# గౌతమబుద్ధుడు





సబ్బపాపస్స అకరణం కుసలస్స ఉపసంపదా
సచిత్తపరియోదపనం ఏతం బుద్ధానుశాసనం
ఎట్టి చెడ్డపనులు చేయకుండా మంచిపనులు చేస్తూ
మనస్సుని పరిశుద్ధపరచుకో యిదే బుద్ధునిశాసనం ప్రేమశాసనం

నటరాజ్.,

# GOWTHAMABUDDHUDU

గౌతమబుద్ధుడు

ప్రథమముద్రణ, ఫిబ్రవరి 19, 1996.

ప్రచురణ : సుజనాపబ్లికేషన్స్

ప్రతులు : 1000

చిత్రలేఖనం : ఆర్టిస్ట్ ఈశ్వర్





వెల : రూ. 45/-

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్,
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంక్‌స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.



విశాలాంధ్ర బుక్‌హౌస్
విజయవాడ, హైదరాబాద్, అనంతపురం, విశాఖపట్నం,
హనుమకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

మరియు

నటరాజ్.,
సుజనాహౌస్, 9-5-2/1,
వుడాబిల్డింగ్స్‌పార్క్ దగ్గర,
పిఠాపురం కాలనీ,
విశాఖపట్నం - 530 003, ఆం.ప్ర.

ముద్రణ: శ్రీసాయిగ్రాఫిక్స్, రామాటాకీస్ దగ్గర, శ్రీనగర్, విశాఖపట్నం-16. ఫోన్: 571040

ANDHRA UNIVERSITY

Dr. M. Gopalakrisna Reddy
M.A. (Hons.), B.L., Ph.D.

VICE - CHANCELLOR

VISAKHAPATNAM 530 003
ANDHRA PRADESH, INDA

Dt : 16th February 1996

## MESSAGE

I am happy that Mr. D. Nataraj, one of our University Employees has compiled and is publishing the life and teachings of "Gowthama Buddha".

At the present time, there is a great deal of anxiety among people who sense that our scientific and material progress has not been matched by corresponding advances in human character and virtue. As a matter of fact, many observers feel that moral values are getting eroded on all fronts, in both public and personal life. The very survival of our society, and the world, depends upon a renewal of individual commitment to an active moral life.

A study of the life and teachings of "Gowthama Buddha" will certainly uplift human dignity and encourage moral values in the society.

I congratulate Mr. Nataraj for doing this good work and I wish him all success.

M. GOPALAKRISNA REDDY
VICE-CHANCELLOR

# గౌతమబుద్ధుడు

## విషయసూచిక

# పరిచయం

గౌతమబుద్ధుడి ఆలోచనాసరళి ఆ కాలానికి అభివృద్ధి దాయకమూ, శాస్త్రీయమూ మాత్రమే కాదు, మనిషి ఉనికిలోని వైరుధ్యాలని, నిత్యజీవితసత్యాలని గమనించి జీవితాన్ని తీర్చిదిద్దుకోవటానికి సామాజిక స్పృహతో తాత్విక ప్రాతిపదికపై రూపొందించిన ఆచరణాత్మక ప్రణాళిక. అది విశ్వజనీయము, సర్వకాలీనమూ కావటమే బుద్ధుడికి అంత ఔన్నత్యాన్ని, బౌద్ధ మతానికి అంత ప్రాధాన్యతని మానవాళి ఇచ్చింది.

బుద్ధుడి జీవితం మీద, బౌద్ధ ధర్మం మీద తెలుగులో ఉన్న పుస్తకాలు ఎక్కువేమీ కాదు. ఈ రెండు అంశాలనీ సమన్వయపరుస్తూ, చారిత్రక నవల, వ్యాస లక్షణాలతో సమర్థవంతంగా సమగ్రమైన ఈ పుస్తకాన్ని రచించిన నటరాజ్ ఎంతో అభినందనీయుడు. ఈ పుస్తకం వెనకాతలి పరిశ్రమ, శ్రద్ధ చదివిన వారికి అవగతమవుతాయి. చరిత్ర, లెజెండ్, మత బోధనలు- వీటన్నిటినీ కలిపి నటరాజ్ తనదైన దృక్పథంతో దీన్ని వ్రాశాడు. ఆ దృక్పథానికి బహుశా కారణం నటరాజ్‌లోని స్వభావ సిద్ధమైన కారుణ్యం. ఈ పుస్తకం రాసేటప్పటి నటరాజ్ తపన, తీవ్రత, పరిశోధన నేను ఎరుగుదును. పిల్లల కోసం అని మొదలుపెట్టిన ఈ పుస్తకం నటరాజ్‌కే ఒక పెద్ద ఎడ్యుకేషన్ అయ్యి, సత్య సాక్షాత్కారం అంటామే దానిగా పరిణమించింది. ఈ పుస్తకంతో నటరాజ్ బుద్ధుణ్ణి తెలుసుకున్నాడనుకుంటాను. ఎందుకంటే కుతూహలంతో మొదలుపెట్టి ఇన్‌స్పైర్ అయిన అతని అధ్యయనంతో పాటే ఈ రచనా సాగింది. పుస్తకం మొదలు పెట్టినప్పుడు బుద్ధుడి గురించి ఇంత వివరంగా నటరాజ్‌కి తెలియదు అని నేను అనుకుంటాను. ఇంత సమగ్రంగా రూపొందుతుందని అతను అనుకున్నాడనీ నాకనిపించదు. రచనతో ఎదిగాడు నటరాజ్.

చారిత్రక ఆధారాల గురించి, బౌద్ధంలోని శాఖా విభేదాల గురించి పట్టించుకోని ఈ పుస్తకం బుద్ధుడి జీవిత కథతో పాటు జాతక కథల్ని, బౌద్ధ ధర్మంతో పాటు మనోవిజ్ఞానాన్ని సైతం పాఠకుడికి అందిస్తుంది. వీలైనంత సమాచారాన్ని ఇందులో గుప్పించాలని రచయిత పడ్డ శ్రమ, కాంట్రడిక్షన్ల జోలికి పోకుండా రచన కొనసాగించిన విధానం, బౌద్ధంపై వినబడే విమర్శలకి జవాబులు ఇచ్చిన తీరు-ఇవన్నీ రచయిత కమిట్‌మెంట్‌ని మనకు చెప్పకనే చెబుతాయి.

ఈ పుస్తకానికి తగిన జనాదరణ, అధ్యయనాభిలాషాపరుల ప్రశంసలు లభించితీరుతాయని నా విశ్వాసం.

*రచయితకి అభినందనలతో,*

పి.వి. కృష్ణారావు

23 జూలై 1995

పి.వి. కృష్ణారావు
"రాజా" 65/11, ఎమ్.వి.పి. కాలనీ,
విశాఖపట్నం - 530 017.

# నామాట

ఈ శతాబ్దంలో బౌద్ధమతం పట్ల ఆదరణ అభ్యాసన జరగడానికి ప్రధాన కారకుడు డా॥ అంబేద్కర్. దళిత బహుజన ప్రజల మధ్య బౌద్ధం దాని తాత్విక పునాదులు మళ్లీ యీరోజు చర్చకు వస్తున్నాయి. అయితే అంబేద్కర్ చెప్పినంత మాత్రాన బౌద్ధంలోని కొత్త ప్రత్యేకతలు ఏమైనా వచ్చాయా? ఈనాడు బౌద్ధమతం స్వీకరిస్తున్న దళితులు బౌద్ధమతంలో వున్న ఔన్నత్యాన్ని చూసి మారుతున్నారా? లేక అంబేద్కర్ మీద భక్తి మూలంగా బౌద్ధమతాన్ని క్రైస్తవ, ఇస్లాం మతాలు స్వీకరించినట్లే మారుతున్నారా? అన్న ప్రశ్నలకు పరిశోధనాపరమైన సమాధానాలు లేవు.

ఒకటి మాత్రం నిజం. అంబేద్కర్ బౌద్ధమతాన్ని పూర్తిగా స్వీకరించడానికి ముందు ఒకజీవిత కాలం దాన్ని పరిశోధించాడు., పరిశీలించాడు. చివరిదశలో దాదాపు సన్యాసం స్వీకరించిన తరువాత బౌద్ధాన్ని తన జీవితవిధానంగా చేసుకున్నాడు. అలా చేసుకునే ముందు బౌద్ధాన్ని ఒక మతంగా కాకుండా అది ఒక సిద్ధాంతంగా స్వీకరించి బ్రాహ్మణీయహిందూమతాన్ని ఎదిరించేప్రజాస్వామ్యయుతమైన మార్గంగా భావించాడు. అది తన వ్యక్తిగతమైన నమ్మకంగా భావించినా, లక్షలాది దళితుల మత స్వీకరణను వ్యతిరేకించలేదు. గాని ఆయన ఆశించిన ఫలితాలు జరిగాయా? అన్నది యీనాడున్న ప్రశ్న. బౌద్ధమతం ద్వారా, ఆ మతంలో గల ప్రజాస్వామ్యయుతమైన విలువల్ని, సామాజిక పరమైన చైతన్యాన్ని, సోదర భావాన్ని దళితులు ఆకళింపుకొని ఒక శక్తిగా ఎదిగి యీ దేశాన్ని సంపాదించ గలరని భావించాడు. ఆయన ఆలోచనా విధానాన్ని, బౌద్ధంలో గల విలువైన మానవ విలువల్ని అతని అనుచరులు అందుకోలేకపోయారా! లేక తన అనుచరులకు కావలసిన విధంగా వారికి అర్థమయ్యే విధంగా ప్రచారం జరగలేదా! అందుకుకావలసిన సాహిత్యపరమైన వ్యవస్థాపరమైన ఏర్పాట్లు జరగలేదా? అన్న అనేక ప్రశ్నలకు సరియైన సమాధానాలు వెతుక్కోవటం ద్వారా మనం యీనాడు ఆయన వారసత్వాన్ని ముందుకు నడిపించే అవకాశం వుంది.

బౌద్ధం, మతం కాదు. అది నాస్తికత్వం, హేతువాదం, మానవతావాదం, లౌకికతత్వాలు మేళవించిన ప్రజాస్వామ్య విలువలపై నిర్మించిన జీవితవిధానం. గాని బుద్ధుని పేరు మీద చాలా ప్రచారం జరిగినది. ఆయన తాత్వికచింతనను సుసంపన్నం చేసిన ధర్మకీర్తి, నాగార్జునుడు వంటివారి ఆలోచనలు సామాన్యులకు అందుబాటులో లేవు. అసలు బౌద్ధం గూర్చి విపులంగా చర్చించే గ్రంథాలే తెలుగులో లేవంటే అతిశయోక్తి కాదు. ఆ లోటును మిత్రుడు నటరాజ్ తీర్చాడు. నటరాజ్ నాకు రెండు దశాబ్దాలుగా తెలుసు. నాస్తిక హేతువాద ఉద్యమాల నుండి జీవకారుణ్యం వరకు సాగిన అతని యాత్ర న్యాయంగానే బౌద్ధం వైపు మళ్ళింది.అది అతడు యీ పుస్తకాన్ని రాయటం ద్వారా మనందరికీ మంచినే చేసింది.

నటరాజ్‌కి అభినందనలతో

కె.ఎస్. చలం

డా॥ కె.ఎస్. చలం
డైరక్టర్, స్టాఫ్ కాలేజి,
ఆంధ్రాయూనివర్సిటీ
వాల్తేరు 530 003

# సమ్మా సంకప్పో

విద్యారంగంలో ఉన్నవారికంటే ఇతర రంగాలలో ఉన్నవారే సాహిత్యానికి ఎక్కువ సేవ చేశారని, చేస్తున్నారని నా నమ్మకం. దీనికి దేశంలోని వివిధ రాష్ట్రాల సాహిత్యవేత్తలను తార్కాణంగా చూపగలను. ఇప్పుడు కొత్త తార్కాణం యువమిత్రులు శ్రీ నటరాజ్‌గారు. వీరికి బౌద్ధంపైన అపారమైన భక్తి.

బౌద్ధం ఆంధ్ర దేశంలో వెయ్యేళ్లకు పైగా మహోన్నత దశలో ఉంది. మనదేశంలో-ముఖ్యంగా ఆంధ్రదేశంలో బౌద్ధమత పతనానికి కారణం బౌద్ధాచార్యులు సంస్కృతాన్ని పట్టుకొని పండితులను, పై వర్గాలను సంతోషపెట్టడానికి, తమవైపు తిప్పుకోడానికి ప్రయత్నించి, ప్రాకృతాన్ని, ప్రజా సామాన్యాన్ని ఉపేక్షించడమేనని నా నిశ్చితాభిప్రాయం.

వెయ్యేళ్ల తర్వాత ఇప్పుడు మళ్లీ దాని యెడల ఆసక్తి కలుగుతున్నది. నిజానికి నానాటికీ హింసామయమై సంక్షుభితమైన నేటి పరిస్థితిలో బుద్ధుని సూక్తుల మననధ్యాననిదిధ్యాసనాలు అత్యావశ్యకాలని భావిస్తున్నాము. వేదోపనిషదాదులలో ఈ సూక్తులు లేవా?-అన్న ప్రశ్న ఉదయించడం సహజం. అవి అతిగహనాలు, అధ్యయన పరిశ్రమైక సాధ్యాలు. బుద్ధుడు-పాత సంస్కృతినంతా జీర్ణించుకొన్న బుద్ధుడు ప్రజాసామాన్యం హృదయం చూరగొనే పద్ధతిలో సరళ మధురంగా ప్రవచించిన నిత్య సత్యాలు అతని ప్రసంగాలలో, సంభాషణలలో ఉపదేశాలలో జాలు మనోబుద్ధ్యహంకారాలకు అతీతమైన స్థితికి కారణమయ్యాయి. ఇప్పుడూ అవుతున్నాయి. అందువల్ల సరళహృదయులు, సత్యాన్వేషణ పరాయణులు అయిన శ్రీ నటరాజ్‌గారు వాటిలో ఆకృష్టులై తమ అనుభూతిని సాటి జిజ్ఞాసువులకూ పంచే ప్రయత్నంలో ఈ రచన సాగించారు. చాల విషయాలు క్రోడీకరించి పాఠకులకు ఆమెతగా అందించారు.

వీరు ముందు మాట చివర ప్రకటించిన ఆశ నన్ను చాల సంతోషపెట్టింది. ఆ ఆశ ఇది-
"ఈ పుస్తకం చదివాక 'ఇది మనకు ఉన్నంతలో మంచి పుస్తకమే. మీరు కూడా చదవండి', అని మిత్రులకు పరిచయం చేసిన సంఘటనలుగాని, ఈ పుస్తకమే మరొకటి ప్రెజెంట్ చేసిన సంఘటనలు గాని, జీవులను రక్షించిన సంఘటనలు గాని, శాకాహారులైన సంఘటనలు గాని, ధ్యానాన్ని సాగించిన, మంచిపని ఎంత చిన్నదైనా ప్రోత్సహించే సంఘటనలు గానీ..... రెండు మూడు జరిగినా, నా కృషికి మించిన గొప్ప బహుమతే లభించిందని నేను చాలా సంతోషపడతాను"

వీరి ఈ ఆశ సఫలం అగుగాక అని ఆకాంక్షిస్తున్నాను.

భాషా సేవకుడు
తిరుమల రామచంద్ర

తిరుమల రామచంద్ర
భాషా సేవకుడు
యువ ఆషాఢ పూర్ణిమ
11-7-19[illegible], హైదరాబాద్-80

# ప్రయోజనం కల పుస్తకం

బుద్ధుడు ఉదుంబర పుష్పంలాంటివాడు. చాలా అరుదు. కల్పానికి (ఒకటి ప్రక్కన నూట ఏభై సున్నాలు పెడితే ఎంత సంఖ్య వస్తుందో అన్ని సంవత్సరాలు ఒక కల్పం) ఒకరిద్దరు బుద్ధులే వస్తారు. కొన్ని కల్పాల్లో అసలు బుద్ధులే అవతరించరు. అటువంటి భాగ్యహీన కల్పాలను అంధకార కల్పాలంటారు. మనం ఉన్నటువంటిది భద్రకల్పం- గౌతమబుద్ధుడవతరించాడు కనుక. ఈ సంప్రదాయ భావాలను నేను స్వీకరిస్తాను. ఎన్ని అతిశయోక్తులు చెప్పినా బుద్ధుని విషయంలో చాలనేమో అనిపించేటంతటి మహోన్నత వ్యక్తిత్వం ఆయనది. అధ్యాత్మ వెలుగును ప్రసరించే ఆయన బోధనలకు సాటి మరొకటి విశ్వంలో లేదు. అనిత్యం, దుఃఖం, అనాత్మ, నిర్వాణం అనే నాలుగు ముద్రలుండే (Four Seals of Buddha) శాక్యముని బోధనలు పరమాద్భుతం.

చాలా ఆలస్యంగా పెద్ద వారిన వయస్సులో సుగత వచనాల మీదికి మా మనస్సు మళ్ళింది. చిన్న వయస్సులోనే ఈ మనస్సు తథాగతుని ఉపదేశాలకు ఆకర్షితమై ఉంటే ఎంత బాగుండేది! సరియైన మార్గదర్శకత్వం లభించనందువల్లనే కదా ఇంత నష్టం జరిగిపోయింది! మా తరం పిల్లలకు కలిగిన ఆ విధమైన నష్టం నేటి తరం పిల్లలకు కలుగరాదనే తపనతో నటరాజ్‌గారు ఈ పుస్తకాన్ని వ్రాశారు. ఆయన ఈ గ్రంథాన్ని ఏ ప్రయోజనం ఆశించి వ్రాసి ముద్రించి ప్రచురించారో ఆ ప్రయోజనం నెరవేరాలని ఆశిస్తున్నాము.

శ్రీ రామకృష్ణ సేవాశ్రమం
సి.టి.ఎమ్. రోడ్, మదనపల్లె-517325

సద్ధర్మ ప్రేమికుడు
బోధ చైతన్య

# మనస్సుకి హత్తుకు పోయే రచన

బుద్ధుని విశ్వజనీనమైన అనంత ప్రేమ, ప్రజ్ఞల సిద్ధాంతం యీ పుస్తక రచయిత నటరాజ్‌ని యెంతగానో ప్రభావితం చేసింది. బుద్ధుని కరుణా సముద్రంలో లోలోతులకి వెళ్లాడు. సకల జీవరాశులలో సహజసిద్ధమైన ప్రేమానురాగాల్ని స్పృశించి ఆనందానుభూతిని పొందాడు. శీల, సమాధి, ప్రజ్ఞలు, బుద్ధుని తాత్త్విక చింతన, సమకాలీన సమాజానికి యెంత అవసరమో ఉదాహరణలతో సహా, చక్కని శైలిలో, పాఠకుల హృదయాలకు హత్తుకునేలా, అనేక బౌద్ధ గ్రంథాలు పరిశీలించి, సాధికారంగా యీ రచన చేసి మనకందించాడు. రెండున్నర సంవత్సరాల అకుంఠిత దీక్ష, అవిరళకృషి ఫలితం యిది. బౌద్ధాన్ని తనలో జ్యోతిలా వెలిగించుకున్నాడు. తానందులో లీనమయ్యాడు. మంచి శైలి. యిలా యెన్నో కారణాల వల్ల, సత్యబలం వల్ల యీ పుస్తకం అందరి మన్ననలూ పొందుతుందనడంలో సందేహం లేదు. యింత చక్కటి రచన చేసి, యెన్నో శ్రమదమాదులకోర్చి యీ పుస్తకం అందిస్తున్న చి॥ నటరాజ్‌కి నా ప్రేమాశీస్సులు. అభినందనలు.

మరెన్నో పుస్తకాలు తన కలం నుండి వెలువడాలని ఆశిస్తూ,

సద్ధర్మ దాతా శ్రీ బెవర వీరభద్ర రావు
ఎడిటర్, యిండియన్ బుద్ధిస్ట్
పురుషోత్తపురం, వయా పెందుర్తి, విశాఖపట్నం జిల్లా

బుద్ధ ధర్మ సేవలో,
బెవర వీరభద్రరావు
5-12-1995

# అరుదైన పుస్తకం

తత్వ జిజ్ఞాస మొత్తం మానవ నాగరిక, వైయక్తిక జీవన విధానానికి పునాదిగా వుంటుంది. అంతేగాకుండా వివిధ కాలాలలో మానవ సమాజాల మీద, ప్రజల మత, సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థల మీద తన ప్రభావం ప్రగాఢంగా చూపుతుంటుంది.

ఈ కాలంలో కూడా తత్వజిజ్ఞాసకు, దాని అధ్యయనానికి, ప్రచారానికి ఏమైనా అవసరముందా అని కొందరు అనవచ్చు. కానీ చాలా పొరపాటు. మనిషి పుట్టుకతోనే బుద్ధి జీవి. బుద్ధి అంటే జ్ఞానం అని కూడా అర్థం. చిన్నప్పటి నుండి ప్రతి కుర్రవాని మదిలో ఏది మంచి ఏది చెడు నేనెలా పుట్టాను మనుషులు చచ్చిపోయాక యేమవుతారు? ఏది న్యాయం ఏది వుత్తమం మొదలైన అనేకానేక ప్రశ్నలు పుట్టి పెద్దవారిని అడుగుతూనే వుంటారు. పెద్దవారిని సైతం నిత్యం అనేకానేక ప్రశ్నలు వెంటాడుతూనే వుంటాయి. ప్రపంచంలో ఏ విషయాన్ని గురించి అయినా చర్చించి, పరిశోధించి, తర్కించి, దాని నిగ్గు తీయడానికి మొదలు పెట్టినా అది తత్వ విచారణే అవుతుంది. అంటే మన సమస్త జీవితం, దాని గమనం తత్వంలో భాగమే. మానవుని వున్నత జీవితానికి ప్రాణం అయిన తత్వ విచారణ మన భారత సమాజంలో జరగడం లేదనే చెప్పవచ్చు.

ముఖ్యంగా పాఠశాలలలో, కళాశాలలలో, వృత్తి విద్యా సంస్థలలో తత్వాన్ని కనీసం ఒక పాఠ్యాంశంగా అయినా పరిగణించకపోవడం చాలా విచారించదగ్గ విషయం. బోధకుడు పరిశుద్ధంగా, నిత్య చైతన్య శీలిగా, నైతికోన్నత జీవితం గడుపుతూ తానే ఒక తాత్వికుడుగా జీవించగలిగితేనే ఆ గురుకులాలు, పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలు మానవ జీవిత ప్రగతికి, విశ్వ జనీన ప్రేమకు ఆశ్రమాలు కాగలవు. నైతిక విలువలు లేకపోయినట్లయితే ప్రగతి ప్రయాణం అనేది శూన్యం. దాని స్థానంలో స్వార్థం, అన్యాయం, దోపిడి, హింస, క్రౌర్యం, పగ, ద్వేషం, అశాంతి ప్రజ్వరిల్లి సమాజం మొత్తం ఒక అశాంతి నిలయంగా తయారయ్యే ప్రమాదం వుంది. యిప్పుడు మన చుట్టూ జరుగుతున్నదదే.

అయితే మానవ చరిత్ర సమస్తం పీడనలోనే నిరంతరం పరిభ్రమిస్తూ వున్నప్పటికీ ఆయా కాలాలలో అనేక మంది తాత్వికులు వుద్భవించి తమ బోధనలతో, భావాలతో మానవ సమాజాన్ని ప్రభావితం చేస్తూనే వుంటారు. అటువంటి వారిలో సమస్త ప్రపంచాన్నీ ప్రభావితం చేయగలిగిన ఘనత మహోన్నతోదయుడైన గౌతమబుద్ధునికే దక్కుతుంది. విశ్వజనీనమైంది ఆయన బోధించిన ధర్మం.

అటువంటి విశ్వజనీనమైన ధర్మాన్ని అందించిన కరుణామయుడు గౌతమబుద్ధుని గురించి, ఆయన బోధించిన ధర్మాన్ని గురించి యెన్నో తెలియని విషయాలను యీ పుస్తక రచన ద్వారా మిత్రుడు నటరాజ్ తెలుగు పాఠకులకు చక్కని శైలితో, వాస్తవికతకు దగ్గరగా పాఠశాల విద్యార్థుల నుండి పెద్దలవరకూ అందరూ యిష్టంగా చదవగల్గేలా అందించాడు. కృతకృత్యుడయ్యాడు.

ఆయన రచనా శైలి అంతా ముఖ్యంగా బౌద్ధం మరలా భారతదేశంలో పునరుజ్జీవింపబడాలి అన్న సదుద్దేశంతో జరిగినట్టు కనబడుతుంది. మంచి ఆలోచన. మంచి సంకల్పం.

నటరాజ్‌కి నా అభినందనలు.

డి.వి.ఎస్. గణపతి రాజు,

డి.వి.ఎస్. గణపతి రాజు ఎమ్.ఎ., (పాలి)
ఎమ్.ఎ.(ఫిలాసఫీ), ఎమ్.కాం.,బి.ఎల్
ఎ4, దయాల్‌నగర్, విశాఖపట్నం - 530 003.

# అందరి మన్ననలూ పొందే పుస్తకం

బౌద్ధం మీద తెలుగులో వచ్చిన పుస్తకాలు తక్కువనే చెప్పొచ్చు. వున్న వాటిలో కూడా విశ్లేషణాత్మకంగా, విమర్శనాత్మకంగా వచ్చినవి అసలే లేవు.

బౌద్ధం ఒక మహాసముద్రం. అందులో ఎన్నెన్నో నిధులు, తరగని సంపదలు వున్నాయి. నేటి సమాజ పరిస్థితులకు, దిగజారిపోతున్న మానవతా విలువలకు బౌద్ధమే పరిష్కారం అని నటరాజ్ నమ్మాడు. బౌద్ధంలోని విషయాలను అవగాహన చేసుకుని, అరిగించుకుని, ఎంతో వుత్సాహంగా, పట్టుదలగా చక్కని శైలితో, చక్కని వ్యాఖ్యానంతో యీ పుస్తకం రాశాడు.

ప్రకృతి అన్నా, పక్షులన్నా, జంతువులన్నా, వృక్షాలన్నా, పిల్లలన్నా, మంచి మనుషులన్నా స్నేహమన్నా జీవితమన్నా ఎంతో ప్రేమ నటరాజ్‌కి. అందుకే బౌద్ధం అతణ్ని ఆకర్షించింది. తానెంచుకున్న విషయాలకీ, తన పుస్తకానికీ చక్కగా న్యాయం చేకూర్చాడు.

యీ పుస్తకం తప్పక అందరి మన్ననలూ పొందుతుందని ఆశిస్తున్నాను. నటరాజ్‌కు అభినందనలు. అతని కృషి వృథా పోదు.

బి.వి.ఎస్. భానుశ్రీ

డా॥ బి.వి.ఎస్. భానుశ్రీ
లెక్చరర్, ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్
ఆంధ్రాయూనివర్శిటీ, వాల్తేరు-530 003

# సులభంగా అర్థమయ్యే పుస్తకం

మహనీయుల జీవిత చరిత్రలు మానవులకి ఆదర్శప్రాయములు, ఆచరణీయములు. వాటిని చదివి ఊరుకోవటం కాకుండా ఆచరణలో పెట్టినపుడు మాత్రమే మనము కూడా ఉద్ధరింపబడటానికి అవకాశం ఉంటుంది. భూమిపై ఉండే మానవులందరికోసం ఒక మహనీయుడు తన జీవితమును త్యాగం చేయటం అన్నది ఒక గొప్ప విషయం దీనిని ఆచరించి చూపిన గౌతముడు ఒక బుద్ధునిగా మారటం మనం తెలుసుకోవలసిన విషయం. కరుణ, దయ, త్యాగం మాటలలో కాక చేసి చూపిన వాడు గౌతమబుద్ధుడు. ఆయన ఆనాటి సమాజమునకు కావలసిన విధముగా ఇచ్చిన సూత్రములు నేటికీ వర్తిస్తాయి కారణం మన బుద్ధి ఇంకా ఎదగకపోవటం మాత్రమే. అందరినీ తనవంటటి వారిగా తయారుచేయాలని ఆయన తను ఆచరించి ఇచ్చిన మార్గము మనమందరమూ పాటించవలసినది.

చి॥ నటరాజ్ బుద్ధుని జీవిత చరిత, పరమపదము వరకు చక్కనైన రీతిలో సులభముగా అర్థమయ్యేటట్లుగా తీర్చిదిద్దారు. బుద్ధుడు ఆయనకు, చదివిన మన అందరకూ తన ఆశీస్సులు ప్రసరింపచేస్తూ ఉంటాడు. వాటిని అందుకోవటం కోసంమన ప్రయత్నం చేద్దాం.

జి.ఎ.వి. రామేశ్వర్.

డా. జి.ఎ.వి. రామేశ్వర్
మెడికల్ ఆఫీసర్ (హోమియో)
హోమియో డిస్పెన్సరీ
ఆంధ్రాయూనివర్శిటీ, విశాఖట్నం-3.

## 'సద్గ్రంథ పఠనంలో ఆలస్యం తగదు'

"ప్రేయసి ప్రేమలోన కనుపించెడి తీయని స్వర్గమొక్కటే
శ్రేయము కాదు. హీనులు-అతిదీనులు-మ్లానతముల్ దరిద్రనా
రాయణు లేడ్చుచుండిరి. తదశ్రువులన్ దుడువంగబొమ్ము నీ
ప్రేయసితోడ, నీకట లభించును కోట్లకొలది స్వర్గముల్!"

నాకు కంఠస్థం వచ్చి, అప్పుడప్పుడు మననం చేసుకుని, ఒడలంతా పులకితం కాగా, మనస్ఫూర్తి నందుకు నేలాచేసే చాలా కొద్ది పద్యాలలో ఒకటి కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి రాసిన ఈ పద్యం. బుద్ధుని మహాభినిష్క్రమణ సందర్భంలోనిది.

బుద్ధుని జీవిత సంగ్రహం చాలామందికి తెలుసు. కానీ పూర్తిగా కొద్దిమందికే తెలుసు. బుద్ధుని ధర్మసారం గురించి సమగ్రంగా ఇంకా కొద్ది మందికే తెలుసు. భారత రామాయణాల్లా బుద్ధగాథ బహుళ ప్రచారం పొందకపోవడానికి ప్రచార లోపమే కారణం కావచ్చు. మైత్రీ-అహింసలు-సమానతలు-లాంటి ఆత్మీయ-అభౌతిక-మతభావాలను ఆధారం చేసుకోకపోగా, వాటిని ఖండిస్తూ మానవాళికి జ్ఞానోదయ మార్గాన్ని 2,500 సంల క్రితమే బుద్ధుడు చూపియుండటం ఎంత గొప్ప విషయమో. అంతటి మహనీయుని జ్ఞాన సంపదను పుణికి పుచ్చుకోకపోవటం ద్వారా ప్రజానీకం ఇప్పటికే ఎంతో నష్టపోవటం అంతే శోచనీయం. పదిమందిలో ఒకడిగా (దశావతారాల్లో) చేర్చటం వల్ల కూడా బుద్ధునికీ బుద్ధ సందేశ వ్యాప్తికి అవరోధం కల్గిందేమో!

ఏదేమైనప్పటికీ, నా చిరకాల మిత్రుడు సహచరుడు 'నటరాజ్' ఆశ్చర్యకరమైన రీతిలో, తన పూర్వ-ప్రస్తుత ఆశ్రమ వ్యాపకాలకు కించిత్ భిన్నంగా బుద్ధ ధర్మం వైపు ఆకర్షితుడై ఈ పుస్తకరచనకు పూనుకోవడం ఆనందించదగ్గ విషయం. ఈ పుస్తకపు ప్రచురణ పూర్వ లిఖిత ప్రతిలోని కొన్ని భాగాలను ఆయన నివాసంలోనే మే 95 ఆఖరివారంలో నేను చదివాను. ఆ భావాల ప్రవాహానికి నేను తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరి అయ్యాను! ఇవి నిజంగా బుద్ధుడు చెప్పినవా? లేక మీరు జోడించారా, వ్యాఖ్యానంగా? అని ప్రశ్నించాను. తను చదివిన ఆధారగ్రంథాలు, జాబితా కూడా చూపి, అన్నీ ఇందులోవే. కాకుంటే ఒక చోట పొందికగా చేర్చాను అంతే అన్నారు! నిజం! ఈ పొందిక ఎంతో బాగా కుదిరింది. నాస్తికుడు-సహజ సున్నిత హృదయుడు- జీవరక్షా సంఘసభ్యుడు- వృక్షప్రేమి-అశ్లీలతాజాడ్య విరోధి 'చిన్నారి పాపల' ప్రచారకుడు- చక్కని రచయిత ఇన్నాళ్ళుగా ఇదే అయిన మా నటరాజ్‌లో ఈ 'గౌతమబుద్ధుడు' గ్రంథ రచనలో కొత్త వెలుగును నేను చూశాను. సమాజంలో మంచిని పెంచే పనులతోనే తృప్తిపొందక, చెడును అడ్డుకునే ప్రతిఘటనోద్యమాల్లో సహచరులమైన మేము ఇకపై బుద్ధుని బోధల వెలుగులను కూడా మా ప్రతిఘటనపథంలో ఆసరాగా తీసుకుపోదలచాము.

బుద్ధధర్మం అంతటా మంచి-చెడుల మీమాంస. వైయుక్తిక సామాజిక రంగాల్లో నైతిక ధర్మాచరణే ఆయన బోధించింది. ఎప్పుడో పరలోకంలో కాకుండా, ఇప్పుడే-ఇక్కడే-ఇక్కడే- స్వయంకృషితోనే జ్ఞానోదయం పొంది. 'బుద్ధి' మంతుడవై, మరో బుద్ధుడవై లోక కళ్యాణ 'బద్ధుడ' వైజీవిత శేషాన్ని గడపమనేదే బుద్ధ ప్రబోధంగా నేను అర్థం చేసుకున్నాను. ఈ పుస్తక రచనను ఒక తపస్సులా భావించి పట్టుదలతో చేస్తున్నానని నాకు నటరాజ్ చెప్పినప్పుడు, గాంధీనగర్. బుద్ధుని

సైతం ఎప్పట్నుంచో గాఢంగా అభిమానించే నేను "ఈ పుస్తక రచనతో మీ జన్మ ధన్యం కాగలదన్నాను.' అది నిజమే అయ్యిందనుకుంటున్నాను.

బుద్ధుని అనంతరం మానవాళికి శాంతి-ప్రేమ-కరుణ-అహింసల సందేశం ఇచ్చిన మహాపురుషులు క్రీస్తు, గాంధీలు. టీనేజ్‌లో నేను చదివిన గాంధీచరిత్రలే నా పాతికేళ్ల సాంఘిక సేవా-ఉద్యమ కార్యక్రమాలకు స్ఫూర్తి. అట్టి గాంధీ స్వీయచరిత్రను చదవటంలో నటరాజ్ 40 ఏళ్ళు ఆలస్యం చేసినా, 'బుద్ధుని' అధ్యయనం చేయడంలో నాకన్నా ముందు మేల్కొని తానా అమరజ్యోతిని దర్శించి, మాకు దర్శింపజేస్తున్నాడు. "మంచిపనులు చేయడంలో ఆలస్యం కూడదు" అని బుద్ధుడు చెప్పిన సూక్తి ఎంతో ప్రాముఖ్యత గలది. నేనంటున్నాను- "మంచి పుస్తకాలు చదవటంలో కూడా ఆలస్యం పనికిరాదు" అని. ఇలాంటి మహాపురుషుల జీవిత చరిత్రలు- సందేశాలను గురించిన పుస్తకాలను ప్రతి కళాశాల విద్యార్థీ, తన విద్యాభ్యాసం పూర్తయ్యేలోపే అధ్యయనం చేసి తీరాలని. ఆలస్యం ఎంతో అనర్థదాయకమని! ఎడ్విన్ ఆర్నాల్డ్ రాసిన 'ది లైట్ ఆఫ్ ఏషియా'- ఆసియాఖండపు అమరజ్యోతి-బుద్ధుడు' పుస్తకంతో సహా ఇతర ప్రముఖ మత గ్రంథాలను ఏకకాలంలో- యుక్త వయసులో గాంధీ చదవడం వల్లనే ఆయన సమగ్ర వ్యక్తిత్వాన్నీ, సమగ్ర జీవన దృక్పథాన్నీ అలవరచుకోగల్గాడు. బుద్ధుని వలెనే సత్యం-అహింసల అమర సందేశాన్ని సమకాలీన ప్రపంచానికి ఆధునిక భాష్యంతో-కార్యాచరణ సహితంగా అందించగలిగాడు. ఇదే రీతిలో నేటి కాలపు యువతీ యువకులు కూడా, మార్కెట్‌లోకి కుప్పతెప్పలుగా వచ్చి పడే చెత్తా చెదారపు కాలక్షేపపు కాలకూట విషగ్రంథాలను చదివేముందు, వాటికోసం తొందరపడక, తీరిక చేసుకుని, శ్రమతీసుకుని, బుద్ధాది మానవోత్తముల బోధలను చదివి తీరాలి. ఇవి చదివిన నాడు ఇతర మలిన గ్రంథాల జోలికి మనసు మళ్లదనేది వాస్తవం.

ప్రతిమనిషి మనస్సులలో ఉండే చెడును క్షాళన చేసి, మంచిని ప్రతిష్ఠించి, ధర్మాచరణ-ధ్యానానుష్ఠానాది ప్రక్రియలతో 'మంచి' ని మరింత శక్తివంతం చేసి విశ్వమానవ కళ్యాణానికి దోహదపడేలా చేసే "బుద్ధుని ధర్మపథ చరిత్ర" మా యీ నటరాజ్ రచన ఆంధ్రదేశపు నాలుగు చెరగులా బౌద్ధం వెలుగులు ప్రసరింపచేస్తుందనీ, ఆతనికృషి ఫలిస్తుందనీ ఆకాంక్షిస్తున్నాను.

ఈదర గోపీచంద్.
తేది 29-6-1995

ఈదర గోపీచంద్.
రాష్ట్ర ప్రధానకార్యదర్శి,
అశ్లీలతా ప్రతిఘటన వేదిక, ఆంధ్రప్రదేశ్ మరియు
ఎడిటర్, నైతికవిప్లవ ద్వైమాసపత్రిక
11-7-17, స్టేట్‌బ్యాంక్ కాలనీ,
నరసారావుపేట - 522 601.

# రచయిత గుండెఘోష

## కృతజ్ఞతలు

ప్రపంచశాంతినీ, ప్రకృతి పరిరక్షణనీ, విశ్వమానవ కళ్యాణాన్నీ కోరుకునేవారందరినీ గౌతమబుద్ధుని జీవితం, బోధనలు, యెంతో ప్రభావితం చేస్తాయి.

చిన్నప్రాయంలోనే ఆయన బోధనలు అందుతే అవి బాలలలో నైతిక విలువల ఆచరణలో వున్న ఆత్మతృప్తినీ, ఆత్మస్థైర్యాన్నీ, మానవతా విలువల పరిరక్షణలో పొందే సాటిలేని ఆనందాన్నీ పొందేటట్లు చేసి వారి వ్యక్తిత్వవికాసానికెంతో వుపయోగపడతాయి. వారిని సామాజిక బాధ్యత కలవారినిగా తయారు చేస్తాయి.

అయితే, మన దేశంలోనే పుట్టినా, మనవాడైనా ఆ మహావ్యక్తి గురించీ, ఆయన బోధనలని గురించీ నేటి మన ప్రజలకు అంతగా తెలియదు. తగినంత సాహిత్యం వచ్చినా అది విస్తృత ప్రచారం పొందివుండలేదు. యేవో వొకటి రెండు పుస్తకాలూ, నాలుగైదు సూక్తులూ తప్ప జన సామాన్యానికి బౌద్ధ వాఙ్మయం విరివిగా చేరలేదు.

ఆ మహానుభావుడి జీవితం నన్ను చాలా ప్రభావితం చేసింది. వొకసారి బుద్ధపథగాములు, 'యిండియన్ బుద్దిస్ట్' పత్రికా సంపాదకులు, సద్ధర్మజ్ఞులో శ్రీ బెవర వీరభద్రరావుగారు, అరవై సంవత్సరాల జీవితంలో కూడా బౌద్ధం గురించి తెలుసుకుని, దాని ప్రకారం నడుచుకుని, ఆదర్శప్రాయులైన వారున్నారు. చనిపోయేముందర తెలుసుకున్నా చాలు. బౌద్ధం జీవితానికంతటికీ సరిపడేవ శాంతినిస్తుంది', అని అన్నమాటలు నన్నెంతో వుద్విగ్న పరచాయి. బౌద్ధం గురించిన పుస్తకాలు లభ్యమైన కాడికి వొక్కొక్కటీ (వుపయోగించుకున్న పుస్తకాల వివరాలు చివర్లో యిచ్చాను) సంపాదించి తెచ్చుకుని శ్రద్ధగా చదివాక, వాటి ఆధారంగా ఆయన జీవితాన్నీ, సందేశాన్నీ తెలుపుతూ నేనూ వొక చిన్న పుస్తకం రాయాలనీ, ప్రత్యేకంగా అది బాలబాలికలకీ, నాబోటివారికీ సరళంగా, సులభంగా, చేరువగా, వీలైతే యిందులో యిచ్చిన సూక్తులను ప్రతిరోజూ వొకసారి చదివి మననం చేసుకునే తీరులో వుండాలనీ అనుకున్నాను. వెంటనే నేను అప్పటికి మొదలుపెట్టివున్న, 'చిన్నారి మార్పుకోసం' అన్న పుస్తకం తాత్కాలికంగా ఆపు చేసి, ఆ మహనీయుని జీవితం రాయడమే నా ప్రథమ కర్తవ్యంగా జీవితధ్యేయంగా భావించి, యెలాగైతేనేం రెండేండ్లకి పూర్తి చేశాను. నేను చదివిన పుస్తకాల్లో వున్న వైరుధ్యాల వల్ల, కొన్ని నా వ్యక్తిగత బాధ్యతల వల్ల పుస్తకాన్ని యేకాగ్రతగా రెండుసార్లు రాసి, మూడోసారి పూర్తి చేయడానికి నాకు కాస్తంత యెక్కువ కాలమే పట్టింది. ప్రెస్‌కి వెళ్ళేనాటికి పుస్తకాన్ని అయిదుసార్లు తిరగరాశాను. అయినా పూర్తి సంతృప్తి యింకా కలగడం లేదు. దీనికి కారణం పుస్తకంపై నాకున్న మక్కువే.

స్వార్థమూ, అవినీతీ అతి దారుణంగా పెరిగిపోతున్న యీ రోజులలో బుద్ధుని వుపదేశాల పాటింపుయొక్క ఆవశ్యకతని యిప్పుడిప్పుడే అందరూ గుర్తిస్తున్నారు. యీ బుద్ధమార్గాన నడవాలని ప్రయత్నిస్తున్నారు. స్వార్థాన్ని విడిచిపెట్టి మంచికి మాత్రమే చోటు యివ్వడం, ప్రకృతి గురించి తెలుసుకుని భిన్న రకాల చెట్లని ప్రేమగా పెంచడం, కాపాడటం, మూగజీవాలను హింసించకుండా వుండటం, శాకాహారులవడం, యెవరికీ హాని కల్గించకుండా నైతికోన్నత జీవితాన్ని గడపడం-మొదలైన ఆదర్శాలని అమలు చేయడంలో, అమలు చేయించడంలో తల్లిదండ్రులకీ, విద్యార్థులకీ, వుపాధ్యాయులకీ యీ పుస్తకం కూడా వుపయోగపడుతుందని నేను గట్టిగా నమ్ముతున్నాను. ఆ నమ్మకంతోనే అందరి సహాయసహకారాలూ తీసుకుని యీ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాను. యీ నా ప్రయత్నం అందరి ఆదరాభిమానాలు పొందుతుందనే నమ్మకంగా ఆశిస్తున్నాను.

పదిమందికీ హృద్యంగా చేరాలన్న కోరికతో యీ పుస్తకం రాయడంలో కొంత వర్ణనా పరమైన, వ్యావహారిక భాషాపరమైన స్వేచ్ఛను మాత్రమే తీసుకున్నాను. గౌతమబుద్ధుని బోధనలన్నింటినీ యథాతథంగా కొన్నిచోట్ల పాఠకులకి వొకేసారి అందేలా, సందర్భం చెడకుండా పుష్పగుచ్ఛంలా వొకేచోట కూర్చాను. యివేవీ కూడా ఆ మహామహుని జీవితానికీ, బోధనలకూ యెటువంటి అపచారాన్నీ, అపార్థాలనీ కలిగించకుండా చూసుకున్నాను. చాలా జాగ్రత్తపడ్డాను. అయినా దయాశీలురైన పెద్దలు యీ పుస్తకంలో లోటుపాట్లు పొరపాట్లు తెలిపితే, వాటిని వచ్చే ప్రచురణలో సరిదిద్దుకుంటానని మనవి చేసుకుంటున్నాను. నా అభిమాని, సాహిత్య విమర్శకుడు శ్రీ బంగోరె మార్గంలోనేను కూడా అచ్చులలో ఆఅలు తప్ప మిగిలినవి రాయడం యేండ్లకేండ్లుగా మానుకున్నాను. ఆ అలవాటునే పుస్తకంలో కూడా కొనసాగించాను. కావున, అందువల్ల బాధపడే భాషాప్రేమికులు నన్ను మన్నించగలరని తలుస్తాను.

పుస్తకం చివరలో ప్రకటించిన ఆధారగ్రంథాలు, యీ పుస్తకం రాయడానికి నాకెంతగానో వుపయోగపడ్డాయి. ప్రతీ పుస్తకం గొప్ప పుస్తకం. కథా భాగానికి సంబంధించి శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు గారు రచించిన "బుద్ధ చరితము- ధమ్మ పదముతో" అన్న పుస్తకం సంతోష పెట్టింది. ఆయన యీ పుస్తకం రాతప్రతి చదవాలని మనసారా కోరుకున్నాను అదృష్టవశాత్తు ఆ కోరికా తీరడమేకాకుండా ఆయనచేత "మంచి ప్రణాళిక కలిగిన, ప్రామాణికమైన పుస్తకం" అంటూ

"వ్రాసె బుద్ధుగూర్చి - గ్రంథమ్మునటరాజ
కఠినపదములు గూడ కనుగునట్లు
సమత - కరుణ - సర్వ సంక్షేమతత్త్వముల్
పండుగాత - తెలుగు గుండెలందు"

అని పద్యరూపంలో సైతం ఆయన ఆశీస్సుల్ని పొందగలిగాను.

అలాగే డాక్టర్ ముక్కాల రాజగోపాలరావుగారు అనువదించిన ఆచార్య నాగార్జునుని శూన్యతా సప్తతి - ప్రపంచంగురించి నాలో మిగిలిన అనుమానాలను సమూలంగా పెకల్చివేసి, నన్ను సత్యమార్గంలోకి అడుగుపెట్టించి నాకు గురుగ్రంథమే అయ్యింది. అంత చక్కటి పుస్తకాన్ని అందించిన శ్రీ రాజగోపాలరావు గారికి, నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

యిలా జనకీర్తి పొందడానికి లోకంలో యెన్నో సాహిత్యాంశాలు వుండగా, బుద్ధుని గురించే ప్రత్యేకంగా రాసిన ఆయా రచయితలకూ, వాటిని దయతో ప్రచురించిన ఆయా ప్రచురణకర్తలకూ నా నమస్సులు కృతజ్ఞతాభివందనాలను తెలియజేసుకుంటున్నాను.

జీవితంలో నిరాశానిస్పృహలను, బాధలను, దుఃఖాన్ని అధిగమించవలసివున్న అన్ని సందర్భాలలోనూ, ఆశాసాంత్వనలకై, ప్రశాంత చిత్తంతో ముందుకు సాగిపోవడానికై తెరచి చదువుకుని స్ఫూర్తి పొందేందుకు, ఆచరించేందుకు కావలసిన మనోధైర్య కరుణామృత మైత్రీ సందేశాలన్నీ బౌద్ధధర్మంలో వున్నాయి. యీ పుస్తకంలో వాటిని లభ్యమైనకాడికి ప్రోదిచేశాను. నేను చేసిన పనల్లా యీ పూలదండ అల్లడమే. యీ కష్టానికి గౌరవం, మర్యాద, అభిమానం యేమైనా లభిస్తే అవన్నీ యీ పుస్తకం మీముందుకు రావడానికి అన్ని విధాలా తోడ్పడిన వారందరికీ చెందుతాయి. యీ పుస్తకం వెలువరింతలో అంతటి విశాలమైన సమిష్టి తోడ్పాటు వుంది. యిది, నాకుకాదు, సర్వ జీవమానవ సమానత్వాన్ని చాటిన బౌద్ధ ధర్మానికే అందిన చేయూత.

పుస్తక ప్రచురణ విషయంలో నా కృతజ్ఞతలను యెక్కడ, యెవరి నుండి మొదలుపెట్టాలో, అందరికీ న్యాయం చేయగలనో లేనోనని చాలా భయపడుతున్నాను.

యెటువంటి సమయంలోనైనా చెదరని చిరునవ్వుతో విరామమెరుగని పరిపాలకులు మా

ఆంధ్రాయూనివర్సిటీ కులపతులు డా॥ ఎమ్. గోపాలకృష్ణారెడ్డిగారు యీ పుస్తకానికి తమ అమూల్యమైన సందేశాన్ని అందించారు. వారికి నా కృతజ్ఞతలు. వారికితెలియని వారిఅభిమానిని నేను. ఆయన అధ్యక్షోపన్యాసాలు విని స్ఫూర్తిపొందేవారిలోనేను వొకణ్ని.

యీ పుస్తకం మొదటి చిత్తుప్రతిని. మా ఆంధ్రాయూనివర్సిటీ సంస్కృత డిపార్ట్‌మెంట్ అధిపతులు ప్రొఫెసర్ తెన్నేటి గౌరీపతిశాస్త్రిగారు చదివి, యెంతో సంతోషంతో, 'నటరాజా! జీవం తొణికిసలాడుతున్న పుస్తకమయ్యా యిదీ. నేను చేస్తున్నదంతా అక్కడక్కడా మెరుగులు దిద్దడం. ముంగురులు సర్దడం, యింతేనయ్యా! యెలా అలవడిందయ్యా నీకింతటి చక్కని శైలి? అంటూ నలభై పేజీల వరకూ దిద్దారు. అంతలోనే హఠాత్తుగా ఆయన పరమపదించారు. తట్టుకోవడం చాలా కష్టమైపోయింది. ఆ తర్వాత యిప్పటికీ ఆయన దగ్గర వాక్యనిర్మాణంలో నేర్చుకున్న సులువు మెలకువలతో మళ్ళా రచన దిద్దుకున్నాను. యీ పుస్తకానికి ఆయన ఆశీస్సులు అక్షరరూపంలో లేని లోటు తీరనిలోటే. ఆ దివ్యగురువుకు నా కన్నీటితర్పణం విడుస్తూ, నాప్రాణసమంగా నా కృతజ్ఞతలను తెలియచేసుకుంటున్నాను.

సౌహార్ద్రతకు, సౌజన్యతకు నిండైన రూపం మా ఆంధ్రాయూనివర్సిటీ పేరాసైకాలజీ డిపార్ట్‌మెంట్ ప్రొఫెసర్, యోగా అండ్ కాన్షస్‌నెస్ డిపార్ట్‌మెంట్ డైరెక్టరుగారైన ప్రొ॥ వి.వి. కృష్ణారావుగారు యెంతో ప్రేమగా 'పరిచయం' అనే అపురూపమైన బహుమతి నందించారు నాకు. వారికి నా కృతజ్ఞతలు.

యీ పుస్తకం చదివి మేలైన సూచనలందివ్వడమే కాకుండా, తమ ఆశీస్సులను, అభినందనలను అందించారు డా॥ కె.ఎస్. చలంగారు, శ్రీ వి. మోహన్‌గారు, డా॥ బి. భానుశ్రీగారు, శ్రీ డి.వి.ఎస్. గణపతిరాజుగారు, శ్రీ బోధ చైతన్యగారు, డా॥ వందూరి రామకృష్ణమాచార్యులుగారు, శ్రీ ఉందవ గోపీచంద్ గారు, శ్రీ తిరుమల రామచంద్రగారు, శ్రీ బెవర వీరభద్రరావుగారు, డా॥ జి.వి.వి. రామేశ్వర్‌గారు. వీరందరికీ నా కృతజ్ఞతా నమస్సుమాంజలులను తెలియచేసుకుంటున్నాను.

యీ పుస్తకం రాయడంలో మా ఆంధ్రాయూనివర్సిటీ డా॥ వి.ఎస్. కృష్ణా లైబ్రరీ వారికి నేనెంతో ఋణపడివున్నాను. వారికి నా కృతజ్ఞతలు. యింకా పుస్తకాల నందించిన శ్రీ అబ్బూరి గోపాలకృష్ణగారికి, శ్రీ బెవర వీరభద్రరావుగారికి, ప్రొ॥ వి.వి. కృష్ణారావుగారికి, శ్రీ బోధ చైతన్యగారికి, శ్రీ ఎస్. రామినాయుడుగారికి, శ్రీ వి. సన్యాసిరావుగారికి, శ్రీమతి విజయలక్ష్మి పరమేశ్వరరావుగారికి నన్నెంతో ప్రోత్సహించిన ప్రొ॥ ఎమ్.వి. కృష్ణయ్యగారికి, శ్రీ బి. అరుణ్‌కుమార్ గారికి, శ్రీ బి.ఎస్. రాములుగారికి, మా యింజనీరింగ్ డిపార్ట్‌మెంట్ అధిపతి శ్రీ టి.వి. సుబ్రహ్మణ్యంగారికి సహోద్యోగులకు నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను.

నా శ్రీమతి సుజాత పుస్తకం విషయంలోమాత్రమేకాదు నేను బౌద్ధ ధర్మదీక్ష తీసుకునే వరకు సైతం, నాకీవిషయంలో యెంతో అండగా నిలబడింది. ఆమె, "మనసున మనసై.... బతుకున బతుకైన" నాకే లభించిన శ్రీశ్రీ గీతం. జన్మజన్మలబంధం. ఆమెకు నా ప్రేమాశీస్సులు, కృతజ్ఞతలు.

ప్రియమిత్రుడు, ఆత్మీయుడు "చిన్నా" శ్రీ దేవ చిన్నారావు పుస్తకంకోసం నా సంతోషంకోసం అహరహం సహానుభూతితో, ప్రేమతో నన్ను వెన్నంటివుంటూ, నాకెంతో అండగా నిలిచాడు. అతడికి నాప్రేమాశీస్సులు. అతడి ఆప్యాయతను మరచిపోలేను. అతడికి అన్నింటా జయం కలుగుగాక.

పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయం కోరినతోడనే, యెంతో ప్రేమగా, సాదరంగా, "తప్పకుండా! అంతేనా? 'మంచిప్రయత్నం' 'మంచిపని' 'యిది మాకూ సంతోషం' మీకు చెయ్యకపోతే

ఇంకెవరికీ చేస్తాం' 'మీరు మంచివారు-మంచిపని చేస్తున్నారు' ఇలా నేనాశించనంత గొప్పగా, నా భుజం తడుతూ నా భిక్షాపాత్ర నింపారు. నేను అంది పుచ్చుకున్న వరుసలో వరుసగా-
శ్రీ పి. మోహన్‌గారు - రూ. 1,000/-, శ్రీ దేవ చిన్నారావు - రూ. 1,000/-, శ్రీ మంగీలాల్ జైన్‌గారు - రూ. 500/-, శ్రీ పీలా రామకృష్ణగారు - రూ. 500/-, శ్రీ ఎమ్. మురళీకృష్ణగారు - రూ. 200/-, శ్రీ ఎల్. నాగేశ్వరరావుగారు - రూ. 250/-, శ్రీ బి. అరుణ్ కుమార్‌గారు బౌద్ధ పరిషత్ తరఫున - రూ. 1,000/-, శ్రీమతి సుజాత - రూ. 2,000/-, శ్రీ కె. జి.ఆర్. కృష్ణయ్యగారు - రూ. 200/-, శ్రీ బి. ధర్మరాజుగారు - రూ. 116/-, ప్రొ॥ కె.ఎస్. చలంగారు - రూ. 500/-, శ్రీ శ్రీనివాస ప్రింటర్స్ ప్రైజెస్‌వారు 100/- డా॥ బి. భామశ్రీగారు - రూ. 500/-, ప్రొ॥ వి.ఆర్.ఆర్.ఎమ్. బాబుగారు - రూ. 558/-, శ్రీమతి ఆములా నాగార్జునగారు - రూ. 300/-, శ్రీ పి. వర్మగారు - రూ. 200/-, శ్రీ టి. శ్రీనివాసరావుగారు - రూ. 500/-, డా॥ బి.వి. సూర్యనారాయణగారు - రూ. 400/-, శ్రీమతి టి. సరోజినిగారు - రూ. 500/-, శ్రీ పుల్లేటికుర్తి ఏకాంబరంగారు - రూ. 200/-, డా॥ వై. గోపాలరావుగారు - రూ. 100/-, డా॥ జి.ఎస్.ఎస్. రాజుగారు - రూ. 200/-, డా॥ వి. మల్లికార్జునరావుగారు - రూ. 100/-, శ్రీ వి. నారాయణరావుగారు - రూ. 100/-, శ్రీ డి. రాజశేఖరరాజుగారు - రూ. 100/-, శ్రీ వి. శంకరరావుగారు - రూ. 200/-, శ్రీ ఎస్. కృష్ణబాబుగారు - రూ. 250/-, శ్రీ ఈదర గోపీచంద్ - రూ. 1000/-, డా॥ బుద్ధిరెడ్డి సత్యనారాయణగారు - రూ. 250/-, శ్రీమతి బి. వసంతసేనగారు - రూ. 100/-శ్రీ వి. శ్రీనివాసరావుగారు - రూ. 200/-, శ్రీమతి కె. జయలక్ష్మిగారు - రూ. 100/-, శ్రీమతి ఎమ్. ఉషగారు - రూ. 501/-, శ్రీ హెచ్.వి. రావుగారు - రూ. 1001/-, శ్రీ జాస్తి రామకృష్ణ చౌదరిగారు - రూ. 500/-, డా॥ ఎల్. సూర్యనారాయణగారు - రూ. 500/-శ్రీ పి. రఘురామ్‌గారు - రూ. 200/-, శ్రీ డి.వి. రమణరాజుగారు - రూ. 300/-, శ్రీ డి.ఎస్.ఆర్.కె. చౌదరిగారు - రూ. 200/-, శ్రీ ఎ. కేశవరావుగారు - రూ. 200/-, డా॥ జె. అశోక్‌గారు - రూ. 500/-, డా॥ పి.ఎల్.హెచ్. వరప్రసాద్‌గారు - రూ. 100/-, డా॥ ఎ.వి. సత్యనారాయణగారు - రూ. 100/-, డా॥ ఎస్. వేణుగోపాలరావుగారు - రూ. 100/-, శ్రీ బి. ఏడుకొండలుగారు - రూ. 200/-, శ్రీ ఎమ్. రామారావుగారు - రూ. 100/-, శ్రీ వై. రామేశ్వరరెడ్డిగారు - రూ. 300/-, డా॥ ఎస్. గోపాలకృష్ణగారు - రూ. 100/-, డా॥ ఎమ్. మరియదాసుగారు - రూ. 100/-, డా॥ పి. సత్యనారాయణగారు - రూ. 200/-, శ్రీ కె.హెచ్. రావుగారు - రూ. 2500/-, మాస్టర్ వి. రాహుల్ - రూ. 1000/-, శ్రీ పి.జె. రావుగారు - రూ. 1000/-, డా॥ పి.ఎస్. ఎన్. రాజుగారు - రూ. 500/-, శ్రీ కొరికాన జనార్దనరావుగారు. 1000/- జి. శ్రీ డి. ప్రకాష్‌గారు - రూ. 500/- శ్రీ డి. గణేష్ గారు - 116/- బొమ్మన బ్రదర్స్ వారు రూ. 316/-, డా. పి. వరలక్ష్మి గారు రూ. 500/- ప్రొ. ఆర్.వి. రంగనాధరావు గారు రూ. 250/- శ్రీమతి సావిత్రి చక్రధరరావు గారు రూ. 116/-, [illegible] - 400/- = 27924

ఇంకా అడ్వర్‌టైజ్‌మెంట్స్ ఇచ్చిన ఆయా సంస్థల అధిపతులు నా అభివృద్ధి కోరిన శ్రీ గుండుపల్లి అగస్టీన్, శ్రీ యార్లు సత్యనారాయణ.. శ్రీ అంబికా ప్రసాద్ గార్లకు నా హృదయ పూర్వకమైన కృతజ్ఞత లు తెలియ చేసుకుంటున్నాను. మంచిపని యేదైనా తలపెట్టినప్పుడు లోక సహకారం తప్పకుండా వుంటుందని యెంతో కరుణ చూపారు. వీరెవ్వరినీ మరువలేను.

ఈ పుస్తకం కంపోజ్ చేసిన శ్రీమతి ఎ. లక్ష్మిగారికి నా ప్రేమాశీస్సులు. ముద్రించి ఇచ్చిన శ్రీ సాయిగ్రాఫిక్స్ అధిపతి శ్రీ కె.వి.వి.ఎస్.ఎన్. రెడ్డి గారికి, ప్రెస్ కార్మికులకు, ముఖచిత్రం చిత్రించిన శ్రీ ఈశ్వర్ గారికి నా కృతజ్ఞతలు.

మొదటినుంచీ నా లోకం యుద్ధాలు ద్వేషాలులేని గొప్ప అందమైన శాంతి ప్రపంచం. ఆ ప్రపంచాన్ని భూమిమీదకు తీసుకు రాలేకపోయినా, ఈ భూమిమీద మనుషుల్ని ఆ ప్రపంచంలోకి తీసుకువెళ్ళలేకపోయినా నాకు మనసు రెక్కలు తగులుతూనే వుండేవి. దేశంలోను పెచ్చు పెరుగుతున్న [illegible] సంఘంలోని హింస, బాల్యాన్ని సైతం నాశనంచేసే కులమతాల భావాలు, స్వార్థం, హింస, అవినీతి...... ఇవన్నీ నాకు తెలిసినా, తెలియక పోయినా నన్ను తీవ్రంగా గాయపరిచేవి. నన్ను సంక్షుభితుణ్ణి చేసేవి. నిస్సహాయత, దుఃఖం, కోపం, అశాంతి, ఆందోళనలు పుట్టించి నన్ను ఒంటరివాణ్ణి చేసేసేవి. ఇలా ఎంతమంది బాధ పడుతున్నారో కదా అనిపించి మరీ బాధకలిగేది.

బౌద్ధ ధ్యానంవల్లన, బౌద్ధధర్మ స్వీకారంవల్లన అనేకానేక మానసిక పరివేదనలనుంచి విముక్తుణ్ణి అయ్యాను. ముఖ్యంగా, చిన్నప్పటినుంచీ చాలా బాధపెట్టే 'మీ కులం ఏమిటి?' అన్న ప్రశ్న నన్నింక బాధించదు. 'నేను బౌద్ధుణ్ణి' అని తృప్తిగా, ధృతితో, ఆ ఆత్మవిశ్వాసంతో నేను హృదయపూర్వకంగా చెప్పుకోగలను. నిజంగా ఇది నేను ఊహించని స్వప్నం. కులాన్ని నిర్మూలించేటట్లు చేయటంలో బౌద్ధం గొప్ప ఆలంబన అని గట్టిగా చెప్పగలను. ఇందుకు ఎంతో ఆనందపడుతున్నాను.

ఈ పుస్తకం చదివాక ఎవరైనా, 'ఇది మనకు వున్నంతలో మంచి పుస్తకమే. మీరుకూడా చదవండి', అని మిత్రులకు పరిచయం చేసిన సంఘటనలుగానీ, ఈ పుస్తకమే మరొకరికొని ప్రెజెంట్ చేసిన సంఘటనలు గానీ, మూగజీవాలను, పక్షులను, చెట్లను రక్షించిన, వాటికి ఆశ్రయం కల్పించిన సంఘటనలుగానీ, మాంసాహారం మానివేసిన సంఘటనలుగానీ, పంచశీల, అష్టాంగమార్గం, ధ్యానం అనుసరించిన సంఘటనలుగానీ, మంచిపని ఎంత చిన్నదైనా ప్రోత్సహించిన సంఘటనలుగానీ, జీవితవిలువలు తెలుసుకుని విడిపోయిన మిత్రులు మంచి హృదయంతో తిరిగి ఏకమైన సంఘటనలు గానీ, చెట్లను రక్షించిన సంఘటనలుగానీ రెండూ, నాలుగు జరిగినా నా కష్టానికిమించిన గొప్ప బహుమతే నాకు లభించిందని నేను చాలా సంతోష పడతాను.

ఈ పుస్తకానికి ప్రాణం మాపాప సుజన. చిన్నితల్లి దానికి చెట్లన్నా, కొండలన్నా, పక్షులన్నా, జంతువులన్నా ఎంతో ప్రీతి. అర్థమైనట్టే వాటితో మాట్లాడుతూ వుండేది. ఆ పసి హృదయమే నా గుండెల నిండా నిండిపోయి ఆ విశ్వకళ్యాణమూర్తి బుద్ధ భగవానుని దర్శింప చేసి, నా జన్మని చరితార్థకం చేసింది.

నా గుండె ఘోషల్ని ఇలా మీతో పంచుకునేందుకు నాకు అవకాశంయిచ్చిన ఆ మహోన్నత బౌద్ధ ధర్మానికి మరోసారి మరోసారి శరణు ప్రకటించుకుంటూ, ఇందుకు తోడ్పడిన వారందరికీ సాష్టాంగ నమస్కారములు చేసుకుంటూ, పాఠకుల, బాలల, పెద్దల స్పందనలకు, అభిప్రాయాలకు, సరిదిద్దుకోవలసివున్న విమర్శలకూ, చేర్చవలసివున్న సలహాలకూ వినమ్రంగా, మహదానందంగా ఎదురు చూస్తూవుంటాను.

నటరాజ్
సుజనా హౌస్, 9-5-2/L
పిఠాపురంకాలనీ హుడాబిల్డింగ్స్ పార్క్ దగ్గర
విశాఖపట్నం - 530 003.

ఇట్లు
బౌద్ధ వందనాలతో
సమస్త జన విధేయుడు
నటరాజ్

పుస్తకారంభం శుభం

అధ్యాయం -I

# గౌతమబుద్ధుడు

## జీవితకథాసంగ్రహం

### పూర్వాపరాలు

మే 14, 1995 నాటికి రెండువేల అయిదువందల యాభైతొమ్మిది సంవత్సరాల క్రిందట (క్రీస్తుపూర్వం 563వ సంవత్సరం) మన పవిత్ర భారత ఖండంలో ఉత్తరాన హిమాలయ పర్వతప్రాంతాన, కపిలవస్తు నగరానికి పదికొమైళ్ళ దూరంలోగల దేవదహ అన్న పేరుగల ఒక చిన్న నగరం దరిదాపుల్లోగల లుంబినీ అన్న పేరుగల ఉద్యానవనంలో మహారాణి మాయాదేవి కడుపున సిద్ధార్థుడు అన్న చక్కని బాలుడు పుట్టాడు. అతడే గౌతమబుద్ధుడు. ఆ ప్రదేశం ఇప్పుడు పూర్తిగా నేపాల్ దేశంలో ఉంది.

పుట్టుకతో అతడొక రాజకుమారుడు. కానీ తనంతటతానే కడు బీదరికాన్ని వరించాడు. ఒక లక్ష్యం కోసం అప్పటివరకూ బహుశా మానవజాతి చరిత్రలో మనుష్యులెవరూ పడివుండని కష్టాలు కోరి మరీ అనుభవించాడు. అయినా ప్రపంచంలో కెల్లా ధనవంతులైన వారు కూడా పొందని అమరమైనంతో శాంతి, తృప్తి, అజరామరమైన కీర్తిని పొందాడు. ప్రపంచమంతటికీ ప్రియాతిప్రియమైన వ్యక్తిగా మారాడు. తానే చిరంతనంగా వెలుగొందే భారతదేశపు కీర్తిపతాక అయినాడు. విశ్వమానవులకే కళ్యాణకారకమైన సత్యాహింసల, ప్రజాస్వామ్య సమతాభావాల ఆచరణ తత్వప్రదాత అయినాడు. ఆ తత్వాన్ని మొదట తానే ఆచరించి చూపి మనకు మార్గదర్శి అయినాడు.

పండితులకీ పామరులకీ కూడా దివ్యస్ఫూర్తినందించేటువంటి అతని ప్రేమాన్వితమైన జీవిత కథని పావన చరితగా, వేలసంవత్సరాలైనా సరే, ఇప్పటికీ ప్రపంచంలో పలుమూలలా ప్రతీదినమూ తలుచుకుంటూనే ఉంటారు. అతని కీర్తినీ అమితానందాన్ని పొందుతారు. అతనిగురించి ఎంతోకొంత తెలియని వారెవరూ ఉండరేమో. ప్రపంచంలో అతని బోధనలను పాటిస్తున్న వారు ఇంచుమించు అందరూ అతనిని దేవుడిగానే భావిస్తారు. 'బుద్ధభగవానుడు' అనే పిలుస్తారు. అతనిని తమ తండ్రిగా, గురువుగా భావిస్తారు. ప్రతి తల్లి తండ్రీకూడా తమ పిల్లలు ఆ బుద్ధ భగవానుడు చెప్పినట్లు నడుచుకుని, తమకీ ప్రపంచానికీ మేలు చేయాలని కోరుకుంటారు. గొప్ప గొప్ప ఆలోచనాపరులు, మేధావులు, విజ్ఞాన వేత్తలు సైతం తాము చేసిన గొప్ప పనులకు ఆ బుద్ధ భగవానుని బోధనలే తమకు ప్రేరణ అని అన్నారు, అంటూనే ఉన్నారు. అతని వ్యక్తిత్వం అట్లాంటిది. అతని త్యాగం అట్లాంటిది. మానవాళికి అతనందించిన జ్ఞానం అట్లాంటిది. ఇప్పటికీ, ఎప్పటికీ కూడా స్వచ్ఛమైన అనంత మహాసాగరమది.

అంతగొప్ప శాంతి, ప్రేమ పంచిపెట్టిన ఆ బంగారు బుద్ధుని గురించి చెప్పాలంటే ఎన్నెన్నో గొప్పగొప్ప విషయాలున్నాయి. ప్రతి విషయం మనకి ఎంతో ఆసక్తిని, ఆనందాన్ని నర్తనాన్ని కల్గిస్తుంది. కొత్త కొత్త విషయాల్ని తెలుపుతాయి మనకి. మన ఆలోచనలు ప్రకాశవంత

మవుతాయి. మన హృదయం కరుణ, ప్రేమలతో నిండి అనిర్వచనీయమైన శాంతిని పొందుతుంది. మనం కూడా అంతటి గొప్పవాళ్ళమవాలని తలపోస్తాం. ఉవ్విళ్ళూరుతాం.

అలా గొప్పవాళ్ళు కావాలంటే డబ్బూ, ఆస్తీ, పొలాలూ, మేడలూ, విదేశీ చదువులూ, డిగ్రీలూ సంపాదించనక్కరలేదనీ, స్వార్థం, ద్వేషం, అజ్ఞానాలనుండి బయటపడితే చాలనీ, తెలుసుకుంటే చాలు, చాలా సంతోషపడతాం. అంత తేలికగా వుంటాయి ఆ పద్ధతులు. వాటిని తెలుసుకోవడమే ఆలస్యం, మనంకూడా ఆ చక్కని పద్ధతులను వెంటనే ఆచరణలో పెట్టెయ్యాలని తలపోస్తాం. నిర్ణయం కూడా తీసుకుంటాం. తృప్తిగా, శాంతిగా, ఆదర్శంగా బతుకుతూ, తోటి మనుష్యులనీ, మనచుట్టూ వున్న చెట్లనీ, మూగజీవాలనీ ప్రేమిస్తూ, జీవావరణ పరిపూర్ణాభివృద్ధికి తోడ్పడుతూ, సమాజంలో శాంతి సౌభాగ్యాలు సాధిస్తూ కొత్త కొత్త విషయాలు తెలుసుకుంటూ అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవిస్తూ అందరి మన్ననలనూ పొందుతాం. బుద్ధతత్వాన్ని అర్థం చేసుకుంటూ అంతరంగాన్ని పవిత్రంగా మార్చుకుంటూ, సర్వ జీవసంక్షేమానికి మనవంతు మనంపాటుపడుతూ మానవజన్మని సార్థకం చేసుకుంటాం. చరితార్థకం చేసుకుంటాం. ప్రతీ అడుగూ అందుకోసమే వేస్తాం. విశ్వమానవ కళ్యాణంలో, విశ్వసత్యంలో భాగమవుతాం.

ప్రపంచంలో బుద్ధుడు చెప్పిన మాటలు ప్రభావితం చేసినంత గాఢంగా యెవరిమాటలూ ప్రభావితం చేయలేదు. దేశాలకి దేశాలే ఆయన బోధనల్ని శిరసావహించాయి. యే ప్రయాణ సాధనాలూ, స్పష్టమైన మార్గాలూ లేని ఆ అతి ప్రాచీనకాలంలోనే ఆయన ప్రవచించిన బౌద్ధధర్మం అడవులూ, మహాపర్వతాలూ, యెడారులూ, సముద్రాలూ దాటుకుంటూ ఖండాంతరాలకు సైతం వ్యాపించింది. ఆయన ధర్మాన్ని వినడంతోటే మనస్సులు సంతోషంతో నిండిపోతాయి ప్రతీవొక్కరూ ఆయన తమవాడనే అనుకుంటారు. అది తమ ధర్మమే అని అనుకుంటారు. అంత చక్కటి మానవీయధర్మం అది. యిరుగు పొరుగు మాత్రమే కాదు, సమస్త జీవులూ సంతోషంగా బ్రతకాలని వాంఛించే, అందుకు ఆచరణీయమైన, స్పష్టమైన పద్ధతులు తెలిపే విమార్శ ధర్మమది. ఆ బుద్ధుని పుస్తకాలు తెరుస్తేనే చాలు అంతా కరుణ, ప్రేమ, దయ, వాత్సల్యాలతో నిండి మనకడుపు అంతా శాంతితో నిండి పోతుంది. యేదో వొక మంచిపని చేయాలన్న వుత్సాహం పుడుతుంది.

జ్ఞానాన్ని ప్రతీమనిషికీ అనుసరణీయం చేసినందువల్ల ఆ బౌద్ధ ధర్మం గొప్ప ప్రజామతం. పరిపూర్ణమైన ఆలోచనలతో నిండివుండటం చేత అదొక గొప్ప తత్వం. మనసుయొక్క లోతు పాతుల్నీ, వేదనల్నీ తెలుసుకుని, ఆ మనసుపైనే అధికారం సంపాదించగల ధ్యాన పద్ధతుల్నీ తెలుపుట చేత అదొక గొప్ప మానసిక శాస్త్రం. సంఘంలో మనిషిబాధ్యతను అతడు అనుసరించవలసిన మానవీయవిధుల్నీ తెలపడం చేత అదొక గొప్ప మానవీయ నైతిక శాస్త్రం. అంతేకాదు, ప్రకృతి సమతుల్యత గురించి చెప్పడంచేత అదొక గొప్ప ప్రకృతి విజ్ఞాన శాస్త్రం. అయిదేండ్ల బాలుని నుంచి నూరేండ్ల వృద్ధుని వరకూ పఠించి, ఆనందించి, పాటించే రమణీయ నవజీవన పావన చరితం అది. అది నిబంధనలు విధించే పిడివాదంకాదు. ప్రార్థనలకీ, క్రతువులకీ మనిషిని కట్టిపడవేసే మతం కాదు. అది మాటల్లో, చేతల్లో, జీవిత విధానంలో స్వచ్ఛతనింపే అమృతసుధ. యీ సంగతులన్నీ యెంత గొప్పగా వున్నాయి? యెంత సంతోషంగా వున్నాయి? ఆ బుద్ధుని గురించి యింకా యింకా తెలుసుకోవాలని పిస్తోంది కదూ!!

బుద్ధుడి గురించి తెలుసుకునే ముందు, బుద్ధుడు పుట్టక ముందటి సంగతులు కొన్ని తెలుసు కుందాము. అప్పుడే మనకు బుద్ధుని గురించి బాగా అర్థం అవుతుంది.

బుద్ధుడు పుట్టకముందూ, ఆ తరువాత చాలాకాలం వరకూ మన భారతదేశపు ఉత్తర ప్రాంతం అంతా అంగ, మగధ, కాశీ, కోసల, వజ్జి, మల్ల, చేది, వత్స, కురు, పాంచాల, మచ్ఛ, సూరసేన, అస్సక, అవంతీ, గాంధార, కాంభోజ మొదలైన రాజ్యాలు వుండేవి. వీటిలో మగధ, కోసల, అవంతి, వత్సరాజ్యాలు పెద్దవి. అంతేకాదు యీ నాలుగు రాజ్యాలూ యేకస్వామ్యరాజ్యాలు. మిగిలిన వన్నీ చిన్న చిన్న గణతంత్రరాజ్యాలు.

యేకస్వామ్య రాజ్యంలో చక్రవర్తే సర్వాధికారి. అతడిమాటకు తిరుగు వుండదు. అతణ్ణి దేవుడి ప్రతినిధిగా భావిస్తారు. అంతా అతడి యిష్టారాజ్యం.

అదే గణతంత్ర రాజ్యాలలో పరిస్థితి అలావుండదు. ప్రజలు తాము నివసించే ప్రాంతాలనుంచి చిన్న చిన్న నాయకుల్ని, తమని పరిపాలించేందుకు యెన్నుకుంటారు. అలా యెన్నికయిన నాయకులందరూ కొద్దిమంది పెద్దనాయకుల్ని యెన్నుకుంటారు. వారిని మహాజనులు అంటారు. యీ మహాజనులందరూ కలిసి మహారాజుని యెన్నుకుంటారు. ఆ మహారాజు పేరు చెప్పి సూచనలకనుగుణంగా పరిపాలిస్తాడు. యేపని అయినా యీ మహాజనులందరూ యెలా చెయ్యాలో, యేంచెయ్యకూడదో, యెందుకు చెయ్యాలో, అసలు చెయ్యకూడదో లేదో యిటువంటివన్నీ కూలంకషంగా చర్చించి మహారాజుకి నివేదిస్తారు. యిటువంటి గణతంత్రరాజ్యంలో ప్రతీ సమస్యా అన్ని విధాలుగా అన్నివైపులా పరిశీలించి నిర్ణయం తీసుకొంటూ వుండటంచేత సాధారణంగా న్యాయం అందరికీ చెందేది.

కానీ, యేకస్వామ్య రాజ్యంలో చక్రవర్తి యెవరిమాటా వినవలసిన అవసరం లేకపోవడం చేత, అతడు యుద్ధం చెయ్యాలని తలపోస్తే, రాజ్యంలో వున్న ప్రజలందరూ అందుకు తమకు యిష్టం వున్నా లేకపోయినా వూ కొట్టాల్సిందే. కుటుంబానికొకడు చొప్పున ప్రాణాలు బలిపెట్టాల్సిందే. యెంత మితిమీరిన పన్నులు వేసినా, ఆకలి మంటలకు ఆహుతైపోతున్నాసరే నోరు మూసుకుని, కొంపాగోడూ అమ్ముకుని రాజు వేసిన పన్నులు కట్టాల్సిందే. రాజభటుల దౌర్జన్యాలకి తలవొగ్గాల్సిందే. బలి కావాల్సిందే.

వీటికి తోడు యేకస్వామ్యరాజ్యచక్రవర్తులు తమ ఘనత అందరికీ తెలియాలన్న కోరికతో, రాజ్యాన్ని పెంచుకోవాలన్న కోరికతో, తమపై పట్టు సంపాదించుకున్న కొందరు పనిలేని పురోహితుల సలహాల మేరకు యజ్ఞయాగాలు చేసేవారు. యుద్ధాలు సరేసరి. యజ్ఞాలలో యెన్నెన్నో గోవులను, మేకలను, యెద్దులను దేవతలపేరిట నిర్దాక్షిణ్యంగా బలి యిచ్చేవారు.

వేలాది మూగజీవాలు అలా ఆహుతి అయిపోతూవుండేవి. ప్రజలలో వ్యవసాయం తరువాత అత్యధిక శాతం పశువులపైనే ఆధారపడి జీవించేవారు. పశువుల సాయంతో భూములు దున్నడం, పంటతోలడం, బండ్లు కట్టడం యెన్నో పనులు జరిగేవి. పాడి పశువులు పాలు యిచ్చేవి. పశువులు లేకపోతే వొక్కపని కూడా సుళువుగా జరిగేదికాదు. తెల్లవారి లేచినది మొదలు నిద్రపోయేదాకా వారికి పశుపాలనలోనే సరిపోయేది. పశుపాలన వల్ల వారికి వ్యవసాయంపనులు శీఘ్రంగా అవడమే కాకుండా పుష్టికరమైన పాలు, పెరుగు, వెన్న, మీగడలు సమృద్ధిగా లభించేవి. వాళ్ళు పశువులను సొంత అన్నదమ్ముల్లుగా చూసుకొనేవారు. తమపాలిటి దేవతలుగా, పెన్నిధులుగా చూసుకునేవారు.

అటువంటి పశువులను యజ్ఞాల్లో బలి యివ్వడానికి రాజభటులు వాటిని బలవంతంగా లాక్కు వెళ్ళిపోతుంటే, రాజాజ్ఞకు యెదురు చెప్పలేక, యెదురు తిరిగితే యెదురయ్యే కొరడాదెబ్బలు, మరణదండనలు పడలేక గుండెలు పట్టుకుని, గుడ్లనీళ్ళు కుక్కుకుని యేడ్చేవారు.

పాపం, ఆ పశువులు కూడా. తమని ఎంతో ప్రేమగా చూసుకుంటున్న రైతుల దగ్గర్నుంచి అలా బలవంతంగా రాజసైనికుల వెంట వెళ్ళడానికి యిష్టం చూపేవికావు. అంబా, అంబా అని అరుస్తూ, భయంతో అటూయిటూ పరుగులు తీసేవి. యేవో అస్పష్టంగా ఆక్రోశించడం తప్ప యేదెబ్బలూ యెరుగని వాటిని రాజసైనికులు దుడ్డు కర్రలతో, కొరడాలతో అతిదారుణంగా కొట్టేవారు. రాజభటులు వచ్చారంటే చాలు యిలా వూరంతా భయంతో, బాధతో, గుండెల నిండా శోకంతో దిక్కుతప్పిపోయేది. పశువుల్ని బలవంతంగా తోలుకుని వాళ్ళు వెళ్ళిపోగానే వారి యేడ్పులతో నిండిపోయేదా వూరువూరంతా.

యిదివరకన్నట్టు బలికోసం బలవంతంగా లాక్కువెళ్ళిన ఆ పశువులను ఆ యజ్ఞాలలో రాజులో, పురోహితులో, రాజభటులో నరికేవారు కాదు, ఆ పనిని రైతుల చేతనే బలవంతంగా చేయించేవారు. అవి గిలగిలా తన్నుకుంటుంటే కాళ్ళు పట్టిపెట్టడం, చంపిన తరువాత వాటిని కత్తులతో చీరడం, వాటి గుండెకాయలు యితర భాగాలు కోసి అందించడం, ముక్కలుకోయడం యిటువంటి పనులన్నీ వారి చేతనే చేయించేవారు. కన్నతల్లుల్లాంటి తమ పశువుల్ని తామే చంపి, ఖండ ఖండాలుగా నరకాల్సిరావడాన్ని వారు తట్టుకోలేకపోయేవారు. తల్లడిల్లి పోయేవారు. గుండెలవిసి పోయేలా యేడ్చేవారు. మాంసం తినేవారు సైతం యీ దుష్టకిరాతక బలులను కంటగింపుకునేవారు.

యిటువంటి భయానకపరిస్థితి యేకసత్తాక రాజ్యాలలోనే యెక్కువగా వుండేది. అయినా యీ యజ్ఞాల ప్రభావమిట్టు ప్రక్కని గణతంత్రరాజ్యాలపైన కూడా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పడుతూనే వుండేది. యే గణతంత్ర రాజ్యమైనా సుఖసంపదలతో విలసిల్లుతుంటే యేకసత్తాకరాజ్య చక్రవర్తులు చూసి ఓర్వలేకపోయేవారు. యజ్ఞాలు చేసేవారు. లేకపోతే బలహీనమైపోయేందుకు, గణతంత్ర రాజ్యాల మధ్య తగవులు, యుద్ధాలు సృష్టించేవారు. కల్పించే వారు.

యిది యిలా వుండగా, యజ్ఞాలు చేయడం రాజులందరూ చెయ్యవలసిన గొప్ప పనిగా ఆనాటి బ్రాహ్మణపురోహితులు ప్రచారం చేసేవారు. యజ్ఞాలు చేయని రాజులను హీనంగా చూసేవారు. యీ యజ్ఞాలలో దానాల పేరున వారికి చాలా రాబడి వుండేది. యీ రాబడి వల్ల వాళ్ళల్లో వాళ్ళే బాగా పోటీలు పడేవారు. సులువుగా ధనం సంపాదించే మార్గం యిది. అందువల్ల యిటువంటి యజ్ఞాలు యెంతమందిచేత చేయిస్తే అంత మంచిది వారికి. చక్రవర్తిని చూపి రాజుకీ, రాజుని చూపి సామంతరాజుకీ, ఆ సామంతరాజుని చూపి భూకామందులకీ యెవరితాహతుకు తగినవిధంగా వారికి రకరకాల యజ్ఞాలను సృష్టించి, వారిలో ఆశలూ, మిథ్యా గౌరవాలూ పుట్టించి, యజ్ఞాలు చేయించి తమ పబ్బంగడుపుకునేవారు. యిక యే యిరురాజ్యాల మధ్యనైనా యుద్ధం వచ్చిందంటే వారి పంట పండిందన్నమాటే. అపన్నాల పేరిట, యుద్ధ విజయాల పేరిట మరిన్ని యజ్ఞాలు క్రతువులు వారిచేత చేయిస్తుండేవారు.

యీ యజ్ఞాలు చెయ్యడానికీ, వేదికలు నిర్మించడానికీ, మూడు మూలల నుండీ వచ్చే బ్రాహ్మణపురోహితులు బస చెయ్యడానికి వసతి గృహాలు నిర్మించడానికీ, పశువులను కట్టేందుకు యూపస్తంభాలు చెయ్యడానికీ అడవులకి అడవుల్నే నరికి వేసేవారు. వేలాది సంవత్సరాల వయసు

గల మహాశక్తుల్ని సైతం ఆపిన అంటే తమ కన్నబిడ్డలుగా భావించే గిరిజనుల చేతనే విశ్వాసఘాత్యంగా బలవంతంగా వరికి వేయించేవారు.

యిలా నిత్య జీవితంలోనూ, వ్యవసాయంలోనూ కష్టించిన్లా ఆదుకునే పశు సంపదని బలిచేస్తూ వుండటం వల్ల ఆదాయ వనరులు తరిగిపోయి, వ్యవసాయాలు, పాడి ఉత్పత్తులు నశించి, జీవన మార్గం కోల్పోయి రైతులు నిరుపేదలై పోయేవారు. చెట్లు నరికేస్తూ వుండటం వల్ల వాటి ఫల పుష్పాలపై, గింజలపై, ఆకులపై ఆధారపడి బ్రతికే ఆదివాసులు కూడా కొంపాగోడూ కోల్పోయేవారు.

యిటువంటి నిస్సహాయ ప్రజలను రాజధానీ నగరాలలో విలాస భవంతులు నిర్మించడానికీ, రహదారులు వెయ్యడానికీ, యుద్ధ సామగ్రి తయారు చెయ్యడానికీ, రాజభవనాలలో బానిస పనులు చెయ్యడానికీ, గుర్రాలకు మాలీషు చెయ్యడానికీ బలవంతంగా కొరడా దెబ్బలతో మోదుతూ మరీ రాజభటులు తీసుకుపోయేవారు.

దయాదాక్షిణ్యాలు అన్నవి లేకుండా, గొంతులోకి యింత నీరు కూడా తాగనివ్వని దారుణాలవలన ఆ ప్రజలు ఆ   బాధలననుభవిస్తూ, నిత్య శల్యాలై, రోగాలతో, ఆకలి బాధలతో అలమటిస్తూ, దిక్కూ, మొక్కూ లేకుండా చనిపోయేవారు. వారిని శ్మశానానికి తీసుకు వెళ్ళడానికి కూడా యెవరికీ సమయం దొరికేది కాదు.

యెప్పుడెవరి కొంప మునుగుతుందో తెలియదు. యే కుటుంబం రాజుల, రాజోద్యోగుల ఆగ్రహానికి గురి అవుతుందో తెలియదు. స్వార్థపరులకూ, దుర్మార్గులకూ యిదే అదను. తమకు లంచాలు యివ్వని వారిపై, లొంగి వుండని వారిపై రాజోద్యోగులకు లంచాలు యిచ్చి, యేవో [illegible] ఫిర్యాదులు చేసి వారిచేత ఆయా కుటుంబాలను రచ్చకీడ్పించి ముప్పు తిప్పలు పెట్టేవారు. పచ్చగా కళకళలాడే కుటుంబాలలో చిచ్చులు పెట్టేవారు. వారి యిళ్ళల్లో జిల్లేళ్ళు మొలిపించేవారు.

ప్రజలు ద్వేషాలతో, కలహాలతో, భయాలతో, ఆవేశాలతో, అభద్రతతో క్షీణించిపోయేవారు. రాజులు తోటి రాజుల పట్ల శత్రుత్వం, స్వార్థాలు పెంచుకొని, ప్రజా సంక్షేమం పట్టించుకోకుండా, సైనిక శక్తి పెంచుకుంటూ, కయ్యాలకి కాలుదువ్వుతూ వుండేవారు. యేకసత్తాక రాజ్యాలు యీ అన్నీ మొదటినుంచీ అన్ని విధాలా ఆక్రమం చేస్తూ, గణతంత్ర రాజ్యాలను శక్తిహీనం చేసి తమ రాజ్యంలో కలిపేసుకోవడమో లేక తమ సామంతరాజ్యాలుగా చేసుకోవడమో పరిపాటిగా చేస్తుండేవి.

బుద్ధునికంటే పూర్వమే, యింకా కొన్ని వందల సంవత్సరాలవెనుకే యిటువంటి దారుణమైన సామాజిక పరిస్థితులు తప్పలేదు. వీటికి కారణాలు తెలియక, అర్థంగాక, వీటి నుంచి విముక్తి కోసం యేం చేయాలా అని ఆలోచనలు చేసేవాళ్ళు చాలామంది వుండేవాళ్ళు. అందుకోసం వారు వొక్కొక్కరూ వొక్కొక్క విధంగా కృషి చేసేవారు. వారిలో చాలామంది రాజులంటే పడక అడవులు పట్టిపోయేవారు. కొందరు దేశద్రిమ్మరులుగా తిరిగేవారు. కొందరు దుస్సాహసమైన ఆలోచనలతో పిచ్చివాళ్ళయిపోయి ఆత్మహత్యలు చేసుకునేవారు. కొందరు దుండగీళ్ళుగా, దోపిడీ దొంగలుగా మారిపోయి, విచక్షణా వివేకాలు నశించి తిరిగి ప్రజలనే కొల్లగొడుతూ వుండేవారు.

కొందరు రెండుపూటలా తిండి తినడమంటే వేరొకరి పొట్టగొట్టడమే అని భావించి వొక్కపూట మాత్రమే భోజనం చేసేవారు. కొందరు వారానికొక్కపూటే భోజనం చేసేవారు. కొందరు ఆ భోజనం కూడా చెయ్యకుండా, పండి రాలిపోయిన ఆకులు, పళ్ళు తిని బతికేవారు. చాలామంది అడవులకి వెళ్ళిపోయి ధ్యానం చేసుకుంటూ వుండేవారు. మనోశక్తుల్ని సాధించడానికి అనేక ధ్యాన

అంతలో ఆమెకి అనుకోకుండా ప్రసవపు నొప్పులు రాసాగాయి.

ఆ రాత్రే ఆమె ఆ లుంబినీ వనంలోనే ఒక అశ్వత్థ వృక్షం క్రింద మన చరిత్రాత్మక, బంగారు బాలబుద్ధుని ప్రసవించింది.

ఈ సంగతి తెలియగానే రాజకుటుంబీకులు, ప్రజలు ఎంతో సంతోషించారు. మహారాణిని స్వయంగా రాజధానికి తీసుకువచ్చాడు శుద్ధోదనుడు. పుర ప్రజలందరూ ఆ బాలుని చూడటానికి ఉవ్విళ్ళూరారు. పున్నమినాడు పుట్టినందుకు ఆ బాలుడు సైతం పున్నమిచంద్రుని లాగే చక్కని తేజంతో, చక్కని రూపంతో పుట్టాడు. గోమాత కన్నుల్లాంటి కరుణ వర్షించే కన్నులు. రెండు కనుబొమ్మల మధ్య చిన్న పుట్టుమచ్చ. చక్కటి వర్చస్సు. చూడగానే గొప్ప వాడవుతాడనిపించే రూపం. ఎవరికైనా చూడగానే ప్రేమ పుట్టే రూపం.

శుద్ధోదనుడి సంతోషానికి అవధులు లేవు. ఆ సంవత్సరం పంటలు బాగా పండి, రాజ్యానికి మంచి ఆదాయం వచ్చింది. రాజ్య నిర్వహణకు ప్రజలే స్వయంగా ధనధాన్యాలను రాజుకు సమర్పించారు. ఈ తరుణంలోనే తనకి పిల్లవాడు పుట్టాడు. తనవన్నీ కోరికలూ తీరాయి. ఆ సంతోషంతో శుద్ధోదనుడు ఆ బాలుడికి, 'సర్వార్థ సిద్ధుడు' అని పేరు పెట్టాడు. అతనిని పిలవడం మాత్రం ముద్దుగా 'సిద్ధార్థుడు' అని పిలిచేవారు.

ఏమి దురదృష్టమో సిద్ధార్థుని కన్న వారం రోజులకే మహారాణి మాయాదేవి చనిపోయింది. ఆమె సంతోషం పట్టలేకనే చనిపోయిందని అంటారు. ఏమైతేనేం వారం రోజుల్లోనే పండగంతా తెల్లారిపోయింది. ఈ విషాదాన్ని శుద్ధోదనుడే కాదు, రాజ్య ప్రజలెవ్వరూ తట్టుకోలేకపోయారు. పురిట్లోనే తల్లిని కోల్పోయిన ఆ పసికందుని తలచి వారెంతో శోకతప్తులయ్యేవారు.

తల్లి లేని బిడ్డని పెంచడం ఎంత కష్టం? ఆ బాలుని చూడగానే అందరికీ దుఃఖం పొంగుకువచ్చేది. జాలితో, దుఃఖంతో అందరి గుండెలూ అవిసిపోయేవి.

తన కుమారుడు తల్లిలేనివాడుగా పెరగడం చూడలేక శుద్ధోదనుడు మహారాణి మాయాదేవికి స్వయానా చెల్లెలైన మహాప్రజాపతి గౌతమిని పెండ్లిచేసుకుని సిద్ధార్థుని పెంపకపు బాధ్యతను ఆమె చేతిలో పెట్టాడు.

ప్రజాపతి గౌతమి సిద్ధార్థుని కన్నతల్లి కంటే ఎక్కువగా ప్రాణంగా చూసుకున్నది. సిద్ధార్థునికి తల్లిలేదన్న సంగతినే ఆమె మరిపించింది. ఆమెకు ఆ చిన్నిబాలునితోటే లోకం అంతా. తల్లి కంటే మిన్నగా ప్రేమను పంచుతున్న మహారాణి గౌతమిని చూసి అందరికీ సంతోషంతో కళ్ళు చెమ్మగిల్లేవి. ఆ తల్లీబిడ్డల అనుబంధాన్ని, ప్రేమానురాగాల్ని ఆ రాజ్యంలో ప్రతిచోటా ఎంతో గొప్పగా చెప్పుకునేవారు. చాలామంది అయితే ఆ తల్లిపేరు కూడా కలిపి సిద్ధార్థుని, 'సిద్ధార్థ గౌతముడు' అని పిలిచేవారు. సిద్ధార్థుడు జ్ఞానసిద్ధిని పొందిన తరువాత 'గౌతమ బుద్ధుడు'గా పేరు పొందడం ఇందుచేతనే అనిపిస్తుంది.

ఆ రోజుల్లో ప్రజలూ, రాజులూ కూడా జ్యోతిష్యాన్ని నమ్మేవారు. జ్యోతిష్కులు బిడ్డ రూపాన్ని బట్టి, పుట్టిన కాలాన్ని బట్టి ఆ బిడ్డ భవిష్యత్తు ఎలావుంటుందో చెప్పేవారు. చాలా సంఘటనలు వారు చెప్పినట్లుగానే జరిగేవి. ఈ ప్రపంచం మారడానికి మహాత్ములెవరో పుట్టాలన్న ఆకాంక్షలు ప్రబలంగా వున్న రోజులవి. సిద్ధార్థుపై వుండే మమకారం కొద్దీ శుద్ధోదనుడు కూడా సిద్ధార్థుని భవిష్యత్తు గురించి జ్యోతిష్కుల్ని సంప్రదించాడు. కౌండిన్యుడనే జ్యోతిష్కుడు సిద్ధార్థుని

చూసి యితడు మహాచక్రవర్తి అయినా అవుతాడు లేదా మహాపరివ్రాజకుడైనా అవుతాడు అని చెప్పారు. అసితుడనే గొప్ప ముని ఆ బాలుని చూసి కంట తడిపెడుతూ, యీ బాలుడు మానవాళి దుఃఖాన్ని పోగొట్టే మహాతత్వాన్ని లోకానికి అందిస్తాడని మహా పరివ్రాజకుడై మానవత్వానికి మరో పేరుగా వర్ధిల్లుతాడని. వయసు పైబడటం వల్ల అదంతా నేను చూడను కదా అని యేడుస్తున్నానని చెప్పాడు.

రాజభవనాల్లో, విలాసాలమధ్య తాను జీవిస్తుండటంతో తన కుమారుడు సర్వసంగపరిత్యాగం చేసి పరివ్రాజకుడవుతాడన్న వూహ శుద్ధోదనుడికి కలగలేదు. అయితే ఆ వూహ మాత్రం అతడికి చాలా భయం కల్గించింది. అయినా తనను తాను సంబాళించుకుని, ఆ వూహ తిరిగి తలపులోకి రాకుండా సిద్ధార్థుని గొప్ప రాజుగా, చక్రవర్తిగా తయారు చేయడానికి తగిన విద్యలన్నింటినీ చిన్నప్పటినుంచే నేర్పించసాగాడు.

సిద్ధార్థుడు కూడా అన్ని విద్యలూ శ్రద్ధగా నేర్చుకుంటూ యెవరికీ బాధకలుగకుండా, గురువుల యెడ వినయ విధేయతలతో, తోటి విద్యార్థులతో స్నేహంగా, ప్రేమగా మెలిగేవాడు. అంత చిన్నతనంలోనే అతడు చక్కని వాక్యాలు కూర్చేవాడు. యేదైనా పాఠం అప్పచెప్పమంటే వచ్చినప్పుడు ఆ పాఠాన్ని మరింత అందంగా అప్పచెప్పేవాడు. అతని పద్ధతికి గురువులే యెంతో సంబరపడిపోయేవారు.

సిద్ధార్థుడెప్పుడు ఖాళీ చిక్కినా రాజభవనం దాపున తండ్రి ప్రత్యేకంగా నిర్మించిన ఉద్యానవనంలోకి వెళ్ళి కూర్చునేవాడు. ఆచెట్లు, గాలి తాకిడికి వూయలలూగుతూ చేసే మధురమైన చప్పుళ్ళను, రాగాలను, ఆకుల గలగలలను, పక్షుల కిలకిలా రావాలను వింటూ యెంతో సంతోషపడేవాడు. విరగబూసిన చెట్లని చూసి తానూ అలాగే వుప్పొంగిపోయేవాడు.

తానొక వనంలో పుట్టాడని తెలుసుకున్నందువల్లనో యేమో సిద్ధార్థునికి చిన్నప్పటి నుంచీ వనాలంటే యెంతో ప్రీతి. చెట్లని యెంతో ప్రేమించేవాడు. వాటిపై గూళ్ళు కట్టుకుని పిల్లల్ని పొదుగుతున్న పక్షుల్ని చూస్తుంటే అతడికి చాలా సంతోషంగా వుండేది. వుద్యానవనంలో అందం కోసం, వేడుకకోసం పెంచుతున్న లేళ్ళను, నెమళ్ళను, పావురాళ్ళను, చెవుల పిల్లులను యెంతో ఆప్యాయంగా చూసేవాడు. అందం కోసం బంధించిన చిలకల్ని మైనాల్ని పంజరాల్లోంచి వదిలేస్తేనే అవి ఆకాశంలో స్వేచ్ఛగా యెగురుతుంటే వాటిని చూసి చాలా సంతోషపడేవాడు. చిన్నప్పుడే చనిపోయిన తల్లిని యిలా ప్రకృతిలో, ప్రకృతి జీవాలలో, చెట్లలో, పక్షులలో చూసుకునేవాడేమో.

యే జీవి అయినా బాధపడుతుంటే అతడు చూడలేకపోయేవాడు. అతడి కనుకొలకుల్లోంచి కన్నీళ్ళు ముత్యాల్లా, చందమామనుంచి ముక్కలు రాలిపోతున్నట్లుగా బలబలా రాలిపోయేవి. వెంటనే ఆ జీవికి చేయవలసిన సపర్యలు చేసేవాడు. తన స్నేహితులలో యెవరికైనా ఆటలో దెబ్బలు తగిలితే ఆ దెబ్బలను, గాయాలను కడిగి, నెప్పితగ్గించే పసరులాంటి మందులు రాసి, కట్టుకట్టి వారికెంతో వుపశమనం కల్గించేవాడు. అతనికి అయిష్టమైన జీవి వుండేదికాదు. పాకే పురుగుల్నీ యెగిరే కీటకాల్నీ కూడా వుత్సాహంగా, అభిమానంగా చూసేవాడు. వేటిని చంపాలనిగానీ, బాధించాలనిగానీ అతడికసలు అనిపించేదే కాదు. వుద్యానవనానికి అతడు వచ్చాడంటేనే చాలు పావురాళ్ళు, అడవికోళ్ళు, నెమళ్ళు, జింకలు అన్నీ అతడి చుట్టూ చేరేవి. ప్రతి ఒక పక్షిని ప్రేమగా పలకరించేవాడు. తన చెంతకు వచ్చిన వాటిని ప్రేమగా స్పృశించేవాడు.

## ఆనందస్పందన

అందమైన ఆ ఉద్యాన వనాల్లో ఒంటరిగా సంతోషంగా తిరుగుతున్నప్పుడు ఒకరోజున అతన్ని నిండా గుత్తులు గుత్తులుగా కాసిన గులాబీ ఆపిల్ (యాపిల్) చెట్టు బాగా ఆకర్షించింది. నెమ్మదిగా వెళ్ళి ఆ చెట్టు క్రింద కూర్చున్నాడు. ఎంతో అందంగా ఉంది ఆ ప్రదేశం. చుట్టూ తిరుగాడే అందమైన నెమళ్ళు, పింఛముప్ప అడవికోళ్ళు, బాతులు, రాజహంసలు, లేళ్ళు, చెవులపిల్లులు— అంతా ఆనందానికి ప్రతీకలా ఉంది ఆ వాతావరణం. ఆహారంకోసం చిలుకలు, గోరువంకలు, కాకులు మొదలైన పక్షులు మరీ కోలాహలం చేస్తున్నాయి. చుట్టూ అందంగా చిన్న చిన్న సరస్సులు కొలువు చక్కగా కూర్చునే విధంగా కట్టారు. ఒక సరస్సునిండా నీలికలువలు పూస్తాయి. మరొక సరస్సు నిండా ఎర్రనిరంగుకలువలు పూస్తాయి. మరొక సరస్సులో తెల్లనికలువలు అక్కడక్కడా తామర పద్మాలు విరబూసి ఉంటాయి. ఆ కలువలలోని తేనె తాగడానికి ఝుమ్మంటూ తేనెటీగలు వస్తున్నాయి. ఆ సరస్సులో అందమైన చేపలు పుష్కలంగా ఎగిరి మళ్లీ నీటిలో పడుతున్నాయి. సిద్ధార్థుడు అలా తదాత్మ్యంగా చూస్తుండగా ఎలా పట్టిందో అతడికి లేత మాగన్ను నిద్ర పట్టేసింది. ఆ నిద్రలో ఏం అందమైన కలలు కన్నాడో. లేచేసరికి వాతావరణం చల్లబడి మరింత అందంగా ఉంది. అతని ముఖం గొప్ప కాంతితో వెలిగిపోయింది. ఆ దివ్య నిద్రలో అతడికి దివ్యమైన ఆనందం లభించింది. ఆ ఆనందం అతడికి అలా జ్ఞాపకం వస్తూనే ఉండేది. లోకంలో ఉన్న ఆనందానుభూతులన్నీ అమృతధారల్లా అతడిని ముద్దముద్దగా తడిపి వేసినట్లుండేదా అనుభూతి. ఆ అనుభూతిని అతడు మరువలేక పోయేవాడు. ఆ ఆనందం అతడు పెద్దవాడైపోయినా జ్ఞాపకం వస్తూనే ఉండేది. ఆ ఆనందాన్ని తిరిగి తెచ్చుకోవాలని ఎంతో ప్రయత్నించేవాడు కానీ ఆ ఆనందం లభ్యమయ్యేది కాదు. ఆ ఆనందంకోసం చాలా తపన చెందేవాడు.

## మూగజీవాల ఆప్తబంధువు

విద్యలో భాగంగా అతడు గుర్రపు స్వారీ నేర్చుకోవాలి. ధనుర్విద్యనేర్వాలి. రథాన్ని నడపాలి. కత్తి యుద్ధాలు చేయాలి. ఇటువంటి విద్యలు నేర్చుకునేటప్పుడు ప్రత్యర్థికి దెబ్బలు తగలకుండా ఎంతో జాగ్రత్తగా వ్యవహరించేవాడు. ఒకసారి అతడు ప్రత్యర్థితో ద్వంద్వయుద్ధం చేయవలసి వచ్చింది. మరి ఇక్కడ అతడు ఆత్మ రక్షణ కూడా చేసుకోవలసి ఉంది. అతడు తప్పనిసరిగా ద్వంద్వయుద్ధంలోకి దిగాడు. తనంతతాను ప్రత్యర్థిని కొట్టడు. ప్రత్యర్థి కొట్టే దెబ్బలకు దొరకడు. సులువుగా తప్పించుకునేవాడు.

ఇటువంటి యుద్ధంలో ఓడిపోయిన ప్రత్యర్థిని చూస్తే అతడికి ఎంతో జాలి కలిగేది. అంతే. తానొక రాజకుమారుడు అన్న అహంకారం లేశమాత్రమైనా లేకుండా. ఆ ప్రత్యర్థి చేతిలో ఓడిపోయి, అతడు సంతోషిస్తూ ఉంటే అతడిని చూసి తానూ పసిపిల్లాడిలా ఎంతో సంతోషపడేవాడు. ఎప్పుడూ కూడా ఇతరులు సంతోషిస్తుంటే అతడికి మహదానందంగా ఉండేది.

ఒకసారి అతడు గుర్రపుస్వారీలో పాల్గొనవలసి వచ్చింది. రాజకుటుంబీకులు, రాజోద్యోగులు, గురువులు, ప్రజలు ఆస్వారీలో ఎవరు గెలుస్తారా, సిద్ధార్థుడే గెలవాలి అనుకుంటూ ఉత్సాహంగా ఎదురుచూస్తున్నారు.

స్వారీ మొదలైంది. సిద్ధార్థునిపై ఉండే ప్రేమ కొద్దీ సిద్ధార్థుడు స్వారీ చేస్తున్న గుర్రం

తనశక్తికి మించి ఆగమేఘాల మీద పరుగులు పెడుతూంది. సిద్ధార్థుడికి యెటువంటి బాధా కలగకుండా, సులువుగా విజయం లభించాలని దాని తపన. ఆ గుర్రాన్ని సిద్ధార్థుడు చాలా ప్రేమగా చూసుకునేవాడు. దాని ఆకలి యెరిగి దానికి స్వయంగా కడుపునిండా ఆహారం తినిపించేవాడు. దానికి కంథక్ లేదా కంటక్ అన్న పేరు వుండేది. అది పరుగులుపెడుతుంటే వేళ కంచుమోగినట్టు మ్రోగేది. అది సిద్ధార్థుని చూడగానే రెండు మోరలూ యెత్తి బిగ్గరగా సకిలించేది. అతడు తనపై స్వారీ చేయాలని తపించిపోయేది. సిద్ధార్థుడు దానితో దాని భాష తెలిసి వున్నట్లే మాట్లాడే వాడు. దాని స్పందనలని ప్రతిస్పందలనలనీ చాలా తేలికగా అర్థం చేసుకునేవాడు.

సిద్ధార్థుడు వొక రోజు కనిపించకపోతే చాలు అది చాలా బెంగ పడిపోయేది. తిండికూడ తినేదికాదు. 'అశ్వానికీ, అశ్వారోహకుడికీ మధ్యన వుండవలసిన వున్నత సాత్వికలక్షణాలు, ఆప్యాయతానుబంధాలు వారిద్దరి మధ్యా వున్నాయి', మరి విజయం వారిని వరించక యెవరిని వరిస్తుంది? అని ప్రజలు అనుకుంటున్నారు. ఆ గుర్రం వేగాన్ని ప్రత్యర్థుల గుర్రాలు అందుకోలేక పోయాయి. బాగా వెనకపడి పోయాయి. యిది చూసి అందరూ సిద్ధార్థుడికి తిరుగులేదని సంబరంగా చప్పట్లు కొట్టనారంభించారు.

సిద్ధార్థుడు తనకి విజయం సంపాదించి పెడుతున్న ఆ గుర్రంకేసి అభిమానంగా చూశాడు. అతివేగంగా పరిగెత్తుతూ వుండటంవల్ల అది బాగా డస్సిపోయింది. దాని డొక్కలు వుచ్ఛ్వాస, నిశ్వాసాలతో అదిరిపోతున్నాయి. నోటినుండి నురుగు వస్తూంది. దాని ముక్కు పుటాలు వేడిగాలులతో వణికిపోతున్నాయి. తనకోసం అంతశ్రమ పడుతున్న ఆ గుర్రాన్ని చూడగానే సిద్ధార్థునికి గుండె అంతా నీరయిపోయింది. విజయం యింకొద్ది దూరంలోనే వుంది.

యిటువంటి విజయవకాశాన్ని యెవరూ వొదులుకోరు. కానీ సిద్ధార్థుడు ఆ గుర్రం అలుపుతీసుకోవడంకోసం, దానిని సముదాయించడం కోసం, దానికి సపర్యలు చేయడంకోసం, తన విజయాన్ని గడ్డిపోచకంటే తేలికగా తీసిపారేశాడు. వెంటనే కళ్ళాన్ని సవరించాడు. గుర్రాన్ని ఆపుచేశాడు. క్రిందకి దిగాడు. దాని జూలు నిమిరాడు. దాని మెడని, తలని ప్రేమగా కౌగిలించుకుని, అత్యంత ఆత్మీయతతో, ఆప్తబంధువువలె దానిని సేదార్చసాగాడు. తను తెచ్చుకున్న నీటి సంచిలోని నీళ్ళు దానికి ప్రేమతో తాగించసాగాడు.

అంతే! మరికొద్దిసేపట్లోనే వెనుకబడిన గుర్రాలు, అతన్ని దాటుకుంటూ ముందుకి వెళ్ళిపోయాయి. దూరంగా ప్రత్యర్థులకి చెందిన కొద్ది పాటిమంది జయజయధ్వానాలు చేయసాగారు. తాను వోటమిచెందినందుకు తన గురువుల, రాజకుటుంబీకుల, బంధువుల ముఖాలు చిన్నబోతాయనీ, వారు విస్తుపోయి చూస్తూవుంటారనీ సిద్ధార్థునికి తెలుసు. కానీ యీ గుర్రపుస్వారీలో ఆవిజయం పొందలేనన్న బాధే అతనికి లేదు. తనకేలేని బాధ వీళ్ళందరూ యెందుకూ పడడం?

యిన్నాళ్ళూ తన సోదరుడిలా భావించి, ఆప్యాయంగా చూసుకుంటున్న యీ గుర్రం, తనంటే ప్రాణం పెట్టే యీ బంగారు గుర్రం అలిసిపోయి, నోటివెంట నురగలు కక్కుకుంటుంటే తాను చూడగలడా? వొక జీవిని దారుణంగా హింసిస్తేనే లభించే విజయం నిజంగా విజయం అవుతుందా? విధివశాత్ యీ గుర్రానికి శ్వాస ఆడక వుక్కిరి బిక్కిరైపోతే? గుండె ఆగిపోతే?! ఆ బాధ తను భరించగలడా?

ఆ విధంగా సిద్ధార్థుడు అందరూ కేవలం వొక జంతువుగా, స్వారీకి పనికివచ్చే వస్తువుగా

మాత్రమే చూసి గుర్రంకోసం తన యిష్టాన్ని, రాజసిరిని కర్పూర హారతిగా సమర్పించాడు. మూగ జీవాలంటే తనకున్న ప్రేమకి అవధులు లేవని చిన్ననాడే చూపి, చిన్నతనం నుండే మూగజీవాల ఆప్త బంధువయ్యాడు. మానవాళి మానవత్వపు చరిత్రలో అదొక అపూర్వ సంఘటన. బుద్ధుని జీవితం నిండా యిటువంటి సంఘటనలే. యెన్నెన్నో

## ప్రతిజీవి స్వేచ్ఛగా బ్రతకాలి

ఒక రోజున అతడు రాజోద్యానంలో వున్న చిన్న సరస్సు వొడ్డున కూర్చుని సరస్సులో వికసించిన కలువ పువ్వుల్ని చూస్తూ యెంతో సంతోషపడుతూవున్నాడు. వుద్యానవనంలో వుండే పక్షి జంతువులన్నీ అతడ్ని పలకరించి వెళ్ళి దూరంగా విహరిస్తున్నాయి. సిద్ధార్థుడు యేకాంతంగా ఆలోచిస్తూ వుంటే తానెందుకు వెళ్ళడం అనుకుందేమో పాలకంక మెరిసేకళ్ళతో అతన్నొకసారి చూసి, అటుకేసొచ్చిన నెమలితో యేదో చెప్పి.... కాసేపటికి రెండూ మరోవైపుకి పోయి వూసులాడుకుంటూ తిరుగ సాగాయి. చల్లనిగాలి వీస్తూంది.

సాయంకాలపు సూర్యకాంతి అరవిచ్చిన గులాబీపూవులా ఆకాశమంతా పరుచుకుని సరస్సులో కూడా ప్రతిఫలిస్తోంది. ఆకాశంలో యింద్రధనుస్సు ఆకారంలో యెగురుతున్న కొంగల గుంపులుకూడా తమ తెల్లనిరంగుకు, సూర్యకిరణాల యెరుపురంగు అద్దుకుని అందంగా మెరిసిపోతున్నాయి. సరస్సులో ఆకాశం ప్రతిఫలిస్తూ వుండటంచేత సిద్ధార్థుడికి సరస్సులోనే ఆకాశంలో జరిగేదంతా కనిపిస్తున్నది. ఆకాశం క్షణక్షణానికీ చిత్రవిచిత్రంగా మారిపోతూవుంది. రంగురంగుల మబ్బులు స్వర్గానికి పోయే స్వప్నరథాలవలె పరుగులు పెడుతున్నాయి.

అంతలో ఆకాశంలోకి మరొక కొంగలగుంపు ప్రవేశించింది. అవి మెరిసిపోతున్న ఈకలతో, బంగారు రంగు ముక్కులతో, పగడాల్లా మెరిసిపోయే కళ్ళతో, విప్పార్చిన పట్టైన రెక్కలతో చాలా అందంగా వుంటాయి. ప్రజలు వాటిని రాజహంసలనే అంటారు. యింక తొలకరి వస్తూందనగా స్వర్గంలోంచి వచ్చినట్లే యెక్కడో దూరతీరాలనుండి గుంపులుగుంపులుగా వస్తాయి. ఆవేళ ప్రకృతిమాత తలలో అరవిచ్చిన మల్లెపూవుల్లా వున్నాయి. సూర్యునికో, చంద్రుడికో వేయబోతున్న కర్పూర సుమహారాల్లా వున్నాయి. సంధ్యాకాంతులు వాటిపై సూటిగా పడినప్పుడు వాటిపై కాంతి ప్రతిఫలించి అప్పటిదాకా మల్లెపూలల్లా వుండేవి అప్పుడు మందార పువ్వుల్లా కనబడుతున్నాయి.

అంతలో యేదో విదారకరమైన, గుబులు పుట్టించే శబ్దం. యెవరిదో హృదయవిదారకమైన కేక. ఆకాశంలోని ఆ పక్షులన్నీ హఠాత్తుగా చెల్లాచెదురైపోయాయి. సిద్ధార్థునికి చప్పున యేమి జరిగిందో అర్థంకాలేదు. గాలివాటుకు యెండుటాకు యేదోపడి సరస్సులో కనిపిస్తున్న ఆకాశచిత్రం అలలమడిలోపడి అదృశ్యాదృశ్యమైంది. అంతలోనే యేదో వస్తుగా కిందపడిన చప్పుడు. అదీ... తనకి మరింత దగ్గరలో!

సిద్ధార్థుడు త్వరత్వరగా ఆ చప్పుడైన ప్రదేశానికి చేరాడు. అది, తాను అప్పటిదాకా సంతోషంగా చూస్తున్న ఆ ఆకాశపక్షుల్లో వొకటి. క్షణం క్రితం మబ్బుల్లో పూలబొమ్మరలా తేలియాడుతున్న ఆ పక్షి ఆకాశంలోంచి కఠినమైన భూమిమీద దబీలుమని పడిపోయింది. గిలగిలా తన్నుకుంటూంది. దాని రెక్కకు బాణం గుచ్చుకుని దాని వళ్ళంతా రక్తసిక్తమై పోతూంది. ఆ బాణపు దెబ్బకు తాళలేక అది గిలగిలా కొట్టుకుంటూంది. దాని యీకలు వూడిపోయి గాలికి యెగిరి ఆ

ప్రదేశమంతా ఆకాశపు దుఃఖాశ్రువుల్లా చెల్లా చెదురుగా పడిపోతున్నాయి. ఆ దృశ్యం చూసేసరికి సిద్ధార్థుడి గుండె తల్లడిల్లిపోయింది.

ఆ ఆకాశపక్షిని వెంటనే రెండు చేతులతో ఆర్తిగా పొదివి పట్టుకుని తానక్కడే నేలపైనే చతికిలపడిపోయి కన్నతల్లిలా తన వొడిలో పడుకోబెట్టుకున్నాడు. యెంతో నెమ్మదిగా, జాగ్రత్తగా దాని రెక్కకు గుచ్చుకున్న బాణాన్ని బయటికి లాగాడు. ఆ గాయంనుండి మరింత నెత్తురు రాకుండా తన బొటనవేలితో అదిమి పెట్టాడు. భయంతో, బాధతో దాని గుండె యెంత కొట్టుమిట్టాడుకుంటుందో, దాని బాధ తొలగించాలన్న ఆతృతతో సిద్ధార్థుని గుండెకూడ అంతగానూ కొట్టుమిట్టాడుకు పోతూంది. కొద్దినిమిషాలు గడిచాక, ఆ గాయాన్ని ఆ సరస్సులోని నీటితో కడిగి, తన పట్టువస్త్రాన్ని  పొడవుగా చించేసి నీటితో తడిపి రెక్కకు కట్టు కట్టాడు. దానికి కాసిని నీరుపట్టాడు. దానికి భయం, బాధ తగ్గేందుకు, 'నీకు నేనున్నాను, మరేమీ ఫరవాలేదు' అని అభయమిస్తున్నట్టుగా సున్నితమైన దాని మెడను, గుండెను, రెక్కలను మృదువుగా నిమరసాగాడు. అది మెల్లగా ఆపదలో తల్లిని చేరిన బిడ్డలా అతడి వొడిలోనికి వొదిగిపోతూ ధైర్యం తెచ్చుకోసాగింది. యెటువంటి శబ్దం వచ్చినా అది మళ్ళీ భయంతో సిద్ధార్థుని మరింతగా కరుచుకుపోసాగింది.

హాయిగా ఆకాశంలో యెగురుతూ యే చెట్టుకొమ్మలపైనో, పంట పొలాలలోనో, సరస్సులలోనో వాలవలసిన ఆ చక్కని పక్షి యిలా కరుకుబాణం దెబ్బకు గురై నెత్తురోడుతూ, ప్రాణంపోయే పరిస్థితులలో తన వొడిలోకి చేరడం, బాధతో విలవిలలాడుతూ వుండటం... యివన్నీ అతన్నెంతో బాధ పెట్టాయి. యెన్నో ఆలోచనలు అతన్ని ముప్పిరిగొన్నాయి.

యీ చక్కని పక్షిపై, ప్రకృతికే అందమిచ్చే యీ అందాలరాశిపై బాణం వేసిన ఆ క్రూరుడెవరు? యీ పక్షిని చంపడానికి అతనికి చేతులెలావచ్చాయి? యిలా ఆలోచిస్తూ యెంతో విచారంగా వున్న సిద్ధార్థుని దగ్గరకి వొక సేవకుడు పరుగెత్తుకువచ్చి, 'ఆపక్షిని దేవదత్తుడు కొట్టాడనీ, తన దగ్గరకి తీసుకురమ్మంటున్నాడనీ, చెప్పాడు. దేవదత్తుడు సిద్ధార్థునికి వరుసకి సోదరుడే అవుతాడు. తన సోదరుడైన దేవదత్తుడే యిలా వొక అమాయకమైన పక్షిని చంపబోయాడని తెలిసి సిద్ధార్థుడు హతాశుడయ్యాడు. ఆ తప్పు తానేచేసినంతగా బాధపడ్డాడు. ఆ సేవకుడితో తమాయించుకుంటూ, మెల్లగా 'యీ పక్షి బాణం దెబ్బకి బాధతో విలవిలలాడుతూంది. బాధ తగ్గేవరకూ నాదగ్గరే వుంటుంది. యిలా అన్నానని చెప్పు' అన్నాడు.

యీ సంగతివిన్న దేవదత్తుడు కాసేపటికి విసురుగా తానే సిద్ధార్థుడి దగ్గరకి వచ్చాడు. "ఆ పిట్టనివ్వమంటే యివ్వనన్నావంటేమిటి? దానిని నేనే చంపాను. నా పిట్టని నాకివ్వడానికి మధ్యన నీ అడ్డేమిటి? యిలా యివ్వు పిట్టని" అన్నాడు దురుసుగా, పెళుసుగా.

సిద్ధార్థుడు ఆ పక్షిని మరింత దగ్గరగా తన గుండెలకి హత్తుకున్నాడు. నెమ్మదిగా "దేవదత్తా యీ పక్షిని నీకివ్వలేను. చాలా బాధతో వుంది. చనిపోలేదు. బతికేవుంది. దానిని వదిలేస్తే చచ్చిపోతుంది. దేవదత్తా యేమనుకోకు... చూడు భయంతో యెలా బిక్కచచ్చిపోయిందో! యెలా నాగుండెలకి హత్తుకుపోతూందో చూశావా? దేవదత్తా... యీ పక్షిని  నీకివ్వలేను దేవదత్తా... బాగయేవరకు నాదగ్గరే వుంచుకోవాలనిపిస్తోంది... అన్నాడు.

దేవదత్తుడు వూరుకోలేదు. ఆ పక్షిని తనకివ్వాల్సిందే అంటూ మొండిపట్టు పట్టాడు. సిద్ధార్థుడు తాను కూడా ఆ పక్షిని దేవదత్తుడికివ్వడానికి పట్టుదలగా నిరాకరించాడు. ఆ పక్షిని ఆ

స్థితిలో దేవదత్తుడికి అప్పచెప్పడానికి అతడిమనసు ససేమిరా అంగీకరించలేదు.

ఈ తగువు పెద్దదయి మహారాజా వరకూ వెళ్ళింది. ఈ విషయం విస్తృతంగా కోట అంతా ప్రాకింది. ఇతరుల ప్రాణాలను హరించేవాడిగా తన కుమారుడు పేరుపడడం మహారాజుకి ఇష్టం లేకపోయింది. అయినను మనస్సులో తన కుమారుడు చేసినదే మంచిదనిపిస్తోంది. అయినాసరే ఆయన ఇందుకోసం ప్రత్యేకంగా కొలువుతీర్చాడు. దేవదత్తుడివాదాన్నీ, సిద్ధార్థుడి వాదాన్నీ కూడా ప్రత్యక్షంగా విన్నాడు.

రాజదర్బారులో సంభాషణ ఇలా సాగింది.

దేవదత్తుడు : ఆ పక్షిని నేనే కొట్టాను. అందువల్ల అదినాదే. దానిని సిద్ధార్థుడు తీసుకోవడం అన్యాయం. పైగా జీవుల్ని చంపకూడదని అతగాడు హితబోధ చేస్తున్నాడు. రాచపుట్టుకపుట్టి, ఏజీవినీ చంపే హక్కు నీకు లేదంటే ఎలా? ఇప్పుడీ విషయంలో సరైన తీర్పు చెప్పకపోతే విషయం చాలాదూరం వెడుతుంది. (ఆవేశంగా, కోపంగా అన్నాడు).

సిద్ధార్థుడు : ఆవేశకావేశాలనవసరం, తోటిజీవి ప్రాణాలను తీసే అధికారం ఎవరికీ లేదు. మహారాజుకైనా సరే. (నెమ్మదిగా, దృఢంగా అన్నాడు).

దేవదత్తుడు : ఆ పక్షిని నేను కొట్టానుగా.. అది ముమ్మాటికీ నాదే (అరిచాడు)

సిద్ధార్థుడు : ఆ పక్షిని నేను రక్షించాను. అందువల్ల అది నాకే చెందుతుంది.

దేవదత్తుడు : ఈ దేశంలో వున్న న్యాయం ప్రకారం, వేటగాడు కొట్టిన పక్షి వేటగాడిదే అవుతుంది. కాబట్టి ఆ పక్షి నాదే. బుద్ధిబద్ధం వున్నవాడెవడైనా ఇదే మాట చెప్తాడు.

సిద్ధార్థుడు : జీవిని చంపటం ఎప్పటికీ న్యాయం కాదు. ఎక్కడాకూడా న్యాయం కాకూడదు. అదే న్యాయమైతే ప్రపంచంలో ఏ అన్యాయమైనా న్యాయమే అవుతుంది. ఒకవేళ ఆ పక్షి దేవదత్తుడికి చెందాలన్నా అది చనిపోవాలి. కానీ, ఇక్కడ ఆ పక్షి చనిపోలేదు. అది నా దగ్గర రక్షణ తీసుకుంటూంది. రక్షించిన వాడి దగ్గరే ఏ జీవి అయినా వుండటం న్యాయం. అదే నిజమైన ధర్మం. అంతేగాని ఆ జీవిని తిరిగి చంపేవాడి దగ్గరకి పంపించడం న్యాయం కాదు. 'ఎంతమాత్రమూ కాదు'.

ఇరు పక్షాల వాదనలూ విన్నాక మహారాజుకేమీ పాలుపోలేదు, చూడబోతే ఇది రాజ్యంలోనే చాలా ముఖ్యమైన విషయం అయ్యేటట్టువుంది. సిద్ధార్థుడి పక్షాన్నే న్యాయమున్నట్టుగా అనిపిస్తోందతడికి. కానీ న్యాయ విచారణలో పుత్రపక్షపాతం చూపాడన్న నింద తనపై పడితే? ఆ వూహే అతడికి ఇష్టం లేకపోయింది. దేవదత్తుడి వాదనలో కొంచెం వేడి వున్నప్పటికీ, ఇరుపక్షాల వాదనలూ సరి అయిన తూకంలో వున్నాయి. అందువల్ల సిద్ధార్థుని తరఫున తీర్పు చెప్పాలంటే ఏదైనా మరొక అనుకూలించే అంశం తప్పక వుండాలి. ఎందుకంటే ఇది ఒక్క రాజభవనంలో వుత్పన్నమైన సమస్యకాదు. రాజ్యంలో ఎప్పుడైనా, ఎక్కడైనా ఇటువంటి సంఘటన జరగవచ్చు.

దానికి కూడా యిప్పుడు తాను చెప్పబోయే తీర్పు వర్తిస్తుంది. ఆ తీర్పుని రాజ్యప్రజలందరూ అంగీకరించాల్సి వుంటుంది. అందువల్ల యీ విషయంపై తీర్పు చెప్పేటప్పుడు చాలా జాగరూకతతో వ్యవహరించాలి.

ఆలోచనలతో సతమతమవుతున్న శుద్ధోదనునికి, సిద్ధార్థుడు వాదిస్తున్నంత సేపూ ఆ పక్షి అతని చేతుల్లోనే వుండటం స్ఫురణకు వచ్చింది. వెంటనే "ఆ పక్షి యెవరిదనే విషయంపై విచారణ చేస్తున్నప్పుడు, అది యే ముద్దాయి చేతుల్లోనూ వుండటానికి వీలులేదు. తీర్పు చెప్పేవరకూ అది న్యాయస్థానానికే చెందుతుంది. ఆపక్షినిక్కడికి తీసుకురండి" అని ఆజ్ఞ జారీ చేశాడు.

క్షణాలలో న్యాయస్థానవుద్యోగులు ఆ పక్షిని సిద్ధార్థుని దగ్గర నుండి తీసుకువచ్చి శుద్ధోదనుని ముందు పెట్టారు. అది భయంతో వణుకుతూ, కంపించిపోతూ తనను వుంచిన చోటనే వొద్దికగా దిక్కులు చూస్తూ కూర్చుండిపోయింది.

దానిని చూడగానే శుద్ధోదన మహారాజుకి చటుక్కున వొక ఆలోచన వచ్చింది. వెంటనే దేవదత్తునివంక న్యాయసలహాదారులవంక, సిద్ధార్థునివంక చూసి, 'యీ పక్షి యెవరికి చెందుతుందన్న విషయంపై వాదోపవాదాలు విన్నాను. నేను యేటువైపు తీర్పు చెప్పినా వీరిలో కొందరికి అసంతృప్తి కలగవచ్చు. అదే యీ సమస్యని ఆ జీవులే అయితే యెలా పరిష్కరించుకుంటాయి? వాటికి గనుక స్వేచ్ఛ యిచ్చి అవకాశమూ, బలమూ, భద్రతా యిస్తే తమ సమస్యల్ని యెలా పరిష్కరించుకుంటాయి? అన్న విషయాన్ని ఆధారంగా తీసుకుని తీర్పు చెప్పడం యుక్తంగా వుంటుందని భావిస్తున్నాను.. మహాజనసభ్యులు యిందుకేమంటారో తెలపవలసింది" అని అడిగాడు.

వెంటనే మహాజనసభ్యులందరూ వొక ప్రత్యేక సమావేశం జరిపారు. అందులో యీ విషయాన్ని కూలంకషంగా చర్చించారు. తీర్పు యేటువైపు చెప్పినా యేదో వొక సమస్యలు వస్తాయన్న రాజుగారి ఆలోచనతో యేకీభవించారు. యేం చెయ్యాలో ఆ పక్షినే నిర్ణయించమనడం కూడా వారికి సబబుగానే తోచింది. కానీ వొక నోరు లేని పక్షి తన వారెవరని యెలా వివరించగలదు? అదెలా సాధ్యం? అని వారు రాజుని అడిగారు.

రాజు చిరునవ్వు నవ్వాడు. "యీ పక్షిని వదిలివేస్తాను. యీ పక్షి దేవదత్తుడి దగ్గరకు వెడితే అది దేవదత్తుడిదే అవుతుంది. సిద్ధార్థుడి దగ్గరకు వెడితే సిద్ధార్థుడిదే అవుతుంది. వొకవేళ అది యెవరి దగ్గరకూ వెళ్ళకుండా యెగిరిపోతే అది యెవరికీ చెందదు".

రాజు ఆలోచనకు మహాజన సంఘసభ్యులందరూ ఏకగ్రీవంగా తమ పూర్తి అంగీకారం తెలిపారు. ఆ ప్రకారం ఆ పక్షిని వదిలేసి, మొదట అవకాశం దేవదత్తుడికే యిచ్చారు.

దేవదత్తుడు వుత్సాహంగా ఆ పక్షికేసి చూసి తన దగ్గరకు రమ్మనమని చేతులు చాచాడు. అది అతని దగ్గరకు వెళ్ళలేదు సరికదా, భయంతో మరింత వెనక్కి వెళ్ళిపోసాగింది. దేవదత్తుడు దాన్ని గట్టిగా కోపంగా అధికారంతో పిలిచాడు. ఆ పక్షి మరింత భయంతో మరో అడుగు వెనక్కి వేసింది. దేవదత్తుడు ఆ పక్షిని అనేక విధాలుగా ప్రలోభపెట్టాడు. మంచి మంచి ఆహారపు గింజలు తెప్పించి చూపి అవి వేస్తానని మభ్యపెట్టాడు. అయినా అది రాలేదు. అతని ముఖం వివర్ణమైంది. బుగ్గలు కోపంతో యెరుపెక్కాయి. అయినా అతడు చేసేదేమీ లేకపోయింది. యిచ్చిన సమయం గడిచిపోయాక యీ సారి దానిని పిలవడం సిద్ధార్థుడి వంతు అయింది.

సిద్ధార్థుడు ఆ పక్షివంక ప్రేమగా చూసి, లాలనగా చేతులు చాచేంతలోనే అది తన రెక్కలు

తగిలిన గాయపు బాధను సహిస్తూనే నెమ్మదిగా యెగురుతూ వచ్చి అతని చేతుల్లో దూరమైన తల్లిదగ్గరకు చేరినబిడ్డలా వాలిపోయింది. యీ దృశ్యం చూసి సభాసదులందరూ చలించిపోయారు. ఆనందంతో పరవశించిపోయారు. వారి కళ్ళమ్మట కన్నీళ్ళు చిందాయి. వెంటనే ఆనాటినుంచీ రక్షించిన వారికే మూగజీవాలు చెందుతాయని మహారాజా తన తీర్పు ప్రకటించాడు.

సిద్ధార్థుడు ఆ పక్షిని ప్రేమగా ఒక చేతితో, గుండెలకి ఆనించి పట్టుకుని, మరొక చేతితో దానిమెడను ప్రేమగా స్పృశిస్తూ తనను అభినందించడానికి వచ్చిన వారందరితో,

"ప్రియమిత్రులారా! పెద్దలారా! యీ పక్షిని నేను రక్షించిన మాట నిజమే. మహారాజా చెప్పినట్టు రక్షించినంతమాత్రాన యీ పక్షి నాది కాజాలదు. ప్రతిజీవీ స్వేచ్ఛగా బతకాలి. తనని రక్షించానన్న కృతజ్ఞత వల్ల యీ పక్షి నాదగ్గరకు వచ్చింది. అసలు దానికే గాయమూ తగలకపోతే అది స్వేచ్ఛగా మిగతా పక్షులతో ఆకాశపథాన హాయిగా తిరుగుతూ వుండేది. అసలు నాదగ్గరకే వచ్చి వుండేది కాదుకదా! యిప్పుడు యీ మూగజీవికి దాదాపు ఆరోగ్యం చేకూరింది. నెమ్మదిగానైనా యెగురగలదు. అంతేకాదు యీ పక్షికిపుడు వేటగాడెవడూ కొట్టబోడన్న భరోసా కూడా వుంది. అందుకని యీ పక్షిని దీని మార్గాన యిది స్వేచ్ఛగా, సంతోషంగా బతికేందుకు, తన వారిని కలుసుకునేందుకు విడిచిపెట్టేస్తున్నాను" అంటూ చివరిగా ఆ పక్షిని మరింత ప్రేమగా ముద్దుపెట్టుకుని, సస్నేహంగా దానివొడలంతానిమిరి, గాయం తగిలినచోట ప్రత్యేకంగా స్పృశించి, "మిత్రమా! హాయిగా యెగిరిపో. నీ మిత్రులను, బంధువులను చేరుకో.. తెలవు.. హాయిగా, స్వేచ్ఛగా యెగిరిపో. మొదట కాస్త నెమ్మదిగా యెగురు.." అంటూ దానిని నెమ్మదిగా గాలిలోకి వదిలిపెట్టాడు అది రెక్కలు టపటపమంటూ కొట్టుకుంటూ నెమ్మదిగా యెగిరి, మహారాజుకూ, సభాసదులకూ, సిద్ధార్థునికీ ప్రమాణాలు చేస్తున్నట్టుగా వారందరిపైనా కలియతిరిగి, పూర్తిగా యెగిరేయగలనన్న విశ్వాసం పుంజుకున్నాక ఆకాశంలోకి స్వేచ్ఛగా యెగిరిపోయింది.

యిలా యీ సంఘటన సుఖాంతమైనప్పటికీ, సిద్ధార్థునికి యీ సంఘటన వల్ల మనస్సులో యేర్పడిన గాయం, అలా ముల్లులా, కాలినగాయంలా బాధపెడుతూనే వుంది. యీ పక్షి సంగతి సరే, తాను రక్షించాడు కాబట్టి బతకగల్గింది. కానీ ఆ బాణం యింకా గట్టిగా గుచ్చుకుని వుంటే యేమయ్యేది? తనలాంటి వాళ్ళెవర్నా చూసి వుండకపోతే? ఆ పక్షి ఏమయ్యేది? యిలా వేటగాళ్ళ బారినపడి యెన్ని పక్షులు నేలకూలిపోతున్నాయో! మహారాజు యెంత దండించినా వేటగాళ్ళ మనసులు మారతాయా? దండనవల్ల వచ్చే మార్పు యెంతవరకూ వుంటుంది? మనుష్యుల మనస్సుల్లోంచే దుష్టత్వాన్ని తొలగించాలి గానీ. కానీ అదెలాసాధ్యం అవుతుంది?

యీ భూమి మీద వేట, హింస అన్నవే లేకుండావుంటే యెంత బాగుండును? నిరంతరమూ యిటువంటి ఆలోచనలతో సిద్ధార్థుడు అలవిమాలిన బాధననుభవించేవాడు. మునుపట్లా అతడికి ఆకాశంలో అల్లనల్లన బారులుతీరి యెగురుతుపోయే కొంగలగుంపుల్ని చూస్తుంటే ఆహ్లాదం కలగడం లేదు. "అయ్యో! ఆ గుంపుల్లో యే పక్షి యెప్పుడు యే వేటగాడి బాణానికి బలైపోతుందో! అయ్యో!" అని అతడి గుండె బాధగా మూల్గేది. యెడతెగని ఆలోచనలతో అతడు తల్లడిల్లి పోతూండేవాడు.

అతడొక రాజకుమారుడు కావడం వల్ల అందరూ అతడి పట్ల ప్రత్యేకంగా ప్రవర్తించేవారు. అతడిపట్ల అసహజమైన భయభక్తులతో అతనికి దూరంగా మసలేవారు. దాంతో అతడికి చెప్పుకోదగ్గ

స్నేహితులెవరూ లేకపోయేరు. వున్నా వారికి అతడివంటి మనస్సు వుండేది కాదు. అందువల్ల సిద్ధార్థుడు దాదాపు యేకాంతంగానే నిరంతరాలోచనలతో అన్యమనస్కంగానే కాలం గడుపుతూ వుండేవాడు. శుద్ధోదన మహారాజుకిదంతా తెలియకపోలేదు.

## అందరూ బాగుండాలి కదా!?

యిలావుండగా యేటా తొలకరిలో వచ్చే వ్యవసాయ పండుగ వచ్చింది. ఆకాశానికి కాసిన అతి పెద్ద నల్ల ద్రాక్షగుత్తుల్లా మబ్బులు పరుగెడుతూ, అల్లరి సింహాల్లా వురుముతూ, తమ తొలకరి ప్రతాపం చూపించేందుకు అడవి పొట్టేళ్ళలాగా, మదపుటేనుగుల్లాగా, మత్తవృషభాల్లా సిద్ధపడుతున్నాయి.

యీ పండుగలో మహారాజైన శుద్ధోదనుడే మొదటగా భూమిదున్నవలసి వుంది. సిద్ధార్థుణ్ణి కూడా తనతోపాటు తీసుకువెడితే, అతడిలో వుత్సాహం కలుగుతుందేమో అని శుద్ధోదనుడు వూహించాడు. దానితో యీసారి వుత్సవాలకు సిద్ధార్థుడు కూడా రానున్నాడని ప్రకటించాడు.

యీ సంగతి వినగానే ప్రజలు యీ విధంగా అయినా తమకాబోయే మహారాజును దగ్గరుండి కళ్ళారా చూసుకోవచ్చు కదాని సంబరపడ్డారు. వారా చక్కటి రోజుకోసం వాన కోసం యెదురుచూసే చకోరపక్షుల్లా యెదురు చూడసాగారు.

అందరూ సంతోషంగా పరవళ్ళు తొక్కుతూ వుండే పండగ యిది. అందువల్ల యీ పండుగలో యెటువంటి బాధా, విషాదం కనిపించదనే కాదు, సిద్ధార్థుడి మనస్సు సైతం సంతోషంతో నిండిపోతుందని శుద్ధోదనుడు వూహించాడు. సిద్ధార్థుడికి ఆ ప్రయాణమంతా గొప్ప ఆహ్లాదంగా గడిచింది. చల్లనిగాలి, రకరకాల చెట్లు, ఆకాశంలో తేలియాడే మబ్బులు యిదంతా అతడికి కొత్తలోకంలా అనిపించింది.

పండుగనాడు చక్కని రథం మీద రాజకుమారుడు సిద్ధార్థుణ్ణి కూడా పంటపొలాలకు తీసుకు వెళ్ళాడు. ఆ పొలం మధ్యలో వొక నేరేడు చెట్టు (జంబూ వృక్షం) వుంటే ఆ చెట్టు క్రిందనే సిద్ధార్థునికి మెత్తని ఆసనం యేర్పాటు చేశారు. కొంతసేపటికి భూమి పూజ మొదలైన కార్యక్రమాలు చేసి, రైతులు కాడి పట్టుకుని పొలందున్న సాగారు. ఆరైతుల మధ్యనే శుద్ధోదనుడు కూడా మబ్బుల మధ్య మెరుపులా రాజఠీవితో పొలం దున్న సాగాడు. అతడు కదులుతుంటే అతడు ధరించిన బంగారు, రత్నాల ఆభరణాలపై సూర్యకాంతి పడి అతని ప్రక్కనున్న వారందరిపైనా కాంతిపుంజాలు విరజిమ్మి ఆ కాంతిలో వారు కూడా మెరిసిపోసాగారు.

సిద్ధార్థుడాదృశ్యాన్ని చూస్తూ ఆలోచిస్తూ వుండగా, వాన కురిసినట్టుగా ఘల్లుఘల్లున వినబడిన కలకలానికి ప్రక్కకుచూడగా చాలామంది పిల్లలు అక్కడికి చేరుకుని తనవంక వుత్సాహంగా యేదో మాట్లాడుకుంటూ, తనివితీరా చూస్తూవుండటం చూశాడు. సిద్ధార్థుడు తమని చూస్తున్నాడని గ్రహించగానే వారు సంతోషంతో వుబ్బితబ్బిబ్బయ్యారు. పాపం వారందరికీ సిద్ధార్థుడి చుట్టూ మూగాలని వుంది. కానీ రాజభటులు వారిని సిద్ధార్థుని దగ్గరకు వెళ్ళనివ్వకుండా కింకరుల్లా దుడ్డుపట్టుకుని అడ్డువున్నారు. భీకరంగా చూస్తున్నారు.

ఆ పిల్లల్ని చూడగానే సిద్ధార్థుడికి కాస్తంత విస్మయం అనిపించింది. అంతలోనే సంబాళించుకుని ధైర్యంగా అందరినీ శ్రద్ధగా పరికించసాగాడు. సిద్ధార్థుడికి కూడా వారితో మాట్లాడాలని యెంతో వుంది. ఆ అన్నెం పున్నెం యెరుగని, పంటపొలాల్లా నిర్మలంగా నవ్వుతున్న

ఆ పాపలతో, బాబులతో ఆడుకోవాలనిపించిందతడికి. వారిలో తనకంటే కొస్త పెద్దవాళ్ళూ వున్నారు. తనకంటే చిన్నవైన, యింకా చిన్నవైన వాళ్ళూ వున్నారు. వారందరితో కలిసిపోయి, తనకు తెలిసిన విషయాలు వారికి చెప్పాలనిపించింది. తనకి తెలియని విషయాలు వారినడిగి తెలుసుకోవాలనిపించింది.

వారు తన దగ్గరకి ప్రేమగా వస్తుంటే రాజభటులు వారిని దూరంగా పొమ్మని అదిలించడం అతడికి చాలా కష్టం కలిగించింది. "వాళ్ళని అడ్డుకోవద్దు" అని రాజభటులకు తాను చెప్పడం, వారు దానికేవో సాకులు చెప్పడం, తాను వాటిని వినితీరవలసి రావడం, యివన్నీ యిష్టం లేక సిద్ధార్థుడు తానే స్వప్నదేవతలా ఆ పిల్లలవైపు కదిలాడు. రాజకుమారుడే వారివైపు వెళ్తాండటంతో రాజభటులు యింకేమీ అనలేకపోయారు.

సిద్ధార్థుడు ఆ పిల్లల కపోలాలను ప్రేమగా స్పృశించాడు. వారు మెడలో వేసుకున్న రంగు రంగురాళ్ళనీ, దిష్టి పూసల్నీ, గవ్వల్నీ యెంతో అపురూపంగా ఆసక్తితో, వుత్సాహంగా తాకాడు. దానితో ఆ పిల్లల ఆనందానికి అవధుల్లేవు. వానపడుతున్నప్పుడు చెరువులో అలల మధ్య అటుయిటు చపచపమంటూ కదిలే తామర ఆకుల్లా వారు గొప్ప సంబరం పడిపోయారు. అప్పటి వరకూ వున్న నిస్తేజవాతావరణం అంతా గొప్ప దేవతాసంబరంలా మారిపోయింది. పిల్లలందరూ లేగదూడల్లా యెగిరి గంతులు వేస్తూ, పక్షుల్లా కిలకిలా యీలలు వేస్తూ సిద్ధార్థుడి చుట్టూ అడవి పూల దండలాగా అల్లుకుపోయారు. అతడి చుట్టూ చేరి జానపదనృత్యం చేయసాగారు. అప్పటికప్పుడు పాటలుకట్టి పాడసాగారు. కొందరు గబగబా వెళ్ళి చుట్టూ చెట్లకి ప్రాకిన లతలకు పూసిన రంగు రంగుల పూలగుత్తుల్ని తెంపి సిద్ధార్థుడికి తెచ్చి యివ్వసాగారు. తల్లిపాడిలాంటి వారిప్రేమకి సిద్ధార్థుడి హృదయం ఆనందంతో స్పందించిపోయింది.

రాజభటులు యెంతోసేపటికి అతికష్టంమీద సిద్ధార్థుని ఆ జనపద బాల బాలికలమధ్యనుంచి తీసుకువచ్చారు. అసరికి తండ్రికూడా తిరుగు ప్రయాణంలో వున్నాడు. తండ్రితోపాటు తిరిగి రాజధానికి వెళ్ళిపోతుంటే సిద్ధార్థునికీ, ఆ పిల్లలకీ కూడా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తెంపివేయబడుతున్న వొక కొమ్మకి వున్న మొగ్గల్లా, పువ్వుల్లా వారు విలవిలలాడిపోయారు. కొందరైతే భోరున యేడ్చేశారు.

సిద్ధార్థునికి తిరుగు ప్రయాణం అంతా జరిగిన సంబరం తాలూకు తీపి జ్ఞాపకాలతో గడిచిపోయింది. కానీ అంత సంతోషంలోనూ వొక ఆవేదన అతనిని వెన్నంటే వస్తున్నది.

వారినీ తననీ విడదీస్తున్నది యేది? వారు తనతో యెంత బాగా కలిసిపోయినా వొక తేడా స్పష్టంగా కనిపిస్తూంది. తను ఆరోగ్యంగా, మంచి శరీరంతో వున్నాడు. వారు బలహీనంగా కనిపించారు. వారికి మంచి బట్టలు కూడా లేవు. తానొస్తున్నాడనే మంచి బట్టలు వేసుకున్నట్లు వుంది. పాదరక్షలు లేవు, ఒట్టి పాదాలతో వున్నారు. చదువు చెప్పే గురువులున్నారో లేదో తెలియదు. వారందరూ కూడా తనలాగా సుఖంగా వుంటే యెంత బాగుండును!! అందరూ బాగుండాలి కదా!!

## జీవుల్ని చంపకుండా మనుష్యులు బతకలేరా?

సిద్ధార్థునికి యీ ఆలోచనలు సదా అలా కలుగుతూనే వుండేవి. తన చదువుల్లో యీ ప్రశ్నలకు సమాధానాలు దొరుకుతాయేమోనని ఆత్రంగా వుపాధ్యాయులను అడిగేవాడు. వారు చెప్పిన సమాధానాలతో అతడికి సంతృప్తి కలిగేది కాదు. వొకసందేహం తీరిన వెంటనే కవలమెరుపులా

మరొక సందేహం పుట్టేది. అతని మనస్సంతా తుఫానులో సముద్రంలా నిరంతరమైన శోధన, వేదన. యేదో తెలుసుకోవాలన్న తపనలతో క్షుభింపిపోయింది. జరిగిన సంఘటనలలోని బాధాకరమైన ఘట్టాలే అతడికి మరల మరల జ్ఞాపకం వస్తూండేవి. అటువంటివెప్పటికీ పునరావృతం కాని ప్రపంచాన్ని వూహించి, నిర్మించాలని వుండేది. కానీ అందుకు యేం చెయ్యాలో సిద్ధార్థుడికి తెలిసేది కాదు. యేవో ఆలోచనలు చేస్తూనే వుండేవాడు.

బాలరాజు యేదో అన్వేషణలో బాధగా కాలం గడుపుతున్నాడని తెలిసి శుద్ధోదన మహారాజు చాలా బెంగపడ్డాడు. "రాజులకు మెత్తటి గుండె వుండటం విరుద్ధం. వారెన్నో ఆటుపోట్లు యెదుర్కోవాలి. శిష్ట రక్షణ-దుష్ట శిక్షణ చేయవలసి వుంటుంది. అందుకు సున్నిత హృదయం వుండటం మంచిది కాదు" అని అతడి అభిప్రాయం.

అయినా అతడు నేరుగా, 'నువ్విలావుండు. నువ్వలా వుండకు?' అని సిద్ధార్థుని ఆదేశించలేకపోయాడు. కుమారుని చూడగానే అతడి వళ్ళంతా వాత్సల్యంతో పులకరించిపోయేది. సిద్ధార్థునికి బాధ కలగకుండా వుండేందుకు రోగులు, కుంటివారు, ముసలివాళ్ళు అతడి కంట పడకుండా చూడమని రాజభటులను ఆదేశించాడు.

అంతేకాదు సిద్ధార్థుడి మనసు సంతోషపడేందుకు తానే స్వయంగా సాయం సమయాలలో గుర్రం మీద సిద్ధార్థుని తోడు తీసుకుని వాహ్యాళికి వెళ్లేవాడు.

మహారాజు వాహ్యాళికి వెళ్ళివచ్చే మార్గమంతా యెటువంటి బాధకల్గించే దృశ్యాలూ కనబడకుండా రాజభటులు ముందుగానే జాగ్రత్తపడేవారు. అందమైన ప్రకృతిలో, సంధ్యాసమయంలోని అందాలను తాను సిద్ధార్థునికి చూపిస్తుంటే సిద్ధార్థుడు తప్పక సంతోషాన్ని పొందుతాడని శుద్ధోదనుడు వూహించాడు. అందుకోసమే యిలా ప్రత్యేకంగా శ్రద్ధ తీసుకున్నాడు.

సాయంకాలం పూట తండ్రితో రోహిణీ నదీ తీరాన ప్రశాంతంగా షికారులు చేస్తున్నప్పుడు సిద్ధార్థునికి మనస్సంతా అనిర్వచనీయమైన సంతోషంతో నిండిపోయేది. దూరంగా నీలి, ఆకుపచ్చ రంగుల్లో కనిపించే కొండలు, దూది పింజల్లాగా యెగురుతుపోయే మబ్బులు, పసుపు, యెరుపు, నారింజ రంగుల్లో మెరిసిపోయే ఆకాశం. పరవళ్ళు తొక్కుతూ ప్రవహించే రోహిణీనది, బంగారు రంగుతో మెరిసిపోయే యిసుకమేటలు, గూళ్ళకు పోయే పక్షుల కిలకిలారావాలు, చల్లని గాలులతో మత్తుగా వూగేచెట్లు, నీటిలో మిసమిసలాడుతూ యెగిరిగెంతే చేపలు, నదినొడ్డున నత్తలు, ఆలు చిప్పలు, పీతలు, గవ్వలు, నీటిపక్షులు, పొదలలో వాటి గూళ్ళు...... యివన్నీ సిద్ధార్థుని ఆనందంలో ముంచివేసేవి. తన్మయుడ్ని చేసేవి.

కానీ అతడి సంతోషం తాత్కాలికమే అయింది. చూడగా చూడగా యీ అందమైన ప్రకృతిలో కూడా యెన్నో హింసలు, బాధలు అతనికి అత్యంతస్పష్టంగా కన్పట్టాయి. ప్రతీ జీవి వేరొకజీవిని నిర్దాక్షిణ్యంగా చంపి తింటూంది. ఆ జీవుల్ని మరికొన్ని జీవులు తింటున్నాయి.

వొక రోజున వొక తీతువు రోహిణీనదిలోని వొక చేపని పట్టుకుని చెట్టుమీదికి తీసుకుపోయి తినడానికి గాలిలోకి యెగరసాగింది. అంతలోనే ఆ తీతువు పిట్టని పెద్దడేగ వచ్చి తన్నుకు పోయింది. వొకసారి చిన్న చిన్న చేపల్ని తింటున్న కప్పని పెద్దపాము వచ్చి పట్టుకుని మింగుతూంటే, వొక గ్రద్దవచ్చి ఆ పాముని యెగదన్నుకుపోయింది. యిలా ప్రకృతినిండా హింసలే. ప్రకృతి అంతా వొక హింసలగొలుసు అనేది అతనికి స్పష్టంకాసాగింది.

ఏమిటి జీవుల బతుకులు? మరో జీవిని చంపకుండా జీవులు బతకలేవా? కనీసం మనిషి అయినా అలా బతకలేడా? మనిషికూడా జీవులలో భాగమేనా? జీవులలో భాగమే అయితే ఏ జీవులకూ లేని యీ బట్టలెందుకు, చదువులెందుకు? యి ప్రత్యేకసుఖాలెందుకు? యీ అధికారాలెందుకు? వొకవేళ మనిషి ప్రత్యేకమైన జీవి అయితే, మిగతాజీవుల్లానే యితర జీవుల్ని చంపి తినడం యెందుకు?

యెన్నిహింసలువున్నా జీవుల మధ్యన కేవలం హింసలే కాకుండా అప్పుడప్పుడు సహాయ సహకారాలు, ప్రేమానురాగాలు కూడా చూస్తున్నాడే! డేగ వస్తున్నదంటే కత్తెరపిట్ట మిగతా పిట్ట పిట్టలకు జాగ్రత్తపడండని హెచ్చరికలు చేస్తోంది. పాము వస్తున్నదంటే పక్షులు పెద్దగా అరుస్తూ కప్పల్ని పారిపొమ్మనమనిచెప్తున్నాయి. ఆవులు, యెద్దులు తమ చెవుల్లో గులిమి, కండ్ల పుసులు తీస్తున్నందుకు, పురుగులున్న చోట మేసి, పురుగుల్ని ఆ పక్షులకు పెడుతున్నాయి. తప్పిపోయిన నక్కపిల్లకి కుక్కలు పాలుపడుతున్నాయి. పక్షులన్నీ ఆహారాన్ని యే భేదభావం లేకుండా పంచుకు తింటున్నాయి. మరియేమొచ్చింది మనిషికి. మనిషిలో మాత్రం అటువంటి సాధుగుణాలు కనిపించవేమిటి? యెందుకింత స్వార్థం మనుషులకి? యిది స్వార్థమా? అజ్ఞానమా?

యిలాంటి ఆలోచనలతో సిద్ధార్థుని శిరస్సు భారమైపోయేది. తన కుమారుడు యీ సుందరప్రకృతి మధ్యను కూడా సంతోషంగా వుండలేకపోవడంచూసి శుద్ధోదనుడు చాలా కలత చెందాడు. అతడి మనసు యెంతో పరితాపం చెందింది. తానేమిచేయగలడింకా? బాధకల్గించేది యెప్పుడు యేది తన దృష్టిలోకి వచ్చినా అది కుమారుని కంటబడకుండా వుండేందుకు సమస్త ప్రయత్నాలు చేస్తూనే వున్నాడాయె.

హఠాత్తుగా, సిద్ధార్థునికి పెండ్లిచేస్తే సంతోషంగా జీవించగలుగుతాడేమో' నని శుద్ధోదనుడికి ఆలోచన కలిగింది. కానీ సిద్ధార్థునికి పెండ్లి చేయవలసినంత వయసు యింకా రాలేదు. దాంతో రాజ్యానికి సంబంధించిన లౌకిక కార్యాలు యేమైనా అప్పచెప్పితే రోజంతా బాగాగడిచి, బాలరాజు పడుతున్న ఆవేదన తగ్గుతుందేమోనని తలచాడు. అదే మంచి మార్గంగా కనిపించిదతడికి.

వెంటనే కౌమారప్రాయంలో వున్న తన బంగారు రాజకుమారుడిని పిలిపించి, తనకు యిష్టమైన రాజ్యపనులు చూడవలసిందిగా కోరాడు. సిద్ధార్థునిదే నిర్ణయాధికారం వుండేటట్లు సైన్యం, గూఢచర్యం, పన్నులవసూళ్ళు, రక్షకదళం, ఆరోగ్యదళం, శాంతి భద్రతలు, క్రీడాసాంస్కృతిక రంగాలు, వనాలు-పంటపొలాల అభివృద్ధి... మొదలైన శాఖల పనులను చూపించాడు.

సిద్ధార్థుడు తండ్రి అభ్యర్థనను సంతోషంగా అంగీకరిస్తూ, ఆ శాఖలలో తనకెంతగానో యిష్టమైన వనాలకు, ప్రకృతికి సంబంధించిన, 'వనాలు- పంటపొలాల అభివృద్ధి' అన్న శాఖను యిష్టంగా తీసుకున్నాడు. ఆ శాఖ గురించి శ్రద్ధగా అన్ని విషయాలూ తెలుసుకోసాగాడు.

కొద్ది రోజుల్లోనే అతడికి ఆశాఖలోని సాధక బాధకాలు తెలిశాయి. వనాలకు, పంటపొలాలకు అందడానికి రోహిణీ నదిలో కావలసినంత నీరు వుండటంలేదనీ, తమరాజ్యంలో ప్రవహిస్తున్న ఆ రోహిణీనది, పొరుగురాజ్యమైన కోలీయుల రాజ్యంనుండి ప్రవహిస్తుందనీ, రోహిణీనదికి అడ్డకట్టలు కట్టి నీరంతా కోలీయులే తమ పంట పొలాలకు మళ్ళించేసుకుంటున్నారనీ, అందువల్ల తమ రాజ్యానికి సరిగా నీరురాక, తమరాజ్యంలోని పంటలు పాడై పోతున్నాయనీ, ఆ పంటలమీద బతికే తమ శాక్యప్రజల బతుకు దుర్భరమై పోతూందనీ తెలుసుకున్నాడు

# మనుష్యులమధ్య యీ శతృత్వాలెందుకు ?

రోహిణీనది తమ భూభాగంలో కూడా ప్రవహిస్తున్నది కాబట్టి రోహిణీనది నీటిని వాడుకునే హక్కు తమకు కూడా వున్నదనీ, రోహిణీనది నీటిలో యిరు రాజ్యాలకూ సమమైన వాటావుండాలనీ, వరదలు వచ్చినప్పుడు మాత్రం వారి రాజ్యంలోని గ్రామాలు మునిగిపోకుండా వరదనీటిని తమరాజ్యంలోకి వదిలెయ్యడం అన్యాయమనీ, అందువల్ల తమ గ్రామాలు మునిగిపోతున్నాయనీ యెవరికీ కష్టం కలగకుండా ప్రకృతి మాత యిచ్చిన నీటిని సరిసమానంగా పంచుకోవాలని, తమశాక్యుల వాదన. న్యాయమేకదా! అందుకు తమవాళ్ళు చూపిస్తున్న దారి యేమిటంటే తమకాలవల్లోకి నీరు ప్రవహించేందుకు కోలీయులు వారి కాలువల్ని మూసేసి రోహిణీనదిని స్వేచ్ఛగా వదలడం. యిలా నీరు వొకరి తరువాత వొకరు పంచుకోవడం, లేదా యిరురాజ్యాలూ తమ పొలాలలోకి నీరు చేరేందుకు తవ్వుకున్న కాలవలలో నీరు వొకసారి వదిలి వొకసారి మూయడం.....

శాక్యుల న్యాయ[illegible]మైన యీ కోరికను కోలీయులు పట్టించుకోలేదు సరికదా, "మా దేశంలో ప్రవహించేనదినీరు అంతా మాదే. నీరు మాకక్కర్లేకపోతేనే వదులుతాం. అంతేగానీ ఆ నీరు అడిగే హక్కే మీకు లేదు" అంటున్నారు. యుద్ధానికైనా సిద్ధమవుతున్నారుగానీ, వివేచనతో నీరు అందివ్వడానికి వారు సుతరామూ అంగీకరించడం లేదు.

"మేం శాంతి ప్రియులమేకానీ, అన్యాయాన్ని సహించమంటే మాత్రం సహించలేం. మేమేం పౌరుషంలేని వాళ్ళం కాము. యుద్ధాలు చేయడంలో మేము తక్కువ తిన్నాం అనుకోకండి. మా నీరు మాకు అందేవరకూ మీతో యుద్ధం చేస్తూనే వుంటాం" అంటున్నారు తమ శాక్యులు. ఆవేశాలు, కావేషాలు పెరిగిపోయి నదిగట్లమీదనే యుద్ధాలు జరగడం నదీజలాలకు బదులు పంటపొలాలకు నెత్తుటినీరే పారడం యిప్పటివరకు జరిగిపోతూంది.

ప్రకృతి, తల్లిలా నీరు అందిస్తుండగా, సక్రమ మార్గంలో ఆ నీటిని సమంగా పంచుకోవలసింది పోయి, యిలా యిరుదేశాలవాళ్ళూ తగవులాడుకోవడం, రక్తపుటేర్లు ప్రవహింపచేసుకోవడం సిద్ధార్థుడికి చాలా బాధకల్గించింది. యే మనిషి అయినా, యెటువంటి విపత్కర పరిస్థితులలో అయినా యెదుటిమనిషిపై చేయి చేసుకోవడమంటే అతడికి చాలా యేవగింపు. అలాంటిది, వారు హత్యలకు కూడా దిగుతున్నారు. దానికి 'యుద్ధం' అనే వొక పౌరుష నామధేయం పెడుతున్నారంటే అతనికి యిదంతా దుస్సహంగా, అనైతికంగా, దారుణంగా అనిపించింది.

దీనికితోడు కొందరు రాజోద్యోగులూ, వేడిరక్తంకల యువ సైనికులూ, రైతుబిడ్డలూ సిద్ధార్థుని చెంతకి వచ్చి, యీ అన్యాయానికి ప్రతిగా యువరాజు అయిన తనను కూడా యుద్ధం చేయవలసిందనీ, యువరాజే సైనికుల్ని నడిపేటట్లయితే విజయం తమనే వరిస్తుందనీ, విన్నపాలు చేయడం మొదలుపెట్టారు. యిది అతడ్ని మరీ బాధపెట్టేసింది.

చిన్నిపిట్ట, బాధకు గురిఅయితేనే తట్టుకోలేని అతడి సుకుమార హృదయం, కత్తి దూసి యుద్ధం పేరుతో తోటిమనిషిని చంపడం తరువాత సంగతి, అసలు అలాంటి ఆలోచనలెందుకు వస్తున్నాయీ మనుషులకి? అని విలవిలలాడిపోయింది. ప్రాణాలుతియ్యకుండా, యుద్ధాలు చెయ్యకుండా, సమస్యలకు [illegible]ాలు కనుక్కోలేమా? మానవులమని అనిపించుకోవడం యెందుకు? జీవరాసులలోకెల్లా జ్ఞానవంతులమనీ లేని గొప్పలు యెందుకూ అనుకోవడం?

చూడబోతే, యుద్ధం చెయ్యకపోతే, 'ఏదం రాజురా బాబూ' అని అతన్ని ప్రజలు పరిహసించే పరిస్థితి వచ్చేట్టువుంది. చేస్తే, యెందరినో చేజేతులా చంపాల్సివస్తుంది. లేకపోతే కదనరంగాన దిక్కూ, మొక్కూ లేకుండా, హీనాతిహీనంగా చావాల్సి వస్తుంది. యుద్ధాలు చేసి నరబలులివ్వడమేనా క్షాత్రధర్మమంటే? యిది యెంత దారుణం? యీ మనుషుల్ని యెలా మార్చాలి? యీ సమస్యల్ని యెలా పరిష్కరించాలి? యుద్ధం చేస్తే యీ సమస్య తీరేదేనా? యుద్ధాల్లో వొకసారి మనం గెలవవచ్చు, మరోసారి విజయం అవతలి వాళ్ళనే వరించవచ్చు. ఆ తరువాత మనం. యిలా నిరంతర యుద్ధాల్లో మానవత్వాన్ని మంటకలపవలసిందేనా? యేదీ దారి? యిరుపక్షాలా శాంతి సామరస్యాలకు, సంతోష భాగ్యాలకు దారిలేదా? యోచనే రాదా?

యిలా సిద్ధార్థునికి యీలోకం గురించి పట్టించుకున్న కొద్దీ బాధే మిగులుతున్నది. అతని మనస్సంతా దుఃఖమే ఆవరించుకుంటున్నది.

రాచరికపు పని చేపట్టకముందు సిద్ధార్థుడు కొంతలో కొంతయినా సరదాగా వుండేవాడు. వుద్యానవనంలో కొత్తకొత్త మొక్కలు వేయించడంలో, ఆటలు ఆడటంలో, క్రమం తప్పకుండా గుర్రపుస్వారీ చేయడంలో, యింతమించి ప్రతిరోజూ తల్లిదండ్రుల దగ్గరకు వచ్చి వారికి ఆ మాటలూ, యీ మాటలూ చెప్పి సంతోషపరచడంలో వుత్సాహంగానే వుండేవాడు.

కానీ, విపత్కరమైన యీ రాజ్యసమస్య అతడిని చాలా కలవరపరిచింది. బాధపెట్టింది. అయినా తనబాధ యెవరికీ తెలియకుండా, రాజభవనంలో తను నిత్యం మెలగే తీరులోనే అందరితోటీ మెలిగేవాడు. కానీ ఆ తీరులో వుత్సాహం లేదు. మాటల్లో జీవం లేదు. చిరునవ్వులో కాంతి లేదు. నిర్లిప్తతకూ, స్తబ్దతకూ అతని ఆంగికం వుదాహరణైంది.

శుద్ధోదనుడికి తెలుసు, తన బంగారుకొడుకు యిలా ఆలోచనలతో ఆత్మహతమైపోతున్నాడని. కానీ అతడేం చేయగలడు? చిన్న పిల్లాడైతే యెత్తుకుని వోదార్చును. కొంతవయసువచ్చాక తల్లిదండ్రులకీ పిల్లలకీ తెలియని అంతరం వచ్చేస్తుంది. యెంతప్రేమ, అభిమానాలు వున్నా ఆ చిన్ననాటి చనువు వుండదు. అటువంటి చనువుకి కుమారుడి వయసు అడ్డంకై శుద్ధోదనుడికి సిద్ధార్థుడు కనిపిస్తేనే చాలు గొంతు పూడుకు పోతూంది. కుమారుడు పడే బాధయేమిటో అడిగి, ఆ బాధను మరింత పెంచడంకంటే, అతడి బాధను మరపించగలిగేదేదైనా అతడికి తానివ్వగలిగితే బాగుండుననని యెంతో ఆర్తిగా తలచాడు.

## ప్రేమ యెంత మధురం !!

యింతలో, సిద్ధార్థునికి విద్యాభ్యాసం ముగిసిందనీ, క్షాత్ర విద్యలన్నింటిలోనూ పరిపూర్ణంగా వుత్తీర్ణుడయ్యాడనీ, అతడికిక వివాహం చేయవచ్చుననీ' కబురు పంపారు రాజగురువులు. శుద్ధోదన మహారాజుకి ఆ వార్త చెప్పరానంత ఆనందాన్ని కల్గించింది. ఆయన వెంటనే సిద్ధార్థునికి వివాహం చేయ సంకల్పించాడు. ఆనంద సందోహాలు మొదలయ్యాయి.

శాక్యదేశపు ఆచారంప్రకారం, దేశంలోనూ, చుట్టుప్రక్కల దేశాలలోనూకల రాజవంశ కన్యలందరికీ ఆహ్వానాలు పంపించారు. అది చైత్రశుద్ధదశమి రోజు. ఆనాడు రాజకుమారుడు తనను చూడవచ్చిన రాచకన్యలందరికీ బహుమతులివ్వాలి. వారితో అతడు సంభాషించవచ్చు. వారిలో తనకెవరు నచ్చారో చెపితే, అప్పుడు ఆ కన్య తండ్రికి శుద్ధోదనుడు కబురుపంపడం,

అతడొకవేళ వరుసైనవైన పరీక్ష పెట్టదలచుకుంటే ఆ పరీక్షలో సిద్ధార్థుడు పాల్గొనడం జరుగుతుంది. ఆ పరీక్షలో నెగ్గితేనే ఆ అమ్మాయిని అతడికిచ్చి పెండ్లి చేయడం జరుగుతుంది.

ఆనాడు సిద్ధార్థుడు సాంప్రదాయం ప్రకారం తనని చూడవచ్చిన రాజకన్యలందరికీ పరిచయాలు అయిన తరువాత సాదరంగా వొక్కొక్కరికీ తన చేతికి వచ్చిన బంగారు బహుమతులు అందివ్వసాగాడు. ఆ రాజకన్యలు కూడా సిద్ధార్థుడికి తాము తెచ్చిన కానుకలు అందివ్వసాగారు. వారు తెచ్చిన, వారే స్వయంగా వేసి తెచ్చిన చిత్రపటాలు, రంగు రంగుల పట్టు పువ్వులు, లతలు, పూలు కుట్టిన పట్టురుమాళ్ళు, తామే స్వయంగా అల్లిన బంగారు, ముత్యాల ఆభరణాలు, రత్నాలు పొదిగిన బాకులు, వీర ఖడ్గాలు యిస్తుంటే వాటిని సంతోషంగా పరిశీలిస్తూ, వొకసారి వారికి తానివ్వవలసిన బహుమానాలనే మరచిపోతున్నాడు సిద్ధార్థుడు. అతడికోలాయింతో రమ్యంగా వుంది. వచ్చిన రాజకన్యలు కూడా, అతడి స్నేహప్రవర్తనకు యెంతో సంతోషపడుతూ, సిద్ధార్థునితో చిరునవ్వులతో ముంచెత్తుతూ చిన్న చిన్న చమత్కారాలు చేస్తూ, పదకవితలు పాడుతూ వెళ్ళలేక వెళ్ళలేక వెళుతున్నారు. వొకోసారి సిద్ధార్థుడే వారిని ఆపుచేసి మాట్లాడుతున్నాడు.

అందరివంతూ అయిపోయింది. వచ్చిన వారందరితోనూ అభిమానంగా మాట్లాడటం, కళలలో వారి నైపుణ్యానికి వారిని అభినందించడం, సస్నేహంగా వారి వద్ద వీడ్కోలు తీసుకోవడం.. యివన్నీ సంతోషంగా చేస్తున్నాడే కానీ, యిది స్వయంవరమనీ, వచ్చినవారిలో తనకు నచ్చిన కన్యను తన దేవేరిగా యెన్నుకోవాల్సివుందనీ అతడు మరిచేమరిచిపోయాడు.

అందరూ అయిపోయారనే అనుకున్నాడు. బంగారు పళ్ళెంలోని బంగారు, రత్నాల ఆభరణాలుకూడా అయిపోయాయి. యింక తనపని అయిపోయిందన్న సంతోషంలో అతడు రాజసౌధంలోపలికి అడుగు వేయబోతుండగా, 'ప్రభూ!' అన్న ప్రేమాస్పదమైన పిలుపు వినబడింది. ఆ పిలుపు అతడిలో రాగవీణాతంత్రులను వొక్కుమ్మడిగా మీటింది. తటాలున అతడు వెనుకకు చూడగానే కనబడిన దృశ్యం అతడ్ని ఆశ్చర్యంలో, మోహానానందంలో ముంచివేసింది. చూపులు మరల్చుకోలేక పోయాడు. అప్రతిభుడైపోయాడు. పరవశుడైపోయాడు.

రాజ్యముఖ్యుడొకడు ఆమె యశోధర అనీ, మహామండలాధిపతుడు సుప్రబుద్ధుని కుమార్తె అనీ పరిచయం చేశాడు. యశోధర అన్న పేరే కాకుండా ఆమెకు గోప, మనోహర, మృగయు, సుభద్రకంచన అన్న పేర్లు కూడా వున్నాయి. పాలకడలిలా స్పందించి పోతున్న హృదయాలతో వారిరువురూ అసంకల్పితంగా నమస్కారప్రతినమస్కారాలు చేసుకున్నారు. అతడామెను కళ్ళనిండుగా చూసుకున్నాడు. రాజకన్యల వరుసలో ఆమె కావాలని అందరికంటే వెనుక వుండటంవల్ల ఆమె అతడ్ని యించుమించు మొదటినుంచీ గమనిస్తూనే వుంది. అతడిని వివాహం చేసుకోకపోతే జీవితమే వృథా అనిపించిందామెకు. సిద్ధార్థుడికీ కూడా అదే భావం జీవితంలో మొట్టమొదటిసారిగా యశోధరని చూశాకే అనిపించింది. ఆడపిల్లలింత అందంగా మెరుపుతీగల్లా, పూలకొమ్మల్లా సస్నేహంగా వుంటారనీ, వాళ్ళతో బాగా వూసుపోతుందనీ అతడికదే తెలియడం.

యింక ఆమెకు అతడు తన కానుకని అందివ్వవలసి వుంది. చూడబోతే బంగారు పళ్ళెంలో బంగారు ఆభరణాలు అయిపోయాయి. వాటిని మరల తీసుకురావడానికి వెళ్ళిన పరిచారిక, దూరంనుంచి వడివడిగా వాటిని తెస్తోంది. యింతలోనే సిద్ధార్థుడు తన మెడలోని ముత్యాల హారాన్ని తీసి యశోధర చేతికి అందించాడు. కానీ ఆమె అది పుచ్చుకోక అతడి ముందు

తలవంచే నిలుచుండటంతో యేమాత్రం ఆలోచించక ఆ హారాన్ని, ఆమె మెడలోనే వేసేశాడు.

వెంటనే సభావేదికం అంతా హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. రాజభవనం ముందర తారాజువ్వలు, టపాసులు, మతాబులు పేలాయి. మంగళ వాయిద్యాలు మార్మోగాయి. శుద్ధోదనుడి ఆనందానికి అంతులేదు. వెంటనే అతడు సకలరాచమర్యాదలతో సుప్రబుద్ధుడికి కబురు పెట్టాడు. సుప్రబుద్ధుడు తాను కూడా స్వయంవరం యేర్పాటు చేస్తున్నట్టు, ఆ స్వయంవరంలో తాను పెట్టే క్షాత్రవిద్యాప్రదర్శనలో సర్వోత్కృష్టుడైనవాడికే తన కుమార్తెనిచ్చి వివాహంచేయడం జరుగుతుందనీ, సిద్ధార్థుడాపరీక్షలో విజయుడు కావాలని తానాశీర్వదించుచున్నాననీ తెల్పాడు.

కొద్దిరోజుల్లోనే యశోధర స్వయంవరం కూడా యేర్పాటైంది. స్వయంవరానికి రాజకుమారులెందరో వచ్చారు. ధనుర్విద్య అతడికి కొట్టినపిండి. పదిగజాల యెత్తులో వున్న గిర గిర తిరిగే మత్స్యయంత్రాన్ని క్రిందనవున్న నీటిలోంచిచూస్తూ ధనుస్సుకి ధనుస్సే వెళ్ళిన విరిగేటట్టు వొక్క బాణం దెబ్బతో విరక్కొట్టాడు.

ఆ తరువాత ఖడ్గవిద్యాపరీక్ష. ఖడ్గంతో రెండు చెట్లని వొకవేటుతో నరికెయ్యాలి. కొందరు వొకే వేటుకు వొక చెట్టును యేడు అంగుళాలలోతుకు, కొందరు తొమ్మిది అంగుళాల లోతుకు నరికారు. కానీ సిద్ధార్థుడు తన ఖడ్గంతో వారు నరికిన చోటున తన వేటు పడకుండా వారికంటే దిగువగా ఆ రెండు చెట్లనీ వొకే వేటుతో తృటిలో నరికివేశాడు. ఆశ్చర్య మేమిటంటే ఆ చెట్లని నరికివేసినా అవి అలాగే నిలిచే వుండి పోయాయి. సేవకుడొకడు వచ్చి వాటిని తోసిన తరువాతనే అవి ఛేదింపబడినాయని తెలుసుకుని సభాసదులందరూ ఆశ్చర్యచకితులై పోయారు.

కానీ సిద్ధార్థుడి మనస్సులో వేదన... 'క్షాత్ర విద్యా ప్రదర్శన' పేరిట అమాయకమైన రెండు పచ్చని చెట్లను న. కి వేయవలసి వచ్చిందే.. అయ్యో!' అని.

నై ఆలోచనలో వుండగానే యశోధర తన చెలికత్తెలతో వచ్చి సిద్ధార్థుని పుష్పమాలాంకృతుని చేసింది. తదనంతరం వారి వివాహం మహావైభవంగా జరిగింది

శుద్ధోదన మహారాజా నూతన వధూవరులకోసం, అతి చక్కటి చలువ రాతి మందిరాల్ని నిర్మించాడు. అందులో సుగంధాలుచిందే పుష్పవనాలూ, దాసదాసీలూ, నృత్యనృత్యసంగీత కళాకేళి వినోదాలూ యింకా యెన్నో యేర్పాటు చేయించాడు. యే కాలానికి తగ్గట్టు ఆ కాలానికి సరిపడిన వేసవికాలంలో చల్లగా, చలికాలంలో వెచ్చగా, వర్షాకాలంలో పొడిగా వుండే భవనాలు వారికోసం కట్టించాడు.

యిప్పుడు సిద్ధార్థ,యశోధరలదే ప్రపంచం అంతా. ఆచోటికి అనుమతిలేకుండా యెవరూ వెళ్ళకూడదు. వారికి కావలసినవన్నీ కనుసైగతోనే అమరేవి.

సిద్ధార్థునికి యశోధర కేవలం భార్యగా మాత్రమే కాకుండా మనసు పంచుకోను చక్కని స్నేహితురాలు కూడా అయింది. ఆమె ప్రేమలో అతడెంతో శాంతిని అనుభవించాడు. వారిరువురూ యెంతో అన్యోన్యంగా వుండేవారు. ఆమెకు అతనితోడిదేలోకం. అతడికి ఆమేలోకం. అయినా అప్పుడప్పుడూ అతన్ని బయట ప్రపంచానికి సంబంధించిన బాధాకరమైన జ్ఞాపకాలు వెంటాడుతూ వుండేవి. ముఖ్యంగా రోహిణీనది నీటిగురించి యిరురాజ్యాలమధ్య స్పర్థలు, శత్రుత్వాలు కొంచెం కూడా తగ్గలేదు. యీ విషయాలు ఆమెతో చెప్పి బాధపడేవాడు. అతని భావాలతో ఆమె

యేకీభవిస్తూ సహానుభూతినిస్తూ అప్పటికతడిమనసు సాంత్వనపడేటట్టు చూసుకునేదామె. సమస్యలను సానుకూలంగా పరిష్కరించుకోవాలనే ఆమెకూడా తలిచేది.

యిద్దరు శత్రువుల మధ్య భేద భావాలు నశించి, వారు మిత్రులయ్యే విధానమేమైనా వుంటే అది తెలుసుకోవాలని అతడు చాలా తపన పడిపోయాడు. యిద్దరు మనుష్యులు, స్వార్థంతోనో, అజ్ఞానంతోనో కొట్టుకుంటే వారికి తమ శాక్యన్యాయసంఘం యెటువంటి శిక్ష విధిస్తుంది? అన్న ఆలోచన వచ్చిందతడికి. ఆ ఆలోచనవెమ్మటే శత్రుత్వ, మిత్రుత్వాంపై మరెన్నో ఆలోచనలు వచ్చాయతడికి. యిద్దరు మనుష్యుల మధ్య శత్రుభావాన్ని రూపుమాపగలిగితే, ఆ పద్ధతిని మరింత మెరుగుపరిచి యిరుదేశాల మధ్య కూడా అన్వయింపు చేసుకోవచ్చు కదా!!. అదీ అతడి భావన.

యింక అతను వుండబట్టలేక శాక్యధర్మప్రతినిధులను రాజభవనంలోనే కలుసుకున్నాడు. శత్రుత్వాలను తొలగించే పద్ధతి, తప్పులకు శిక్షించే పద్ధతి తమ శాక్యులలో యెలా వున్నదో తెలుసుకోగానే అతడికి చాలా ఆశ్చర్యం వేసింది. ఆనందం కలిగింది. ముందరముందర మరింత గొప్పసంగతేదో తెలియనున్నట్టుగా అనిపించి అతడి మనసు సంతోషంతో వుప్పొంగింది.

శాక్యన్యాయప్రకారం యేయిద్దరైనా తగవులాడుకోవడం, కొట్టుకోవడం నేరం. ఆ నేరానికి శిక్ష వారిద్దరూ తప్పనిసరిగా మిత్రులవడమే. వారు మిత్రులయ్యేంత వరకూ యిద్దరూ నేరస్థులే. శాక్యుడు ప్రతి వొక్కడూ తోటి శాక్యుల శారీరక, మానసిక, ఆదాయ యోగక్షేమాలను చూడాలి. సంఘసమావేశాలకు తప్పకుండా హాజరవాలి. యెవరైనాసరే నేరం చేసినట్టు నిందిస్తే కోపం తెచ్చుకోకూడదు. నేరాన్ని అంగీకరించాలి. లేదా తన నిర్దోషిత్వాన్ని సత్యపద్ధతిలో నిరూపించుకోవాలి. మిత్రుత్వాన్ని పెంపొందించుకోవాలి. బాధాకరమైన గతాన్ని వర్తమాన సంతోషంతో మరచిపోవాలి.

యివి అతడికి యెంతో సంతోషం కల్గించాయి. శాక్య సంఘంలో అతడికి అధ్యక్షుని తరువాత స్థానం వుంది. అయినా అతడు మామూలు సభ్యుడుగా మాత్రమే వెళ్ళేవాడు.

అతడికింక అనుమానాలు పోయాయి. చుట్టుప్రక్క రాజ్యాలలో తమ శాక్యరాజ్యమంటే యెంతో పేరు. శాక్యులు అందరూ అన్నదమ్ముల్లా మెసులుకుంటారనీ, వారిలో వారికి గొడవలు తక్కువనీ. మరి వారు యిదే సభ్యత కోలీయులలో యెందుకు చూపించరు? వారితో యుద్ధాలకు దిగుతారెందుకని? లేక కోలీయులకు మరే యితర సమస్యలన్నా వుండి, వారి రాజ్యప్రజలను సమస్యలనుండి మళ్ళించేందుకు యిలా తమతో కయ్యానికి కాలుదువ్వుతున్నారా? యీ తగవులాటలో సమయం అంతా వృధా అయిపోతూందే!? యెన్నో విలువైన ప్రాణాలు బలైపోతున్నాయే!! మనదేశంలో వున్నటువంటి న్యాయసంఘంలాంటిది, నీటి విషయంలో రెండు రాజ్యాంమధ్యా యేర్పడి, యిరు పక్షాల ప్రతినిధులూ అన్ని విషయాలూ కూలంకషంగా యెప్పటికప్పుడు చర్చిస్తూ వుంటే, కోపాలు తెచ్చుకోకుండా. శాంతి సహనాలతో వుంటే యిరువురి మధ్యా వొక వొడంబడిక కుదుర్చుకోలేమా? యిరువురికీ మేలు కలిగేలా నిర్ణయాలు తీసుకోలేమా?

యీ ఆలోచన అతన్ని నిలువ నీయలేదు. మొత్తం ఆ రోహిణీనదీపరివాహక ప్రాంతం అంతా చూసి రావాలి. అప్పటి ప్రజలందరితో సంప్రదించాలి. తమ రాజ్యంలోగానీ, వారి రాజ్యంలోగానీ రోహిణీనది నీటిని నిల్వ చేయగల అతిపెద్ద చెరువుని తవ్వే అవకాశంవుంటే అసలు సమస్యే వుండదు. మనమువుంటేనే కదా మార్గం కనపడేది? ప్రకృతి మధ్య వుదయాస్తమయాలు చూసి చాన్నాళ్ళయింది కూడా, యెప్పుడో తండ్రితో కొన్నాళ్ళపాటు వెళ్ళాడు... అంతే... యీ మధ్య మళ్ళ వెళ్ళలేదు. వొంటరిగా ప్రయాణిస్తుంటే యెంత బాగుంటుందని!?

# జ్ఞానానికై మనిషికి స్వేచ్ఛ వుండాలి

యింక అతడు వుండలేక పోయాడు. యింక తెల్లవారే సమయం. నిద్రపోతున్న యశోధర కపోలాలు ప్రేమతో స్పృశించి, రాజ్యంలోకి వెళుతున్నానని లాలనగా చెప్పి, రాజభవనం దాటి, గుర్రాన్ని తీసుకుని, దూరంగా వున్న రాజముఖద్వారాన్ని చేరుకోగానే, ద్వారపాలకులు ద్వారాలు తెరువకుండా భయంతోటి, భక్తితోటి అసలు విషయం చెప్పకుండా నేలచూపులు చూస్తుండి పోయారు. ప్రయత్నం మీదట, తనను ఒంటరిగా బయటకి పంపించడానికి వారికి ఆజ్ఞ లేదని తెలుసుకున్నాడు.

యెంతో మంచి ఆశయంతో వుత్సాహంగా బయలుదేరిన అతడి అభిమానం దెబ్బతింది. వెంటనే గుర్రాన్ని వెనకకు తిప్పి తండ్రివుండే సౌధానికి దౌడుతీయించాడు.

వెళుతున్నాడన్న మాటేగాని తండ్రి చేసినపని తలవగానే అతడి కళ్ళల్లో యెర్రటి జీరలు వచ్చేశాయి. శుద్ధోదనుడు సిద్ధార్థుడి కోరికను వినగానే హతాశుడయ్యాడు. తనకు స్వేచ్ఛ లేకుండా యెందుకు చేశారన్నదే సిద్ధార్థుడి బాధ. శుద్ధోధనుడు వివరంగా చెప్పాడు.

"బాబూ! యిప్పుడిప్పుడే నిన్ను సంతోషంగా చూసుకుంటున్నాము. యెంతో చక్కటి కోడలు లభించిందని మేము మురిసిపోతున్నాం. యిన్నాళ్ళూ యింతమంది చిన్నప్పటినుండీ నీలో తెలియని యేదో ఆవేదన... మమ్మల్ని కూడా బాధపెడుతూ వుండేది. గుండెలు పిండుకు పోతున్నట్లుగా వుండేది. ప్రతీ చిన్న విషయాన్ని కూడా తీవ్రంగా తీసుకుని బాధపడతావు. జీవితంలో హింస, అన్యాయం, మూర్ఖత్వం, అజ్ఞానం యివన్నీ 'మామూలే' అని నేననను. కానీ అవి వున్నాయి. యే జ్ఞానం చేతా వాటిని యిప్పటివరకూ యెవరూ నిర్మూలించలేక పోయారు. రాజదండన ఒక్కటే సరి అయినదిగా అనిపిస్తుంది నాకైతే. యీ ప్రపంచంలో యేదీ నీకు సంతోషం కల్గించలేదు. కడకు రమ్యమైన ప్రకృతిలో కూడా నీకు హింసలే కన్పట్టాయి. నువ్విప్పుడు సంతోషంగా వున్నావు. మాకదే చాలు. నువ్వు ప్రపంచంలోకి వెళ్ళే అవసరమే లేదు. ప్రపంచాన్ని చూసి బాధపడే అవసరం కూడా లేదు. రాజభవనంలో వుండి నువ్వేది అడిగినా క్షణాల్లో దాన్ని నీ ముందు వుంచుతాం. బాబూ! నువ్వు ప్రపంచంలోకి వెళ్ళి బాధలు కొనితెచ్చుకోకూడదని నా తలపు. స్వర్గలోకపు రాజకుమారునిలా బతుకు... నాయనా మాకు అదే ఆనందం. అందుకే ద్వారపాలకులకు అనుజ్ఞ యివ్వలేదు. నాయనా! భవనంలోకి వెళ్ళిపో! సుఖంగా వుండు నాయనా. యెందుకొచ్చిందిదంతా నీకు చెప్పు?".

"నాన్నగారూ! యిది మీకు న్యాయం కాదు" దృఢంగా అన్నాడు సిద్ధార్థుడు 'యిది మీకు గౌరవంకూడా కాదు' అన్న ధ్వని కూడా వినిపించిదామాటలో. తండ్రిపై గౌరవంకొద్దీ తనపౌరుషాన్ని అణుచుకుంటున్నానన్న ధ్వనికూడా వుందామాటలో.

సిద్ధార్థుని ఆ మాటకు శుద్ధోదనుడు కళవళపడిపోయాడు. నోటమాట రాలేదు. అయినా తనను తాను సమర్థించుకుంటూ, "అదికాదు నాయనా! నువ్విలా ఒంటరిగా రాజ్యంలోకి వెళ్తే యెంతో ప్రమాదం. నువ్వు మామూలు పౌరుడవు కాదు. యీ రాజ్యానికి కాబోయే రాజువి. శత్రువులుండవచ్చు. వారు నీకు అపకారం తలపెట్టవచ్చు... రాజ్యంలోకి నువ్వు సపరివారంగా వెళ్ళేటట్లయితే నాకభ్యంతరమేమీ లేదు. భద్రతగానూ వుంటుంది, చూడాలనుకున్నవాటిని ముందరే రాజోద్యోగులు చూసి, ఆ ప్రదేశంలో శత్రుభయం లేకుండా చూస్తారు. నువ్వు చూడకూడని దృశ్యాలు, నీకు బాధకల్గించే దృశ్యాలు నీ కంటబడకుండా చూస్తారు.. నాయనా! నా మాట కాదనకు నీ సౌధానికి

వెళ్ళిపో. కోడలు నీకోసం చూస్తూవుంటుంది. నువ్వెక్కడికి వెళ్ళాలనుకుంటున్నావో చెప్తే అక్కడికి రేపే పరివారంతో వెళ్ళేటట్టు నేను చూస్తాను.."

తండ్రి మాటలకి సిద్ధార్థుడికెంతో బాధకలిగింది. నిస్సత్తువ ఆవహించింది. అతడెప్పుడూ తండ్రికి యెదురు చెప్పలేదు. కానీ యిప్పుడు తండ్రి తనపైన ప్రేమతోనే తనని రాజభవనానికి బందీ చేస్తున్నాడు. అవమానిస్తున్నాడు. పిరికివాడిని చేసేస్తున్నాడు. యెంత అవమానం? అతడిమనసు అతని పరిస్థితికి బాధతో కుంచించుకు పోయింది. తమాయించుకుంటూ ప్రశ్నించాడు.

"నాన్నగారూ! వొకటి చెప్పండి. నేను, నన్ను నేను రక్షించుకోలేని అర్భకుడినా? అలా అయితే యిటువంటి అర్భకుడికి మహారాజపదం యెందుకు? లేక నేనొకబందీనా? బందీనైతే రాజసౌధాల్లో నాకీ ప్రత్యేక సుఖాలెందుకు? చెప్పండి నాన్నా!" సిద్ధార్థుడి గొంతు కంపించింది.

సిద్ధార్థుడి మాటలకు శుద్ధోదనుడికి వొక్కమాట కూడా పెకల్లేకపోయాడు. అప్పటికప్పుడే రాజ్యముఖ్యుల్ని పిలిపించి పురద్వారాలను తెరువవలసిందిగా, సిద్ధార్థుడికెవరూ, యిప్పుడేకాదు యెప్పుడూ కూడా యెట్టి సందర్భంలోనూ అడ్డుచెప్పకుండా వుండేటట్టుగా ఆజ్ఞజారీ చేశాడు.

సిద్ధార్థుడు తిరిగి గుర్రంమీదకు యెక్కి వెళ్ళబోతుంటే శుద్ధోదనుడతడి దగ్గరగా వచ్చి, "నాయనా! నువ్వు అర్భకుడివన్నాటికీ కావు మహా వీరుడివి మహారాజు బిడ్డవి. కాబోయే మహారాజువి. బందీవసలే కావు. నీకెక్కడైనా పూర్తి స్వేచ్ఛ వుంది..."

"అలానే !"

"నాయనా! వొక్కమాట... యేమనుకోవుకదూ!" శుద్ధోదనుడు అన్నాడు

"అడగండి!" సిద్ధార్థుడు అన్నాడు నిర్లిప్తంగా.

"నాయనా! నీవు తట్టుకోలేని విషాదదృశ్యాలేవైనా యెదురు కావచ్చు.... నాయనా... నువ్వు గుండెనిబ్బరంగా వుంటావు కదూ! నువ్వు బాధపడుతుంటే నేను చూడ్లేను నాన్నా.. నా గుండె తరుక్కుపోతుంది!" శుద్ధోదనుడిగొంతు గద్గదికమైంది.

"అలాగేలెండి నాన్నగారూ.. వస్తాను" అంటూనే సిద్ధార్థుడు గుర్రాన్ని అగమేఘాలమీద పరుగుపెట్టించాడు. గుండెపట్టుకుని చూస్తూండిపోయాడు శుద్ధోదనుడు.

## యే శరీరమైనా శిథిలమైపోకతప్పదు

సిద్ధార్థుడు పురద్వారాన్ని దాటి రాజ్యంలోకి, సాగరంలోకి పొంగిపొర్లుతున్న మహానదిలా ప్రవహించాడు. రాజ్యంలోకి రాగానే అతడికి స్వేచ్ఛగా వూపిరాడింది. పట్టుసంకెళ్ళే తెగిపోయినట్టుగా అనిపించింది. అలా అలా చాలా దూరం వెళ్ళి వొక యెత్తయిన స్థలందగ్గర ఆగి చుట్టూ పరికించి చూడసాగాడు. పొగమంచు యింకా పలచబడనేలేదు.

వొక ఆకారమేదో నెమ్మదిగా, వణుకుతూ అతనుండే వైపుకు వస్తున్నది. అది మనిషే అయివుంటాడని, తోడు వుండటానికి సిద్ధార్థుడు క్రిందకు దిగి, తూలిపడబోతున్న అతణ్ణి పడిపోకుండా పట్టుకుని, యెవరుమీరు అని అతడి మొఖం వంక చూసేసరికి, సిద్ధార్థుడికి వళ్ళు గుగుర్పొడిచి పోయింది.

అతడొక శతవృద్ధుడు. సిద్ధార్థుడికి అంత ముసలితనాన్ని చూడటం జీవితంలో అదే మొదటిసారి. ముదివగ్గు. పళ్ళన్నీ వూడిపోయాయి. కళ్ళు కనిపించడం లేదు. నడుము పూర్తిగా వంగి

పోయింది. శరీరమంతా ముడతలు ముడతలు. కనుబొమలు వేలాడిపోతున్నాయి. నడవటానికి సహాయంగా తెచ్చుకున్న కర్రని కూడా యెత్తి మరొక అడుగు వెయ్యలేని నిస్సహాయతలో వున్నాడు. అతడి ఆకారం చూడగానే సిద్ధార్థుడికి కాళ్ళు చేతులు వణికిపోయాయి. యేమిటీ యింత దారుణమైన ఆకారం? మనిషేనా లేక యేదైనా వింత జంతువా? అతడేమన్నా జబ్బుతో బాధపడుతున్నాడా? చివరికి ఆ ప్రశ్నే వేశాడు.

ఆ ముసలివాడు వణుకుతున్న పెదవులతో అన్నాడు... "జబ్బేమీ లేదు.. వయసు మీరిపోయింది. ముసలితనం కదా... ముసలితనంలో నడవడం కష్టంకదా యెవరికైనా?"

"యెవరికైనా కష్టమేనా?" అన్నాడు సిద్ధార్థుడు..

ఆ ముసలివాడు నవ్వలేక నవ్వాడు.." యెవరికైనా అంతే. ముసలి తనంలో యెవరైనా చకాచకా యెలా నడవగలుగుతారు? ముసలితనం వచ్చాక నేనేమిటి యెవరైనా అంతే. యిలానే యింద్రియాలేమీ పని చెయ్యవు... యిట్లానే వళ్ళంతా ముడతలు పడిపోయి, దవడలు జారిపోయి, పళ్ళూడిపోయి... యెవరైనా అంతే.. ముసలితనం వచ్చాక నేనైనా అంతే నువ్వయినా అంతే..."

"నిజమేనా?" అన్నాడు సిద్ధార్థుడు ఆశ్చర్యంగా.

"సందేహమెందుకు? నువ్వేమైనా అమృతంతాగి పుట్టావా అబ్బాయ్? యవ్వనంలో వాడి నీలాగే బలిష్ఠమైన శరీరం— వయసు మీద పడిన కొద్దీ యిదుగో నాలాగే అవుతుంది నీ శరీరం కూడా.. నీ శరీరమేమీ, నా శరీరమేమీ అన్నీ యిట్లానే శి..థి..ల..మై.. పో..తా..యి.." అంటూ యింకా యేమో గొణుగుతూ ఆ ముసలివాడు వేరే వైపుకు వెళ్ళిపోయాడు నెమ్మదిగా.

యీ సంఘటన జరిగాక సిద్ధార్థుడికి యింకెక్కడికీ వెళ్ళాలనిపించలేదు. తిరిగి రాజభవనంలోకి గుర్రాన్ని పోనిచ్చాడు.

తననుకాదని పట్టుబట్టి రాజ్యంలోకి వెళ్ళిన సిద్ధార్థుడు రెండు ఘడియలైనా ఆవకముందే కోటలోపలికి వచ్చేయటం చూసి శుద్ధోదనుడు 'హమ్మయ్య' అనుకున్నట్లు నిట్టూర్చాడు. కొడుకు మహాభినిష్క్రమణానికి యిది తొలి అడుగు అని ఆ పిచ్చితండ్రికి తెలియనే తెలియదు.

సిద్ధార్థుడు తన మందిరానికి చేరుకున్నాడన్న మాటేకానీ అతడి మనసు జరిగిన సంఘటనకి కకావికలై పోయింది. పదేపదే తన కాళ్ళు చేతులు చూసుకున్నాడు. ఆ ముసలి అతనే జ్ఞాపకం వచ్చాడు. అతడిలాగే తామూ వొకనాటికి ముసలివాడినై పోతానన్నమాట. యిట్లా ముడతల మీద ముడతలు పడిపోయే దేహం కోసమైనా యింత ఆరాటపడిపోయేది? ఫలానా బట్ట కట్టాలనీ. ఫలానా తిండి తినాలనీ వ్యాకుల పడిపోయేదీ? యేమిటో వివరించలేని ఆలోచనలు అతన్ని వెన్నంటాయి. వొకటి మాత్రం అతడికి స్పష్టంగా తెలిసిపోయింది, 'యీ రాజభవనాలకూ, బయట ప్రపంచానికీ చాలా తేడా వుంది. బయట ప్రపంచంలో తాము తెలుసుకోవలసిన విషయాలు చాలా వున్నాయి. అవి తెలుసుకోకుండా వినోద విలాసాలలో మునిగి తేలుతూ కాలాన్ని వృథా చేయడం మంచి పద్ధతి కాదు, అనిపించింది. అనుక్షణం నాట్య సంగీత విలాసాలలో తనని అదమరిపింప చూసే యీ రాజభవనం అతడికొక విచిత్రమైన కారాగారంలా అనిపించింది. మాటిమాటికీ ఆ ముసలి అతను జ్ఞాపకం వచ్చి, 'యెల్లకాలమీ దేహమిలా వుండదన్న నిజం నీవు తెలుసుకో- విలువైన గుణాలతో బతుకు చరిత చేసుకో'- అని చెప్తున్నట్టే అనిపించింది.

ఆ సాయంకాలమే రాజ్యంలోకి అతడికి మళ్ళా వెళ్ళాలనిపించింది. గుర్రపుశాలకి వెళ్ళగా, యెప్పటిలాగే తన గుర్రానికి ప్రేమగా మేత తినిపిస్తున్న చెన్నుడు కనిపించాడు. తను కనిపించగానే వినయంగా నమస్కరించాడు. క్షణాల్లో గుర్రాన్ని సిద్ధం చేశాడు. సిద్ధార్థుడు గుర్రం యెక్కుతూ, తనవంక యెంతో అభిమానంగా, గౌరవంగా, వినమ్రంగా, అమాయకమైన ప్రేమతో చూస్తున్న చెన్నుడితో అన్నాడు. 'చెన్నా! వస్తావా నాతో పాటు?'

"అలాగే దొరా గుర్రం వెనుకే పరుగెత్తుతూ వస్తాను.."

"అలా వద్దు.."

"నన్నూ వోగుర్రాన్ని తెచ్చుకోమంటారా బాబూ?"

"అలాకూడావద్దు. యెందుకూ రెండో గుర్రాన్ని కూడా కష్టపెట్టడం? మన 'కాంథకుడు' . తెలుసుకదా నీకు బలమైనవాడు..నీ చేతుల్లో కూడా మచ్చిక అయినవాడు కాబట్టి.. రా.. నా వెనుకే కూర్చో.." అంటూ సిద్ధార్థుడు చెన్నుడికి చేయి అందించాడు..

"దొరా! వద్దు దొరా.. మీరు ప్రభువులు.. మేము మీ కాళ్ళకాడ పడుండవలసిన వాళ్ళం.. మీ వెనుకే కూర్చునేందుకు తగినవాడ్నికాదు దొరా!"

"చెన్నా! అలాటివేమీ మాట్లాడకు..నాకలాంటి మాటలంటే గిట్టవని నీకు తెలుసు కదా! యెవరుగొప్ప? యెవరుపేద? యెవరు యెక్కువ? యెవరు తక్కువ? కోసి చూస్తే నీలోనూ నాలోనూ వుండేది నెత్తురే కాదా! చెన్నా యింక ఆలస్యం చెయ్యకు... రా... నా చేయందుకో.. లేకపోతే ఆజ్ఞాపించవలసి వుంటుంది"

"ఆజ్ఞాపించటమెందుకు దొరా? మీ మాటలే ఆజ్ఞాపనలు.. తెలియక నేనేమైనా తప్పులు చేస్తే మన్నిస్తారు కదా! దొరా!"

"అలాగేలే!"

చెన్నుడు, సిద్ధార్థుని చేయిఅందుకుని కంథకుడి మీద సిద్ధార్థుడి వెనుకే ఒదిగియుంగా కూర్చున్నాడు. సిద్ధార్థుడికి తానింక రక్షక కవచం వంటి వాడినన్న ఆలోచన వచ్చిందతడికి. వెంటనే సకలేంద్రియాలూ తన అదుపులోకి తెచ్చుకుని, సిద్ధార్థుని అత్యంత జాగరూకతతో కాచుకున్నాడు. సిద్ధార్థుడు చిరునవ్వు నవ్వుకున్నాడు.

## అందరూ చచ్చిపోయేవాళ్ళే

ఆ సంతోషం యెంతో సేపు నిలవలేదు. రాజ్యంలోకిరాగానే దక్షిణద్వారం గుండా వారికి మేళతాళాలతో వోక వూరేగింపు యెదురైంది. అది యే వూరేగింపో గ్రహించిన చెన్నుడు, అశ్వాన్ని మరోకవైపు మరల్చవలసిందిగా సిద్ధార్థుడ్ని కోరాడు. కానీ సిద్ధార్థుడు వినకుండా అదేమిటో తెలుసుకోగోరాడు. అది శవయాత్ర అని చెప్పాడు చెన్నుడు. "శవమంటే యేమిటి?" అన్నాడు సిద్ధార్థుడు . యీ సంభాషణని పొడిగించడం చెన్నుడికి యిష్టం లేదు. సిద్ధార్థుడు సున్నితమైన మనస్సు కలవాడని అతడికి కూడా తెలుసు. "మీరుండండి దొరా! నేను వెళ్ళి  కనుక్కుని వస్తాను' ' అని చెప్పి చెన్నుడు ఆ వూరేగింపు దగ్గరికి వెళ్ళి.. విషయాలు కనుక్కుంటున్నాడు. అతడు వూహించనట్టుగా, ఆవూరేగింపు సరిగ్గా సిద్ధార్థుడి ముందరనుంచే వెళ్ళింది.

చెన్నుడు సిద్ధార్థుని చేరే సరికి సిద్ధార్థుని ముఖంలో 'యేవో విషాదగంభీరఛాయలు.
సిద్ధార్థుడడిగాడు." ఆ పడుకున్నది మనిషిలాగానే వున్నాడు. అతడి మెడలో దండలు వేశారు..
అతడెవరు? యెక్కడికి తీసుకెడుతున్నారు? వెనకాల వాళ్ళెవరూ యెందుకలా యేడుస్తున్నారు?"

"దొరా! అతడొక రోగి, పైగా ముసలితనం. చచ్చిపోయాడు. అతడికింక చలనం వుండదు. అతడ్ని వూరి బయటకు తీసుకువెళ్ళి మంటల్లో కాల్చేస్తారు. అతడు చనిపోయివుండటం వల్ల అతడికి బాధ తెలియదు. మంటల్లో కాలి బూడిదై పోతాడు. మనుషులు యెవరైనా అంతే... దొరా! రండి యింకెక్కడికైనా వెళ్దాము.. రోహిణీ నదీ తీరానికి వెళ్దామన్నారు కదా దొరా!" చెన్నుడు మాటమార్చాలని ప్రయత్నించాడు.

"నది వొడ్డుకి రేపు వెళ్దాములే.. యింకా చాలా పనులున్నాయి కూడా కదా! కానీ యిపుడు యేంటన్నావు చెన్నా... ఆ చనిపోయిన మనిషిని కాల్చివేస్తారా? బాధవుండదా? కాల్చకపోతే?

"దొరా! కాల్చకపోతే అతడి వళ్ళంతా కుళ్ళిపోయి, పురుగులు పట్టేస్తాయి. దుర్వాసన వచ్చేస్తుంది. అతడివల్ల యితరులకి రోగాలు అంటుకుంటాయి. కొందరు చనిపోయినవాళ్ళని భూమిలో పాతిపెడతారు. మట్టిలో కలిసింది కలిసిపోగా వుత్త యెముకల గూడు మిగుల్తుంది. కాల్చినా, పాతిపెట్టినా చచ్చిపోయిన వాళ్ళకి బాధయేమీ వుండదు."

"యేమిటి.. మనుషుల్ని- అదే అలాంటి మనుషుల్నికాల్చకపోతే పురుగులు పట్టాయా? యెవరి శరీరమైనా అంతేనా చెన్నా?

"అంతే దొరా! కాల్చితే బూడిద మిగుల్తుంది. పాతిపెడితే బొమికలు మిగుల్తాయి. దొరా మనమింకేచోటకైనా వెళ్దాం దొరా! యింకే రోజుకి వెళ్ళిపోదాం.." చెన్నుడు తొందరపడ్డాడు.

"లేదు.. మనం ఆ వూరేగింపు వెనకే వెళ్దాం."

"దొరా! దొరా! వద్దు... నా మాట వినండి. నేను మీ సేవకుడ్ని. ఆ దృశ్యాలు మీరు తట్టుకోలేరు దొరా నెమ్మదిగా అన్నీ చూద్దాం. నా మాట వినండి... " చెన్నుడు సిద్ధార్థుడ్ని చేతులెత్తి వేడింపాడు. అతడి కళ్ళనిండా నీళ్ళు ధారలు కట్టాయి.

కరుణాహృదయుడు సిద్ధార్థుడు చెన్నుడి కోరికను మన్నించాడు. తనవల్ల చెన్నుడికి మాట రాకూడదు కదా! చెన్నుడు చెప్పినట్లే నది వొడ్డుకి వెళ్ళారు. యిసుక మేటల మీద విహరిస్తూ సిద్ధార్థుడు చెన్నుడ్ని అడిగాడు.

"చెన్నా! నన్ను తిప్పరాని చోట్ల తిప్పావని. రాజుగానీ, రాజ్య ముఖ్యులు గానీ నిన్ను నిందిస్తారని భయపడుతున్నావా?"

"లేదు దొరా! నాకలాంటి భయమేమీ లేదు. మిమ్మల్ని నేను తిప్పడమేమిటి దొరా.. నేనే మీ అడుగుల వెమ్మటి నడుస్తున్నాను. యిందుకు నిందలు వేయడం కాదు యెవరైనా నా ప్రాణాలు తీయబోయినా నేను భయపడను. దొరా! మీరు బాధ పడకూడదు దొరా! మీరు బాధ పడుతుంటే నేను చూడలేను దొరా! చిన్నప్పటినుండీ మిమ్మల్ని చూస్తునే వున్నాను. చక్కనైన మీముఖం యెప్పుడూ నవ్వుతూ వుండాలి దొరా! మీ ముఖంలో బాధ కనిపిస్తే నేను చూడలేను దొరా! అప్పుడు నాకు చచ్చిపోవాలనిపిస్తుంది" అన్నాడు.

"చెన్నా! నీ మనస్సు నేను మొదటే గుర్తించాను చెన్నా! యెప్పుడైతే కంథకాన్ని ప్రేమగా చూస్తూ దానికి తిండి తినిపిస్తున్నావో, నోరు లేని మూగజీవిని నీతోపాటు సమానంగా చూస్తున్నావో..

ఆనాడే నీ మనస్సు తెలుసుకోగలిగాను. చెన్నా! నా తండ్రికి నాపై యెంత ప్రేమ వుందో, అంతప్రేమా నీకూ నాపై వుంది. తేడా యేమీ లేదు. కానీ నా ముఖంలో బాధ కనిపిస్తే దానిని నువ్వు పోగొట్టేటట్లు వుండాలిగానీ చచ్చిపోవాలనిపిస్తుందంటావేమిటి? చచ్చిపోవడమంటే యిదుగో యిందాక అలా వెళ్ళిందీ శవం.. అలాగేనా? అలాగే నీకు కూడా పూలదండలు వేసెయ్యమంటావా?"

సిద్ధార్థుడి చతురోక్తికి చెన్నుడు, 'అంతోటదృష్టమా బాబా!' అనుకుంటూ సిగ్గుతో తలవంచుకుని నవ్వుకున్నాడు. సిద్ధార్థుడు మరల తన మాటలు కొనసాగిస్తూ-

"చెన్నా! యీ ప్రపంచం గురించి నాకు పెద్దగా తెలియదు. పుట్టుకనుంచి యిప్పటి వరకూ యించుమించు రాజసౌధాల మధ్యనే నా జీవితం గడిచిపోయింది. పంజరంలోనే పుట్టిన పక్షికి యెంత జ్ఞానముంటుందో, నాకున్నదీ అటువంటి పరిమితమైన జ్ఞానమే. ప్రపంచంలో వుండే సుఖాలు తప్ప, బాధలు అనేవి తెలియకుండా మా నాన్న నన్ను పెంచారు. అయినా తోటి జీవుల, మనుష్యుల బాధలు నాకు తెలుస్తూనే వున్నాయి. వాటినెలా పోగొట్టాలా? అనే నేనెప్పుడూ ఆలోచిస్తూవుంటాను. ముసలితనం రావడం, చనిపోవడం... యిలాటి పదాలు వినడమే కానీ, వాటి గురించి కూడా నాకు పెద్దన్నా, యిప్పుడూ ప్రత్యక్షంగా చూసిన తరువాత తెలియలేదు. అందరూ ముసలివాళ్ళయిపోయి చచ్చిపోయేటట్లయితే... యీ అనిత్యశరీరం కోసమేనా, యీ పొట్టబతుకు కోసమేనా అందరూ యింత పరితపించిపోయేది? తోటి జీవుల, మనుష్యుల బాధలను పోగొట్టడంలో శ్రద్ధ చూపిస్తే జన్మకి చరితార్థత అయినా సిద్ధిస్తుంది కదా! చెన్నా! యీ ప్రపంచం గురించి యింకా యెంతెంతో తెలుసుకోవాలి... చెన్నా! నాతో వస్తావా?"

"దొరా! నిన్ను వెన్నంటే వుంటా దొరా! నా అజ్ఞానానికి క్షమించు దొరా!"

"చెన్నా! నేను ఒంటరిగా కూడా వెళ్ళగలను. కానీ యెందుకో చెన్నా, నీలో ఆప్యాయత, ప్రేమ, స్నేహం చూశాను. మాట కలుస్తేనే కదా మనసు తెలిసేదీ? చెన్నా! నువ్వెప్పుడూ నాకు భయపడకూడదు. నువ్వు నాకు తోడునీడగావుండే మంచి స్నేహితుడవు కావాలి."

సిద్ధార్థుని ఆ మాటలకి చెన్నుడికి కళ్ళమ్మట గిర్రున నీళ్ళు తిరిగాయి. "దొరా! నన్ను అందల మెక్కించకండి దొరా! నేను మీకు దాసుణ్ణి. నా సర్వస్వం మీకు అర్పిస్తున్నాను. నన్ను అనుమానించకండి దొరా!" అంటూ సిద్ధార్థుడి పాదాలపైన పడి గొల్లున యేడ్చేశాడు.

సిద్ధార్థుడు అతణ్ణి ప్రేమగా లేవనెత్తుతూ, "చెన్నా! యీ ప్రపంచంలో యెవరికీ యెవరూ దాసులు కారు... స్వార్థమూ, కపటమూ యెరుగని స్నేహం కన్నా గొప్ప గుణం యీ ప్రపంచంలో లేదు.. జీవితం సర్వస్వం స్నేహమూ, ప్రేమా అయినప్పుడు, జీవితానికింకేదో ప్రత్యేకమైన గుర్తింపు యెందుకు? చెన్నా! సముద్రఅగాధాలలో దొరికే ఆణిముత్యంలాంటి వాడివి నువ్వు.. నాకు మిత్రుడిగా లభ్యమయ్యావు.. నన్ను ప్రేమించే వారెవరిప్రేమకీ నీ ప్రేమ తీసిపోదు.. చెన్నా! నా మనస్సు నీకు అర్థమయింది కదూ! రోగాలురావడం, ముసలివాళ్ళు అవడం, చనిపోవడం యివన్నీ అందరికీ జరిగేవే అయినప్పుడు, వున్న కాలాన్ని మంచిగా, పదిమందికీ వుపయోగపడేటట్లుగా బతకాల్సిందిపోయి, పదిమందికీ వెలుగవాల్సింది పోయి ఆదర్శమవాల్సింది పోయి, కేవలం సుఖం పడటం కోసం వెంపర్లాడటం, అందుకోసం నీచమైన బతుకులు అసత్యపు బతుకులు బతకడం, అసూయా ద్వేషాలతో జీవితాన్ని అంధకారం చేసుకోవడం... యేమిటీ యిదేనా జీవనపద్ధతి? యిది కాదు, చెన్నా! యెన్ని యిబ్బందులెదురైనా జీవితానికి ఒక మంచి పద్ధతి వుండాలి. యెవరికీ బాధ,

హాని కల్గించని బతుకు బతకాలి. చెన్నా! మనుష్యుల మధ్య చెడు భావాలు, ద్వేషాలు నాకు చాలా బాధ కల్గిస్తాయి. యీ ప్రపంచానికి నేనేమైనా చెప్పేముందు, నాకూ యీ ప్రపంచం బాగా అర్థమైవుండాలి కదా! అందుకే చెన్నా.. నువ్వూ నాతో వస్తావా?"

చెన్నుడు తలవూపాడు. సిద్ధార్థుని చేతులు తన చేతుల్లోకి తీసుకుని, ఆ చేతుల్ని తన శిరసు మీద పెట్టుకుని, 'మీ ఆన ప్రభూ! మీ మాట జవదాటను' అన్నాడు.

సిద్ధార్థుడు చిరునవ్వు నవ్వాడు. "సరేలే ! చెన్నా! మనం యిప్పుడెక్కడికి వెళ్దాము?"

"దొరా! యీ రోజుకి మనమింక వెనక్కి వెళ్ళిపోదాము. దొరా! మీరు యిలాగే వస్తే ప్రజలు మిమ్మల్ని గుర్తుపట్టి మర్యాదలు చేస్తారు. పెద్దని కప్పిపుచ్చి, మంచిమాటలే మాట్లాడుతారు. అందువల్ల విజావిదాలు మనకి పూర్తిగా తెలియవు. అందువల్ల.. దొరా! నాదొక విన్నపం... మనం రోజూ మారువేషాల్లో తిరుగుదాం. యిప్పుడెక్కడ యే వేషం వెయ్యవలసి వుంటే ఆ వేషం వేద్దాం. యిందుకు కావలసిన వస్త్రాలు నేను చూసుకుంటాను. కానీ సున్నితమైన పట్టువస్త్రాలు ధరించే మీరు వొకోసారి శరీరానికి బాధ కల్గించే ముతక బట్టలు వేసుకోవాల్సి రావచ్చు. వంటి మీద సరైన వస్త్రమే లేకుండా యెండల్లో తిరగవలసి రావచ్చు.. దొరా! అది మీకు కష్టం... అట్లా మిమ్మల్ని చూడటం నాకూ కష్టం. యేం చెయ్యమంటావు దొరా! అటువంటి చోట్లకు వెళ్ళడం మానేద్దామా?"

'యే కష్టమూ లేదు. యిష్టం వుంటే కష్టం వుండదు. ప్రపంచాన్ని గురించి తెలుసుకోవాలన్న గొప్ప సంగతి ముందు యిటువంటి కష్టాలెంతమాత్రం? సరే! రేపు తెల్లవారు ఝాము నుంచే మనం బయలుదేరుదాం. సత్యాన్వేషణని దిన చర్యగా చేసుకుందాం. ప్రపంచమంతా కలయ తిరుగుదాం.'

## సత్యాన్వేషణ మొదలైంది

అది లగాయతు సిద్ధార్థుడు చెన్నుణ్ణి వెంటబెట్టుకుని సంవత్సరాల తరబడి అనేక ప్రచ్ఛన్న వేషాలలో రాజ్యంలో చుట్టుప్రక్కల రాజ్యాలలో సైతం మూలమూలలా తిరుగుతూ, మనుష్యుల్ని, వారి జీవన పద్ధతుల్ని, వైవిధ్యాల్ని పరిశీలించసాగాడు. తన పరిశీలనలో ఆడవార్ని వుపేక్షించలేదు. రాజకుటుంబీకుల్ని, పల్లకీలుమోసే నిరుపేదల్ని కూడా వొకేరీతిగా పరిశీలించాడు, మాట్లాడాడు. ప్రశ్నించాడు. వారితో మెలిగాడు. వారు తినేతిండే తిన్నాడు. వారి గ్రామీణయాసల్లో కొద్దిపాటి ప్రవేశంకూడా కల్పించుకున్నాడు. యిలా తన జ్ఞానాన్ని చక్కగా మెరుగు పర్చుకున్నాడు. లయంతో కూడిన వారి భాషని చక్కగా ఆకళింపు చేసుకున్నాడు.

రాజకుటుంబీకులు, వ్యాపారస్తులు, భూ అధిపతులు, మండలాధీశులు, ధనవంతులు యెటువంటి కాయకష్టమూ చేయకుండా అందలాలెక్కి విహరిస్తూ వుండటం చూశాడు. వారిలో చాలామంది కించిత్ జాలికూడా లేకుండా దుర్మార్గపు, ద్రోహపు బతుకులు బతకడం చూశాడు. నిరుపేదలు వారి పల్లకీలు మోస్తూ, వారి వ్యాపారాలలో, అంగళ్ళలో, భూములలో విశ్రాంతి అన్నది లేకుండా వెట్టిచాకిరీ చేస్తూ వుండటం, జానెడు కడుపునింపుకోవడానికి వాళ్ళు నానా అగచాట్లు పడుతూ వుండటం చూశాడు. కూలిపని చేసికూడా వాళ్ళు కూలికోసం దీనంగా దేహీమని చేయిచాచవలసి రావడం, పడిగాపులుకాయడం చూశాడు. వర్తకులు తమ వస్తువులు అమ్ముడు పోవడానికి చేసే యుక్తులు, కుయుక్తులు చూశాడు. ప్రచారాలు విన్నాడు. ప్రజలలో సుఖాలపట్ల, వస్తువులపట్ల వ్యామోహం, అందుకోసం వారు మనుష్య ధర్మాన్నే మరిచిపోవడం, నిత్యం కలహాలతో,

ద్వేషాలతో బతకడం చూశాడు. వివిధవృత్తుల వాళ్ళని చూశాడు. కలిశాడు ఆయా వృత్తిపని చేయించుకోవడానికో, లేక విషయాలు తెలుసుకోవడానికి వచ్చిన బాటసారులుగానో వారితో మాట్లాడాడు. అనేక విషయాలు కూలంకషంగా తెలుసుకున్నాడు. కొంతమందిని, వారాల తరబడి కలుసుకుంటూ వుండేవాడు. వారి ఆదరాభిమానాలు పొందేవాడు. నిజాలు తెలుసుకుంటున్న కొద్దీ యింకెన్నో విషయాలు తెలుసుకోవాలనిపించేదతడికి. అతడు రాజకుమారుడన్న సంగతి యెవరికీ తెలియకుండా చెప్పుడు చాలా జాగ్రత్తలు తీసుకొనేవాడు. అలాకాచుకునేవాడు.

నేతపనివాళ్ళ మగ్గాల చప్పుళ్ళు, బట్టశుభ్రంగా అలినతరువాత రంగు రంగు అద్దకాలు వెయ్యడం, పిండి పనివాళ్ళ తిరుగళ్ళమోత, కుండలు చేయువాని కుమ్మరిసారె, యినుమును కాల్చి సాగదీసే కమ్మరవాని సమ్మెటపోట్లు, కంచరి సుత్తిరొదలు, బంగారు ఆభరణాలు చేసే స్వర్ణకారుని శ్రద్ధ, చేపలుపట్టే జాలరుల వలల అల్లిక, యిలా యెన్నో వృత్తిపనులు చేసేవారి జీవితశైలి స్వయంగా తెలుసుకున్నాడు. ఆయా పనిముట్ల వివరాలు పేర్లు వుపయోగాలు కూడా తెలుసుకున్నాడు.

దొమ్మరి ఆటలు చూశాడు. దుర్గంధాన్ని వెదజల్లే అంగళ్ళు చూశాడు. పుట్టగొడుగుల్లాంటి చిన్న చిన్న పూరిళ్ళు చూశాడు. యేటి వొడ్డున చిన్న పిల్లలు కట్టుకునే పిచ్చుక గూళ్ళుకూడ చూశాడు. యెంతో కష్టపడి కట్టుకున్న గూళ్ళను వాళ్ళు చిటికలో కాళ్ళతో తొక్కిపాడుచేసి, ఆనందంతో గెంతడం కూడా చూశాడు. వీధికుక్కల్ని, పెంటలమీద తిరుగాడే పందుల్ని కూడా పరిశీలించాడు. ఆకలితో అలమటించిపోతున్న పేదవాళ్ళని, దిక్కులేని బిచ్చగాళ్ళని యెంతమందినో చూశాడు.

కల్లు, సారాయిఅంగళ్ళు చూశాడు. అక్కడ తాగితందనాలాడుతున్న తాగుబోతుల్ని చూశాడు. రకరకాల జూదాలు చూశాడు. జూదాలలో డబ్బు పోగొట్టుకుని యేడుస్తూ పోతున్న వాళ్ళని చూశాడు. తాగుబోతులవల్ల నాశనమైపోతున్న కుటుంబాలను చూశాడు. బాణాకర్రలు, ముష్టియుద్ధాల పోటీలు చూశాడు. పాచికల ఆటలు చూశాడు. గోటీబిళ్ళలు చూశాడు. అంగవిహీనులు పడే బాధకు తోడు వారి చుట్టూ వున్న మనుష్యులు పెట్టే అల్లరికి చెప్పుకోలేని బాధపడుతున్న వారి దీనమైన ముఖాల్ని చూశాడు. వేశ్యాగృహాలలో ఆనందంపేరిట ఆటబొమ్మల్లాగా మగ్గిపోతున్న ఆడపిల్లలనెందర్నో చూశాడు. గుండెకుదేలై పోయాడు.

జ్యోతిష్యాలు చెప్పి ప్రజల్ని భయపెట్టేవాళ్ళని చూశాడు. గృహవాస్తు పేరుతో యింటి భాగాల్ని పడగొట్టించడం, కొత్తవికట్టించడం, యెండావానల గురించీ, పిడుగుపాట్లగురించీ శకునాలు, భవిష్యత్తులు చెప్పి అమాయకుల్ని దోచుకునే తెలివైనవాళ్ళని చూశాడు. పుట్టుకనీ, పెళ్ళినీ, చావునీకూడా కర్మకాండలతో తమగుప్పెట్లో పెట్టుకుని, మనుష్యుల బుర్రలుపాడుచేస్తూ, తమ బొజ్జలు పెంచుకుంటున్న వాళ్ళనికూడా చూశాడు. శ్మశానాల్లో పిశాచాల్నిగొయ్యితీసి పాతిపెడతామనే వాళ్ళను, దయ్యాలను భూస్థాపితం చేస్తామనే వాళ్ళను, పెళ్ళిముహూర్తాలు పెడతామంటూ పెళ్ళికూతుళ్ళను చూడటానికి వెళ్ళడానికికూడా ముహూర్తాలు పెట్టేవాళ్ళనీ, అంజనాలువేసి డబ్బులు దండుకునే వాళ్ళనీ, శవదహనానికికూడా మంత్రాలు చదివి డబ్బులు పిండే వాళ్ళనీ స్వర్గనరకాల నమ్మకాల్ని తమకు అనువుగా పెంచుతూ ప్రజల్ని పిరికి వాళ్ళుగా చేసేవాళ్ళను కూడా చూశాడు.

వొకనాడతడొక దేవాలయానికి వెళ్ళాడు. పరదేశం వెళ్ళిపోయిన భర్తతిరిగి రావాలనుకుంటూ వొక గృహిణి దేవుణ్ణి పూజిస్తూంది. తనకి సంతానం కావాలని కోరుకుంటూంది మరొక గృహిణి. చేసిన పాపాలు పోవాలని వొకభక్తుడు దేవుడికి ముడుపులు కడుతున్నాడు. తన వ్యాపారం బాగా

జరగాలని ఒక వ్యాపారి పురోహితునిచేత మంత్రపుష్పం చదివిస్తున్నాడు. అర్చకులు దేవునికి ప్రతినిధుల్లాగా భక్తులు తెస్తున్న ముడుపుల్ని కైంకర్యం చేస్తున్నారు. దేవుని పేరున జరుగుతున్న యీ కోరికల జాతర, మౌఢ్యం, తమ స్వార్థంకోసం పనికట్టుకుని మరీ ప్రచారం చేస్తున్న అజ్ఞానం- యువస్సీ సిద్ధార్థునికి హృదయవిదారకంగా జుగుప్సగా అనిపించాయి.

ఒకరోజున వారిద్దరూ పురమంతా ప్రచ్ఛన్న వేషంలో తిరిగితిరిగి సాయంకాలం అయ్యేసరికి రోహిణీనదీ తీరాన్ని చేరారు. ఆ నదీతీరాన, ఒక యిసుకమేటపై బాధతో లుంగలు చుట్టుకుపోతున్న ఒక రోగిని చూశారు. అతడి ఒళ్ళంతా పుళ్ళయిపోయి చీము, నెత్తురు కారుతూంది. అతడి ఒళ్ళంతా ఈగలు వాలుతున్నాయి. కుళ్ళిపోయిన ఆ పుళ్ళల్లో పురుగులు లుకలుకలాడుతున్నాయి. అతడి చుట్టూ భరించలేని దుర్వాసన.

సిద్ధార్థుడు అతడిచెంతచేరి, దీనాతిదీనంగా మూలుగుతున్న ఆ రోగితో, 'యెక్కడ నొప్పిగా వుందయ్యా చెప్పు నిమురుతాను' అంటూ ప్రేమగా అతడి ఫాల భాగాన్ని స్పృశిస్తూండగా ఆ రోగి అతడికి చేతులెత్తి దండం పెడుతూ, 'బాబూ! నొప్పి, మంటలేని చోటులేదయ్యా వంటి మీద. ప్రాణం కడగట్టుకు పోతుందయ్యా. నేనీ బాధ భరించలేకుండా వున్నాను." అంటూ ఆ రోగి కళ్ళు తేలవేశాడు. తీవ్ర వుచ్ఛ్వాసనిశ్వాసలతో అతడు దారుణ మరణబాధననుభవిస్తున్నాడు.

చెన్నుడు, సిద్ధార్థుణ్ణి మెల్లగా ప్రక్కకు తీసుకువెళ్ళి "దేవా! యిది భయంకరమైన అంటురోగం. యితడు బతకడం అసాధ్యం. యిప్పట్నుంచి రేపు వుదయంలోగా యెప్పుడో ఒకప్పుడు చచ్చిపోతాడు.. యిది అంటురోగం. అతణ్ణి స్పృశించడం మంచిదికాదు ప్రభూ!"

సిద్ధార్థుడు చిరునవ్వు నవ్వాడు. "చెన్నా! యిదేనా నువ్వు నన్నినాళ్ళూ చెప్పదలచుకున్నది? భలేవాడివి. ఆ రోగిపడే బాధముందు మనం పడే బాధ యెంత? పద- అతణ్ణి పట్టుకునేందుకు సాయం చెయ్యి" అంటూ ఆ రోగిని నెమ్మదిగా యిద్దరూ పూరిలోకి మోసుకుని తెస్తుండగా రోగి నుండి దీర్ఘమైన నిట్టూర్పు వినబడింది. యేమైందని దించిచూసేసరికి అతడు చనిపోయివున్నాడు. అతడి బంధువులను తెలుసుకుని, తీసుకువచ్చి, అతడి దహనకార్యక్రమాలను యిద్దరూ దగ్గరుండి స్వయంగా జరిపించారు.

చితిమీద ఆ రోగి దహనమైపోగా మిగిలిన బూడిదను సిద్ధార్థుడు గంభీరవిషాదంతో చూడసాగాడు. ఒక గొప్ప రాజకుమారుని, ఆ స్మశానంలో అలా చూస్తున్న చెన్నుడికి బాధతో గుండె పట్టేసినట్లయింది. సిద్ధార్థుని అతడు కంటిపాపలా చూసుకుంటూ వస్తున్నాడు. రోజురోజుకీ అతడి బాధ యెక్కువవుతూందే గానీ తగ్గడం లేదు. శ్మశానం నుంచి అందరూ వెళ్ళిపోయారు. చెన్నుడు మెల్లగా సిద్ధార్థుని చేరి, విషాదంగా కూర్చుండిపోయిన సిద్ధార్థుణ్ణి చూస్తూ, కళ్ళవెమ్మట జలాజలా నీళ్ళుకారుతుండగా, "ప్రభూ! యిక వెళ్ళిపోదామా?"

సిద్ధార్థుడు చెన్నుడి వంక చూశాడు. తనకోసం తన వెనుకే అవ్యాజమైన ప్రేమానురాగంతో తోడువుంటున్న చెన్నుణ్ణి చూడగానే సిద్ధార్థుడికి కూడా కళ్ళనీళ్ళాగలేదు. చెన్నుడు సిద్ధార్థుణ్ణి తోడ్కొని అతణ్ణి రాజభవనానికి చేర్చాడు. బరువైన గుండెలతో తలుపు వుచ్చుకున్నాడు. రాజసౌధానికి చేరుతుండగా దక్షిణాన తమ శాక్యులు కొందర్ని కోలీయులు చంపేశారని చెప్పారెవరో. గుండె ఏండుకుపోయినట్లయింది.

ఆ రాత్రి సిద్ధార్థునికి నిద్ర అన్నది పట్టలేదు. నిరంతరమూ యెడతెగని ఆలోచనలు.

పుట్టుటయేమిటి? పెరుగుట యెందుకు? గిట్టుటయేమిటి? జీవయాత్రకు చివరి గమ్యం శ్మశానమేనా?
తన మనస్సులోని బాధను తండ్రికిగానీ, పూర్ణగర్భవతిగా వున్న భార్యకుగానీ తెలియకుండా వుండడానికీ, వారికి బాధకల్గకుండా వుండడానికీ యెప్పటిలాగానే నిత్యక్రమానుసారంగా నృత్య మందిరానికి వెళ్ళాడు. అప్పటికే వేళమించిపోవడంతో గాయనీమణులూ, వాయిద్యకారిణులూ, నాట్యకత్తెలందరూ యెక్కడపడితే అక్కడ తలావొక తీరులో వొళ్ళుమరిచి వంటిమీద బట్టలు వున్నవీ లేనిదీ తెలియకుండా వికారంగా గురకలు తీస్తూ నిద్రపోతున్నారు. వారు మేల్కొని వున్నప్పుడు ఆ ప్రాంతమంతా సంగీతగానవినోదాలే. యిప్పుడో? గాఢమైన నిశ్శబ్దం. అక్కడక్కడా తీవ్ర స్థాయిలో వుచ్ఛ్వాసనిశ్వాసలు. చొంగలు కారుతున్ననోళ్ళు. సగం తెరుచుకున్న కళ్ళు. యెక్కడపడితే అక్కడ, యెలాపడితే అలా పడుకున్నారు. కొందరు పళ్ళు కొరుక్కుంటున్నారు. కొందరు నిద్రలో గొణుక్కుంటున్నారు. అలా వారిని చూడగానే అతడికి కడుపంతా దేవినట్టు అయిపోయింది. జీవి నిద్రలో వున్నప్పుడు దానికి ప్రాపంచిక బంధాలేమీ వుండవు. మనుషులు కూడా అంతే అన్నమాట. చూడబోతే మనిషి పరిస్థితి కాస్త విపరీతంగా కూడా వుంది. మేలుకువగా వున్నప్పుడు మెరుపుల్లా, బంగారు బొమ్మల్లా వుండేవాళ్ళు యిప్పుడిలా వున్నారు! కమ్మని గొంతుకలతో పాడేవాళ్ళు యెంతటి వికారమైన శబ్దాలు చేస్తున్నారు!!

యింతలో వొక నాట్యకత్తె లేచి, కాస్త వొళ్ళు విరుచుకుని, కళ్ళునులుముకుని తెప్పరిల్లి యువరాజు వచ్చినట్టుగా గమనించి, తత్తరపాటుతో లేచి, అంతలోనే పిల్లలకోడిలా అందరినీ గబగబా నిద్రలేపి నాట్య సంగీతాలను వారందరినీ అతివేగంగా సిద్ధం చేసింది.

యెదురుగా పురివిప్పిన మయూరాల్లా వారెంత చక్కగా నాట్యం చేస్తున్నా సిద్ధార్థునికి మాత్రం ఆ సాయంకాలం రోహిణీనదివొడ్డున తారసిల్లిన ఆ ముసలిరోగి విలవిలలాడుతున్న దృశ్యమే, అతడి మునుంలోని మృత్యు హేల కనిపించసాగింది. కోయిల గొంతుకలతో వారెంత బాగా పాడుతున్నా ఆ రోగి దీనమైన మూలుగులే వినిపించసాగాయి. వారెంత బాగా సంగీతవాయిద్యాలు వాయిస్తున్నా ఆ దీనుడు పుళ్ళబాధ తట్టుకోలేక గిలగిలా తన్నుకోవటమే అతడికి కళ్ళముందర కనిపించసాగింది. ఆరోగి, "ముసలితనం, రోగపియోగాల్ తప్పవన్న నిజం నీవు తెలుసుకో- కరుణతో మమతతో యివ్వనాన్ని దుష్టతనం నుండి కాపాడుకో!" అని చెప్తున్నట్లే అనిపించింది. శిథిలమైపోయిన అతడి శరీరం, చీముకారుతున్న పుళ్ళు, వణికిపోతున్న ఆ శరీరం, అతడి మూలుగులు.. అన్నీ చివరికి మృత్యువులో అంతమై పోవడం, అగ్నిలో కాలిపోయి బూడిదమిగలడం.. ఆ యెగసిన మంటలు, టపటపమండిపోతున్న కట్టెల, యెముకల శబ్దాలు.. యివే.. యివే వినిపించసాగాయి, కనిపించసాగాయి. యిక అతడు అక్కడ వుండలేక పంజరం విడిచిన పావురంలా, వధ్యశిలనుంచి కట్లుతెంచుకున్న గోమాతలా మెల్లగా తన మందిరానికి చేరుకుని కాస్త విశ్రమించబోయాడు.

అయినా అతన్ని సత్యాన్వేషణా ఆలోచనలు వదలలేదు. మణులకోసం పూసిరాడని రాతిబొగ్గు గనుల్ని తవ్వుతున్నట్లుగా సత్యం కోసం అతడి మేధ పగిలి పగిలిపోతున్నది. సముద్రకెరటాలు వున్నెత్తున లేచి కొండబండలమీదపడి పెద్ద శబ్దంతో బద్దలై చెల్లా చెదురైపోయినట్టు అతడి మస్తిష్కం బ్రద్దలైపోతున్నది. గుండెగాయాలతో తల్లడిల్లి పోతున్నాడు. నిద్ర అనేది కరవైంది. కల్లోలితమైపోయిన అతని మనస్సు అన్ని పర్వతాల మధ్య మహాసముద్రంపెట్టే ప్రళయఘోషను మించిపోతూంది..

యేమిటీ యెల్లెడలా యీ దుఃఖం? యీ బాధ? యీ హింస? యెందుకీ జీవితంలో యింత క్రౌర్యం? యీ దౌర్జన్యాలేమిటి? యీ మృత్యురోదనలేమిటి? యీ దురహంకారాలెందుకోసం? లోకం నిండా యేమిటి యీ విద్రోహవికటాట్టహాసాలు? యేమిటీ ద్వేషాలు? యెందుకీ పగలూ ప్రతీకారాలూ? వీటికైనా అంతమున్నదా? బుద్ధిజ్ఞానమూ లేని యీ వినోదాలేమిటి? యీ ధన మదమోహలోభమాత్సర్యాలేమిటి? యెల్లెడలా ప్రళయకాలమబ్బుల్లా యీ అజ్ఞానమేమిటి?

అజ్ఞానులు, జ్ఞానులు సైతం మాంసాహారసేవనంకోసం మూగజీవాలను అత్యంత దారుణంగా, కనికరం అన్నమాటలేకుండా వధించి వేస్తున్నారు. పొరుగు రాజుల్ని సంహరించి, యజ్ఞయాగాదుల్ని నిర్వహించి, రాజ్యాలకన్నింటికీ చక్రవర్తిగా అవడమే పరమార్థంగా భావించాలట... అందుకోసం సామాన్యుల్ని యుద్ధాలపేర బలిపెట్టాలిట.. యిదే క్షాత్రధర్మమట యెవరీ కర్కశధర్మాలు చెప్పేరీ? యెవరు వారు? మనిషి పుట్టుకపుట్టినవాళ్ళేనా? ప్రజలందరూ రాజుకి సోదరులూ, కన్న బిడ్డలూ కారుట.. దాసులట... దుష్టసామ్రాజ్య కాంక్ష మహారాజుల లక్షణమా? యిది మానవసహజమా లేక యేదైనా దుష్టపిశాచభావమా? యిటువంటి దుష్టత్వాలకు అతీతంగా వుండలేడా తాను? అలా తనను వుండనిస్తారా? కోలీయులతో యుద్ధం చేయకతప్పదన్న నిర్ణయాలకు అంతువుండటంలేదు. యేంచేయాలి తను? యీ రాజహర్మ్యంలో వుంటూ తాను సత్యాన్వేషణ చేయగలడా? అది సాధ్యమయేనేనా?

యెవరు యేమనుకున్నా, యేది యేమైనా అజ్ఞానం వల్ల పుట్టే ప్రతీ దుఃఖాన్నీ పరిమార్చాలనీ, ప్రపంచాన్ని స్నేహం, ప్రేమలచే స్వచ్ఛంగా సంతోషంగా కళకళలాడేటట్లు మార్చాలనీ, లోకాన్ని కళ్యాణకారకంగా సూర్యునివలె తేజోమయంగా చేయాలనీ, ఆ కార్యసాధనకేదైనా సాకమంచి మార్గం యెంచుకోవాలనీ.. అతడిలో యెన్నోభావాలు నెమ్మది నెమ్మదిగా స్థిరరూపాన్ని పొందసాగాయి. ఆ ఆలోచనలతో తనకెదురుగా వున్న యువరాజధరించే కాంచనమైన, అనువంశిక కిరీటం అతడికొక గడ్డిపోచలా కనిపించింది. "అవును... యీ రాజ్యలోభాలనే, సుఖాలనే సంకెళ్ళు వేసుకోవడంకోసం చేసే యుద్ధాలకు తాను కట్టుపడివుండలేడు. మనిషికి మనిషిమీద నమ్మకాలూ, ప్రేమలూ వుండాలిగానీ యీ అధికారాలేమిటి? యెవరికివారు ఆత్మశిక్షణ గరుపుకుంటూ నడవాలిగానీ, దుష్టత్వాన్ని పరిమారుస్తామని చెప్పి శిక్షించే హక్కు రాజ్యనేతలకు యెవరిచ్చారు? చేతనైతే అజ్ఞానమూఢత్వాలు తొలగించేందుకు, అందరూ వొక్కతాటిపై యీర్ష్యాసూయలు లేకుండా నిలచేట్టు చేసే విద్యనేర్పాలిగానీ, శిక్షిస్తామన్న భయంతో చెడ్డని యెంతవరకూ అణచివేయగలరు? యెందుకీ క్రౌర్యాలు? యెందుకీ కృపాణాలు? యెవరు చంపేసారని భయాలు? అపోహాలు?"

అతడు ఆ అర్ధరాత్రి ఆకాశంలో అందమైన చందమామనీ, వీస్తున్న చల్లని గాలుల్నీ కూడా మరిచి అటూయిటూ పచార్లు చేస్తుంటే వొక ముసలిదాసి అతని మందిరానికి సంతోషం నిండిన కళ్ళతో ముసలిఆవు తన దూడదగ్గరికి పరుగెత్తుకువచ్చినట్లుగా తన వయసును మించిన వేగవడకతోవచ్చి నిలుచుంది. ఆమె కన్నులవెమ్మట ఆనంద బాష్పాలు. సిద్ధార్థుడు ఆమె వంక యెంతో దయతో చూశాడు. ఆమె చెప్పబోయే విషయమేమిటా అని ఆలకించసాగాడు. ఆమె సంతోషపు వుద్వేగంతో నోటమాట రాక యెట్టకేలకు, "బాబూ! తమరికి మగబిడ్డ పుట్టాడు.. బాబూ! మన వంశానికీ, మన రాజ్యానికీ గొప్ప పండుగ తెచ్చాడు" అంటూ ఆమె యింకేమీ మాట్లాడలేకపోతుంటే సిద్ధార్థుడు సంతోషంగా తన మెడలోని రత్నాలహారాన్ని ఆమె మెడలో వేశాడు.

ఆమె చెప్పిన మాటలకు అతడి మనస్సంతా చిత్రాతిచిత్రమైన భావాలతో నిండిపోయింది. అంతలోనే, 'తన సత్యాన్వేషణకు అడ్డుపడే కొత్త బంధమన్నమాట యిది' అని అనిపించిందతడికి. తలవని తలంపుగా ఆ మాటని అతడు "రాహుల్" అని పైకే అనేశాడు కూడా (రాహుల్ అంటే బంధనం). ఆ పదాన్నే తాను కూడా అంటూ ఆ ముసలిదాసి రాణితో "యువరాజు యిలా అన్నారమ్మా!" అని చెప్పడానికి వచ్చినప్పటి కంటే వేగంతో రాణీవాసానికి వెళ్ళిపోయింది.

మళ్ళా ఆలోచనలు- యేమనుకుంటున్నాడు తాను? తానేం చేయాలి? మొదట శాంతిని సాధించాలి. శాంతిని సాధించే ఆ మార్గమేదో కరతలామలకంగా అవుపోసన పట్టాలి. అందరికీ చూపాలి. ఆ మార్గంలో అందరూ నడిచి, దుఃఖం అనేది పోగొట్టుకుని, సుఖ శాంతులు పొందేటట్టుగా చూడాలి. యీ అన్వేషణను తాను మొదట యేమార్గాన మొదలు పెట్టాలి? దేశంలో యెక్కడో అడవులలో శ్రమణులనేవారు తపస్సు చేస్తుంటారనీ, ఆ తపస్సు చాలా గొప్పదనీ, ఆ తపస్సులో వారు శాంతిని సాధిస్తున్నారనీ, ఆ శాంతికోసం యితరులకెవరికీ, చీమకు కూడా హాని తలపెట్టకుండా, ఒక జీవితాదర్శంతో బతుకుతున్నా[illegible] అతడు వినివున్నాడు. అటువంటి మహనీయుల బాటనే తానూ యెంచుకోవాలని నిశ్చయంగా అనుకున్నాడు.

అంతలోనే తనకు బిడ్డడు పుట్టాడన్న విషయం అతనికి జ్ఞప్తిలోనికి వచ్చింది. ఆ పసిబిడ్డను చూసి యెత్తుకుని ముద్దాడాలన్న కోరికను అపుకోలేక పోయాడు. యశోధరమందిరం కేసి ప్రయాణం సాగించాడు. తండ్రికి బిడ్డ వాంఛ యెంత సుందరం! యెంత అపురూపం?!

ఊయలలో ప్రశాంతంగా పడుకున్న కుమారుడ్ని చూడగానే అప్పటిదాకా తామవద్ద ఆవేదన అంతా మరచిపోయి, వానకి నిలువెల్లా తడిసిపోయిన చెట్టులా సంతోష పడిపోయాడు. ఆ పసిగుడ్డును కౌగలించుకుని ప్రకృతిమాతవలె యెంతో తృప్తి పడ్డాడు. ప్రశాంతతా, తృప్తీ, శాంతీ... అన్నీ ఆ పసిబిడ్డలోనే కనిపించాయతడికి. రాజభవనం అంతా గొప్ప వేడుకగా వుంది. పూలు, చందనాలూ, రంగులూ ఒకరి మీద ఒకరు చల్లుకుంటున్నారు. చూడబోతే అదంతా గొప్ప రంగుల పండగలాగా వుంది. దీపావళిలాగా వుంది. సంక్రాంతిలాగా వుంది.

యశోధర సంతోషానికీ, తృప్తికీ అంతులేదు. యీ దివ్యమైన క్షణాలు సిద్ధార్థుడి కందివ్వడం కోసమే పురుడుకి పుట్టినింటికి కూడా వెళ్ళకుండా అత్తగారి యింటిలోనే వుండిపోయిందామె. పసిబిడ్డను యెంతో ప్రేమతో గుండెలకి హత్తుకుంటున్న, ముద్దాడుతున్న సిద్ధార్థుడ్ని చూడగానే ఆమెకి సంతోషంతో కళ్ళమ్మట నీళ్ళు జలజలరాలాయి. బిడ్డపుట్టిన వెంటనే కబురు తెలియగానే సిద్ధార్థుడు "రాహుల్"?! యిదొక 'బంధనమా?' అని అన్నాడన్న మాట ఆమెకి మరీ సంతోషం కల్గించింది. నిజమే..యీ చిన్ని బిడ్డ యీ అమాయకపు తండ్రికి నిజంగా బంధనమే కావాలి. పుత్రుడ్ని యెత్తుకుంటూ తనివితీరా పుత్ర మమకారాన్ని అనుభవిస్తున్న సిద్ధార్థుడ్ని చూస్తుంటే ఆమె ఆనందానికి అవధులు లేవు. సిద్ధార్థుడుకూడా పసిబిడ్డలా కనిపించాడామెకు.

ప్రపంచాన్ని గురించి అతడు పడుతున్న బాధ, చేస్తున్న సత్యాన్వేషణ, రాజ్యంలో రాత్రనక పగలనక మారువేషాలలో తిరగడం, యివన్నీ ఆమెకు తెలుసు. యించుమించు ప్రతీరోజూ మెదడు భరించలేని ఆలోచనలతో, సత్తువలేనట్టుగా యే అర్ధరాత్రికో రాజమందిరానికి చేరే సిద్ధార్థుడికి సేవ చేయడంలో, వుపశమనవాక్యాలు చెప్పి తిరిగి కార్యోన్ముఖుడ్ని చేయడంలో ఆమె యెంతో తృప్తి ననుభవించేది. ఆమెకి సిద్ధార్థుడంటే పంచప్రాణాలు. అతడిలో విరాగాన్ని ఆమె భరించలేకపోయేది.

కానీ ప్రపంచం తెలుసుకోవాలన్న అతడి తృష్ణని అడ్డుకోవాలనిపించేది కాదామెకు. వెళ్ళినవాడు యెంత త్వరగా సౌధానికి తిరిగి చేరుకుంటాడా అనే యెంతో ఆవేదనగా, ఆరాటంగా యెదురు చూస్తుండేది. పురుటికని తప్పనిసరై వేరే మందిరానికి వచ్చినా అతడికి అన్ని సౌకర్యాలూ అమరేట్టుగా చూసిన తరువాతే ఆమె యీ మందిరానికి వచ్చింది. సిద్ధార్థుడి విషయాలు ఆమె రోజూ యెప్పటికప్పుడు తెలుసుకుంటూనే వున్నది.

యిప్పుడామెకు ఏ బెంగా లేదు. సిద్ధార్థుడికి తనతోపాటుఅవ్యాజమైన ఆనందాన్ని యిచ్చే సరికొత్త బంధవాన్ని యిచ్చిందామె. "యింక సిద్ధార్థుని మోములో యెటువంటి బాధా, ఆవేదనా తానింక చూడనేమో.. యెంత సంతోషం కలిగించే విషయం యిది?" అని ఆమె తలిచింది.

కానీ విధి వేరేవిధంగా వుందని ఆమెకు తెలియదు. సిద్ధార్థుడు యింక కొద్ది రోజుల్లోనే తనను విడిచిపెట్టి సత్యాన్వేషణకు వెళ్ళిపోతాడనీ యింక అతడితో తనకు శాశ్వతమైన దాంపత్య వియోగమేననీ ఆమెకు తెలియదు. నిజానికి సిద్ధార్థునికి కూడా స్పష్టంగా తెలియదు. పడబోయే పిడుగు సంగతి తెలియని వంటరిచెట్టు ఆమె. యెంత బాధ కల్గించే విషయం?!!

పౌత్రుడు కలిగాడని శుద్ధోదనుడు పడుతున్న ఆనందం యింతా అంతా కాదు. అంతేకాదు సిద్ధార్థుడికి పట్టాభిషేకం కూడా చేసేసి తానింక మనుమడితో సంతోషంగా కాలంగడపాలని కూడా శుద్ధోదనుడు నిశ్చయించుకున్నాడు. మహా ప్రముఖుల్ని పిలిపించి తన వుద్దేశాన్ని తెలిపాడు. వారెంతో ఆనందించడమేకాకుండా మంచిముహూర్తం కోసం జ్యోతిష్కులకు కబురుపెట్టారు. వారం రోజుల్లోనే మంచి ముహూర్తం వుంది. కానీ అంత తక్కువ సమయంలో అన్ని భారీ యేర్పాట్లు, వర్తమానాలు అన్నీ పూర్తికాగలవా? శుద్ధోదనుడు మాత్రం పట్టాభిషేకాన్ని పూర్తి చేయాలనే నిశ్చయించాడు. అందుకై యేర్పాట్లకు కూడా ఆజ్ఞలు జారీ చేశాడు.

---

యేడురోజులపాటు పసిబిడ్డ ఆలనాపాలనలతో తృప్తిగా గడిపేస్తున్న సిద్ధార్థుడు ఆ రోజున కూడా ఆ పసిబాలుడ్ని గుండెల మీద పడుకోబెట్టుకుని రాజభవనం పైఅంతస్తువసారాలో చల్లగాలికి తిప్పుతున్నాడు. మరునాడే అతడి పట్టాభిషేకం. సిద్ధార్థుడికి యెంతమాత్రమూ యిష్టం లేని విషయం. తప్పించుకునే మార్గం కూడా అతడికి కనిపించడం లేదు. యేం చేయాలో తెలియక పసిబిడ్డతో ఆటలాడుతూ మనస్సుని ఆలోచనలనుంచి మరల్చుకుంటున్నాడు.

పిల్లవాడ్ని యెత్తుకు తిప్పుతుంటే రాజభవనంపై నుంచి, అతిదూరంగా కాషాయరంగుబట్టలతో వొక నిండైన ఆకారం కనిపించింది. సంధ్యాసూర్యుడిలా ప్రకాశిస్తున్న ఆ ఆకారాన్ని మరింతగా పరికించి చూశాడు సిద్ధార్థుడు. శ్రమణుల గురించి వినివున్న సిద్ధార్థుడికి ఆ వ్యక్తి శ్రమణుడేమోనన్న ఆలోచనవచ్చి వళ్ళంతా సంతోషభరితమైంది. ఆ సాధువు ప్రశాంతంగా శాంతిదూతలా నెమ్మదిగా ఆ బాటలో వొక్కొక్క యింటి ముందు ఆగుతూ వెళుతున్నాడు. కొందరు గృహస్థులు అతడి భిక్షపాత్రలో యేవో వేస్తున్నారు.

సిద్ధార్థుడు అతడెవరో తెలుసుకోవాలన్న ఆతృతని అణచుకోలేకపోయాడు. వెంటనే బిడ్డని యశోధర చేతికి యిచ్చి తాను వడివడిగా క్రిందకి దిగి చెన్నుడికి కూడా కబురు పంపించకుండా అశ్వాన్నధిరోహించి, క్షణాలలో నగరద్వారందాటి పురవీధిలోకి ప్రవేశించి, ఆ కాషాయాంబరధారి

సమీపానికి వెళ్ళి అతడికి శిరసువంచి నమస్కరించాడు. అతడు ఆశీర్వదించాక వినయంగా అడిగాడు. "స్వామీ యెవరుమీరు? యెందుకిలా భిక్షాటన చేస్తున్నారు? నేను శ్రమణుల గురించి విని వున్నాను. స్వామీ తమరు శ్రమణులా?"

అతడు నిర్వికారంగా సిద్ధార్థునితో, "నేను శ్రమణుడినే. యీ ప్రపంచం అంతా దుఃఖంతో కూరుకుని వుంది. ఆ దుఃఖాన్ని నాశనం చేయడానికి, సర్వం త్యజించి, సత్యాన్వేషణకుడనై, పరివ్రాజకుడనై, శ్రమణుడనై, భిక్షువునై యిలా సంచారజీవనం గడుపుతున్నాను"

ఆ మాటలకి సిద్ధార్థుడు అంతకుమునుపెన్నడూ అనుభవించని గొప్ప సంచలనా స్పందనలలో మునిగిపోయాడు. అతడి వొడలంతా వుప్పెన సముద్రంలా హోరెత్తింది. వుప్పొంగింది. యెగసిపడింది. అతడు కోరుకుంటున్నది కూడా దుఃఖనిర్మూలనే. ఆ భిక్షువు మాటలు అమృత సుధల్లా అనిపించాయతడికి. ఆ క్షణమే, తాను కోరుకున్న శాంతిని సాధించడానికీ, దుఃఖాన్ని రూపుమాపడానికీ, తెలుసుకున్న సత్యాన్ని బోధించడానికీ యీ శ్రమణ మార్గమే అత్యున్నతమైనదన్న మనోనిశ్చయం కలిగిందతడికి. ఆ నిర్ణయానికి కట్టుబడిపోయి సమయం వృధాగాకుండా తానుకూడా వెంటనే పరివ్రాజకుడనైపోవాలన్న కాంక్ష కూడా బలపడి పోయింది.

ఆ శ్రమణున్ని అనుసరించుతూనే, అతనిద్వారా శ్రమణుల గురించీ, వారి తపస్సు గురించీ, వారి జీవన శైలిగురించీ యెన్నో సంగతులు తెలుసుకున్నాడు. కోసల దేశంలోని వైశాలీ నగరంలో ఆళారకాలాముడు అన్న గొప్ప శ్రమణ మహర్షి వున్నాడన్న సంగతి కూడా తెలుసుకున్నాడు. ఆ రాత్రి బాగా పొద్దుపోయేవరకూ ఆ శ్రమణుడివెంటనే వుండిపోయాడు. కంథకాశ్వం అతడి వెన్నంటే వస్తోంది. అక్కడ రాజభవనం దగ్గర కంథకాశ్వం కనబడక చెన్నుడు చాలా కంగారు పడ్డాడు. సిద్ధార్థుడు కంథకాశ్వాన్నధిరోహించి రాజ్యంలోకి వెళ్ళాడన్న సంగతి తెలుసుకుని, వూపిరి బిగబట్టుకుని అతడు కూడా రాజ్యంలోకి పరుగులు పెట్టి ఎవరికి సిద్ధార్థుడెక్కడ వున్నదీ తెలుసుకుని, హమ్మయ్య అని నిట్టూర్చి, కంథకాన్ని తనదగ్గరకి చేర్చుకుని సిద్ధార్థుడి కోసం వేచి చూస్తూ వుండసాగాడు.

సిద్ధార్థుడికి వేమీ తెలియవు. ఆ శ్రమణుడి దగ్గర శెలవు పుచ్చుకుని వెనుకకు వచ్చేసరికి, కంథకాశ్వాన్ని తీసుకుని, తనకోసం యెదురు చూస్తున్న చెన్నుడు కనిపించాడు. చెన్నుడ్ని చూడగానే అతడికెంతో సంతోషమైంది. అంత నమ్మకమైన, ఉత్తమయిన స్నేహితుడు లభించినాడని అతడికెంతో తృప్తి కలిగింది. కానీ.. యీ రాత్రే కదా చివరి రాత్రి.. తానింక పరివ్రాజకుడనై, సర్వం విడిచిపెట్టి వెళ్ళిపోతున్నాను కదా..., యీ సంగతి యితడికిలా చెప్పగలనో కదా! అని అతడి గుండె మూల్గింది. అయినా చెన్నుడివంక కృతజ్ఞతతో, ప్రేమతో చూస్తూ, అతని భుజం మీద చేయివేసి.

"చెన్నా! యీ రోజు రెండవ ఝామునకే నా ప్రయాణం. పరివ్రాజకులు ధరించేటటువంటి కాషాయవస్త్రాలు తీసుకునిరా! రాజభవనందగ్గరే సిద్ధంగా వుండు.." అని అశ్వాన్నధిరోహించి, వెనుక కూర్చోవలసిందిగా చెన్నుడికి చేయి అందించాడు.

సిద్ధార్థుడి వెనకే కూర్చున్న చెన్నుడికి మనసులో మనసులేదు. సిద్ధార్థుడూ అతడూ కలిసే యించుమించు తొమ్మిది సంవత్సరాలనుంచీ ప్రయాణాలు చేస్తున్నారు. రాజ్యమంతా తిరుగుతున్నారు. కానీ యీ రోజున అతడు తనని కలుపుకోకుండా యీ రెండో ఝామునకే 'తన' ప్రయాణం అని స్పష్టంగా చెప్పాడు. దుస్తులు తెమ్మన్నప్పుడు కూడా 'తనవొక్కడికే,' అన్నట్టుగా సూచిస్తున్నాడు.

చెన్నుడి మనస్సు చిన్నబోయింది. అతడి గొంతు మూగపోయింది. కళ్ళమ్మట గిర్రున నీళ్ళు తిరిగాయి. సిద్ధార్థుడి వెనుక భుజంపై తలవాల్చి.. "తప్పయిపోయింది దొరా నన్ను క్షమించు.. కంథకాశ్వం దగ్గరకి నేను రావడం ఆలస్యమైంది.." యింకేం మాట్లాడటానికీ అతడి గొంతు గాద్గదికమైంది. రాజభవనం దగ్గరపడుతూంది.

సిద్ధార్థుడిగుండె కూడా బరువుగానే వుంది. అయినా చిరునవ్వుతో మనస్సుని తేలిక పరుచుకుంటూ, తన వొక చేతిని వెనుక ఆన్చిన చెన్నుడి తలపై వేస్తూ... "చెన్నా! నీ తప్పేమీ లేదు.. నీకన్నా యెవరికి చెప్పుకోగలను? నేనీరోజు రాత్రికే యిల్లు విడిచి వెళ్ళిపోతున్నాను. పరివ్రాజకుడ్నవుతున్నాను. నేను చెప్పినవి జ్ఞాపకం వున్నాంకదా! రాత్రి రెండో ఝాముకల్లా సిద్ధంగా వుండు" అని చెప్పి నెమ్మదిగా అశ్వాన్ని దిగి సౌధంలోనికి వెళ్ళిపోయాడు.

చెన్నుడేదో విపత్తు మీదపడినట్టుగా నిశ్చేష్టుడైపోయాడు. రెండవసారి కూడా సిద్ధార్థుడు తనని కలుపుకోలేదన్నబాధ అతడి గుండెపిండివేయసాగింది. అయినా అతడు చెప్పింది చేయుడానికి మౌనంగా సిద్ధం కాసాగాడు. గుండె బరువై పోతూందతడికి.

## నాన్నగారూ! నన్ను ఆశీర్వదించండి

రాజసౌధంలోపలికి వెళ్ళివెళ్ళగానే సిద్ధార్థుడు తండ్రి మందిరం వైపుకు వెళ్ళాడు. శుద్ధోదనుడు సిద్ధార్థునికి పట్టాభిషేక మహోత్సవ పనులలో తలమునకలై అప్పుడే కొద్ది విశ్రాంతిలో వున్నాడు. సిద్ధార్థుడు తండ్రికి నమస్కరించి, 'నాన్నగారూ నన్ను ఆశీర్వదించండి' అంటూ ఆయన పాదాలకుకూడా నమస్కారం చేశాడు.

శుద్ధోదనుడు యెంతో తబ్బిబ్బయిపోతూ, సిద్ధార్థుణ్ని లేవనెత్తి "యేం కావాలి నాన్నా?" అని ప్రేమగా అడిగాడు.

"నాన్నగారూ! మీకు కష్టం కల్గిస్తున్నాను"

"నీకోసం యే కష్టమైనా భరిస్తాను బాబూ! యేమిటా కష్టం?" చెప్పూ?"

"నాన్నా! నన్ను క్షమించండి. విధిలేని పరిస్థితుల్లో యీ నిర్ణయం తీసుకోవలసి వచ్చింది."

"యేమిటి నాన్నా ఆ నిర్ణయం. చెప్పు? ఆడియమెందుకు?"

"నాన్నగారూ! నేను యీ రాత్రికే యిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోతున్నాను. పరివ్రాజకుడ్నయిపోతున్నాను" ఆ మాటకు శుద్ధోదనుడికి గుండె ఆగినంత పనైంది.

"యేమిటీ నాయనా అంటున్నావు?" నోరు తడారిపోతూ అన్నాడాయన

"పరివ్రాజకుడ్నయిపోతున్నాను నాన్నా"

"నిజమేనా?" గొంతు కూడదీసుకుని అడిగాడు శుద్ధోదనుడు. పిడుగుపాటులా వుందామాట. అంతరాంతరాల్లో యిది నిజంకాదనిపించిందతడికి.

"నిజమే!"

"నిజం కాదని చెప్పు బాబూ!"

"నిజమే నాన్నా!"

"రేపే నీ పట్టాభిషేకం.. ఆ సంగతి తెలుసు కదూ!" యేమిటి నాయనా యీ విపత్తు... యేం చెయ్యాలి మేము? శుద్ధోదనుడు వణికిపోతున్నాడు...

"ఆ సంగతి తెలుసు.. రాజ్యపాలనపై యెటువంటి యిచ్ఛా నాకు లేదు. నేను తీసుకున్నది స్థిరమైన నిర్ణయమే నాన్నా!" సిద్ధార్థుడన్నాడు నిశ్చయంగా.

కుమారుడు తీసుకున్నది స్థిరమైన నిర్ణయమే అని శుద్ధోదనుడికి అర్థమైపోయింది. అతడి గుండెగుభేలు మంటూంది. పిడుగులు పడుతున్నట్టు వుంది. యిప్పటిదాకా అతడెంతో ఆనందంగా వున్నాడు. కానీ యిప్పుడు? తన గారాబు కుమారుడు. తాను ప్రపంచంకంటే అత్యధికంగా ప్రేమించే తన కన్నకొడుకు యిల్లు విడిచి వెళ్ళిపోతున్నాడట.. మరింకెప్పుడూ తనకి కనబడడట.. యిలాంటి కష్టం యే తండ్రికయినా రావచ్చా? తన చేతుల్లో చనిపోవలసిన్న తండ్రి బతికి వుండగానే.. కొడుకు యిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోవడం న్యాయమేనా? యిల్లా మోసం చేసి వెళ్ళిపోతాడట. పరివ్రాజకుడైపోతాడట. శుద్ధోదనుడికి పిచ్చెత్తి పోతున్నట్టుగా వుంది.. నోటమాట రావడం లేదు.. కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగిపోతున్నాయి. గొంతూ, శరీరమూ కంపించి పోతున్నాయి. అతడు సిద్ధార్థుని భుజాలు పట్టుకుని గట్టిగా నొక్కేస్తూ, దీనంగా తల్లి దూరమైపోతున్న పసిబిడ్డలాగా, ఆక్రోశంతో

"నాయనా! అలాంటి మాటనకురా! యిదంతా నిజంకాదనీ, అబద్ధమనీ చెప్పరా! నువ్వెళ్ళిపోతే మేం అంతా యెలా బతికుండాలి? చెప్పు. యిదంతా అబద్ధమని చెప్పు.. నువ్వు వెళ్ళడానికి యెంతమాత్రమూ వీల్లేదు.." అన్నాడు శుద్ధోదనుడు, కూలిపోతున్న చెట్టులాగా వూగిపోతూ.

సిద్ధార్థుడు, తన యెడబాటు వూహకే తండ్రి యెంతగా తల్లడిల్లిపోతున్నాడో చూశాడు. అతడికి తండ్రిని బాధపెట్టాలంటే బాధగానే వుంది. కానీ.. యిది వినా అతడికి యింకో మార్గం లేదు. తండ్రి చేతులు పట్టుకుంటూ నెమ్మదిగా, దృఢంగా అడిగాడు.

"నాన్నగారూ! రోహిణీనది నీటికోసం కోలీయులతో యుద్ధం చేయవలసి వుంటే అందుకు నేను వొప్పుకుని వుంటే నన్ను పంపివుండేవారు కదూ! ఆశీర్వదించి వుండేవారు కదూ!"

"నిజమే. అందులో సందేహమేముంది?" అన్నాడు శుద్ధోదనుడు.

"నేనా యుద్ధంలో చనిపోయివుంటే యేం చేసేవారు నాన్నా?" సిద్ధార్థుడు సూటిగా ప్రశ్నించాడు? ఆ ప్రశ్నకు శుద్ధోదనుడికి నోట మాట రాలేదు. నెమ్మదిగా అన్నాడు.

"నాయనా? యెందుకు నాయనా అటువంటి మాటల్తో నన్ను బాధపెడతావు? అదీ యిదీ వొకటి అవుతుందా? యిప్పుడిట్లాంటి సందర్భంలో.. యిది నీకు అన్యాయంగా అనిపించడం లేదూ?

"అదీ యిదీ వొకటి కాకపోయినా యెడబాటును మీరు అంగీకరించినట్టే కదా! యిప్పుడు అంతకంటే యెంతో మేలైన యెడబాటు యిది. మీకుమారుడు జ్ఞానసాధనకోసం, సత్యాన్వేషణకోసం పరివ్రాజకుడవుతున్నాడు.. అతడు గతించడంలేదు.. నా నిర్ణయాన్ని కాదనకండి. నేనింకా పట్టాభిషిక్తుణ్ణి కాలేదు. అందువల్ల నా అభిమతం న్యాయమే! నాన్నగారూ కాదనకండి".

"నాయనా! నువ్వలా అంటే నేను కూడా నామాట మీద స్థిరంగా వుండక తప్పదు. నీ నిర్ణయాన్ని నేను యెంత మాత్రమూ అంగీకరించలేను. ససేమిరా అంగీకరించలేను. యేమైపోవాలి మేమంతా? నీ భార్య బిడ్డలేమవ్వాలి? మేమేమవ్వాలి? నీ మీదే యిన్నో ఆశలు పెట్టుకున్న యీ రాజ్య ప్రజలేమవ్వాలి? యిటువంటి నిర్ణయం తీసుకోవడంలో అర్థం యేమైనా వుందా? నీ మీద ఆశలు

పెట్టుకున్న యింతమంది యేమైపోవాలి?"

"నాన్నా యెవరి విషయంలోనూ నాకే కాంక్షలూ లేవు నాన్నా!"

"నువ్విలా ఆశలూ కోరికలూ చంపుకుని గుండెరాయిలా మార్చుకోవడానికి మేము చేసిన నేరమేమిటో చెప్పు నాయనా?"

"నేను సత్యాన్వేషణ చేయాల్సి వుంది"

"నీ సత్యాన్వేషణకి యెవరు అడ్డువచ్చారు? నువ్వు సామర్థ్యముండి ఆ సత్యాన్వేషణేదో స్వేచ్ఛగా చేసుకోవచ్చుకదా! చెప్పు నీ అన్వేషణకే సాధనాలు కావాలో చెప్పు? దేశదేశాలమండి పండితుల్ని తీసుకురమ్మంటావా? నీవంటి అన్వేషకులకు ముఖ్యమైన ఆశ్రమాలు నిర్మించమంటావా? వారికి వొక్కొక్కరికీ వెయ్యేసిమంది పరిచారికల్ని యేర్పాటు చెయ్యమంటావా? చెప్పు నాయనా చెప్పు. నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను.. కానీ.. కానీ.. అందుకోసం యిల్లువిడిచి వెళ్ళిపోతానంటే మాత్రం వొప్పుకోను.. వొప్పుకోలేను.. నాయనా? ఆ మాటమాత్రం అనకు ముసలివాళ్ళు అయ్యాక ఆలోచించవలసిన విషయం సత్యాన్వేషణ అంటే. అన్నీ అనుభవించవలసిన వయస్సు నీది యిప్పుడేమిటిరా యిదంతా?" తండ్రి గొంతు వణికింది.

"మీరేమన్నా అనండి "యీ మోహాల సుడిగుండంలోపడి సత్యాన్వేషణ చేయడం అసాధ్యం నాన్నగారూ! యిప్పటికే యెంతో ఆలస్యం జరిగిపోయింది. జీవితం చాలా చిన్నది నాన్నగారూ! ముసలివాళ్ళయినాక చేసే సత్యాన్వేషణకు యెన్నో పరిమితులుంటాయి. శరీరం ఆరోగ్యంగా వున్నప్పుడే యే ఆశయాలకోసమైనా కష్టపడాలి. నాన్నగారూ.. నేను యీ మార్గాన్ని యెంచుకున్నది నావొక్కడి కోసంకాదు. ప్రపంచానికే శాంతినందించే సత్యాన్ని నేను కనుగొనాల్సి వుంది. రాజ్యాధికారాన్ని చెలాయించడం ద్వారా ప్రపంచంలోని దుఃఖాన్ని రూపు మాపగలనన్న నమ్మకం నాకు లేదు. చూస్తూనే వున్నాంకదా యేం సాధించగలిగాం? మనస్ఫూర్తిగా యెవరైనా మారారా? దండించడం వల్ల వచ్చే మార్పుకీ, మనస్సులోనే వచ్చే మార్పుకీ యెంతో తేడా వుంది. ప్రపంచంలోని యీ అశాంతికి, దుఃఖానికి గల మూలకారణాలు కనుగొనాలంటే సుఖసంపదలతో తులతూగే యీ రాజభవనాలు చాలా అడ్డు వస్తాయి. ప్రలోభపెడ్తాయి. అందుకనే యే కోరికలూ, బంధాలూ అడ్డుకోని, అడ్డుకోలేని, శ్రమణ జీవితాన్ని యెన్నుకున్నాను. నా మార్గంలో నేను విజయుడ్నయ్యేందుకు నన్ను ఆశీర్వదించండి నాన్నా! యీ ప్రపంచంలోని అమాయాద్వేషాల్ని, హింసని, దుఃఖాన్ని, దోపిడీని, అసత్యాన్ని రూపుమాపే మార్గాన్ని నేను కనుగొనాల్సి వుంది."

—యీ దేహం కొన్నాళ్ళు మాత్రమే వుంటుంది. యిది బలంగా, దారుఢ్యంగా వున్నప్పుడే దీనిని మనం సద్వినియోగం చేసుకోవాలి. యథార్థ సత్యం అనేది అనంతకాలం జీవిస్తుంది. అటువంటి సత్యాన్ని కనుగొనడం వొకవేళ నాకు అసాధ్యమే కావచ్చు. కానీ అందుకై నేను పడే శ్రమవృథా కాదు. నా అనుభవాలు తరువాత వచ్చేవారికి వుపయోగపడతాయి. నా కృషి నేను చేయవలసి వుంది. నాన్నగారూ! యిందుకోసం యింకొక్క క్షణం కూడా వృథా చేయలేను. యీ ప్రపంచాన్ని సౌఖ్యమయం చేసే అమరసత్యం కోసం నాయీ మిగిలిన జీవితాన్ని ఖర్చు పెట్టాలని తలపోస్తున్నాను. నా మనస్సు మీకు తెలుసు. నన్ను ప్రేమగా సాగనంపండి నాన్నా! "యిది మీకు మాత్రం గర్వకారణం కాదూ?"

శుద్ధోదనుడు కొడుకు మాటలు విని వొకటి రెండు క్షణాలు మూగగా వుండిపోయాడు.

తరువాత గుండెకెత్తుకుంటూ...

"నాయనా! యెప్పుడైనా నీమాటకాదన్నానా? యెప్పుడైనా నిన్ను బాధపెట్టానా? ఋతువులలో వచ్చే మార్పులవల్ల కూడా నీకు బాధ కలుగకుండా, ఋతువుకొక విధంగా నిన్ను దివ్యమైన భవనాల్లో కర్పూర, చందనాది పరిమళాలలో పెంచాను. కన్నా! యెందుకురా నాకిట్లాంటి శిక్ష వేస్తావు? నువ్వు లేని బతుకు బతకడం దుర్భరం నాయనా! నువ్వులేని యీ రాజసౌధంలో బతుకీడ్వటం కూడా కష్టం. నాన్నా నువ్వే లేకపోతే యింకెవరిని చూసి బతకాలిరా? కన్నా! నేనొక్కమాట అడుగుతున్నాను నన్ను కాదనవు కదూ! నా మాట మన్నిస్తావుకదూ! నాయనా! నీ పరివ్రాజకత్వానికి కూడా అంగీకరిస్తాను. మరి నామాట కాదనవుకదూ!"

"యేమిటి నాన్నా అదీ!"

"నేను చనిపోయిన తరువాత తీసుకో ఆ పరివ్రాజకత్వం. నన్ను నీ చేతుల్తో దహనంచేసి. నేను నీకేమీ అడ్డు చెప్పడం లేదు కదా! నా మాట విను.. యిప్పటికీ నిర్ణయం చాలించు".

సిద్ధార్థుడు చిరునవ్వు నవ్వాడు. చిరునవ్వు నవ్వుతూనే యిలా అడిగాడు.

"నాన్నగారూ మీ మాట ప్రకారమే వుండిపోవడానికి నాకు నాలుగు వరాలివ్వగలరా? ఆ వరాలివ్వగలుగుతే వుండిపోతాను. అవి మీకు సాధ్యమేనా?"

"చెప్పు బాబూ! దానిదేముంది? అంత సాధ్యం కాని దేముంది?"

"మీ కంటే ముందరే నాకు మృత్యువు రాదన్న వరాన్ని యివ్వగలరా? నన్నే జబ్బుపీడించదని, నాకు వృద్ధాప్యం రాదని, నేనెల్లప్పుడూ సుఖశాంతులతోనే ఉండగలనన్న వరాలివ్వగలరా? యివ్వగలరా?"

ఆ ప్రశ్నలకు శుద్ధోదనుడు నిరుత్తరుడయ్యాడు. గుండె పట్టుకుంటూ "యిలా అడగడం నీకు ధర్మమేనా?"

"నాన్నగారూ! నేను సత్యాన్వేషణ చేయాల్సివుంది. రాగ మోహబంధాలను వీడి స్వేచ్ఛగా శ్రమణమార్గంలో నడవాలనుకుంటున్నానందుకే. మీరు యిందుకు తండ్రిగా దోహదపడటం మీ ధర్మం. నాకింక సెలవిప్పించండి నాన్నగారూ!"

శుద్ధోదనుడు దుఃఖం ఆపుకోలేకపోయాడు అతడి ఆశాసౌధాలన్నీ కుప్పకూలిపోయాయి. సిద్ధార్థుడి వడలంతా పిచ్చిగా నిమిరాడు. "బాబూ! నా చేతుల్లో పెరిగావు. తల్లిలేని పిల్లాడివిరా! యెంత సున్నితంగా పెరిగావో నీకు తెలుసుకదా! వెన్నముద్దలతో పెరిగిన నా చిన్ని బిడ్డా.. నువ్వు భిక్షాటన చేస్తూ దేశాలు తిరుగుతావా? నీ కోమలశరీరం యిందుకు తట్టుకుంటుందా? "శుద్ధోదనుడు యేడుస్తుండగా సిద్ధార్థుడు నెమ్మదిగా శుద్ధోదనుడి కౌగిలి నుండి విడివడి, ఆ పక్కనే అక్కడికి చేరిన తల్లి మహా ప్రజాపతి గౌతమికి పాదాభివందనం చేశాడు. ఆమె జరుగుతున్నదంతా అప్పటికే అర్థం చేసుకుంది. యిలాటిదేదో జరుగుతుందని ఆమెకు తెలుసు. ఆమె వొక్కటే ఆశీర్వదించింది.

"చిరాయువుగా వర్ధిల్లు నాయనా! నాది నిన్ను కన్నకడుపుకాదు.. కానీ యీ బాధ భరించలేమురా! యీ తల్లిని జ్ఞాపకం పెట్టుకో నాయనా!" ఆమె యేడ్వసాగింది.

సిద్ధార్థుడికి కూడా కళ్ళమ్మట నీళ్ళు వచ్చేశాయి. అంత ప్రేమగా పెంచిందామె. సిద్ధార్థుడు గాద్గదికంగా. "అమ్మా! మిమ్మల్నిందర్నీ కష్టపెట్టాలనికాదమ్మా! యీ ప్రపంచంకోసం నేనీకొత్త

త్యాగం చేయాలమ్మా! అమ్మా! శెలవమ్మా" సిద్ధార్థుడి కన్నీళ్ళాగడంలేదు. ఆమె మనసు దిటవుపరుచుకుంటూ, "నాయనా! యిందుకు కోడలు అంగీకరించిందా?" అని అడిగింది.

"ఆమె దగ్గరకే వెడుతున్నానమ్మా!"

"వెళ్ళు నాయనా! మేము పెద్దవాళ్లము. రేపోమాపో పోయేవాళ్ళము. ఆమెకింకా జీవితం వుంది. తన జీవితమంతా పచ్చగా కళకళలాడుతూ గడుస్తుందని నమ్మి మన యింటికి కోడలుగా వచ్చింది. ఆమె నిజంగా నీకు తగిన భార్య. ఆమె కాదంటే మాత్రం కనీసం ఆమె మాట అయినా కాదనకు - యిదే నీ తల్లి కోరిక.. నీకు అన్నిటా జయం కలగాలి" అంటూ యింక దుఃఖం ఆపుకోలేక, ఆమె అక్కడే కూలబడిపోయింది.

సిద్ధార్థుడు బరువుగా యశోధర మందిరానికి దారితీశాడు. అతడి గుండె యుద్ధ సమయంలో నగరభేరి కొట్టుకొంటున్నట్టు కొట్టుకుంటూంది.

అతడు యశోధర మందిరం వైపు వెడుతుంటే, ఆ వృద్ధదంపతులిరువురికీ చివరి ఆశ మినుకుమినుకుమంటూ వుంది. సకల దివ్యగుణరాశి, ప్రేమ హృదయిని అయిన తమ కోడలే కొడుకు నిర్ణయాన్ని మార్చగలదని వారి నమ్మకం. అదే వారికి మిగిలిన ఆశ.

నిజంగానే యశోధరకి యీ విషయం తెలిస్తే సిద్ధార్థుని మహాభినిష్క్రమణాన్ని ఆపగలిగి వుండేదని చెప్పడం చాలా కష్టం. అయినా తన భర్త ఒక మహాసత్యాన్ని కనుగొనేందుకు తాను నిస్సారంగా బతుకునీడలని చవిచూసి, ప్రాణాధికంగా ప్రేమించిన పతి వియోగాన్ని తట్టుకుని, చివరిగా అతని మార్గాన్నే యెంచుకున్న గొప్ప చారిత్రక వ్యక్తి యశోధర. ఆమె అప్పుడు జగం మరిచి ప్రశాంతంగా నిదురపోతూంది.

చంద్రబింబంపైన నల్లని మబ్బుల్లా ఆమె ముంగురులు చల్లని గాలికి దోబూచులాడుతున్నాయి. నిద్దురలో ఆమె యే ప్రశాంతసుందర సీమలలో తన ప్రాణనాథుడైన సిద్ధార్థునితో, తన కన్న కుమారుడు రాహులునితో విహరిస్తోందో?! అప్పుడు జరగబోతున్నది సున్నిత మనస్కులెవరికి తెలిసినా వారు కన్నీరు పెడతారు.

## ప్రియా! యశోధరా! నీకు చెప్పలేను

అలా ప్రశాంతంగా నిద్రపోతున్న యశోధరనీ, రాహులుణ్ణీ చూడగానే సిద్ధార్థుడి కళ్ళనుండి నీళ్ళు చిప్పిల్లాయి. రేపటి నుండీ తన ప్రాణసఖి తాను లేక జీవచ్ఛవమై పోతుంది. తన బంగారు బిడ్డడు తండ్రి లేని వాడై పోతాడు. వీరికి నమ్మకద్రోహం చేస్తున్నానా? అని అతడి గుండె పట్టేసింది. తన జీవన జ్యోతి, తన ఆరాధ్య హృదయిని, తనకి తల్లిలా, స్నేహితురాలిలా, ప్రాణంలో ప్రాణంగా సాంత్వనకూర్చే అమృతహృదయిని, తన మనస్సులోని బాధను తెలుసుకుని అవగతం చేసుకోగల జ్ఞానదయామూర్తి.. యీ విషయం చెపితే గుండె రాయి చేసుకుని తనను సాగనంపుతుంది. కానీ.. తానే ఆ స్థితిలో ఆమె విషాద ధృతచిత్తవదనాన్ని చూడలేడు. అతడి కళ్ళు కన్నీళ్ళతో ధారలు కట్టాయి.

"నా ప్రియమైన, నా ప్రియాతిప్రియమైన యశోధరా! నీకెన్నో చెప్పాలని వుంది. నిన్ను విడవకుండానే పశ్చాత్తాపం నన్ను దహిస్తోంది. ప్రియా! కేవలం సత్యాన్వేషణకొరకే వెడుతున్నాను. నా అన్వేషణలో నేను విజయంసాధించేవరకూ నేను నిన్ను తిరిగిచూడలేను. ఆనాడు మన అనుబంధం కూడా వేరుగావుంటుంది. ప్రియా! యీ జీవితానికింతే ప్రియా! నిన్ను విడిచి

వుండాలంటేనే నాప్రాణం కటకటలాడిపోతున్నది. యీలోకసౌభాగ్యం కోసం నువ్వు నన్ను త్యాగం చెయ్యి ప్రియా! నేను చరితార్థుడనైతే, నా చరిత్రలో యుగయుగాలకూ నువ్వు నా వెంటే వుంటావు. యశోధరా! నన్ను మన్నిస్తావు కదూ! పెద్ద మనసుతో నన్ను దీవిస్తావు కదూ! యిన్నాళ్ళ పాట్లు నీవు నన్ను గుండెల్లో పొదువుకుని యెనలేని సాంత్వననిచ్చావు. అలాంటిది నీ గుండెల్లో చిచ్చుపెట్టి వెళ్ళిపోతున్నానా?

..నన్ను అర్థం చేసుకుంటావు కదూ! నేనిలా వెళ్ళిపోతున్న సంగతి తెలిస్తే నువ్వు నీ కనుకొలుకులచిరుకదలికలతోనే నన్ను ఆపివేయగల నా ఆరాధ్య ప్రేమమూర్తివి. కానీ యెప్పటికైనా సత్యాన్వేషణకోసం నేనీ బంధాలన్నీ వదిలి వెళ్ళక తప్పదు. ఆ పని యిప్పుడే చేసినట్లయితే కాలం మరింత కలిసి వస్తుందికదా! నన్ను తప్పక విజయం వరిస్తుంది. రోజులూ, సంవత్సరాలూ గడుస్తున్న కొద్దీ దేహదారుఢ్యం నశించి వృద్ధాప్యం ఆవరిస్తుంది. అప్పుడు యే అన్వేషణ చేయాలన్నా స్వంత శరీరమే ప్రతిబంధకమైపోతుంది. అందుకే ప్రియతమా.. నా యీ నిష్క్రమణని మన్నించు.. మన్నించు" అంటూ ఆమె నుదుటి ముంగురులను తాకలేయి, ఆమెకి నిద్రాభంగమైపోతుందేమో, పరిస్థితి మొదటికివచ్చి మారిపోతుందేమో అని భయపడి వూరుకున్నాడు. చంద్రబింబంవంటి ఆమె ముఖాన్ని అలా కళ్ళార్పకుండా వేదనగా చూస్తున్నాడు.

నిద్రలో యేమికలవచ్చిందో, చిన్నారి రాహులుడు కొన్ని వులిక్కిపడి, తిరిగి తల్లి పదిని వెతుక్కుని దగ్గర చేరాడు. ఆచిన్ని బాలుని చూడగానే సిద్ధార్థుడి కళ్ళమ్మట నీళ్ళు తిరిగిపోయాయి. సృష్టిలో యేజీవి బాధపడినా అతడు తట్టుకోలేడు. అటువంటిది తన జీవిత భాగస్వామి, తన రక్తం పంచుకుని పుట్టిన బిడ్డా తన కారణంగా రేపటి నుండి వంటరివారైపోతారు, తనకోసం కుమిలిపోతారు! అనుకుంటే అతడి గొంతు పట్టేసింది.

చివరిసారిగా ఆ పసిబిడ్డన్ని యెత్తుకుని ముద్దాడాలన్న కోరిక అతణ్ని బలీయంగా ఆవరించింది. అతడి అధరాలు కంపించాయి. "యిదే చిన్నా! యీ తండ్రి నీకిచ్చే చివరి ముద్దు.." అనుకుంటూ ఆ బాబుకి ముద్దు యివ్వబోయేంతలో రాజభవనం క్రింద నుంచి చెన్నుడు చేసిన అశ్వ శబ్దం వినిపించింది.

తనింకేమాత్రం ఆలస్యం చేసినా యీ బాంధవ్య బంధాలకు లోనవవచ్చని, అందువల్ల తన సత్యాన్వేషణ వాయిదాపడిపోతుందని, జీవితాన్ని సత్యాన్వేషణకూ, మానవత్వానికీ అంకితం చేయాలనుకున్నప్పుడు, ఆపనిని వేగవంతం చేయాలని, అందుకు అడ్డువచ్చే యీ మమతానురాగాలకు దూరంగావుండాలని.. చటుక్కున అతడికి తోచింది. స్తబ్దుడై అలాగే వుండిపోయాడు. భార్యా బిడ్డలను ప్రశాంతిగా, చివరిసారిగా వెనుక అడుగులు వేసుకుంటూ చూడసాగాడు. అప్పుడతని హృదయంలో యెటువంటి భావాలు కలిగాయో అది వేదనో, శాంతో తెలియని అగాధస్థితి.

ద్వారం రాగానే, ద్వారం వైపుకు తిరిగి, మళ్ళీ వారిద్దరినీ ప్రేమగా చూసి నిండుగా ఆశీర్వదించి మనసులోనే వీడ్కోలు చెప్పుకుంటూ అలా చాలాసేపు వుండిపోయాడు. అతడి మనసంతా శూన్యమైపోయింది. గుండె గొంతుకలోకి వచ్చి కొట్టాడిపోయింది. కళ్ళు తప్తశోక సముద్రాలయ్యాయి. గుండె అంతా పట్టేస్తోంది గట్టిగా యేడవడానికీ లేదు. దిగమింగడానికీ లేదు. ద్వారం పట్టుకుని చిన్నపిల్లాడిలా కన్నీళ్ళతో వారిని చూస్తూ చాలా సేపుండిపోయాడు. వారిరువురూ తనని ఆప్యాయంగా పిలుస్తున్నట్టు, తన వొడిలో సేద దీరుతున్నట్టు, తను లేకపోవడమన్న వూహనే

భరించలేకపోతున్నట్టు అనిపిస్తుంటే తట్టుకోలేకపోతున్నాడు. వారిని తిరిగి సమీపించలేక, అక్కడ వుండలేక తన్నుకులాడిపోయాడు. వొక్కసారైనా వారియిద్దర్నీ తన గుండెలకి గాఢంగా హత్తుకోవాలన్న కోరికని అణుచుకోవడం అత్యంతకష్టమైపోయిందతడికి.

చెన్నుని అశ్వశబ్దం మళ్ళా వినబడింది. గమ్యం కళ్ళముందు కదలాడింది. శక్తినంతా కూడ దీసుకుంటూ వారి వంక చూసి కళ్ళనీళ్ళు తెచ్చుకుంటూ ఆర్తితో వారిరువురినీ రెండు చేతులతో ఆశీర్వదిస్తూ, యిదే చివరిసారి అనుకుంటూనే వారిని మరలా మరలా చూస్తూ, భూమాతలా గుండె దిటవు పరుచుకుని ద్వారం దాటి బయటకు వచ్చేశాడు.

సిద్ధార్థుడు పరివ్రాజక నిర్ణయంతోనే యశోధరమందిరం నుండి తిరిగి వస్తూ రాజభవనం దాటే ప్రయత్నంలో వుండేసరికి తల్లిదండ్రులిరువురికీ గుండెలు పగిలిపోయాయి. "అమ్మా! యశోధరా! యెంత పనిచేశావమ్మా! నువ్వు అతడి పరివ్రాజకత్వానికి అంగీకరించావా అమ్మా! నీపైనే ఆశలుపెట్టుకున్నాం. నువ్వు తలుచుకుంటే అతనిని ఆపు చేయగల సమర్థురాలివి.. యీ ముసలి తల్లిదండ్రులపై నీకు జాలి కలుగలేదామ్మా? యింక మేమేమైపోవాలమ్మా! అయ్యో యెంతటి దురదృష్టవంతులమమ్మా మేము?" అని గొంతుల్లో గుండెలు తెచ్చుకుని యేడ్వసాగారు. సిద్ధార్థుడు తమను కడసారిగా నమస్కరించి వెళ్లిపోతూంటే యింక నిలిపలేక వణికిపోతున్న చేతులతో మూగాశీస్సులు తెలుపుతూ అతడు ద్వారం దాటగానే నిస్సహాయంగా గుండెలు పట్టుకుంటూ కుప్పకూలిపోయారు. 'పంటరిగా రాజ్యంలోకి వెళ్ళడానికి ఆనాడే నిరాకరించి వుంటే యిప్పుడీ పరిస్థితి యెదురయ్యేది కాదుకదా!' అనుకుంటూ శుద్ధోదనుడు ఘోరుమన్నాడు.

మరి రెండు క్షణాల్లోనే సిద్ధార్థుడు అధిరోహించిన అశ్వం నగరద్వారం వైపుకు సాగుతూ, మరికొద్ది క్షణాల్లోనే దాని గిట్టల చప్పుడు పూర్తిగా వినిపించకుండా పోయింది. పైన శయనమందిరంలో ప్రశాంతంగా నిదురపోతున్న యశోధరకీ సంగతులేమీ తెలియవు.

## చెన్నా! ఆత్మీయుడా! నీకు నా కృతజ్ఞతలు

సిద్ధార్థుని చారిత్రాత్మకమైన మహాన్వేషణ ఆరంభమైంది. బౌద్ధ సాహిత్యంలో యిది మహాభినిష్క్రమణంగా చరితకీర్తులందుకుంది.

కపిలవస్తునుండి వారు ఆ రాత్రి అంతా ప్రయాణం చేసి మహారణ్యాలకు యీవలగా వున్న అనోమనది వొడ్డుకి (యిప్పటి గోరఖ్‌పూర్‌కి యాభైమైళ్ళదూరంలో) చేరారు. తొలిసూర్య కిరణాలు ఆకాశమంతా పరుచుకుంటున్నాయి.

సిద్ధార్థుడు అశ్వాన్ని దిగాడు. చెన్నుడు ముందే దిగాడు. అతడి గొంతు పూడుకుపోతూంది. సిద్ధార్థుడు మాట్లాడే మాటలకోసం పసివాడిలా యెదురు చూస్తున్నాడు. సిద్ధార్థుడడిగాడు.. "చెన్నా! కాషాయవస్త్రాలు తెచ్చావా?"

"ధరా! తీసుకువచ్చాను[ ]....

"సరే! మంచిపని చేశావు" అంటూ సిద్ధార్థుడు మౌనంగా అక్కడ వున్న వొక బండరాతిపై కూర్చుని, తన కరవాలాన్ని బయటికితీశాడు. వుదయసూర్యకాంతికి అది వజ్రాయుధంలా మెరిసింది. దానివంక సిద్ధార్థుడు చూస్తూ 'నాముందు నువ్వెంత'? అన్నట్టుగా నవ్వాడు. దాన్ని అటూయిటు తిప్పి, తలవంచి, తన పక్కని, మెత్తని జుత్తుని ఆ కరవాలంతో మొదలంటా కోసి వేయసాగాడు.

సిద్ధార్థుడు జుత్తంతా గీసేసి, తలపూర్తిగా గుండు అయిపోయాక, ఆ కరవాలాన్ని మరొకసారి నవ్వుతూ చూసి నిశ్చేష్టుడై, కళ్ళింతలు చేసుకుని చూస్తున్న చెన్నుడితో,

"చెన్నా! చూశావా చెన్నా నేనెంత మంచి పనిచేశానో? యీ కరవాలం ఆత్మరక్షణకు వుద్దేశించినటువంటిది. అంతేకాదు ఏకసారి దీనితో యెన్ని హింసలైనా చేయొచ్చు. భయంవుంటేనే కదా రక్షణకావాలని కోరుకునేది? నాకు యిప్పుడు యేం పోతుందని భయం వుండాలి. అందుకని భయాన్నే వదిలేశాను. భయాన్నే వదిలేశాక ఆత్మరక్షణ కోరుకోవడమెందుకు? అందుకోసం యిలాంటి కరవాలాలూ కత్తులు యెందుకు? యిప్పుడింక యింకోమంచిపని కూడా జరిగింది. హింసకు గుర్తయిన దీనితో అహింసకూ, నిర్భయత్వానికి గురుతైన శిరోముండనం కావించుకున్నాను. యీ కరవాలంతో యే జీవినీ చంపే అవసరం నాకెప్పుడూ లేదు... అందువల్ల యీ కరవాలం యొక్క వుపయోగమేలేదింక నాకు." అంటూ ఆ కరవాలాన్ని తిన్నగ తిప్పి అనోమానదిలోకి దూరంగా విసిరివేశాడు. బట్టలు విప్పి అనోమానదిలోకి వెళ్ళి స్నానం చేసివచ్చి చెన్నుడి వంక చూశాడు.

చెన్నుడు అర్థం చేసుకుని తాను తెచ్చిన కాషాయవస్త్రాలు సిద్ధార్థుడి చేతికిచ్చాడు. సిద్ధార్థుడు ఆ కాషాయ వస్త్రాలు ధరించి కనులు ప్రశాంతంగా కాసేపు మూసుకున్నాడు. కాసేపయాక అన్నాడు "ఛెన్నా మరికం శెలవుతీసుకోనా?"

చెన్నుడు కుమిలిపోయాడు. కుంగిపోయాడు. అయినా ధైర్యం తెచ్చుకుని, "దొరా! మిమ్మల్ని యేమాటకు కాదన్నాను. చెప్పండి దొరా? తల్లినీ, తండ్రినీ, భార్యా బిడ్డలనూ, రాజ్యాన్నీ వదిలిపెట్టేసినా నాదొర నన్ను మాత్రం విడిచి పెట్టడని నమ్మాను.. నా దొరకి సేవ చేసుకుంటూనే నేను చచ్చిపోవాలని గట్టిగా కోరుకున్నాను. దొరా? నీకిదిన్యాయమా? నేను నీ వస్త్రాలకంటిన గడ్డిపోచ, పూరికముల్లపాటికూడా చేయనా? చెప్పుదొరా? నీ కంతకష్టంగా వుంటే నన్నిక్కడే చంపేసి వెళ్ళిపో దొరా!" చెన్నుడు బిగ్గరగా యేడ్చేశాడు. అతడి గుండెలు అతలా కుతలమైపోతున్నాయి. దుఃఖంలో వూపిరికూడా ఆడక తల్లడిల్లి పోతున్నాడు. సిద్ధార్థుడిపై అతడు పెంచుకున్న మమత అట్లాంటిది. యే బంధానికి తెగిపోతుంది స్నేహబంధం?!

సిద్ధార్థుడు, చెన్నుడిదగ్గరగావచ్చి... "చెన్నా! నా ప్రియమైన నేస్తమా? నిన్ను బాధపెట్టాలనెందుకుంటుందయ్యా నాకు? నీమేలు, నీ స్నేహం నేను మరిచాననుకుంటున్నావా? లేదు. నువ్వు నాకు ఆత్మీయుడివి. ప్రియాతి ప్రియమైన స్నేహితుడివి. నిన్ను విడిచి వుండటం అనే బాధ నేను భరించలేనటువంటిది. అయినా గుండెదిటవు పరుచుకుంటున్నాను... నిజానికి నీతోడులేని ప్రయాణాన్నే వూహించలేను. నీ చెలిమిలో నేను పరవళ్ళుతొక్కే నదుల్నే అలవోకగా యీది దాటడం నేర్చుకున్నాను. మన మిద్దరం యెన్నో మూగప్రాణులను రక్షించాము. కీకారణ్యాలలో సైతంనిర్భయంగా తిరిగాము. నిన్ను విడిచి వుండటం యెంత కష్టమో తెలుసా?

చెన్నా! నిజమే.. యెవరినైనా విడిచి పెట్టవచ్చునేమోగానీ నువ్వుమాత్రం విడిచిపెట్టదగిన వాడివికావు. నీవు నాపట్ల చూపిన కరుణామమతలు, భక్తి ప్రపత్తులు నిరుపమానమైనవి. అందుకు తగిన ప్రతిఫలాన్ని యివ్వలేని నిస్సహాయుణ్ని నేను.

కుటుంబాన్ని ఆదుకుంటాడన్న ఆశతో కొడుకుని పెంచుతారు. తాము పెరిగి పెద్దవాడయేందుకు తోడ్పడుతున్న తండ్రిని కొడుకు గౌరవిస్తాడు. యిలా ప్రపంచంలో ప్రతికార్యం యింలో కొంత ప్రతిఫలాపేక్షతోనే జరుగుతూంది. కానీ నీలో యెట్లాంటి స్వార్థచింతన కూడా నాకు

రక్ష. నీవు తప్పకుండా జ్ఞానసాధన చెయ్యి. నాతో గడిపిన విలువైన అనుభవాలను మరింతగా మెరుగుపెట్టుకో. చెన్నా! నువ్వు కూడా సత్యాన్వేషణ చెయ్యి. రాగ మోహబంధాలు సత్యాన్వేషణకు ప్రతిబంధకాలుగా నిలుస్తాయి. వాటిని వదిలెయ్యి. నీ నుంచి నేను దూరమవడాన్ని కూడా నీకు లభించిన మంచి అవకాశంగా తీసుకో. చెన్నా! శుశ్రూషలు చేయడం ద్వారా నీకు తృప్తి కలుగుతుందే కానీ సత్యాన్ని నీ అంతట నువ్వు తెలుసుకోలేవు. నీ కాళ్ళపై నువ్వు స్థిరంగా నిలబడగలిగినప్పుడే కదా నువ్వు చూడవలసిన మార్గాన్ని సుస్పష్టంగా చూడగలిగేది? చెన్నా! నా గురించి చింతించవద్దు. నా యీ వస్త్రాల్ని యశోధరకు అందచెయ్యి. ఆమె గొప్పఇల్లాలు. నా ప్రాణ సఖి. నేనామెను మోసం చేయలేదని, నా పరిత్యాగంను ఆమె తప్పక అంగీకరిస్తుందన్న నమ్మకం నాకు కలదని. అయితే ఆమెపై వున్న రాగబంధాన్ని ధైర్యంగా విడనాడే ధైర్యం నాకే లేక నే యిలా చెప్పకుండా వచ్చేశానని. నా సత్యాన్వేషణలో నాకు జయం కలిగేట్టు నన్ను ఆశీర్వదించమని ఆమెకు చెప్పు. "చెన్నా! ఆమెతో వియోగాన్ని నేనింకా తట్టుకోలేక పోతున్నానని చెప్పు. నాకు శుభం కలగాలని ఆశీర్వదించవలసిందిగా ఆమెను నేనే కోరుకున్నట్టుగాచెప్పు!! యిలా అంటుంటే సిద్ధార్థుడికి మళ్ళాకళ్ళముందర యశోధర ప్రత్యక్షమై కళ్ళనీళ్ళు నిండాయి. చెన్నుడి ముందర గుండెదిటవు పరుచుకుంటూ అన్నాడు. చెన్నా! మరింక వెళ్ళిరానా!?"

చెన్నుడి గుండెని యేదో చెప్పలేనంత నిశ్శబ్దం ఆవరించింది. అతడు సైతం గుండె బాగా నిబ్బరంచేసుకున్నాడు. యింక చేసేదేమీ లేదని తలచి నెమ్మదిగా అన్నాడు:

"దొరా! నేనేమైనా తప్పులుచేసివుంటే నన్ను మన్నించండి దొరా! మీ కాళ్ళకాడ చావు కోరుకున్నాను నా జన్మకింతే దక్కింది. యీ మాత్రమైనా యెవరికి దక్కింది కనుక? దొరా! నాకీ అదృష్టంచాలు. దొరా! వెళ్ళిరండి. మీ సత్యాన్వేషణ విజయవంతంకావాలి. మళ్ళా నా దొరని నేను చూసుకోవాలి. దొరా! యింకెళ్ళిరండి. మీరు చెప్పిన మాటలన్నీ శిరసావహిస్తాను" అన్నాడు.

కంథకాశ్వం సిద్ధార్థుని సమీపించింది. కన్నీరు విడిచింది. అతడు దాని తలని తన గుండెకు హత్తుకున్నాడు. ధైర్యంగా వుండమన్నట్టుగా దాని చెక్కిలిమీద ప్రేమతో ముద్దాడాడు. అది తనన్ని గట్టిగా హత్తుకుపోయింది. సిద్ధార్థుడు చెన్నుడివంక చూసి నవ్వుతూ రెండు చేతుల్నీ చాచాడు.

చెన్నుడు పసిపాపలా సిద్ధార్థుని కౌగిటిలో యిమిడి పోయాడు. వారిద్దరూ అలాచాలాసేపు వుండిపోయారు. తరతరాలకూ చెరగనిమైత్రీ బంధమది.

నెమ్మదిగా కౌగిలి నుంచి విడివడి, సిద్ధార్థుడు చెన్నుని ఫాలభాగాన్ని, ఆత్మని ప్రేమతో నిమిరి ధైర్యంగా వుండమని ఆశీర్వదించి, చిరునవ్వుతో వెనుకకు తిరిగి. తన సుదూర ప్రయాణాన్ని ఆరంభించాడు. జనన, మరణ, వృద్ధాప్య సమస్త దుఃఖాలనుండి, ఆశామోహ తృష్ణలనుండీ మానవాళిని రక్షించడానికై - అందమైన, ప్రశాంతమైన, సర్వామోదమైన మార్గంకోసం సిద్ధార్థుని మహాభినిష్క్రమణం ఆరంభం అయింది. యెంత దూరంలో అది చేరువ అవుతుందో తెలియదుకానీ సుదూరప్రాంతంలో ప్రియాతి ప్రియమైన ప్రేయసిని చూడటానికా అన్నట్టు అతడి ప్రయాణం సాగిపోతుంది. చెన్నుడు సిద్ధార్థుని శుభమూర్తి మంతాన్ని కనుమరుగయేవరకూ కండ్లతడితోనే చూస్తూ విరాళా విన్నపాలతో తీరనిదుఃఖంతో తామా, కాంథకుడితో వెనుతిరిగాడు. హృదయం ద్రవీభూతమై చెన్నుడి కళ్ళ చెమ్మట కన్నీళ్ళుగా ప్రవహిస్తూనే వుంది. చెరగని మైత్రికి, చెమ్మగిల్లిన కళ్ళకు చరిత్రలో చెన్నుడే గొప్ప వుదాహరణ. అతడి గురించి తెలుసుకున్న వాళ్ళకి కూడా అంతే. కళ్ళు చెమ్మగిల్లక మానవు అతని స్నేహానికి అన్యోయతకి సేవాతత్పరతకు వారి గుండె ద్రవించక మానదు.

# మహాభినిష్క్రమణం

గోచీపాతకి గతిలేక పోయినా, సన్యసించడం తరువాతి సంగతి. పొరుగువాడికి పిడికెడు సాయం, కనీసం మాటసాయం చేయడానికైనా బెంబేలెత్తిపోయే మనుషులుండగా యిరవై తొమ్మిది సంవత్సరాల నిండు యవ్వనంలో సకల సుఖభోగరాజ్య సంపదలనన్నీ ప్రపంచ ప్రజల దుఃఖ నిర్మూలనకోసం గడ్డిపోచగా పరిత్యజించిన సిద్ధార్థుని ఆనాటి త్యాగమే అతణ్ని బోధిసత్వుణ్ని, తథాగతుణ్ని, బుద్ధుణ్ని చేసింది. అజరామరమైన కీర్తిప్రతిష్ఠుణ్ని చేసింది. ఆ అన్వేషణలో, ఆ త్యాగంలో, ఆ అనుభవాలలో అతడు కనిపెట్టిన సత్యమే బౌద్ధధర్మమై విశ్వమానవులకు కళ్యాణ కారకమైంది. సమస్త జీవులపాలిట బతుకు వెలుగైంది.

యింతకీ ప్రపంచ దుఃఖనిర్మూలనకై, సుఖసౌఖ్యాలకై, మహోన్నతమైన జీవితానికై అతడు కనిపెట్టిన ఆ సత్యం యేమిటి? ఆ ధర్మం యేమిటి? అతడు ప్రవచించిన వుపదేశాలేమిటి?

అవన్నీ మానవజాతికతడు వూదిన కొత్త వూపిరులు. వాటిని అతడు యెలాసాధించాడో, అతడి అనుభవాలేమిటో కూడా తెలుసుకుంటే తప్ప అవి యెంత విలువైనవో, యెంతటి వున్నతమైనవో, యెలా ప్రతిమనిషీ ఆచరించక తప్పని విషయాలో పూర్తిగా, హాయిగా అర్థంకావు. అందుకే బుద్ధ భగవానుని జీవితచరిత్రను అందరూ పూర్తిగా తెలుసుకోవాలి. రెండువేల అయిదువందల యాభైయెనిమిది సంవత్సరాల క్రితమే మనకోసం వొక మహామనిషి జన్మించి, యీ ధరణీతలాన్ని పునీతం చేశాడన్న సంగతి తెలుసుకుంటేచాలు వడలంతా వినమ్రంగా పులకరిస్తుంది.

యీ ప్రపంచంలో కెల్లా గొప్పత్యాగం బుద్ధుని త్యాగం. తన ప్రాణాన్నీ, దేహాన్నీ, కట్టుకున్న ప్రేమనీ, కన్న ప్రేమనీ, పెంచుకున్న ప్రేమనీ జీవితంలో చివరిక్షణాలతో సహా సమస్త జీవితాన్నీ ప్రజల సుఖశాంతుల కోసం, మానవకళ్యాణం కోసం, వారు జాగరూకతగా, బాధ్యతగా, విశ్వ ప్రేమికులుగా బ్రతకడం కోసం ఖర్చుపెట్టాడు. ధారపోసాడు. యిదంతా అతడు తన బాధ్యతగా స్వీకరించాడు.

అతని త్యాగానికి హద్దులు లేవు. అతని ధర్మం విశ్వమానవులకు ఆదర్శం. ఆయన జీవితంలో ఆనాటికాలంలో ఆయనకు తారసపడిన సంఘటనలకూ, నేటి మనకాలంలో మనకు యెదురవుతున్న సంఘటనలకూ వున్న సారూప్యత గమనిస్తే చాలు, యిన్ని తరాలు గడిచినా మనకు బుద్ధుని బోధనలపాటింపు యెంత అవసరమో తెలియగలదు. మారిందనుకుంటుందల్లా మనుష్యుల వేషభాషలు, కోరికలలో వ్యత్యాసాలు మాత్రమే. ఆనాటి అంతరంగాలలో, నైతిక జీవితంలో రావలసివున్న మహోన్నతమార్పులు తీసుకువచ్చిన బౌద్ధ ధర్మం, నేడు యింకా లక్షలాది, కోట్లాది మందిని చేరవలసే వుంది. పోటీలు పడి మరీ ప్రజలు దుఃఖాన్ని కొని తెచ్చుకుంటున్న, అశాంతి, భయ, వేదనలతో మగ్గిపోతున్న నేటి దుస్థితిలో, వారిని గుండెలలో పొదువుకుని, వారిని ధైర్యశాలురుగా, సత్యసంధులుగా, నీతివర్తనులుగా, శాంతి సాధకులుగా, మానవ కళ్యాణకారకులుగా చేయగలిగేది వొక్క బౌద్ధమే. యెందుకంటే బౌద్ధానికి ద్వేషమంటే యేమిటో తెలియదు. దానినిండా వున్నవి ప్రేమామృతధారలే. అదొక మూగజీవి పాలపొదుగు. దానిని సంరక్షించి, పితికితే మనిషికి జ్ఞానమనే బలిష్టమైన ఆహారం లభిస్తుంది. ఆ పొదుగు కోసివేస్తే అశాశ్వతమైన నెత్తురుకూడే లభిస్తుంది. శాశ్వతమైన నరకాలలో పడిపోకుండా మనిషి బౌద్ధం సహాయంతో మానవతాజ్యోతుల్ని వెలిగించడమే అతడు నిర్వర్తించవలసిన సమతాన్యాయం, ధర్మం. అందుకోసమే యీ చిన్నిపుస్తకం.

ఆ వెళ్ళడం వెళ్ళడం సిద్ధార్థుడు కోసలదేశం వెళ్ళాడు. అక్కడ వైశాలి అన్న ప్రదేశంలో

ఆళారకాలాముడనే శ్రమణమహర్షిని కలుసుకున్నాడు. ఇన్నాళ్ళూ కూడా అతనికి అన్నపానాదుల మీద ఆసక్తి లేదు. శాక్య, కోలీయ రాజ్యాలు రెండింటిలోనూ గొప్ప ప్రతిష్ఠ కలిగిన ఆ ఆళార కాలాముడనే మహర్షిని యెప్పుడు సందర్శించుకుంటానా అన్న తపనే అతనిని వేధిస్తూ వుండేది.

ఆళారకాలాముడు వృద్ధుడు. మహాతపస్వి. తపస్సు చేయడంలో అతనికి నాలుగు ధ్యాన పద్ధతులు తెలుసు. యోగ సాధన పద్ధతులు తెలుసు. బ్రతికి వుండగానే సమాధి పొందడం కూడా అతనికి తెలుసు. ఆళారకాలాముడితో పాటు, యించుమించు అతనితో సరిసాటి అయిన వుద్దక రామపుత్రుడనే శ్రమణ మహర్షి కూడా ఆ ఆశ్రమంలోనే వుండేవాడు. యిద్దరికీ వందలాది శిష్యులు వుండేవారు. వీరందరూ కూడా యజ్ఞయాగాల పట్ల, రాజుల భోగాలపట్ల చాలా వ్యతిరేకతతో వుండేవారు. యజ్ఞయాగాదుల పేరుతో రాజులు ప్రజాధనాన్ని విచ్చలవిడిగా ఖర్చు చేయడం, మంత్రతంత్రాలునేర్చిన పురోహితులకు, వేదజ్ఞులకు గురుదక్షిణ పేరిట ప్రజలకు చెందిన మడిమాన్యాలను దానం చేయడం, చెట్లు నరకడం, యజ్ఞాలలో బలులివ్వడం వీటన్నిటినీ వారు తీవ్రంగా నిరసించేవారు. యిటువంటి పనులను నిష్కృతిలేని పాపకార్యాలుగా వారు భావించేవారు. ముక్తి అనేది యిటువంటి పాపపు పనులవల్ల రాదనీ, ముందర ప్రతిమనిషీ తనలో వున్న పాపాన్ని తొలగించుకోవాలనీ, దేనికైనా అపకారం తలపెట్టకుండా జీవించాలనీ ప్రవచించేవారు. ఆ విధంగానే వారు బ్రతికి చూపించేవారు.

సిద్ధార్థుడు యీ సత్యాన్వేషణ చేస్తున్న నాటికి భారతావనిలో గొప్ప తత్వచింతన సాగుతూంది. ప్రపంచ చరిత్రలోనే అదొక గొప్ప తాత్విక మహాశకం. వుత్తర భారతమంతా చాలామంది గొప్పతాత్వికులు సత్యసత్యాన్వేషణలో తపించిపోతూ వుండేవారు. తత్వచింతన ద్వారా వారు ప్రపంచాన్నీ, సమాజాన్నీ శోధిస్తూ, సమాజం యెలా వుండాలో బోధిస్తూ, కొండొకచో వ్యతిరేకిస్తూ అప్పటికి వున్న అజ్ఞాన ఆలోచనలను, పరిస్థితులను, జ్ఞానయుతంగా హేతుబద్ధంగా తూర్పారబెడుతూ వుండేవారు. వారి కొత్త వూహలు, ప్రమాణాలు నచ్చినవారిలో చాలామంది వారికి శిష్యులై, వారి ఆలోచనల్ని తాముకూడా పూర్తిగా తెలుసుకుని, ప్రజలలో ప్రచారం చేసేవారు. వారివారి వాదాలతో ఆనాటి సంఘమంతా హోరెత్తి అట్టుడికి పోతున్నట్టు వుండేది. యించుమించు అన్నీ ఆనాటి రాచరిక, పురోహితవర్గాల దారుణమైన పద్ధతుల్ని యేదోవొక విధంగా విమర్శించేవే. అందువల్ల రాజ్యాధిపతులు, పలుకుబడివేత్తలు, ప్రచారం చేసే యీ తాత్వికులు యెప్పుడేం ముంచుకు తెస్తారో అన్న భయంతో వారిలో మరీ ప్రమాదకరంగా తోచినవారిపై వేగుల్ని నియమిస్తూ వుండేవారు. ఆ వేగుల్లో కొందరు సన్యాసి వేషాల్లో తిరుగుతూ, ప్రజలను మోసపుచ్చుతూ, రాజులకి సమాచారాలు పంపిస్తుండేవారు. ఆనాటి తాత్వికులందరికీ ప్రజాభిమానం మెండుగా వుండేది. అందువల్ల వారిని రాజులు ప్రత్యక్షంగా యేమీ చేయలేక పోయేవారు.

ఆ తాత్వికులలో పూర్ణకాశ్యపుడు, సంజయబేలట్ఠిపుత్రుడు, కకుధకాత్యాయనుడు, అజితకేశకంబళుడు, మక్ఖలి గోశాలుడు, మహావీరుడు మొదలైన మహాతాత్వికులు వుండేవారు.

వీరిలో పూర్ణ కాశ్యపుడిది అక్రియావాదం. పుట్టడం, బతకడం, చావడం, ఆ తరువాత శరీరం మట్టిలో కలిసిపోవడం... అంతే. మంచీ లేదు. చెడూలేదు. - యే పని చేసినా దాని ఫలితం యేమీ వుండదు. మంచిపని చేసినా వుండదు. దొంగతనం, చంపడం, వ్యభిచరించడం యిలా యెటువంటి చెడ్డపనులు చేసినా ఫలితం వుండదు. అంటాడీయన. పైపెచ్చు యీయన యెవరైనా

స్వీకరించిన, బహుశా గౌతమబుద్ధునికి కూడా ఆదర్శప్రాయుడైన మహావీరుడీయన. నిరాడంబరత, ముక్కుసూటితనం, పవిత్రత, నిజాయితీ, ఆత్మస్థైర్యం, పరివ్రాజకత్వం, త్యాగం మొదలైన గుణాలను వుద్బోధిస్తూ తానే వాటికి ప్రతీకగా నిలిచాడీయన. సత్యాన్నే పలకడం, జీవుల్ని చంపకుండా వుండడం, దొంగిలించకుండావుండడం, సన్యసించడం- యీ నాలుగు చతుర్ యామాలూ ముక్తికి మార్గాలుగా ప్రబోధించాడీయన. తీర్థంకరులలో మొదటివాడీయన. చివరివాడు మహావీరుడు. యీయననే నిగంఠనాథపుత్రుడని కూడా అంటారు. యీయన పైన చెప్పిన చతుర్యామాలతో పాటుగా- వివాహం చేసుకోకూడదనీ, శ్వేతవస్త్రాలు తప్పించి యెటువంటి ఆస్తి వుండకూడదనీ చెప్పాడు. అంతకు ముందు తీర్థంకరులందరూ కూడా నగ్నంగానే సంచరించేవారు. మహావీరుని అహింసాప్రబోధం జగత్ప్రసిద్ధం. గత జన్మలోనూ, ప్రస్తుత జన్మలోనూ చేస్తున్నపాపాలు పర్యవసానంగా పునర్జన్మ యెత్తక తప్పదు. యీ జన్మలో యెటువంటి పాపాలూ చేయకుండా వుండాలంటే తపశ్చర్య చేపట్టకతప్పదు అని ఆయన బోధించాడు. గౌతమబుద్ధుడు యీ శ్రమణ మార్గాన్నే అనుసరించాడు. గౌతమబుద్ధునిపై తీర్థంకరుల భావాల ప్రభావం చాలా వుందని చెప్పవచ్చు. అయితే వారందరూ చెప్పినదానికి పూర్తి విభిన్నత కల్గినది గౌతమబుద్ధుడుపదేశించిన మధ్యేమార్గం. ధరణీతలాన యిప్పటికీ అదే సత్యం.

## స్వర్గసమానం-గురుశిష్యబంధం

ఆళారకాలాముడు, వుద్ధకరామపుత్రుడు వీరిద్దరూ మన సిద్ధార్థుని సాదరంగా తమ శిష్యునిగా చేసుకున్నారు. అతని వినయవిధేయతలు, జ్ఞానతృష్ణ, గ్రాహకశక్తి చూసి యెంతో ముచ్చటపడ్డారు. చిన్ననాడు ఆమలకీవృక్షం క్రింద తనకు కలిగిన ఆనందానుభూతిని మరలా పొందాలనుందని సిద్ధార్థుడు కోరగా, ఆశ్చర్యంగా 'అది గొప్ప దివ్యయోగం' అంటూ యెంతో సంతోషపడుతూ యిద్దరూ తమకున్న జ్ఞానాన్నంతా సాకల్యంగా అందించారు.

సిద్ధార్థుడు తపస్సులన్నీ ఆచరించాడు. ఆ తపస్సు వల్ల అతడి మనస్సూ శరీరమూ స్వచ్ఛతనూ, శాంతినీ పొందాయి. అతడి తనువంతా గొప్ప దివ్యకాంతితో నిండిపోసాగింది. ధ్యానం చాలా గొప్పది అని తెలుసుకున్నాడు. తనదైన పంథాలో దానికి రూపకల్పన చేయసాగాడు. తపస్సు చేయడంతోపాటు పైన వివరించిన యింకా అనేకమంది తాత్వికులు వుంటే వారిని కూడా కలుసుకునేవాడు. తాను వెళ్ళేమార్గంలోగానీ వారు వెళ్ళేమార్గంలో గానీ వారు తారసపడితే వారి దగ్గరి విషయాలను వినయంగా తెలుసుకునేవాడు. అతని జ్ఞానతృష్ణ చూసి ఆళారకాలముడు, వుద్ధకరామపుత్రుడు యెంతో సంతోషించేవారు. తమకు గొప్ప శిష్యుడు లభించాడని వారెంతో ఆనందపడేవారు. అక్కడే సిద్ధార్థునికి కూడా ఒక పెద్ద ఆశ్రమం కట్టించాలని వారు తలపోశారు.

కానీ, సిద్ధార్థుడు కోరుకున్నది వేరు. ప్రపంచంలో దుఃఖం అనేదే లేకుండా చేయాలని అతని తలపు. దుఃఖనివృత్తికి మార్గాలు తెలుసుకోవాలి. అవి ప్రజలకు చెప్పాలి. అందరూ సుఖపడేటట్టు చూడాలి. మనుష్యులలో, భేదభావాలూ, స్పర్థలూ వుండకూడదు. దుఃఖనివృత్తికి తాను చెప్పే మార్గం అందరికీ అందుబాటులో వుండాలి. ఆచరణయుతంగా వుండాలి. అదొక గొప్ప జీవన విధానాన్ని స్పష్టంగా చూపించాలి. అతడు కోరుకుంది తానొక్కడి దుఃఖ నిర్మూలన -కాదు. ప్రపంచంలోనే దుఃఖం అనేది వుండకూడదు. యిప్పటివరకూ అతడు చేసిన అన్వేషణ అతడికి పూర్తి

సంతృప్తి కలిగించలేదు. యింకా చాలా తెలుసుకోవాలని తలచాడు. గొప్పగొప్ప తాత్వికులు చెప్పిన విషయాలను యెంతో శ్రద్ధతో, అభిమానంగా తెలుసుకునేవాడు. వారు చెప్పిన వాటిలో కొన్ని అతడికి బాగా నచ్చేవి. చాలామటుకు హేతుబద్ధంగా, సహజంగా వున్నట్లు తెలుసుకొనేవాడు. కానీ కొన్ని భావాలతో అతడికి యేకాభిప్రాయం అసలు కుదిరేది కాదు.

అతడు వూహించే మనిషి విశ్వ మానవుడు. ప్రతివొక్కడూ అటువంటి విశ్వమానవుడవాలి. అతడు యేటువంటి దుష్కృత్యానికీ వొడిగట్టకూడదు. సాంఘికబాధ్యతను మరువకూడదు. యేటువంటి వ్యక్తికీ బానిసకాకూడదు. అలాగని తినడం, త్రాగడం, సంతోషంగా గడిపెయ్యడమే అతడి పరమావధిగా గడిపెయ్యకూడదు. జ్ఞానచింతన లేకుండా నిరర్థకంగా బ్రతకకూడదు. అలాగని సమస్తకోరికలు చంపుకుని సన్యాసి అయిపోకూడదు. అతడి బ్రతుక్కి వొక ప్రయోజనం వుండాలి. తాను విశ్వమానవుడై ప్రతీ మనిషీ విశ్వకళ్యాణాన్ని కోరుకునే, ఆచరించే విశ్వమానవుల్ని తయారు చేయగలగాలి. అతడెప్పటికీ నిరాశకు, నిస్పృహాయుతకు, విచ్చలవిడితనానికి గురికాకూడదు.

అటువంటి వుదాత్తచరితుల్ని తయారుచేసే సిద్ధాంతాన్నే అతడు కనుగొనాల్సి వుంది. యెందుకంటే అటువంటివారు మాత్రమే దుఃఖాన్ని నిర్మూలించగలుగుతారు. మొదట తానే అటువంటి జ్ఞాని అవ్వాలి. విశ్వమానవుడవ్వాలి. సిద్ధార్థుడు నిరంతరం తనలో జరిగిన తాత్విక ఘర్షణలు ప్రశాంతపడటానికీ, మరింత గాఢంగా తాత్విక ఆలోచనలు చేయడానికి అన్వేషణ కొనసాగించాలనీ, యింకా దేశాలు తిరగాలనీ తలచాడు.

అతడి వుద్దేశం ఆళారకాలామునికీ, వుద్దకరామపుత్రుడికీ యెంతో నిరాశకల్గించింది. సిద్ధార్థుడంటే వారికి అలవిమాలిన అభిమానం. సిద్ధార్థుణ్ణి తమ దగ్గరే గొప్ప గురువుగా తయారు చేయాలని వారు ఆశపడ్డారు. అయినా వారు సిద్ధార్థుణ్ణి ఆశీర్వదించారు. అతడు కోరుకున్న విధంగా జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలని తలచారు. సిద్ధార్థుడికి వారు సాదరంగా వీడ్కోలు చెప్పారు.

వారి నుండి శెలవు తీసుకుంటుంటే సిద్ధార్థుడికే చాలా బాధ కల్గింది. ఆ వాతావరణం, గురువుల ప్రేమాభిమానాలు అతడికెంతో అలవాటు అయ్యాయి. అతడికెంతో స్ఫూర్తినిచ్చాయి. వారు నేర్పిన సంగతులు, ధ్యానం యెంతో వుపకరిస్తున్నాయి. వారి దగ్గర శెలవు తీసుకుంటూ సిద్ధార్థుడు యెంతో గౌరవంతో కూడిన ఆవేదనతో, 'మీరెంతో ప్రేమతో నాకు జ్ఞాన నిధి అంతా తెల్పారు. భవిష్యత్తులో నేను సాధించబోయే దానికి మీరు నేర్పిన విద్య పునాది వం[illegible]. యిప్పటికి నేను తెలుసుకున్న సంగతులూ, తత్వశాస్త్ర విషయాలూ - యివేమీ తక్కువ శక్తి కలవి కాదు. వాటిలో గొప్ప వూహాశక్తి వుంది. మనుష్యులు సక్రమమైన దారిలో సుఖంగా జీవించాలన్న కోరిక వుంది. కానీ యే సిద్ధాంతమూ నేను కోరుకున్న విశ్వమానవుణ్ణి తయారు చెయ్యలేదు' అంటూ దుఃఖాన్ని నిర్మూలించే సిద్ధాంతంకోసం తానెంతగా పరితపించిపోతున్నదీ, అన్వేషణ చేస్తున్నదీ తెలిపాడు. యింక వారు అతణ్ణి పూర్తిగా సమర్థించారు. అంతేకాదు చాలావేగంగా అతడి అన్వేషణ పూర్తి కావాలని, అతడు కనుగొన్న విషయాలు తెలుసుకునే అవకాశం తమకూ కలగాలనీ వాంఛించారు. ఆశీర్వదించారు.

సిద్ధార్థుడు వారిని విడువలేక విడువలేక విడిచాడు.

మార్గ మధ్యమంలో అనేకమంది గురువులను, వుపాధ్యాయులను కలుస్తూ రాజగృహ అనే పట్టణప్రాంతానికి ప్రయాణం కట్టాడు. మధ్యలో యెదురైన పరవళ్ళు తొక్కుతున్న గంగానదినే

సులువుగా యీదాడు. ఆళారకాలాముని. రుద్రకరామపుత్రుని బోధనలు, తపశ్చర్యలు అతడి జీవితాన్ని విశేషంగానే మార్చాయి. మాటలను పరిశుద్ధంగా, దయగా, హితవుగా మాట్లాడటం నేర్చుకున్నాడు. యెటువంటిపరిస్థితులలోనూ మనస్సులో కూడా ఆవహనం, కోపం, చికాకు, విసుగులను తెచ్చుకోవడం మానేశాడు. యెక్కడకు వెళ్ళినా తలవంచుకునే వెళ్ళేవాడు. అతని దృష్టి కేవలం రెండు అడుగుల దూరంలోపు మాత్రమే వుండేది. వినయశాంతాలకు, కరుణార్ద్రతలకు అతడొక రూపచిత్రమయేవాడు.

యింత శాంతంగా, మౌనంగా తమ యిండ్లముందు ఆగివెళ్ళిపోతున్న గౌతముడంటే అతడెవరో తెలియకపోయినా, రాజగృహంలోని గృహస్థులకు గొప్ప ఆదరణ కల్గింది. అతణ్ణి బోధిసత్వుడని పిలవసాగారు. అతడు భిక్షకు బయలుదేరిన కొద్దిసేపటికే అతడి భిక్షాపాత్ర నిండిపోయేది. వొకమారు భిక్ష స్వీకరించిన యింటిలో అతడు తిరిగి భిక్ష స్వీకరించేవాడు కాదు. వొకటి రెండు యిళ్ళకంటే యెక్కువ యిండ్లకు వొక రోజు భిక్షకు వెళ్ళేవాడుకాదు. పగలంతా ప్రజలను కలుసుకుంటూ, పరిశీలిస్తూ, రాజగృహకు సమీపంలోని పాండవపర్వత గుహల్లో విశ్రాంతి తీసుకునేవాడు.

నెమ్మదిగా నెమ్మదిగా సిద్ధార్థుని గురించి, ఆ రాజ్యాన్ని పరిపాలించే బింబిసారునికి కూడా తెలిసింది. బింబిసారుడు తానే సిద్ధార్థుని దగ్గరకు వెళ్ళి పలకరించుదామని అనుకుంటూ వున్నాడు. కానీ ఆయన అప్పుడు వొక యజ్ఞం చేసే హడావుడిలో వున్నాడు. యజ్ఞం యెలా చెయ్యాలి, యేమేమి వస్తువులు కావాలి. బలియివ్వడం కోసం పశువుల్ని యెక్కడెక్కడ నుంచి తీసుకురావాలి? యజ్ఞవాటికలో పశువుల్ని కట్టడానికి చేసే యూపస్తంభాల్ని యే అడవిలో యేరకమైన యెంత వయసున్న చెట్లను నరికి తెప్పించాలి అన్న అనేకానేక పనుల గురించి ఆయన క్షణం విశ్రాంతి లేకుండా పురోహితులతో, యజ్ఞనిర్వాహకులతో మాట్లాడవలసి వచ్చేది. యజ్ఞం ముగిసిన వెంటనే సిద్ధార్థుని సందర్శించుదామన్న ఆలోచనతో అతడా యజ్ఞ నిర్వహణలో మునిగిపోయాడు.

## మృత్యువులేనిచోటులేదు

వొకనాటి మధ్యాహ్నం సిద్ధార్థుడు తను నివసించే ఆవరణ మీదుగా పోతున్న మేకలమందను యిష్టంగా, ప్రేమగా చూడసాగాడు. మేకలకాపరులు దారితప్పుతున్న మేకల్ని వంకరకర్రలతో అదలుస్తున్నారు. ఆ మందలో కవలపిల్లల్ని కన్న తల్లిమేక కూడా వొకటి వుంది. ఆ కవల మేకపిల్లల్లో వొకటి కుంటిది. అది మందతో పాటు నడవలేక వెనకపడిపోతుంటే మాతృప్రేమతో తల్లిమేక వెనక్కి వచ్చి ఆ కుంటిమేకను సముదాయించడం, ముట్టితో నెట్టుతూ మందలో కలపడం చేస్తోంది. అది వొక ప్రక్క వాళ్ళతో తమ్ములు తింటూనే, పిల్లమేకపై ప్రేమకొద్దీ మళ్ళీమళ్ళీ వెనక్కి రాసాగింది.

ఆ దృశ్యాన్ని చూసిన వెంటనే సిద్ధార్థుడు ఆ మంద దగ్గరకు వెళ్ళి ఆ కుంటి మేకపిల్లని యెత్తుకుని దాని కాలు, మెడ నిమరసాగాడు. తల్లిమేక అతడి దగ్గరకు కృతజ్ఞతతో చేరింది. మేకలకాపరులు అతని చుట్టూ చేరి, అతడు మేకపిల్లని వదిలేస్తే తాము తిరిగి బయలుదేరవచ్చు కదా అని చూస్తూ వుంటే సిద్ధార్థుడు వారితో 'యేమిటి మేకలన్నీ హాయిగా, కడుపునిండా మేతమేశాక కదా సాయంకాలానికి యిండ్లకు తీసుకువెళ్తారు? యీ మిట్టమధ్యాహ్నం వీటినిలా ఆకలిదప్పులతో తీసుకువెళ్తున్నారేమిటి?' అని అడిగాడు.

వాళ్ళు "వీటిన్ని యజ్ఞంలో బలికోసం తీసుకువెళుతున్నాము. బింబిసారమహారాజా పెద్ద యజ్ఞం చేస్తున్నారు. యివాళ రాత్రి మూరు మేకల్ని బలి యిస్తారు" అని చెప్పారు.

వారి సమాధానం వినగానే సిద్ధార్థుడు నిర్విణ్ణుడయాడు. అన్నెం పున్నెం యెరుగని యీ అమాయక జీవులు నేటిరాత్రి యజ్ఞంలో బలైపోతాయి అన్న భావన అతడికి దుస్సహమైన క్లేశాన్ని కల్గించింది. తాను మారువేషంలో రాజ్యపర్యటనలో వున్నప్పుడు మాంసాహారం కొరకు జీవుల హత్యలు జరగబోతే, చెన్నుడి ద్వారా రాజభటుల్ని తప్పించి, ఆ జీవుల్ని రక్షించేవాడు. అక్కడ తనతండ్రి మూగజీవాలహత్యకు వ్యతిరేకి. కానీ యిక్కడ ఒక మహారాజే యిలా యజ్ఞయాగాదుల పేర మూగజీవాలను నిర్లజ్జగా బలివేస్తుంటే, ఆయనని చూసి సామాన్య ప్రజలు కూడా తమకు వీలయిన రీతుల్లో తామూ బలులు వేయడం మొదలుపెడతారు. యింక యీ మూగజీవాల బతుకులకు భద్రత యేముంటుంది? యీ బలులవల్ల, వాటి రక్షణలోనే మనుష్యులరక్షణ కూడా వుందన్న నిజాన్ని అనుభవాల రీత్యా కూడా తెలుసుకోలేని దుస్థితి కలుగుతుంది. ప్రకృతిలో యేహింస అయినా ప్రతిహింస తీసుకుంటుంది. తాను తెలుసుకున్న విషయాలు అయినా చెప్పక తప్పని పరిస్థితి యిది. లేకపోతే మానవత్వానికిక చోటెక్కడ? అనుకుంటూ సిద్ధార్థుడు ఆ మేకపిల్లను తన భుజాలపైన అమరికగా, సుఖంగా పరుండబెట్టుకుని, ఆ మేకల మంద వెనుక నడవసాగాడు. ఆ మేకల కాపరులూ, దారిలో యెదురైన ప్రజలూ ఆ దృశ్యాన్ని వింతగా, ఆశ్చర్యంగా చూడసాగారు. చిత్రమేమిటో చూద్దామని కొందరు సిద్ధార్థుని అనుసరించసాగారు. ఆ మేకలమంద దారిలో యెక్కడ విడిది చేస్తే తామూ అక్కడే విడిది చేయసాగాడు సిద్ధార్థుడు. మేకలమంద యీసారి ఒక వూరి చివరి వూరిళ్ళ దగ్గర విడిది చేయడంతో సిద్ధార్థుడు భిక్షకోసం దగ్గరలో వున్న ఒక పూరిగుడిసె దగ్గరకు వెళ్ళాడు.

అది కిసాగోతమి అన్న నిరుపేదరాలి యిల్లు. ఆ యింట్లో పరిస్థితి దారుణంగా వుంది. ఆ రోజు వుదయాన్నే పశువులకు గడ్డికోతకు వెళ్ళిన ఆమె కొడుకు పాముకాటువల్ల మరణించాడు. వూరివారందరూ కూలిపనులకు వెళ్ళిపోవడం వల్ల అతడి అంత్యక్రియలు చేయడానికి కూడా యెవరూ లేరు. అందరూ యిళ్ళకు చేరేసరికి సాయంకాలమైపోతుంది. ఆ దీనురాలి దుఃఖానికి అంతులేదు. తనను కడతేరుస్తాడు అనుకున్న ఒక్కగానొక్క కొడుకు తానే కడతేరిపోయాడు. సిద్ధార్థుడు భిక్ష అడిగేసరికి ఆమె యేడ్చియేడ్చి కొడుకు శవంపైనే సొమ్మసిల్లి పడిపోయి వుంది.

యిది తెలియని సిద్ధార్థుడు గుడిసె బయటినుండి వేచి చూసి చూసి, "అమ్మా భిక్ష వేయి తల్లీ" అని పిలిచాడు. కిసాగోతమికి ఆ పిలుపుకి లీలగా మెలకువ వచ్చి నెమ్మదిగా గుడిసె బయటికి వచ్చేసరికి, కాషాయవస్త్రాలతో, కరుణార్ద్రదృక్కులతో సిద్ధార్థుడు కనిపించాడు.

ఆమె, సిద్ధార్థుడ్ని సాక్షాత్తూ తన బిడ్డన్ని రక్షించడం కోసం వచ్చిన దేవతామూర్తిగా భావిస్తూ, గుడిసెలోంచి బయటికి వచ్చి సిద్ధార్థుడి కాళ్ళు కౌగిలించుకుని వెక్కి వెక్కి యేడ్వ సాగింది. యింతోసేపటికి, 'బాబూదేవుడిలా వచ్చావు.. నా బిడ్డని కాపాడు తండ్రీ.. వాడిని పాముకరిచింది. వులుకూ పలుకూ లేదు.. చూసినవాళ్ళు చనిపోయినాడంటున్నారు. బాబూ బతికి వుంటే వాడికి బలం పొయ్యి.. చనిపోయివుంటే ప్రాణంపొయ్యిబాబూ.. నిన్నే నమ్ముకున్నాను. నా కొడుకును బ్రతికించు తండ్రీ!" అని అతిదీనంగా యేడుస్తూ ప్రార్థించిందామె.

సిద్ధార్థుడు గుడిసెలోపలికివెళ్ళి ఆమెకొడుకుని పరీక్షించాడు. అతడు అప్పటికే మరణించాడు.

ఆ దీనురాలికి వచ్చిన ఆ దుస్థితికి సిద్ధార్థుడు చాలా బాధపడ్డాడు. కొడుక్కి ప్రాణం పొయ్యమంటున్న ఆమె కోరిక, ప్రేమబంధం వల్ల చూసేవారికి సహజం అనిపిస్తుంది. అయ్యో! అని బాధ అనిపిస్తుంది. కానీ లోకానుభవంలోగాని, తన అనుభవంలోగాని చనిపోయిన జీవికి ప్రాణం పొయ్యడం అసంభవం. కానీ యీసంగతి ఆమెకు యెలాతెల్పేది? ఆమె దుఃఖాన్ని యెలా మాన్పించేది?

ఆమె సిద్ధార్థునిపై గొప్ప నమ్మకాన్ని పెట్టుకుంది. "చనిపోయిన వారికి ప్రాణం పొయ్యడం యీ ప్రపంచంలో జరగనిపనమ్మా... నీవు దుఃఖాన్ని మాని. నీకు నువ్వు ధైర్యం చెప్పుకోవాలి. యిటువంటి సమయాల్లోనే ధీరత్వంతో వుండాలి" అని ఆమెకు చెప్పాడు. కానీ కొడుకుపోయాడన్న దుఃఖంలోవున్న ఆమెకి అతడిమాటలేమీ హత్తుకోవడం లేదు. యే మహత్తులతో అయినా తన కొడుకుని బతికించమని విలపిస్తూ ఆమె సిద్ధార్థుని పదేపదే ప్రార్థించసాగింది.

తమ మేకలమంద వెనుకే వచ్చిన కాషాయంబరధారి యెక్కడున్నాడో అని చూడటానికి వచ్చిన మేకలకాపరులూ, సిద్ధార్థుని ఆసక్తితో అనుసరిస్తున్నవారూ అక్కడకు చేరుకుని, జరుగుతున్నది, జరగబోయేది యేమిటా అని వుత్కంఠగా యెదురు చూడ సాగారు.

సిద్ధార్థుడు చివరికి ఆమెతో, "అమ్మా! యెవరి యింటి దగ్గర నుంచి అయినా గుప్పెడు ఆవాలు తీసుకురాగలవా?" అని అడిగాడు.

ఆమె "అలాగే బాబూ!" అంటూ యెంతో ఆశతో ఆవాలకోసం బయలుదేరబోతుంటే సిద్ధార్థుడు అన్నాడు. "అమ్మా! ఆ ఆవాలు మరణ దుఃఖం అన్నది యెరుగని వారి యింటి దగ్గర నుంచి తీసుకురావాలి" అన్నాడు. ఆమె అలాగే బాబూ అంటూ లేనిశక్తి తెచ్చుకుని బయలుదేరింది.

ఆ ఆవాలు తెస్తే, ఆ ఆవాల్ని మంత్రించి తన కొడుకుని బతికిస్తాడేమోనని ఆమె యెంతో ఆనందపడింది. కానీ యెవరి యింటి దగ్గరికి వెళ్ళినా, ఆ యింట్లో యెవరో ఒకరు, తండ్రో, తాతో, తల్లో, తండ్రో, సనిహితులో - యెవరో ఒకరు యెప్పుడో పోయినవారు, మరణించేవున్నారు అంటూ యెవరూ కిసాగోతమికి ఆవాలు యివ్వలేదు. కిసాగోతమి యిల్లిల్లూ తిరిగి అలిసిపోయింది.

యిక్కడ, మేకలకాపరులు, సిద్ధార్థుని అనుసరిస్తున్నవారు, ఆమె ఆవాలు తెస్తే, ఆ ఆవాలతో యీ స్వామీజీ యే మహత్యం చేసి ఆమె కొడుకుని బతికిస్తాడో, యెలా బతికిస్తాడో, చనిపోయినవాడు యెలా లేస్తాడో అన్న వుత్కంఠతో మందని తోలుకుపోకుండా, ఆవాలు తెచ్చే ఆ తల్లి కోసం స్తంభించిపోయి చూస్తూ వుండసాగారు.

వెళ్ళిన యెప్పటికో కిసాగోతమి ప్రాణాలన్నీ కళ్ళల్లో పెట్టుకుని, నిరాశతో దుఃఖంతో వచ్చి, "స్వామీ! యెవరూ ఆవాలు యివ్వలేదు. అందరి యిండ్లల్లోనూ యెవరో ఒకరు పోయే వున్నారట.. "బాబూ...బాబూ యేంకాసికాలమో గుప్పెడు ఆవాలు తేలేకపోయాను..బాబూ నన్ను క్షమించి యెలాగైనా నా కొడుకుని బతికించు నామీ చల్లనికడుపునప్పుడలా.." అని అదేపనిగా విహ్వలంగా యేడ్వసాగింది. యేదో జరుగుతూందని, అక్కడికి చేరినవాళ్ళు, దారినబోయేవాళ్ళూ కూడా అక్కడకు చేరి, యిప్పుడీస్వామీజీ యేం చేస్తాడా? అని చాలా వుత్సాహంతో చూడసాగారు.

సిద్ధార్థుడు చల్లని చూపులతో ఆమెను అనునయిస్తూ, 'అమ్మా! ఆవాలు లేని యిల్లు లేదు. అయినా నీకు ఆవాలు యెవరూ యివ్వలేదు. కారణం యీ ప్రపంచంలో మరణ దుఃఖం లేని వారెవరూ లేరు.. మరణ దుఃఖం లేని వారి యింటి నుండి కదా నిన్ను ఆవాలు తీసుకురమ్మన్నాను. యెవ్వరూ యివ్వలేదని చెప్తున్నావు.. నిజమే యెవరూ నీకు ఆవాలు యివ్వలేదు. యెందుకంటే

మరణదుఃఖం అనేది యెరుగని వారెవరూ వుండకపోబట్టే కదా! అంటే మరణం అన్నది ప్రతివొక్కరికీ అనుభవమే అని తెలుస్తోంది. అంటే దాని అర్థం మరణం అనేది నీకే ప్రత్యేకమైన విపత్తుకాదు. అందరికీ వున్నదే అని కదా! ప్రతీ వొకరూ మరణం వల్ల బాధపడుతూనే వున్నారు. ప్రతీ వొకర్నీ మరణం బాధిస్తూనే వుంది. యిదింత సామాన్యమైన విషయం అయినప్పుడు బాధపడటం యెందుకు? తల్లీ? బాధపడవద్దు.. నీ బాధ పోవాలంటే ముందర మరణం అన్నది అందరికీ వున్నదే అని గుర్తించు. ధీరత్వంలో యీ మరణబాధను అధిగమించు.." అని చెప్పాడు.

ప్రజలందరూ కూడా సిద్ధార్థుని వుపదేశాన్ని విని, "నిజమేకదా! ఆయన నిజమే చెప్పాడు. బాధపోవాలంటే ఆయన చెప్పినట్లే అంగీకరించాలి.. అదే నిజం.." అనుకుంటూ జరిగినదంతా మరల మరల చెప్పుకోసాగారు.

కిసాగోతమి చేతులతో ముఖం కప్పుకుని చాలాసేపు యేడ్చింది.

సిద్ధార్థుడు అక్కడనుంచి నెమ్మదిగా బయలుదేరబోయాడు. కిసాగోతమి యేడుస్తూనే వచ్చి అతని కాళ్ళకు చుట్టుకుపోయింది. యేడుపు ఆపుకోలేక పోతున్నప్పటికీ ఆమె సిద్ధార్థునితో 'అలాగేబాబూ! మీరు చెప్పింది నిజమే కదా బాబూ!' అంది నిశ్చయంగా.

సిద్ధార్థుడామెతో ప్రేమగా, "మరింక దుఃఖం యెందుకమ్మా? నీ ప్రేమ అందరికీ పంచు. యిప్పుడు చేయవలసిన పని యేమిటో ఆ కర్తవ్యం పూర్తి చేయి.." అన్నాడు.

ఆమె 'అలాగే బాబూ!' అంటూ లేచి బాధని అధిగమిస్తూ ఆ బిడ్డడి సంగతి తమవాళ్ళందరికీ చెప్పడానికి మనుషుల్ని బతిమాలుతూంది. దహనసంస్కారానికి కట్టెలు తేవలసిందిగా యెవరినో కోరుతూంది.

సిద్ధార్థుడు నెమ్మదిగా ప్రశాంతంగా అక్కడినుంచి మేకలమంద వున్న వైపుకి బయలుదేరాడు. కిసాగోతమి అతడి కాళ్ళకు మళ్ళీ దండం పెట్టింది. అతడు కనుమరుగయ్యేంతవరకూ, ముకుళిత హస్తాలతో అలాగే వుండిపోయింది.

సిద్ధార్థుడు మేకలమంద వున్న చోటికి వచ్చి ఆకుంటి మేకపిల్లని మళ్ళీ భుజాలకెత్తుకుని, మేకలకాపరుల వెనకే ప్రయాణమయ్యాడు. చాలా మంది ప్రజలు అతన్ని అనుసరిస్తూ రాసాగారు.

వారు చాలాసేపటికి యజ్ఞవాటికకు చేరుకున్నారు.

యజ్ఞంలో బలియివ్వడానికి తెస్తున్న మేకలమందతోపాటు, వూరి చివర పాండవ వనంలో నివసిస్తున్న మహర్షి, పేరు సిద్ధార్థుడట తన దగ్గరకే వచ్చాడని భటులు చెప్పగా తెలుసుకున్న బింబిసారుడు, తను చేస్తున్న యజ్ఞపు హడావుడి అంతా మరిచి, పురోహితుల్ని సంప్రదించకుండానే వడివడిగా సిద్ధార్థునికి యెదురేగి వెళ్ళి అతడి ఆంగికం చూసి గొప్పగా సంతోషపడిపోతూ,

"మహాశయా! మీ గురించి విని వున్నాను. మీ దగ్గరికి యీ హడావుడి తగ్గాక నేనే రావాలనుకున్నాను. నా అదృష్టవశాత్తూ మీరే వచ్చారు. రండి. యజ్ఞవాటికలోనికి రండి! అంటూ సిద్ధార్థుని సాదరంగా తోడ్కొని వచ్చి, అతడికి ప్రత్యేకమైన ఆసనం వేసి కూర్చోపెట్టి, తాను తిరిగి పురోహితులు చెప్పిన ప్రకారం యజ్ఞం చేయడంలో మునిగిపోయాడు.

# ప్రాణి రక్షణే సిసలైన మానవధర్మం

బింబిసార చక్రవర్తికిరువైపులా మంత్రాలు జపిస్తూ బ్రాహ్మణ పురోహితులు కూర్చున్నారు. యజ్ఞకుండంనుండి మంటలు, పొగలు వస్తున్నాయి. యజ్ఞకుండంలో సుగంధ ద్రవ్యాలు, నెయ్యి పోస్తున్నారు. అగ్ని పెద్దయెత్తుకు భగాభగా మండుతూ వున్నప్పుడు మంత్రాలు పఠిస్తూ బలిపశువును నరికి వేస్తారు. అక్కడ తనతో వచ్చిన మేకల మందే గాకుండా, అయిదువందల ఆవులు, అయిదు వందల యెద్దులు, అయిదు వందల గొర్రెలూ కూడా వున్నాయి. తెల్లవారేసరికి యీజీవాలన్నింటినీ బలిపేరున నరికి వేస్తారు. యిప్పుడు నరికిన దానికే అక్కడ నేల అంతా నెత్తుటి తడితో, వొక ప్రక్కకు పెట్టివేసిన విగత జీవుల మాంసఖండాలతో కకావికలైన పేగులతో, బతికివున్న మూగజీవాల అరుపులతో భయ విహ్వలంగా వుంది. నరకాన్ని తలపిస్తూ వుంది.

సిద్ధార్థుడు ఆశీనుడయ్యాక, మరొక మేకను దర్భలతోకట్టి యజ్ఞకుండం దగ్గరకి తీసుకువచ్చారు. ఋత్విజుడొకడు వాడి అయిన కత్తిని రెండు చేతులలోపట్టుకుని, "వో యజ్ఞలోకస్థులైన దేవతలారా! యీ యజ్ఞపశువు గొంతునుండి యెర్రగా చిమ్ముతున్న రక్తాన్ని తాగి ఆనందించండి. యీ నైవేద్యాన్ని మీకు యీ బింబిసార చక్రవర్తి అగ్నిహోత్రుని ద్వారా అందిస్తున్నాడు. ఆయన చేసిన పాపాలన్నీ యీ యజ్ఞాగ్ని కుండంలో పడి భస్మం అయిపోగాక... యిదుగో... యీ యజ్ఞపశువుని నరుకుతున్నాను" అంటూ ఆకత్తితో ఆ మూగజీవిని నరికేంతలో, సిద్ధార్థుడు లేచి శాంతగంభీరంగా,

"ప్రభూ!" అన్నాడు.

జీవిని నరకబోయేవాడు చటుక్కున ఆగిపోయాడు. సిద్ధార్థుడు మరింత గంభీరంగా, "ప్రభూ! జీవహింసని నిషేధించండి. అమాయక ప్రాణుల్ని రక్షించి పుణ్యం కట్టుకోనండి" అన్నాడు.

అక్కడున్నవారందరూ ఆ మాటలువిని నిశ్చేష్టులయ్యారు. యే యజ్ఞంలోనూ అటువంటి మాట యిప్పటికొచ్చి యెవరూ అనలేదు. అంత ధైర్యం కూడా యెవరికీ లేదు. ఋత్విజుని చేతిలోని కత్తి అప్రయత్నంగా చేతిలోంచి జారి క్రిందపడిపోయింది. సిద్ధార్థుడి ఆ మాటలు అందరిలోనూ, ఆలోచనలు రేకెత్తించాయి. చక్రవర్తి బింబిసారుడు కూడా సిద్ధార్థుని కోమలమైన ముఖంలో వర్తిస్తున్న నిర్మలమైన, ప్రశాంతమైన కళ్ళు కరుణాకాంతుల్ని చూస్తూ అట్లా గగుర్పాటుగా చూస్తుండిపోయాడు.

సిద్ధార్థుడు వెన్వెంటనే లేచి బలిపీఠం దగ్గరకు వెళ్ళి ఆ మేకమెడకి కట్టిన దర్భల తాడుని తీసివేశాడు. అతనిని యెవరూ ఆపలేకపోయారు. అప్పటిదాకా భయంతో వణికిపోతున్నమేక సిద్ధార్థుడి కాళ్ళకి అంటుకుపోయి నిలిచింది. 'భయంలేదు' అన్నట్లుగా అతడు కాస్తవంగి దానిమెడని తన అరచేతితో నిమిరి,తిరిగి గంభీరంగా నిల్చుని, మెల్లగా కంఠమెత్తి అక్కడవున్న వారందరినీ పరికించి, మొదటగా బింబిసారుణ్ణి ప్రశ్నిస్తూ..

"ప్రభూ! తనప్రాణమంటే ప్రతిజీవికీ తీపి. మనిషేకాదు. యేజీవి కూడా తాను యితరజీవి చేతిలో చావాలని, దానికి ఆహారమవ్వాలని కోరుకోదు. యీ సృష్టిలో యే జీవిని కూడా మనిషి పుట్టించలేదు. పుట్టించలేడు. అతడు ప్రాణం తియ్యగలడే తప్ప ప్రాణం పొయ్యలేడు. మనిషి కూడా వొక ప్రాణి. అతడి పాపాన్ని వేరొక ప్రాణి రక్తంతో పోగొట్టగలననుకోవడం భ్రమ, అజ్ఞానం. అత్యంత దారుణమైన స్వార్థం. అతిహేయం. అసలు పాపమంటే అదే. ప్రభూ! తమ పాపాల్ని పోగొట్టుకోవడానికి యీ మూగప్రాణుల రక్తాన్ని నైవేద్యంపెడితే తాగేవారు రాక్షసులై వుంటారో, దేవతలై వుంటారో ఆలోచించండి. సుఖశాంతులు కలుగుతాయన్న భ్రమతో, దీనమైన పశువులను

హత్య చేయడం కన్నా వేరే పాపముంటుందా? చెప్పండి? చెప్పండి ప్రభూ!

... యజ్ఞంలో చంపిన పశువు ఆహారమై నిజంగా స్వర్గానికి వెళ్తున్నది నిజమైతే యీ ఋత్విజులూ, పురోహితులే తమంతతాముగా ముందుకొచ్చి యజ్ఞానికి బలి కాగలరా? అలా స్వర్గానికి వాళ్ళూ చక్కగా వెళ్ళవచ్చుకదా! యిటువంటి ఆచారం వారిలో యెక్కడా కనిపించదు. మరి అలాంటప్పుడు యిట్లాంటి దారుణమైన ఫలితఫలహాలు మీకు యిస్తుంటే మీరిలా అంగీకరిస్తున్నారు? స్వర్గంలో, అందగత్తెలైన అప్సరసలు అసాధారణమైన సువాసనలు వెదజల్లుతూ, మంచి రుచికరమైన, అతిశక్తిమంతమైన అమృతాన్ని పంచిపెడుతుంటే, దాన్ని వదిలి, నెత్తురు వాసనతో భీతావహంగావున్న యీ చచ్చిన బలిపశువుల్ని స్వర్గ దేవతలు విందారగిస్తారా? వారు దేవతలా? దుష్టదేవతలా?

వారు దుష్టదేవతలైతే, వారికి భయపడి వారికి రక్తాన్ని లంచం యివ్వడం న్యాయమేనా? అసలు అది వీరులలక్షణమేనా? మనుషులరక్తాన్ని త్రాగగోరేవారినిగురించి మనమేం అనుకుంటాం? మరి తమను చంపుతున్న మన గురించి ఆ మూగజీవాలు యేమనుకోవాలి? ఒక ప్రక్కన తాను తన తోటి జీవాలను నిర్దాక్షిణ్యంగా హింసించుతూ, చంపుతూ, తనను మాత్రం యెవ్వరూ హింసించరాదనీ, బాధపెట్టరాదనీ మనిషి అనుకోవడంలో న్యాయం యేమైనా వుందా?

దేవతల ప్రీత్యర్థం అంటూ యిట్లా మూగజీవాలను బలులివ్వడంవల్ల అది క్రమేపీ ఆచారంగా మారి, ఒకరిని చూసి ఒకరు నేర్చుకుంటారు. గ్రామాలకు, కుగ్రామాలకు కూడా యీ దురాచారం పాకుతుంది. పాలు, అన్నం, పండ్లు కానుకలుగా సమర్పించడం మాని, ప్రజలు, వృక్షదేవతలకు, గ్రామదేవతలకు యిట్లా నెత్తురుకూడుని యివ్వడం మొదలుపెడతారు. ప్రజలలో భయం, మూఢత్వం, స్వార్థాలు పెరిగిపోయి దుష్టులై, అజ్ఞానంలో వరిగివరిగి పోతారు. ప్రభూ! యిటువంటి దుస్థితి మొదట మీనుండే ప్రారంభమవుతుంది. యిది న్యాయమేనా? ప్రజలను రక్షించడంలో, వారు వివేకంగా ఆలోచించడంలో కృషి చేయవలసిన మీ వంటి పెద్దలు, వారిని అజ్ఞానాంధకారాలలో ముంచివేయడం ధర్మమేనా?

ప్రభూ! దయచేసి అర్థం చేసికొనండి. యీ విశాల సృష్టిలో భూతదయ కలిగిన హృదయం కంటే విలువైనది మరొకటి లేదు. గుండె నిండా దయని నింపుకుంటే జీవితాన్నెంతో మహోన్నతంగా తీర్చిదిద్దుకోవచ్చు. జీవితాలను ఆనందధామాలుగా దయే మార్చగలదు.

## పెద్దవారు ఆదర్శంగా వుండాలి

ప్రభూ! నా అనుభవంతో చెప్తున్నాను. తోటి జీవులయెడ దయ, శ్రద్ధ, ప్రేమ, వాటిని లాలించడం, పాలించడం,కాపాడటం, యివన్నీ సృష్టినే ఆనందమయంగా చేస్తాయి. మీవంటివారు యిందుకు ఆదర్శంగా వుండాలి. సద్వర్తనులై వుండాలి. రాజు అధర్మవర్తనుడైతే అతడి మంత్రులు, అధికారులు, అధర్మవర్తనులవుతారు. మంత్రులు, అధికారులు అధర్మవర్తనులైతే పురోహితులు, బ్రాహ్మణులు, ఋత్విజులు, గృహస్థులు అధర్మవర్తనులవుతారు. బ్రాహ్మణులు, గృహస్థులు అధర్మవర్తనులైతే రాజ్యంలోని పట్టణాలు, పల్లెలు అవినీతిమయమైపోతాయి.

ప్రభూ! రాజు సద్వర్తనుడైతే మంత్రులు, అధికారులు సద్ధర్మవర్తనులౌతారు. మంత్రులు, అధికారులు సద్ధర్మవర్తనులైతే బ్రాహ్మణులు, ఉపాధ్యాయులు, గృహస్థులు సద్ధర్మవర్తనులవుతారు. బ్రాహ్మణులు, ఉపాధ్యాయులు, గృహస్థులు సద్ధర్మవర్తనులైతే రాజ్యంలోని పట్టణాలు, పల్లెలు నీతివంతమవుతాయి.

ప్రభూ! ఆవులమందలో ముందున్న ముసలియెద్దు ప్రక్కదారి పట్టినట్లయితే తక్కిన వన్నీ అదేదారి తీస్తాయి. అదేవిధంగా పెద్దరికం వహించేవాడు హింసకుడైతే తక్కినవారందరూ అటువంటి హింసామార్గాన్నే అవలంబిస్తారు.

ప్రభూ! మీరు సద్వర్తనులైతే యావత్తు ప్రజలు మిమ్మల్నే అనుసరిస్తారు. మీ మంచితనం వల్ల, అహింసవల్ల, సద్వర్తన వల్ల రాజ్యమంతా సుఖసంతోషాలతో మనగలుగుతుంది.

అందుకే ప్రభూ! దయచేసి అర్థం చేసుకోవండి. యీ హింసామార్గం విడనాడండి. యీ విశాలసృష్టిలో భూతదయకలిగిన హృదయంకంటే విలువైనది ఆనందకరమైనది మరొకటిలేదని మరలమరల చెప్తున్నాను. ప్రభూ! యే జీవినీ యికముందు యెందుకోసమూ చంపకుండా చట్టం చేయండి. ప్రభూ! చూశారా! యీ మేకని? పిడిసిముష్టాలక్రితం యిది వణికిపోతూ తనని రక్షించే వారెవరూ లేక, ప్రాణం బిక్కటపడి, బలిపీఠంవద్ద బలవంతంగా నుంచున్నది. తనపిల్లలనో, తల్లులనో, కడసారిగా తలుచుకుంటున్నది. చూశారా.. యిప్పుడెలా పసిబిడ్డలా నా కాళ్ళను చుట్టుకుపోతూందో? యీ మమతావాత్సల్యాలలో యెంత ఆనందముందో మీరు యెరుగుదురా? ప్రభూ మన పిల్లలకూ దీనికీ యేటువంటి తేడా లేదు ప్రభూ! ప్రాణమన్నింటికీ వొక్కటే. యీ మేకని చూస్తే మీకు జాలి వెయ్యడం లేదూ?

యివి బతికి వుండటమే మనకు కూడా సౌఖ్యం ప్రభూ! జీవులన్నీ వొకదానిపైవొకటి ఆధారపడిబతుకుతున్నాయి. మనిషి అయితే యించుమించు పూర్తిగా జీవులపైనే ఆధారపడి బతుకుతున్నాడు. ఆ జీవులుసైతం మనిషికి సేవచేశాకే, తమ పిల్లలకు పాలుయిస్తున్నాయి. భూమిని సారవంతం చేస్తున్నాయి. ప్రభూ! యీ దారుణమైన జంతుబలిని ఆపండి. చరిత్ర శాశ్వతకీర్తిని, ఆనందాన్ని పొందండి... జీవులకు ప్రాణభిక్షపెట్టండి... మనుష్యులకు నిస్వార్థంగా ఫలపుష్పాలను అందించే వృక్ష దేవతలను కాపాడండి.

అతడిమాటలు కారుచీకటిలో కాంతిరేఖలవలె ఆ ప్రాంతం అంతా ప్రకాశించాయి. దిక్కులను నిద్దురలేపే దేవనాదాల్లా వారి హృదయాల్లో మార్మోగాయి. తుఫాను సంద్రపు అలల్లా వారిని చుట్టుకు పోయాయి. ఆతడు చిట్ట చీకటిలో జ్ఞానజ్యోతిలా కనిపించాడందరికీ.

అతడి వచనాలకు బింబిసారుడు విచలితుడైపోయాడు. అతడికి సిద్ధార్థుడిలో దిఙ్మండలాలనేలే మహామూర్తుడే కనిపించాడు. యిన్నాళ్ళూ తాను రాజ్యం అంటే కేవలం మనుషులదే అని భావించాడు. రాజ్యమంటే కేవలం మనుషులదే కాదు, ప్రకృతి ప్రాణులన్నింటిదీ కూడా. తాను గొప్ప చక్రవర్తినై యుండీకూడా యిలా తన స్వార్థం కోసం యిన్నాళ్ళూ యజ్ఞ యాగాల పేరుతో వేలాది మూగజీవాలను అన్యాయంగా, కిరాతకంగా బలిచేశాడు. వేలాది వేలాదివనువృక్షాలనుసైతం, యజ్ఞవాటికల, బసల నిర్మాణానికి నరికివేయించాడు. తనంటేతనకే సిగ్గువేస్తోంది. యెన్ని వేదాలు చెప్పాడు?

అక్కడ వున్న వారందరి హృదయాలలో కూడా యించుమించు యిటువంటి భావమే వుదయించింది. సిద్ధార్థుని వచనాలు వారందరిలోనూ మానవతాజ్యోతులను వెలిగించాయి. వారికి కూడా విసుగు పుట్టిస్తోంది. బలులు చేసి చేసి వారిలోకూడా జీవితాశలు చచ్చిపోయాయి. జీవితంలో యేటువంటి చైతన్యానందమూ లేకుండా యెప్పుడూ జీవుల్ని చంపడాలు, తోళ్ళుతియ్యడాలు, మాంసఖండికలు పీకడాలు నెత్తురు మడుగులలో, మూగజీవాల యేడుపులతో వాళ్ళకి జీవితమే వొక

నరకంలా శాపంలా అనిపించసాగింది. యిన్నాళ్ళీ ఘోరహింసలు? యీ మరణహోమాలు? యిక వీటిని కట్టిపెట్టి వేరొక మానవీయ పద్ధతులను పాటించడం మంచిదన్న భావన కల్గింది వారిలో. ఋత్విజులు అంతకుక్రితం నరికిన మేకల రక్తం తమ చేతులకు అంటివుండటం గమనించి, తమ చేతుల్ని తమ వస్త్రాలమధ్య దాచేసుకుని తడుచుకోసాగారు. మాంసంముక్కలు కోయడానికీ, తోళ్ళు తీయడానికీ బలవంతంగా తీసుకువచ్చిన - రైతులు యెదురు చూడని మంచి జరుగుతుంటే చూసి ఆనందఆనందంలో నోటమాటరాక నిశ్చేష్టులైపోతున్నారు.

లోపల యజ్ఞవాటికలో, లోపలికి వెళ్ళిన కాషాయాంబరధారి, పశుబలిని ఆపు చేశాడని పసికట్టి వాకబుచేసి రూఢపరుచుకున్న ప్రజలు, తాము అంతటి మహనీయుని అనుసరిస్తూ వెంట వచ్చినందుకు పుల్కితబ్బిబ్బయిపోయారు. ఆ మహత్కార్యం తామే సాధించినంత ఆనంద పడిపోయారు. తెలిసిందే తెలుసుకుంటూ, చెప్పిందే చెప్పుకుంటూ, దానికి వర్ణనలు కూడా జత చేస్తూ కొత్త వారెవరూ దొరకక, 'మనకి మంచి రోజులొచ్చాయే తల్లులారా'! అని పశువులతో అంటూ, వాటి మెడలను కౌగలించుకుంటూ యెనలేని ఆనందాన్ని పొందుతున్నారు.

బింబిసారుడు సిద్ధార్థునితో 'స్వామీ! నేను యీ సింహాసనానికి అయోగ్యుడ్ని. మీ వంటి జ్ఞానసంపన్నులు, మానవతామూర్తులే యీ సింహాసనానికీ యీ ప్రజలకూ, యీ జీవాలకూ శ్రేయస్సుకల్గిస్తారు. మీ మాటలువిన్నతోడనే నాకు పశ్చాత్తాపంకల్గింది. స్వార్థచింతలు నశించాయి. స్వామీ! యీ సింహాసనాన్ని అలంకరించండి. మీకు యేటువంటికష్టం రాకుండా కాచుకుంటాను. నాకు కాస్త శాంతిని కలుగజేయండి' అని కోరాడు. యెనలేని పశ్చాత్తాపం ధ్వనించిందా గొంతులో.

సిద్ధార్థుడు, 'తనకు రాజ్యాధికారం చెలాయించాలన్న కోరికలేదనీ, తానే స్వయంగా వొక రాజకుమారుడిననీ, అయినా సత్యాన్వేషణకోసం సమస్త సుఖాలు వదిలి, లోక సంచారంచేస్తూ యిటువచ్చానని చెప్పగానే, అందరూ ఆశ్చర్య చకితులయ్యారు.

సత్యాన్వేషణ కోసం, నవయవ్వనంలో వున్న వొక అందాల రాకుమారుడు రాజ్య సుఖాలను వదిలి, దేశసంచారం చేయడం, అందరూ అతి చిన్న విషయంగా భావించే మూగ జీవాల వధను నేరుగా యజ్ఞవాటిక దగ్గర మహారాజు యెదురుగానే ఖండించి అతనినే తనవైపు తిప్పుకోవడం... యిదంతా అందరికీ చాలా ఆశ్చర్యంగా, సంభ్రమంగా, ఆనందంగా వుంది. అందరూకూడా 'మూగజీవాలను చంపకూడదు, వాటిని ప్రేమగాపెంచుకోవాలి, వాటి పాలు ఆహారానికీ, వాటి విసర్జితాలు వ్యవసాయానికీ పనికివస్తాయి. పొలాలు దున్నడానికీ, ప్రయాణాలకు వాటిని వాడుతూనే వున్నాం. ఆ వుపయోగాలు చాలు. వాటిని చంపికూడా వాటి మాంసాన్ని తినడం దారుణం. యింక యెప్పుడూ అట్లాంటి హీనపు పనులు చెయ్యకూడదు', అని అనుకోసాగారు.

బింబిసారుడు అప్పటికప్పుడే తన మగధ రాజ్యంలో మూగజీవాల బలిని, యజ్ఞకర్మలను నిషేధించుతూ శాసనాన్ని ప్రకటించాడు. సిద్ధార్థుని కనీసం తన రాజగురువుగా వుండవలసిందిగా కోరాడు.

పశుబలి ఆపడమే కాకుండా, యికంగా రాజ్యంలో పశుబలులే వుండకుండా రాజశాసనమే వచ్చిందని తెలియగానే, యజ్ఞవాటిక బయట వేచివున్న ప్రజల ఆనందానికి అంతులేదు. చల్లుకోవడానికి రంగులు లేక యిసుకా, మట్టీ నెత్తిన చల్లుకున్నారు. కొమలువంచి ఆకులూ, పువ్వులూ తెంపి నెత్తిమీద పోసుకున్నారు. మోకాటిలోతు నీళ్ళల్లో సైతం యీతలు కొడుతూ కేరింతలు కొట్టారు.

బింబిసారుడు బలి చెయ్యడానికి సిద్ధంగా వుంచిన అన్ని రకాల పశువులకూ వెంటనే స్వేచ్ఛ కల్పించాడు. బ్రాహ్మణులకూ, ఋత్విజులకూ మాత్రమే కాకుండా అక్కడకు చేరిన సాధారణ జనులకుసైతం తనకు చెందిన వాటిని చంపకుండా వుండే తీరున దానం చేసివేశాడు. మిగతావాటిని యెక్కడెక్కడి నుంచి వాటిని తెప్పించాడో ఆయా చోట్లకి ఆయా పశువుల్ని భద్రంగా పంపివేశాడు.

తన విన్నపానికి యింతో చలించిపోవడమే కాకుండా, పశువులకు ప్రాణభిక్ష పెట్టి, రాజ్యాన్నే తనకోసం త్యాగం చేయబోవడమే కాకుండా, భవిష్యత్తులో యెక్కడా తన రాజ్యంలో మూగజీవాల ఆర్తనాదాలు వినిపించకుండా శాసనాన్నే ప్రకటించిన బింబిసారునిపట్ల సిద్ధార్థునికి యెంతోప్రేమ కృతజ్ఞత ఆదరణ, గౌరవం కలిగాయి. రాజగురువుగా వుండవలసిందన్న అతని కోరికను అత్యంత సున్నితంగా, తాను సత్యాన్వేషణలో వున్నాననీ, యెన్నో దూరప్రాంతాలు తిరగవలెనను కుంటున్నానని, తన సత్యాన్వేషణ విజయవంతం అయితే తప్పక వెనుకకువచ్చి తన ఋణాన్ని తీర్చుకుంటాననీ చెప్పాడు. యజ్ఞవాటికను వదిలి, పూర్తివివర తాను విశ్రాంతి తీసుకొంటున్న పాండవవనాల్లోకి సిద్ధార్థుడు సాగిపోయాడు. ప్రశాంతంగా, జీవనదిలా సాగిపోతున్న అతన్ని చూసి, అతనికెటువంటి యిబ్బందీ కలగకుండా అక్కడకు చేరినవారందరూ స్థాణువుల్లా వుండిపోయారు. రైతులు అతడు వెళ్ళిపోయిన పాదధూళులను నేలపైకి వంగి తాకుతూ ధూళి నెత్తిన జల్లుకుంటూ యెంతో ఆనంద పడ్డారు.

బింబిసారుని మనస్సు మనస్సులో లేదు. అతీతశక్తి యేదో ఆవహించి తన చేత కొత్త జీవితం యెత్తించినట్లుగా వుందతడికి. కానీ పాకవేవు సిద్ధార్థుని చూస్తుంటే, అతడి త్యాగజీవితానికి తట్టుకోలేక పోతున్నాడు. తన పుత్రుడు అజాతశత్రువులాంటివాడు. రాజ్యసౌఖ్యాలలో మునిగి తేల వలసినవాడు. యిలా పరివ్రాజకుడై దేశాలుపట్టి తిరుగుతున్నాడనేసరికి అతడికి సిద్ధార్థునిపై అంతులేనంత పుత్రవాత్సల్యం కలిగి కళ్ళమ్మట నీళ్ళువచ్చేశాయి. అక్కడ సిద్ధార్థుడి తండ్రి శుద్ధోదనుడు యెంత బాధపడుతూ వుంటాడో వూహించి, యింక ఆగలేకపోయాడు. వుదయం అయ్యే సరికల్లా పాండవ వనానికి దారితీశాడు.

తనకోసం చక్రవర్తే వెతుక్కుంటూ రావడం చూసిన సిద్ధార్థుడు , బింబిసారుణ్ణి సాదరంగా తానుకూర్చున్న చెట్టుక్రిందికి ఆహ్వానించాడు. మెత్తని శయ్యలమీద, రత్న ఖచిత సింహాసనాలమీద కూర్చునే బింబిసారుడు ఆ చెట్టుక్రింద మొలిచిన మెత్తని గడ్డిపై రాలినపువ్వులపై యింతకు మునుపెప్పుడూ పొందని సౌఖ్యంతో కూర్చున్నాడు. తెల తెలవారుతూంది. నెమ్మదిగా సిద్ధార్థుడితో అన్నాడు :

"నాయనా! వయసులో నీ తండ్రి వంటివాడిని. నిన్న యజ్ఞవాటిక నుండి నువ్వు వెళ్ళిపోయినప్పటినుండీ నా మనసు మనసులో లేదు. రాత్రల్లా ఆలోచనలు. నిన్ను చూడాలనిపించేది. యెప్పుడు వుదయం అవుతుందా అనిపించేది. బాబూ! నీసౌశీల్యం, అహింస, ప్రేమ... నన్నేకాదు యీ రాజ్యాన్నే వొక్క కుదుపు కుదిపేశాయి. చిన్నవాడివైనా పెద్దగుండె చూపావు.

.... కానీ నాయనా! వొక్కటే తట్టుకోలేకపోతున్నానయ్యా! నువ్వెంతో మంచిగా ఆలోచిస్తావు. మంచి పనులు చేస్తావు. కానీ యీ పనులన్నీ నువ్వు హాయిగా, సుఖపడుతూనే చెయ్య వచ్చుకదయ్యా! వుదయం అయ్యేసరికి, నువ్వెక్కడికో, యే అడవులకో వెళ్ళి పోతావని, నాకింక కనిపించవే కనిపించవనీ యెంతో బెంగపడ్డాను బాబూ! నిన్ను చూసిన వాళ్ళెవరూ నిన్ను వదులుకోలేరు.

జీవితాంతం నిన్ను చూసుకుంటూ బతికెయ్యాలనిపిస్తుంది. నేను వట్టినే యీ మాటలు అనడం లేదు. నాకూ నీతోటి కొడుకు వున్నాడు. వాడిమీద నాకెంతో ప్రేమ. కానీ.. నాయనా... సిద్ధార్థా... నిన్ను చూశాక, అక్కడ నీ తండ్రి శుద్ధోదనుడు పడుతున్నబాధను, నీ వంటి మేలైన పుత్రుడికి, ఒగరేక పుత్రుడికి దూరంగా బతుకుతున్న శుద్ధోదనుణ్ణి తలవగానే, అతడుపడేంత బాధ అంతా నేనూ పడుతున్నాను.

.... బాబూ! నువ్వు చేసే మంచి పనులన్నీ జీవితంలో సుఖిస్తూనే చెయ్యి. నిన్ను కాదన్న దెవ్వరు? యింటికి వెళ్తే నీ రాజ్యం నీకుంది. యిక్కడ వుంటానంటే యీ రాజ్యమే నీకుంది. నీ శక్తి యుక్తులతో, తెలివితేటలతో యీ రాజ్యాన్ని నడుపు. విస్తరింపు. నీకు అడ్డులేదు. యెవరి జోక్యమూ వుండదు. నీ వంటి వుదాత్త చరితుడి పరిపాలనలో యీ రాజ్యం సుభిక్షమవుతుంది. బాబూ! నిన్ను వదులుకోలేక పోతున్నానయ్యా! నా దగ్గర రాజ్యం తీసుకోవడం నీకు అభిమానంగా అనిపిస్తే రా! నా సైన్యాల్ని నడుపు. నీదైన విశాలరాజ్యాన్ని స్థాపించు.

.... యీ తత్వచింతన వృద్ధులైన తరువాత యెవరికైనా వచ్చేదే. నువ్వూ అలాగే చెయ్యి... యెందుకూ యౌవ్వనాన్నిలా వృథా చేయడం? వృద్ధాప్యంలో తత్వచింతన మనకు వున్నదే కదా!

......నాయనా సిద్ధార్థా! నామాట కాదనవు అన్న నమ్మకంతో అడుగుతున్నాను. రాజభవనానికి వచ్చెయ్యి. రాజుగా వచ్చినాసరే! రాజర్షిగా వచ్చినాసరే. యిలానే వుంటానన్నాసరే! నాయనా! కుమారా! నువ్వు నా కళ్ళయెదురుగా వుండాలన్న నా కోరిక తీర్చు.." అంటూంటే, అంతటి మహారాజు అయివుండీకూడా బింబిసారుడికి గిర్రున కళ్ళనీళ్ళు తిరిగాయి. (సిద్ధార్థుని, శుద్ధోదనునికన్నా యెక్కువగా ప్రేమించిన వ్యక్తి బింబిసారుడు. సిద్ధార్థుని చూడగానే అతడికి పుత్రవాత్సల్యం వరదలా పొంగుకు వచ్చేది. సిద్ధార్థుడు కూడా బింబిసారుణ్ణి యెంతో గౌరవించాడు. ప్రేమించాడు. వారి ప్రేమానుబంధం గుండెల్ని ద్రవింప చేస్తుంది. మూగ జీవాల విషయంలో సిద్ధార్థుడికిచ్చిన మాటను జీవితాంతం నిలబెట్టుకున్నాడు బింబిసారుడు. సిద్ధార్థుడైతే తథాగతుడైన తరువాత యెక్కువకాలం రాజగృహంలోనే గడిపాడు.

## జీవితం యెంతో విలువైంది

బింబిసారుని మాటలకు అతనిపై సిద్ధార్థునికెంతో ప్రేమ, గౌరవం కల్గాయి. బింబిసారుడి ఆప్యాయతకూ, పితృవాత్సల్యానికీ అతడి గుండె పొరలు కదిలిపోయాయి. అయినా తన వుద్దేశాల్ని, తన తండ్రి శుద్ధోదనుడికి చెప్పినంత స్పష్టంగానూ బింబిసారుడికి కూడా చెప్పాడు.

"మహారాజా! మీ వాత్సల్యానికి యెంతో ఆనందపడుతున్నాను. కానీ నాకు ప్రాపంచిక సుఖాలమీద రవ్వంత కూడా కాంక్షలేదు. సర్వసంగ పరిత్యాగినయ్యాను. యీ సుఖాలవల్ల యేటువంటి ప్రయోజనమూ లేదు. సుఖం అంతకంటే లేదు. నా అన్వేషణ అంతా దుఃఖాన్ని జయించడం యెలా అనేదే. భౌతికమైన సుఖాలు, వాటిని మళ్ళీ మళ్ళీ కోరుకునేట్టు చేస్తాయి. రాగబంధాలు కూడా దుఃఖాన్నే కల్గిస్తాయి. యీ ప్రపంచంలో యేదైతే దుఃఖాన్ని కల్గిస్తుందో, దుఃఖానికి ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగా గానీ, తక్షణం గానీ, ఆలస్యంగా గానీ కారణ మవుతుందో అటువంటివాటిని పరిత్యజించాను. నేనిప్పటికి తెలుసుకున్నది యేమిటంటే స్వార్థత్యాగంలో సుఖం వున్నదీ అని. జీవితాన్ని, సిరిసంపదల్ని, శక్తి యుక్తులన్నింటినీ యితరుల సౌఖ్యం కొరకు, వారు సక్రమమార్గంలో బతుకుటకొరకు వెచ్చించడంలోనే యెక్కువ సౌఖ్యం వుంది. యింతటి గొప్ప సౌఖ్యాన్ని నేను అనుభవిస్తూ వుండగా,

మళ్ళా నన్ను నేను వదిలివేసిన రాజ్యపాలన చెయ్యమనీ, సుఖాలు అనుభవించమనీ చెప్పడంలో అర్థం వుందా? పుత్రవాత్సల్యం కొద్దీ మీరు యీ మాటలంటున్నారు నిజమే. అందుకు మిమ్మల్నేమీ నేను తప్పుపట్టడం లేదు. కానీ నన్ను నా సత్యాన్వేషణలో విజయం పొందవలసిందని నన్ను ఆశీర్వదించవలసింది పోయి నన్ను మళ్ళా యీ తృష్ణాసాగరంలో లాగివెయ్యాలనుకుంటే అది యెవరికీ సాధ్యంకాదు. విషసర్పాలు చుట్టుముట్టినా, ఆకాశం ఒక్కసారి పిడుగులు పడినా నా నిశ్చయాన్నుండి నేను మరలలేను. దుఃఖాన్ని జయించాలనే నా సత్యాన్వేషణ నుండి నేను మరలలేను, యీ అన్వేషణలోనే నాకు సుఖం వుంది'.......

మహారాజా నేను మీకు కొన్ని విషయాలు చెప్తాను.

సౌఖ్యమంటే యేమిటి?

ప్రాపంచిక సుఖాలు నిజంగా సుఖం కల్గిస్తాయా? జాగ్రత్తగా ఆలోచిస్తే యివన్నీ దుఃఖాన్నే కల్గిస్తాయి. విషయలోలుర్ని తయారు చేస్తాయి. బాధ్యతల్నుండి తప్పించుకునేట్టు చేస్తాయి. చేయరాని పనుల్ని చేసేట్టు చేస్తాయి. వొక కోరికనుండి మరొక కోరికకు నిచ్చెన మెట్లువేస్తాయి. అసలైన తృప్తి అన్నది యెప్పటికైనా కలుగుతుందా? యెన్ని కోరికలు తీర్చుకుంటున్నా యింకా కోరికలు పుడుతూనే వుంటాయి. తృప్తి అనేది కలుగదు. నిస్సారమైన యెముకకోసం ఆకలితో వున్న కుక్క వెంపరలాడినట్లు యెన్ని సుఖాలు అనుభవించినప్పటికీ మనుషులకు తృప్తి అనేది కలగదు.

... రాజా! గమనించండి!! యే సుఖమైనా అవసరానికి మించి యెవరైనా అనుభవించగలరా? దాహం వేసినప్పుడు నీళ్ళుతాగితే దప్పిక తీరుతుంది. అన్నం తింటే ఆకలి తీరుతుంది. యెండ, గాలి, వానలనుండి యిల్లు రక్షిస్తుంది. గాలి ధూళి తగలకుండా బట్టలు వుపయోగపడతాయి. నిద్రమత్తును తొలగించుకునేందుకు పడక వుపయోగ పడుతుంది. యివన్నీ శరీరానికి బాధలు కలగకుండా వుండటానికి వుపయోగపడే సాధనాలు మాత్రమే. యిందులో ప్రత్యేకత యేముంది? యేది తిన్నా ఆకలి తీరుతుంది. యేది కట్టినా అది వంటిని కప్పుతుంది. యెండ, వానలనుండి రక్షించేది అది భవనమైనా, పూరిల్లయినా, చెట్టునీడ అయినా వొకటే. అలాంటప్పుడు విలువైన సమయాన్ని జ్ఞాన సాధనకు వుపయోగించుకోకుండా, ఆ సుఖాల్ని మరింత సుఖంగా మార్చుకోవడం కోసం ఖర్చుపెట్టడం తెలివైనపని అవుతుందా? సుఖం పైన సుఖం, సుఖంపైన సుఖం యివన్నీ కష్టంపైన కష్టం, కష్టంపైన కష్టం... అసంతృప్తి, ఆవేదనా, అశాంతి, అసహనమూ దుఃఖమూ కలిగించి చివరికి జీవితాన్ని పతనం చేయడానికి తప్పించి యెందుకుపనికి వస్తాయీ సుఖాలు?

సుఖాలకోసం వెంపరలాడటం వొక దండగ మాలిన పని. యీ సుఖాలు, సంతోషాలు శాశ్వతమైనవి కావు. యివి దుఃఖానికీ, యెడబాటుకు, విచారానికి దారితీస్తాయి. అప్పుడు పడే బాధను భరించడం కంటే, అసలు మొదటే వాటిని పొందకుండా వుండటం, వాటికోసం అర్రులు చాచకుండా వుండటం యెంతో వుత్తమం. యీ భూప్రపంచాన్నంతటినీ జయించినా మీరు వుండేది వొక భవనంలోనే, పడుకునేది వొక ప్రక్కమీదే, తినేది వొక పూటకొక తిండే, కట్టేది వొక బట్టే, వొక్కసారి వందతిళ్ళు తింటారా, తినగలరా యెవరైనా?

దుఃఖాన్ని జయించాలన్న కోరికతో, కోరికోరి యీ భిక్షుజీవితాన్ని యెంచుకున్నాను. నా ఆశయాల్ని సాధించేందుకు యీ భిక్షుజీవితం నాకెంతో వుపయోగపడుతోంది. నేనెంత హాయిననుభవిస్తున్నానో మీకెలా చెప్పగలను? రాగద్వేషాలను విడిచి పెట్టాక మనస్సు ప్రశాంతమైంది. సమయం

విలువ తెలుసుకున్నాను. నాకు ప్రతిక్షణం యెంతో విలువైంది. గతించిన కాలంలో ఒక్కక్షణాన్ని కూడా వెనక్కు తీసుకురాలేం. నా సర్వశక్తుల్నీ సత్యాన్వేషణకూ, దుఃఖనిర్మూలనకూ, ప్రజలమంచి, ప్రకృతినుంచీ విషయాలు తెలుసుకునేందుకూ ఖర్చు పెడుతున్నాను. ఆ గొప్ప జ్ఞానం ముందర, ఆ జ్ఞానం యిచ్చే సౌఖ్యం ముందర... యీ భౌతిక సుఖాలు నా దృష్టిలో గడ్డిపోచ కంటే హీనమైనవి. జ్ఞాన సౌఖ్యం పొందిన మనిషికి మళ్ళీ పూర్వ స్థితికి చేరుకోవాలని యెప్పటికీ అనిపించదు. గుడ్డునుంచి పక్షి బయటకు వచ్చాక అది రెక్కలువిప్పార్చి దిగంతాలకేగుతుంది గానీ, తిరిగి గుడ్డులోకి ప్రవేశించాలని చూస్తుందా? అలా కోరుకుంటుందా?

...... యీ ప్రపంచం అంతా నిత్యసంఘర్షితంగా వుండటంచూసి నేనెంతో వ్యధ చెందాను. మనుష్యులమధ్య యీ ఘర్షణలను నివారించి శాంతిని స్థాపించాలన్న ధ్యేయంతోనే బయలుదేరాను. యిలాంటి చీకూ-చింతాలేని స్వర్గంలో స్థానం కల్పిస్తామన్నా అది నాకు అంగీకారం కాదు. స్వర్గ సుఖాలు లభిస్తాయనిగానీ, మనిషి సుఖ పడటానికనిగానీ మరొక జీవిని చంపడం తప్పుదనే సిద్ధాంతాన్ని నేను పూర్తిగా ద్వేషిస్తాను. మహారాజా! కరుణారసప్రధానమైన, నీతివంతమైన, అహింసాయుతమైన జీవిత విధానం అన్ని వయస్కులవారికీ అవసరమే. ప్రశాంతతను కోరుకునే వాళ్ళెవ్వరూ వృద్ధాప్యం వరకూ దానికోసం వేచివుండరు. యీలోగానే అతడు మరణిస్తే యేమిటి అతడిగతి? మహారాజా! నాసత్యాన్వేషణ ముగిసినవెంటనే తప్పకుండా యీ రాజ్యానికి తిరిగి వస్తాను. మూగజీవాలకు మీరు చేసిన సేవలకు ప్రతిగా నా ఋణాన్ని తీర్చుకుంటాను యిది తప్పకుండా జరుగుతుంది", అన్నాడు.

బింబిసారుడేమీ మాట్లాడలేక పోయాడు. సిద్ధార్థుని స్థిరమైన అభిప్రాయాలకు, సత్యాన్వేషణా తృష్ణకు చలించిపోయాడు. తనకంటా యెంతో చిన్నవాడు, గొప్పరాజ్యం చేతుల్లో వుండీకూడా సన్యసించి, నిష్కామ జీవితాన్ని గడుపుతుంటే, ఆ జీవితంలో జ్ఞానాన్ని, అనుభవాన్ని అభివృద్ధి చేసుకుంటూవుంటే, మితంగా జీవించడంలోని సౌఖ్యాన్ని, వున్నతత్వాన్ని ఆచరణ పూర్వకంగా ఋజువుచేస్తుంటే, తాను సుఖభోగాలకు లోనుకావడం, అంతటితో పరిపోనట్టు యజ్ఞాలు చేసి వాటిల్లో లెక్కలేనన్ని మూగజీవాలను చంపబోవడం.... యిదంతా అతడికి సిగ్గుగా అనిపించింది. చిన్నవాడైనా పెద్దమనసుతో చెప్పిన సిద్ధార్థుడి మాటల్ని తు.చ. తప్పక తాను ఆచరించి తన రాజ్యంలోని ప్రజలుచేత ఆచరింపచేసేందుకు నిర్ణయం తీసుకున్నాడు. యెంతో సేపటికి సిద్ధార్థుని వదలలేక వదలలేక బింబిసారుడు సెలవుపుచ్చుకున్నాడు.

కొద్ది రోజుల్లోనే సిద్ధార్థుడు ఆ ప్రాంతంనుండి వురువేలారణ్యంవైపుకి ప్రయాణం సాగించాడు. అతని ప్రయాణమంతా యెంతో ఆహ్లాదంగా సాగింది. వురువేలారణ్య ప్రదేశం అయితే అతడికి చాలా నచ్చింది. కన్నులకు పండుగ చేసింది. కడురమణీయంగా వుందా ప్రదేశం. విభిన్న ఆకృతులతో, రంగు రంగుల పువ్వులతో నిండిన పచ్చటి వృక్షాలు. నీటి కొలనులు. సరస్సుల చిరు సంగీతంలా కురిసే వర్షాలు. కొండలు. లోయలు. యెన్నెన్నో పక్షులు - జంతువులు... యెక్కడా చూడని అందాలవి. అతడు తిరిగిన అన్ని ప్రదేశాలకంటే యీ ప్రదేశమే అతడికి చాలా నచ్చింది.

అక్కడే నివాసం యేర్పరచుకుని, ఆళారకాలాముడు, వుద్రాకరామ పుత్రుడు బోధించిన ధ్యాన పద్ధతుల్ని ఆచరించ సాగాడు. ఆ ధ్యాన పద్ధతుల్ని మరింత మెరుగుపరిచి, మనిషిలో వున్న తెలియని శక్తులన్నీ తెలుసుకోవాలని నిర్ణయించుకున్నాడు.

యింకా అతడికి అప్పుడప్పుడు యశోధర, రాహులుడు, తల్లిదండ్రులు, చెన్నుడు జ్ఞాపకానికి వచ్చేవారు. వారి వియోగం అతడికి దుఃఖం కల్గిస్తూనే వుండేది. వెనువెంటనే ఆ జ్ఞాపకాలు రాకూడదు అని తనమనస్సుని తానే శాసించుకునేవాడు. యెందుకంటే తాను దుఃఖాన్ని అనుభవిస్తూ దుఃఖాన్ని పోగొట్టే మార్గాన్ని యెలా దర్శించగలడు? అయితే అతడు పలాయన వాదాన్ని అంగీకరించలేదు. బాధలు మరచిపోయేందుకు తాత్కాలికంగా మత్తు పదార్థాలు వుపయోగ పడతాయని తెలుసు. కానీ ఆ మత్తు పదార్థాలవల్ల బాధలు మరచిపోవడం అనేదీ, మూలంగా గడిచిపోవడం అనేదీ జరగని పని. అతడు ఆయా పదార్థాలకు అలవాటుపడి కృంగికృశించిపోయి, కుక్కలు కన్నా హీనంగా బతుకుతున్న వాళ్ళను అనేకమందిని చూశాడు. మనిషిని పతనం చేసివేసే యీ మత్తుపదార్థాలవాడకాన్ని అతడు తీవ్రంగా ద్వేషించాడు. అంతేకాదు తదనంతరం అతడు బోధించిన పంచశీలలో, అష్టాంగ మార్గాలలో వీటిని నిరాకరించడాన్ని చాలా ప్రధాన విషయంగా విశ్వజనావళి ముందుంచాడు. అయితే అతను చెప్పిందేమిటి? మనస్సుని దృఢపరుచుకోవడం. చెడ్డ ఆలోచనలు వస్తున్నాకూడా వాటిని మంచివిషయాలతో మరల్చడం అనేది యెంతో నైపుణ్యంతో, ఆ ధ్యానం చేస్తేగాని అలవడదు. అందుకొరకు అతడు చక్కని ధ్యాన పద్ధతుల్ని కూడా మానవజాతికి బహూకరించాడు.

నీటిలో తడిసిన కట్టెను బయటికి తీసి దానికి అగ్గి అంటిస్తే అంటుకోదు. యెందుకంటే అది తడిసి వుంటుంది. తడిసి వున్న కట్టెకు అగ్గి అంటించినా అంటుకోదు. యెందుకంటే అదీకూడా తడిసే వుంటుంది. యెండిపోయిన కట్టెకు అగ్గి అంటిస్తే మాత్రం వెంటనే అంటుకుంటుంది. యెందుకంటే అది బాగా యెండిపోయి వుంటుంది కదా!

అలాగే సంసారంలో వున్నంతకాలమూ తనకు జ్ఞానదీప్తి కలుగలేదు. సంసారాన్నుంచి బయటికివచ్చినా తడిసిన కట్టెలాగా ఆ జ్ఞాపకాలు యింకా బాధిస్తున్నందువల్ల తనకి జ్ఞానదీప్తి కలగడం లేదు. అందుకని తాను ఆ యెండిపోయిన కట్టెలాగా అవాలి. దుఃఖమనేది యెరుగని విధంగా గుండెని దిటవు పరుచుకోవాలి. అందుకు కఠోరపరిశ్రమ చేయాలి అని తలిచాడు.

దానితో అతడు కడు కష్టసాధ్యమైన హఠయోగాన్ని చేయనారంభించాడు. హఠయోగం చేయడం అంటే సామాన్యమైన విషయం కాదు. నిద్రాహారాలు మాని, వుచ్ఛ్వాస నిశ్వాసాలు బంధించి, ధ్యానం చేయవలసి వుంటుంది.

యీ హఠయోగం వల్ల సిద్ధార్థునికి చెవులనుండి కూడా శ్వాస వినిపించేది. తలదిమ్మెక్కి పోయేది. పాదాలపైన వస్త్రాన్ని యెవరో గట్టిగా మెలిపెట్టినట్లుండేది. కడుపులో భరించరాని వేదనగా వుండేది. పొట్ట అంతా పరపరా కోసినట్టు వుండేది. యిటువంటి దారుణమైన అనుభవాలు పొందుతున్నా అతడికి వుత్సాహం తగ్గలేదు.

కానీ యెంత వుత్సాహంతో సాధన చేస్తున్నా అతని కడుపులోని వేదన తగ్గేదికాదు. శరీరాన్ని అంతకంతకూ మహావేదనల పాలు చేయడమే తప్ప యీ హఠ యోగం వల్ల ప్రయోజనమేమీ లేనట్టుగా అనిపించ సాగింది. అయినప్పటికీ ఆ హఠ యోగ సాధనలో మిక్కిలి కృషి చేశాడు.

అతడి అతి తీవ్రమైన తపశ్చర్యకు ఆశ్చర్యపడి, అతడు తప్పక జ్ఞానాన్ని పొందుతాడు. ఆ జ్ఞానాన్ని తమకు బోధిస్తాడు అని అయిదుగురు శ్రమణులు అతడిని కనిపెట్టుకుని వుండేవారు. వారిలో వాప్పుడు, భద్దియుడు, మహానాముడు, అశ్వజిత్తుడు చిన్నవారలు కాగా, కౌండిన్యుడు బాగా

పెద్దవాడు. బుద్ధుని పుట్టుకముందే యెరిగినవాడు. సిద్ధార్థుడు మహా పరివ్రాజకుడవుతాడని ముందే జోస్యం చెప్పిన మహా మేధావియితడు. అయినా సిద్ధార్థుని శిష్యుడిగానే వుండదలచాడు. జ్ఞానం విషయంలో పెద్దా, చిన్నా తేడా వుండకూడదనీ, వయసుకంటే జ్ఞానమే మిక్కిలి గొప్పదనీ శ్రమణులు భావించేవారు.

రోజు రోజుకీ హఠ యోగంవలన ప్రయోజనం లేదని తెలుసుకున్న సిద్ధార్థుడు వొక రోజున ఆ సాధన విరమించాడు. తపస్సుని విరమించిన సిద్ధార్థుని చూసి, అతనిపై ఆశలు పెట్టుకున్న ఆ శిష్యులు అయిదుగురూ హతాశులయ్యారు. సిద్ధార్థుడు యోగాన్ని విరమించడమే కాకుండా ఆహారంకూడా తీసుకోవడం మొదలు పెట్టాడు. శరీరాన్ని శుష్కింప చేసుకుంటూ పోతే క్రమేపీ మృత్యువుకి యెర అవడం తప్పించి, జీవితకాలంలో యేమీ సాధించలేం అని సిద్ధార్థుడు గ్రహించాడు.

యిది యెరుగని ఆ అయిదుగురు శిష్యులకీ యిక సిద్ధార్థునికి జ్ఞానోదయం కలగడం అసాధ్యం అనిపించింది. అలాంటప్పుడు యింకా సిద్ధార్థుని కనిపెట్టుకుని వుండటం, అతని నుంచి జ్ఞానాన్ని ఆశించడం శుద్ధ దండగమారి పనిగా భావించి, తాము పెట్టుకున్న ఆశలన్నీ అడియాసలయ్యాయన్న బాధతో, కాలం వృధా అయిందన్న బాధతో, సిద్ధార్థుని దగ్గర కాస్తంత సెలవుగానే సెలవు పుచ్చుకుని కాశీవైపు మరలిపోయారు. కౌండిన్యుడు సైతం తన జోస్యం తప్పు అయిందని బాధపడుతూ వారితో వెళ్ళిపోయాడు.

యిలా శిష్యులు అయిదుగురూ తనని విడిచి వెళ్ళిపోవడం గౌతముడికి బాధ కల్గించలేదు. జ్ఞానాన్ని సాధించడంలో అతని పద్ధతులు అతనివి. ప్రతీ పద్ధతిలోనూ అతడు యేదో వొక సత్యాన్ని తెలుసుకుంటూనే వున్నాడు. తెలుసుకుంటున్న సత్యాలను క్రోడీకరించుకుంటూనే వున్నాడు. అతనికేస్వార్థమూ లేదు. భయం అసలే లేదు. సత్యాన్వేషణే అతని గమ్యం. పైగా యిపుడు యిటువంటి బంధాలకు అతీతుడుగా వుండాలని తలచాడు.

అతడు కేవలం తన జీవికను నిలబెట్టుకోవడానికి మాత్రమే యేమైనా తినేవాడు. అదీ కూడా చాలా కొద్దిగా, అదీ వొక్కపూటే. తాను చేసిన ప్రతిపని నుంచీ అతడు అనేకానేక ఆలోచనలు చేసి సారాంశాలు తీసేవాడు. గ్రహించేవాడు. గుణపాఠాలు తీసుకునేవాడు. చేసినపని యెంత చిన్నదైనా, అదెంత క్లుప్తపాటులో జరిగినా దాని న [illegible] యేదో వొక జ్ఞానాన్ని పొందే ప్రయత్నం చేసి, దానికెన్నో ఆలోచనలు చేసి, పాత అనుభవాలను క్రోడీకరించి, చివరికి విజయం సాధించేవాడు.

మానవసమాజంలో మనుష్యులమధ్యకంటే ప్రకృతిలో వున్న భిన్నత్వం, సంక్లిష్టత, యేకత్వం అతడినెంతో ఆకర్షించింది. ప్రకృతిలో మనిషి తెలుసుకోవలసిన జ్ఞాననిధులెన్నో వున్నాయని గ్రహించాడు. ప్రకృతిలోని జీవులన్నీ తమకు మనిషిలాగా మాటా, చదువూ లేకపోయినా, బతుకు-బతికించు అన్న ధోరణిలో అవి తమ జీవనవిధానాల్ని మలచుకుంటూ, సమస్యల్ని పరిష్కరించుకుంటూ అభివృద్ధి అవుతూవుండడం గమనించాడు. వాటి మధ్య కార్యాకారణ సంబంధాల్ని వూహించాడు. యేదీ తనంతట తానుగా ప్రవర్తించడం లేదనీ, పుట్టడం లేదనీ, పుట్టుకా, బ్రతుకూ, చావూ.. యివన్నీ ఆయా జీవుల కార్యాకారణాల వల్ల, చుట్టూ వున్న ప్రకృతి తోడ్పాటు వల్ల జరుగుతున్నాయని గ్రహించాడు. కొద్దిపాటి తేడాలతో యీ భావాలను మనుష్యులకు కూడా మలచడం మంచికి దారి తీస్తుందని తలచాడు. మాంసాహార జీవులు సైతం, శాకాహార జీవుల సంఖ్య పెరిగిపోయి మొత్తం అడవికే నష్టం తేకుండా, పరోక్షంగా శాకాహారజీవుల రక్షణకే తోడ్పడుతూ వుండడం గమనించాడు.

అతడిని అడవిలోని నిద్రావస్థలోవున్న కీటకాలు, అతిచిన్న చీమలతో సహా మహా భీకర ధ్వనులుచేసే అడవి సింహాలూ, మదపుటేనుగులూ, ఖడ్గమృగాలు సైతం అమితంగా ఆకర్షించాయి. వాటి జీవన రీతులను యెంతో శ్రద్ధతో అధ్యయనం చేస్తూ, వాటికీ మానవుల ప్రవర్తనకూగల పరస్పర సంబంధాన్ని విశ్లేషించుకునేవాడు. జీవరాశుల ప్రేమాభిమానాలకూ, నిర్మలత్వానికీ, ప్రకృతి పరిరక్షణకూ, ప్రశాంతతకోసంపడే తపనకూ అతడికెంతో ఆశ్చర్యం కలిగేది. కోతులు, యేనుగులు, ఖడ్గ మృగాలు అతణ్ని విశేషంగా ఆకర్షించాయి. ఆకట్టుకున్నాయి. అవి అతడితో చెలిమి చేసేవి. అతణ్ని యిష్టపడేవి.

యేజీవికైనా తన వల్ల బాధకలుగకూడదని భావించేవాడు. తనవల్ల యే జీవికి ప్రశాంతత భగ్నం కాకూడదని తలిచేవాడు. వాటికి దూరంగా వెళ్ళిపోయేవాడు. తానేదో ప్రపంచం కోసం ఘోర తపస్సు చేస్తున్నాను కాబట్టి తన ప్రశాంతతకు భగ్నం కాకుండా ఆ అడవిలో తానెంచుకున్న చోట చెట్లన్నీ కొట్టేసి, నేలంతా చదును చేసి పారేసి, చుట్టూవున్న పక్షుల్నీ జంతువుల్నీ తరిమి కొట్టేసి, పర్ణుటి గృహం యేర్పాటు చేసుకోవాలని అతడు తలచలేదు. అతడికి కావలసింది అటువంటి శ్మశాన ప్రశాంతి కాదు. ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగాగానీ యే సదుద్దేశం కోసమైనా సరే, యే జీవికైనా అంతెంత చిన్నదైనా దానికి అపకారం తలపెట్టడం అన్నది అతడికెంత మాత్రమూ అంగీకారం కాదు. అతడు కనుగొని ప్రవచించిన బుద్ధమతసారాంశం కూడా అదే. జీవులు చిన్నవైనా, పెద్దవైనా, పాలిచ్చేవైనా, విషంతో కరిచేవైనా, అవి చెట్లయినా, మొక్కలైనా, యేవైనా సరే ప్రకృతిలో స్వేచ్ఛగా బ్రతకడానికీ, అభివృద్ధి అవడానికీ పూర్తి హక్కులుగలవాటిగా అతడు భావించాడు. వాటిని బాధపెట్టడానికిగానీ, అడ్డుకోవడానికిగానీ, బంధించడానికిగానీ, చంపడానికిగానీ మనిషికి యెటువంటి హక్కూలేదని, వాటి విషయంలో మనుష్యులు అసలు జోక్యం చేసుకోకూడదని భావించాడు. అప్పుడే మనిషికి కూడా ప్రకృతి నుంచీ పరిసరాలనుండీ పూర్తి రక్షణ కలుగుతుందని వూహించాడు.

కొన్ని రోజులు ఆహారంగా యే వేళ్ళ కషాయమో తాగేవాడు. జనావాసాలకు వెళ్ళినప్పుడు వొక్క యింటిలో మాత్రమే భిక్ష అడిగేవాడు. వొకే వొక రేగుపండు తిని రోజంతా వుండిపోయేవాడు. పశువుల చర్మాన్ని తీసేవారు పారేసిన చర్మపు ముక్కలు యికయెందుకూ పనికి రానివి తినేవాడు. గడ్డి చివుళ్ళు తినేవాడు. పేడ కూడా తినేవాడు. వీధుల్లో పడేసిన చింకి గుడ్డలు యేరుకుని, చిన్న బట్టగా కుట్టుకుని ధరించేవాడు. శ్మశానాల్లో శవాల మీద కప్పిపారేసిన గుడ్డల్ని కూడా కట్టుకునేవాడు. యిదంతా మనిషి సుఖలాలసతలో మునిగిపోకూడదనీ, అత్యంత సాదాగా బతకవచ్చుననీ, బతకడం కోసం యే జీవినీ బాధపెట్టనక్కరలేదనీ, యే వస్తువునీ వృథాచేయునవసరం లేదనీ, దుఃఖాన్ని జయించాలనీ, మొదలైన విషయాలను స్వయంగా అనుభవించి నిరూపించడం కోసమే.

యిటువంటిదేహ పరీక్షల వల్ల అతడికి తనకొక దేహం వున్నదన్న సంగతే మరపుకు వచ్చేది. స్నానం చేస్తే రోజుకి మూడుసార్లు చేసేవాడు. చిట్టచలిలో అర్ధరాత్రి పూట ఆరుబయల్లో తిరిగేవాడు. కణకణలాడే మండుటెండల్లో, నిప్పులు చెలరేగే యిసుకమేటల మీద బోసికాళ్ళతో గంటల తరబడి నడిచేవాడు. లేకపోతే ఆ మండుటిసుకలో గంటలతరబడి నిలబడే వుండిపోయేవాడు. వొకసారి రోజుల తరబడి స్నానం మాటే మరిచేవాడు. అతని వొళ్ళంతా అంగుళం మందాన దుమ్ము అట్టకట్టి పోయి వుండేది. తన వల్ల యే జీవికీ యెటువంటి అపకారమూ జరకూడదని అతడి తలపు. కనీసం మరొక జీవికి క్షణం సేపు అయినా అడ్డంకుగా వుండడం కూడా యిష్టపడేవాడు కాదు. యే జీవి అయినా అతని దాపులకి వస్తే త్వరత్వరగా ఆ జీవినుంచి తప్పుకుని వెళ్ళిపోయేవాడు. నెలల తరబడి మనుషులకి అసలు కనిపించేవాడుకాదు. వారు కనబడకుండా కీకారణ్యాలలోకి వెళ్ళిపోయేవాడు.

యీ నిరాహార, వృధాహార, విసర్జనాహార పద్ధతులవల్ల, యోగసాధనవల్ల అతడు చిక్కి శల్యమై పోయాడు. అతడికడుపు వెన్నెముకకి అతుక్కుపోయింది. అతడు వంటిమీద చేయివేసుకుంటే చాలు వెంట్రుకలు వూడివచ్చేసేవి. యిలా అతడు భౌతికమైన సకల దుఃఖాలనూ నిండా అనుభవించాడు. అనుభవించి వాటిని జయించాడు. అతడికింక దుఃఖం అనేది పోయింది.

## మనుషులందరూ సమానమే

ఒకనాడతడు కీకారణ్యాలను వదిలి, జనసంచారంలేని విశాలప్రదేశంలో, ఒక చెట్టు క్రింద ధ్యాన సమాధిలో వుండగా శక్తి లేక మూర్ఛిల్లి పడిపోయాడు. ఆ చుట్టు పట్ల మేకలు మేపుతూ వుండే గొల్లపిల్లవాడొకడు తాను రోజూ చూస్తున్నట్లుగాగాక, మూర్ఛిల్లి పడిపోయి వున్న సిద్ధార్థుని చూసి వడివడిగా పరుగెత్తుకుంటూ వచ్చాడు.

ఆ పిల్లవానికి యేం చేయాలో తెలియలేదు. తనముంతలో వున్న పాలు తీసి సిద్ధార్థుని నోటిలోపోసి అతడిని రక్షించాలని తలచాడు. కానీ అంతలోనే తానొక శూద్రుడిన్నికదా, యీ మునీంద్రుడు అగ్ర వర్ణస్తుడిలావున్నాడు, అతణ్ని తాకితే కోపపడతాడేమో, శపిస్తాడేమో అని భయపడ్డాడు. చూడబోతే సిద్ధార్థుని పరిస్థితి యేమీ బాగులేదు. అందుకని బాగా యోచించి, తాను సిద్ధార్థుని ముట్టుకోకుండా, మంచి పొదుగుతో వున్న మేకను సిద్ధార్థుని తల దగ్గర నిలబెట్టి పాలు పరిగా అతని నోటిలో పడేటట్లుగా పాలు పితుకసాగాడు. సిద్ధార్థుని పిడచకట్టిన నాలుక ఆ నునువెచ్చని పాలధార తడికి తెప్పరిల్లి చైతన్యమైంది. నెమ్మదిగా సిద్ధార్థుడికి తెలివివచ్చింది. యెదురుగా చేతిలో ముంతతో గొల్లపిల్లవాడు. సిద్ధార్థుడు ఆ పిల్లవాణ్ణి, ఆ ముంతలోని పాలు తనకి పోయవలసిందిగా కోరాడు. ఆ పిల్లవాడు అతడివంక భక్తి శ్రద్ధలతో, జంకుతూ..

“అలాగే కానీ అయ్యా.. మేము శూద్రులము.. మేము ముట్టిన పాలు మీరు తా[illegible]డదుకదయ్యా!” అన్నాడు.

సిద్ధార్థుడు ఆ మాటకు, అట్లాంటి పరిస్థితికి చాలా బాధపడ్డాడు. “బాబూ! మనుషులందరూ ఒకేలాగ పుట్టినవాళ్ళే. నువ్వయినా సరే, నేనయినా సరే అంతే. మనుషులందరూ సమానమే. మంచిపని చేసే వాళ్ళు మంచివాళ్ళు. చెడ్డపని చేసేవాళ్ళు చెడ్డవాళ్ళు. చెడ్డ పనులు చేస్తే బ్రాహ్మణుడు కూడా చెడ్డవాడే. మంచి పనులు చేస్తే యెవరై[illegible]. నేను చాలా దప్పిగొన్నాను. నాకు కాసిని పాలు పోయి నాయనా! నాక్కాస్త కడుపునింపు [illegible] తండ్రీ! నాకు మాట్లాడేశక్తి కూడా లేదూ!” అన్నాడెంతో ఆకలితో.

“బాబూ! అలా మీరే అడిగితే అంతకంటే యింకేమి కావాలి సామీ!” అంటూ ఆ పిల్లవాడు తన ముంతలోని పాలు యిచ్చి గౌతమ బుద్ధుని దాహాన్ని, ఆకలిని సంతోషంగా తీర్చాడు.

యీ సంఘటనతో మనుష్యుల మధ్య స్నేహానురాగాలకు, సఖ్యతకు భంగం కలిగించే, అనుమానాలకు, అపోహలకూ దారితీసే యీ కులభావం నశించిపోతే తప్ప మనుష్యుల హృదయాలలో దయా మానవతా భావాలు పరిపూర్ణంగా యెదగవు, నిండైన శాంతి సంతోషాలు కలగవు అని గ్రహించాడు. యిటువంటి అజ్ఞాన భావాలకు తావు లేకుండా , సర్వుల్నీ ఒక్కటి చేర్చుకునే ధర్మాన్ని తాను నిర్మించాలని స్థిరంగా నిర్ణయించుకున్నాడు.

మరునాడు సమీప పట్టణం వైపుగా అతడు ప్రయాణిస్తూ వుండగా అతడికి ఒకపాట

వినిపించింది. ఆ గానానికి సిద్ధార్థుడు ముగ్ధుడై పోయాడు. ఆపాట పాడుతున్నది ఒక స్త్రీ. వేశ్య. ఆమె పాడిన పాట యెంతో గొప్పగా వుంది. ఆ పాటలోని అర్థం అతన్ని అమితంగా ఆకర్షించింది. సంతోషం కల్గించింది. ఆమె యిట్లా పాడుతూంది-

"గాయకా! ప్రియగాయకా!!
శ్రుతి చేయుమోయి వీణతీగెలను
తనుపాటి బిగువులో
తనుపాటి బిగువులో
తీగతెగుమా
బిగువు హెచ్చితే
నాదము పలుకదు
బిగువు తగ్గితే!!
గాయకా! ప్రియగాయకా!!
శ్రుతి చేయుమోయి వీణతీగెలను
హెచ్చు తగ్గులు లేక
సమస్థాయి బిగువులో!!
యికపాడుమోయి
ఆనంద గీతము
వసంత ఋతువులా
రసరమ్యదీప్తితో
గాయకా! ప్రియగాయకా!!

ఆ గీతం అలా అతన్ని వెంటాడుతూనే వచ్చింది. వేసవి యెండల్లో బాగా యెండిపోయిన పుల్లలపైన అగ్ని కణం పడిన వెంటనే గొప్ప జ్వాలగా మారిపోయినట్లు ఆ గీతంలో అతడికి యెన్నెన్నో గొప్ప గొప్ప అర్థాలు కనబడ్డాయి. తన జీవితానికీ, తన తత్వానికీ సరిపడిన ప్రాణంలా అనిపించిందతడికాపాట. యేదైనా సరే మితిమీరిపోయినా, వుండవలసిన దానికంటే తగ్గిపోయినా యే ప్రయోజనమూ వుండదన్న అర్థం కనిపించదతడికి ఆ పాటలో. జీవితంలో ప్రతిదానికీ అనుసంధించకలిగిన తత్వంలా అనిపించిందతడికి. జిజ్ఞాస మహావాయువుల చేత సంక్షుభితమైన తన మనోమహాసముద్రం శాంతపడుతున్నట్లుగా అనిపించిందతడికి. ఆపాటని స్మరిస్తూనే అతడు తిరిగి అరణ్యంలోకి ప్రవేశించాడు. అప్పటికే అతడు యిల్లువదిలి ఆరు సంవత్సరాలు గడిచిపోతున్నాయి. యిన్ని సంవత్సరాల అన్వేషణలో, తపస్సాధనలో అతడు చాలా విషయాలను స్వశక్తి మీద కూలంకషంగా తెలుసుకున్నాడు. ఆకళింపుకున్నాడు. కనిపించే ప్రతి వస్తువూ, కనిపించే ప్రతిజీవీ, కనిపించే ప్రతిమనిషీ, మనస్సులోకి వచ్చిన ప్రతి చిన్న ఆలోచనా జ్ఞానాభివృద్ధికే దోహదపడేటట్లు చేసుకున్నాడు. తన ఆలోచనలన్నీ సత్యం అనే గమ్యం వైపుగా మాత్రమే నడిచేటట్లు అతడు మనస్సుపై సాధికారాన్ని సంపాదించాడు. ధ్యానం అతడికెంతో తోడ్పడింది.

అతడి మనస్సులో కోరికలు లేవు. ద్వేషం లేదు. యెవరికీ, యే జీవికీ కొంచెం కూడా కష్టం

కలిగించడు. పైగా వాటిని గౌరవిస్తాడు. ఎప్పుడూ జాగరూకతతో, చైతన్యవంతంగా వుంటాడు. చిరునవ్వుతో సస్నేహంగా, ప్రేమాస్పదంగా వుంటాడు.

ఎప్పుడైనా కోరికలు ఆలోచనమాత్రంగా అయినా, లిప్తకాలంలో పుట్టినాసరే, 'ఇటువంటి కోరికలకి సంబంధించిన ఆలోచనలు నాలో పుడుతున్నాయా అంటే ఇవి నాకు గానీ, ఇతరులకు గానీ, లేక అందరికీ గానీ దుఃఖానికి కారణాలవుతాయి. జ్ఞానాన్ని, చైతన్యాన్ని ప్రజ్ఞను విరోధిస్తాయి. గమ్యం చేరుకోవడానికి అడ్డంకులవుతాయి. ఈ ప్రపంచంలో తన గమ్యం కన్నా మించినది తనకి వేరేదీ లేదు. 'నాగమ్యం సత్యం. అదే శాశ్వతం' అని వూహించేవాడు. దానితో అటువంటి ఆలోచనలు అతడి మనస్సు నుండి తొలగిపోయేవి.

పంటలకాలంలో పశువులకాపరులు పశువుల్ని చక్కగా కాపుకాస్తారు. దానికి కారణమేమిటంటే, వాళ్ళు అజాగ్రత్తగా వుంటే ఆ పశువులు వెళ్ళి పంటపొలాల్లో మేస్తాయి. దానితో ఆ పంటపొలాల రైతులు వచ్చి వీళ్ళ వీపులు చిట్లగొడతారు. ఆ సంగతి పశువుల కాపరులకు బాగా తెలుసు. అందుకే పంటలు పండే ఆ శరదృతువులో వాళ్ళు పశువులని జాగ్రత్తగా కాపుకాస్తారు. ఆ విధంగానే కోరికల్ని, భయాల్ని వాటియిష్టం వచ్చినట్టు వాటిని పెరిగిపోనియ్యకుండా అదుపులో వుంచుకోవాలి. అని సిద్ధార్థుడు తన శిష్యులకి బోధించాడు.

ఈ విధంగా మనస్సు యొక్క అన్ని రకాల స్థితులనూ ఎరిగివుండటమే కాకుండా, దానినెలా వశంలో వుంచుకోవాలో, దానిని ఏవిధంగా మంచివైపు మళ్ళించాలో చెప్పి సిద్ధార్థుడు ప్రపంచంలో ప్రప్రథమ మానసిక శాంతి శాస్త్రజ్ఞుడయ్యాడనడంలో సందేహం లేదు.

అంతేకాదు, అరణ్యాలలో ఒంటరి జీవితాన్ని గడిపి, ఆయా వృక్షజాతుల, జంతుజాతుల జీవరహస్యాల్ని, వాటి చావుపుట్టుకల అంతస్సంబంధాల్ని, వాటి మధ్య వున్న పరస్పర అభివృద్ధి సూత్రాన్ని కనుగొని, అతడు ప్రపంచంలోనే ప్రప్రథమ ప్రకృతి, జీవజంతు, పర్యావరణ శాస్త్రవేత్త అయినాడు. ప్రకృతి ఆధారంగా తన ప్రతీత్య సముత్పాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. శాశ్వత సత్యాల కెన్నింటికో పితామహుడైనాడు. ఆదిశాస్త్రవేత్త అయినాడు.

అతడు చెప్పినవన్నీ ఇప్పటికీ సత్యంగానే, శిరోధార్యంగానే వున్నాయి. బుద్ధుని తరువాత వచ్చిన బోధనలన్నీ ఆయన బోధనలకు కొనసాగింపుగానే సాగాయనడంలో సందేహం లేదు.

ఆయన తన బోధల్ని ప్రకృతి పరిసరాలతో, జీవజంతుప్రేమలతో, దయా, వాత్సల్యాలు నిండిన హృదయామృతాలతో కలిపి కడురమణీయం చేశాడు. కరుణామమతలతో, కవితాహృదయంతో నిండిన ఆయన బోధనలు, చెప్పిన కథలు ఇప్పటికీ మనస్సుని వుప్పొంగింప చేస్తాయి. మనిషి నైతికోన్నతికి సర్వకాలాలలోనూ వుపకరిస్తాయి.

మనిషి మంచి ఆలోచనలతో వున్నప్పుడు అతడు చాలా సంతోషంగా శాంతిగా వుండటం అతడు గమనించాడు. మంచి తనమూ, దయా.. ఈ రెండూ మనుష్యులలో ఎంతో మంచి మార్పులకు, వున్నతమైన మార్పులకు కారణమై, తన అభివృద్ధికీ, ఇతరుల అభివృద్ధికీ, జీవకోటి అభివృద్ధికీ ఎంతో దోహదం చేస్తున్నాయనీ, సంతోషాలు నింపుతున్నాయనీ తెలుసుకున్నాడు. ఇలా మంచితనమూ, దయా.. ఇవి రెండూ ఫ్పితంగా సంతోషాన్ని ఇస్తున్నాయంటే ఆ స్థానంలో పరోక్షంగా చెడునీ, దుఃఖాన్ని ప్రవేశించకుండా చేస్తున్నాయన్నమాటే కదా! ఈ సంగతి అతడికెంతో ఆసక్తినీ, సంతోషాన్నీ కల్గించింది.

'మంచి ఆలోచనలు వచ్చినప్పుడు, యిటువంటి మంచి ఆలోచనలు యెవరికీ దుఃఖం కలిగించేవి కావు కదా. పైగా అందరికీ మేలే కలుగచేస్తాయి, యిటువంటి ఆలోచనలు రాత్రుళ్ళూ పగళ్ళూ ఆలోచించినా మంచిదేకదా' అనుకుంటూ వాటిని స్వేచ్ఛగా మనసులోకి రానిచ్చేవాడు. దీనికి కూడా సిద్ధార్థుడు చక్కటి వుపమానం చెప్పాడు. అది కూడా పశుల కాపరులకి సంబంధించినదే.

పేసవి వచ్చేసరికి రైతులు పండినపంటని యిండ్లకి చేరవేసుకుంటారు. అప్పుడు పశువుల కాపరికి తమ పశువులు యెవరి చేలల్లో అయినా పడతాయేమో, తిట్లూ, దెబ్బలూ కాస్తాయేమోనన్న భయం వుండదు. అందువల్ల వాళ్ళు స్వేచ్ఛగా, హాయిగా ఆ పశువులను వదిలేసి విశ్రాంతిగా వుంటారు. అవి బయలులో వున్నాయా లేదా యేదైనా చెట్టు క్రిందికి చేరాయా అని మాత్రమే వాళ్ళు గమనిస్తూ వుంటారు అంతే. అదేవిధంగా నేను కూడా మంచి ఆలోచనల గురించి సంతోషపడుతూ వాటిని బంధించకుండా స్వేచ్ఛగా వదిలివేస్తాను" అని చెప్పాడతడు.

సదాదయతో మంచితనంతో వుండడం ద్వారా మనస్సులో ద్వేషభావం నశించిపోతుందని చెప్పాడతడు. అప్పుడు మాత్రమే మనిషికి శాంతి, అభివృద్ధులు కలుగుతాయని రుజువు చేశాడు.

అడవుల్లో అతడలాగే జీవిస్తూవుండడంవల్ల, యే జీవికీ అపకారం చేయాలన్న తలపే అతడికి లేకపోవడంవల్ల, జీవులన్నీ అతడంటే చాలా యిష్టంగా వుండేవి. అరణ్య జీవితానికి అలవాటుపడడానికి మొదట్లో అతడు చాలా కష్టపడ్డాడు. జోరున వానలు కురిసేవి. యెముకలు కొరికేంత చలి. భయానకమైన సర్పాలు, కీటకాలు, భయంకరమైన విషపు పురుగులు, మాంసాహారులైన జంతువులు. ధ్యానం చేసుకోవడం తరువాత సంగతి పీటి నుంచి తనను తాను రక్షించుకోవడమే అతడికెంతో కష్టమయింది. చెట్లే అతన్ని కాపాడుకున్నాయి. ధ్యానం వల్లన అతడు భయ సంకోచాలను, సందేహాలను విముక్తం చేసుకున్నాడు. ప్రేమభావంతో, నిస్వార్థ భావంతో, నిర్భయంతో తనని చంపడానికి వచ్చిన జీవితో కూడా స్నేహం చేయవచ్చునని తెలుసుకున్నాడు. ఆ విధంగా ధ్యానంవల్లన అతడు చీకటిపడితే చాలు మనిషి తలచుకోవడానికి కూడా భయపడిపోయే ఘోరారణ్యాల్లో జ్ఞానసాధనకు విశ్రాంతిగా కృషి చెయ్యడమే కాకుండా. అక్కడి జీవరాసులకు క్రమేపీ ఆత్మీయుడై పోయాడు. వన్య జీవులు అతడంటే అసలు భయపడేవే కావు. అన్ని జంతువులూ అతడిని తమ మిత్రుడిగానే భావిస్తూ వుండేవి. కొన్ని అయితే అతడి ప్రేమాభిమానాలను పొందాలన్నట్లుగా అతడి దాపుకు చేరేవి. అతడేమైనా మాట్లాడతాడేమోనని. శబ్దాలు చేస్తాడేమోనని శ్రద్ధగా చెవులురిక్కించి వినేవి. యీ ఋషియేమిటి తమనేమీ పట్టించుకోడు? అని దుఃఖించేవి. అతడికి తపోభంగం కల్గించకుండా వుండేందుకు కోతులు తమ పిల్లలకి జాగ్రత్తలు, హెచ్చరికలు చేసేవి. అల్లరి పుడతలూ, లేడిపిల్లలూ, నెమళ్ళూ అతన్ని యెలాగైనా మాట్లాడించాలనీ, అతన్ని కవ్వించాలనీ ప్రయత్నించేవి. సృష్టిలో యేజీవికైనా కోపం వస్తుందిగానీ యితడికి రాదేం? అని కోపగించుకునేవి. విసుక్కునేవి. హూష్ అల్లరి చేయకండి.. ఆయనేదో తపస్సు చేసుకుంటున్నాడని, ఒకదానికొకటి మందలించుకుంటూ వుండేవి. అంతలోనే అతడు తమపట్ల మాత్రం కొంచమైనా శ్రద్ధ చూపాలని ప్రతిఒక్కటీ తహతహలాడిపోయేవి. సిద్ధార్థుడు కూడా అటువంటి వాటికి శాంతి సంతోషాలు కలిగేటట్టు ప్రవర్తించేవాడు. అవన్నీ ఒకసారి అతడు తపస్సు చేసుకుంటున్న చెట్టుక్రిందికి వచ్చి చేరేవి. అలా చేరినప్పుడు అక్కడతమ శత్రు జంతువు యేదైనా వున్నదేమోనన్న భయాన్నే మరిచిపోయేవి. చిలకా, పిల్లీ, పామూ, ముంగిసా, మేకా, పులీ, యెలుకా, కోతి, పురుగులూ,

అడవికోళ్ళూ, పిచ్చుగలూ, గద్దలూ.. యివన్నీ కూడా యెదురురెదురుగానే వుండేవి. వొకదానికొకటి ఆనుకునే వుండేవి. యింకా కొన్ని యేకంగా తమ శత్రుజంతువుల మీదే కూర్చుని హాయిగా విశ్రమిస్తూ వుండేవి. అసలు శత్రుత్వ మన్న మాటే మరిచిపోయేవి. వొకదానివొకటి పలకరించుకునేవి, స్నేహితులు వెటకులు విసురుకున్నట్లు అవి కూడా ఆయా శత్రుజంతువులను వేళాకోళం పట్టిస్తుండేవి. యివన్నీ , చూసే అతడు దయ యొక్క ప్రాధాన్యతను యిన్నో సార్లు చెప్పాడు.

అతడు తన అనుభవాలనే బోధనలుగా చేసి, జనసామాన్యానికి అర్థమయ్యే విధంగా వారి భాషలోనే చెప్పాడు. అతడికి వనాలన్నా, మూగజీవాలన్నా, గ్రామీణులన్నా, పశులకాపరులన్నా, పచ్చిపులన్నా, పంటచేలన్నా యెంతో యిష్టం. అతడి బోధనంలో అడుగడుగునా చక్కటి వుపమానాలతో అవి కనిపిస్తూనే వుంటాయి.

తాను భయాన్ని జయించిన సంగతిని అతడు పిల్లలకి కూడా అర్థమయ్యేలా చెప్పాడు. దోపిడీ దొంగలు, సైనికులు తమ శత్రువుల మీద వొక్కుమ్మడిగా పడి వాళ్ళని చంపివేస్తారు. కానీ అందులో నిర్భయత్వం యేదీ? వాళ్ళు పట్టిన ఆయుధాలు యెంత పదునుగావున్నా, వారెంత జాగ్రత్తలో వున్నా దాపులనుండి యెవరెప్పుడు మీదపడి చంపుతారో అన్న వొకభయం వారినెల్లప్పుడూ పీడిస్తూనే వుంటుంది. పరిశుద్ధమైన మనస్సుతో, దయతో, యెవరికీ అపకారం చేయని బుద్ధిలో వుండటం వల్లనే తనలో భయం పోయిందని బుద్ధుడు చెప్పాడు. అతని మనస్సులో ద్వేషం అన్నది లేశం కూడా లేదు. దేనిపైనా అనుమానం లేదు. యింక అతనికి భయం యెందుకుంటుంది?

భయాన్ని ఆయన ప్రేమతో జయించాడు. ఆయన యిలా అన్నాడు : "అరణ్యాలలో, పర్వత సానువులలో నేను సంచరిస్తున్నప్పుడు నాకు సింహాలూ, పెద్దపులులూ యెదురవుతూ ఉండేవి. చేరువగా తిరుగుతూ వుండేవి. విశ్వప్రేమతో వుండడంవలన అవి నన్ను ద్వేషించేవి కావు. అనుమానించేవి కావు. చుట్టూ అనేకానేక భయంకర మృగాల మధ్య అరణ్యాలలో నిర్భీతిగా జీవించాను. యేజీవీ నన్ను చూసి భీతి చెందేదికాదు. నేనూ యెప్పుడూ యే జీవిని చూసీ భయపడలేదు. ప్రేమే నాకు ఆలంబన. ఆ ప్రేమ అనే ఆలంబనతోనే నేను యీ శిఖరాగ్రాలకి చేరుకో గల్గాను. ప్రేమ యొక్క శక్తి అంత గొప్పది.

హఠాత్తుగా యేదైనా శబ్దం వినబడితే మంచున్నవాడు నించున్న పాటుగానే అదేమిటో తెలుసుకోప్రయత్నించేవాడు. ఆ అడవుల్లో అనేక రకాల చప్పుళ్ళు వినిపించేవి. త్రాచు పాములబుసబుసలు, యెండుటాకుల గలగలలు, పులులుగాండ్రింపులు, పక్షుల స్వరాలు, తూనీగల రాగాలు, తుమ్మెదల ఝుంకారాలు, గుడ్లగూబల అరుపులు, వాటొక్కల మెత్తటి చప్పుళ్ళు, నక్కల వూళలు, పందుల ఘుర్ఘురింపులు, కప్పల బెకబెకలు, యిలకోళ్ళ కీచుధ్వనులు యివన్నీ వినబడుతూనే వుండేవి. యోగసాధనవల్ల అతడికి అతి సూక్ష్మ ప్రాణుల కదలికల చప్పుళ్ళు కూడా వినిపించేవి. యెంతో దూరాన వున్న కనపడని జంతువుల్ని కూడా వాటి పాదాలశబ్దం వినడంలోటే ఆ శబ్దాల ప్రత్యేకతల్ని బట్టి అదేజంతువో పసిటువుగా తెలుసుకునేవాడు.

నిద్రపోయేటప్పుడు భయంపుడితే నిద్రలోనే అదేమిటో, దానికి కారణం యేమిటో తెలుసుకునేవాడు. కూర్చున్నప్పుడు భయంపుడితే, భయంపుట్టే ధ్వనివినబడితే కూర్చుని వుండే అదేమిటో తెలుసుకునేవాడు. పెనుగాడ్పులు, తుపానులు, వరదలు, పిడుగులు, ... అన్నీ తనకంటూ యేగొడవా పీడా లేకుండా, యే చెట్టుక్రింద విశ్రమిస్తే ఆ చెట్టే యిల్లు, యే గట్టుమీద విశ్రమిస్తే ఆ

గట్టే విశ్రాంతి శయ్యలా, భావించి, నిర్వికారమైన అచంచలమైన జీవితాన్ని గడిపించాడు.

రేయింబవలు అతడు యేదో వొకదాని మీద పరిశీలన చేస్తూనే వుండేవాడు. ఆ విధంగా యే కారణమూ లేకుండా, యే పనీ, శబ్దమూ చలనమూ పుట్టదని తెలుసుకున్నాడు. యెవరో యెక్కడో దూరాన యిలావుండు అని శాసిస్తే యీ ప్రకృతి యిలా లేదనీ, యీ ప్రకృతి పరస్పరాధార భూరితమైనదనీ యిందులో వచ్చే మార్పులన్నీ వొకదానికొకటి సంబంధితంగానే వుంటాయనీ విడిగా యేదీ లేదనీ, మానవదేహం సైతం అలా అనుసంధానమైన ప్రకృతిలో భాగమేనని గ్రహించాడు.

ఆ విధంగా మహాభీకరారణ్యాల్లో సైతం అతడు నిర్భీతిగా తిరుగుతూ, అక్కడ అరణ్యాల్లో రాలిపడిన ఆకులనుండి కూడా జ్ఞానాన్ని తెలుసుకుంటూ, అభివృద్ధి చేసుకున్నాడు. ప్రకృతి అంతా అనంతమైన జ్ఞానంతో నిండి వున్నదనీ, ఆ జ్ఞానాన్ని తెలుసుకోవడమే మనిషికి మేలైన పని అనీ అతడు చెప్పేవాడు. వొకసారి అతడు గుప్పెడు ఆకుల్ని చేతితో పట్టుకుని శిష్యులకు చూపుతూ, యీ మహారణ్యంలో వున్న చెట్ల ఆకులన్నీ కలిపితే యెంత జ్ఞానం అవుతుందో అంత జ్ఞానం యీ మన ప్రకృతిలో వుందనీ, తాను చెప్పింది యీ గుప్పెడు ఆకులంత మాత్రమే అనీ చెప్పి, ప్రకృతిపట్ల తన ప్రగాఢ గౌరవాన్నీ, ప్రేమనూ ప్రకృతి యొక్క యధార్థ స్థితినీ తెలియ చెప్పాడు. తన జ్ఞానాన్ని పదే పదే అనుభవిస్తూ, విశ్లేషించుకుంటూ, సుషుప్తిలో ప్రతిదినం నిక్షిప్తం చేసుకునేవాడు.

తన యీ ఆరుసంవత్సరాల సత్యాన్వేషణలో, యీ ధ్యాన యోగ సాధనలో, మానవుడనే వాడు సత్యంకోసం యింతకుముందెప్పుడూపడివుండని భయంకర బాధల్ని స్వీయంగా అనుభవించాడు. యే మానవుడూ యింతకు ముందెప్పుడూ అనుభవించి వుండని అపూర్వమైన శాంతిని అనుభవించాడు. మానవత్వాన్నీ, ప్రేమనూ, కరుణనూ, అహింసనూ తన ప్రాణంలో ప్రాణంగా నిలుపుకున్నాడు. చెడ్డకోరికల్నీ, యితరుల్నీ, యితరజీవుల్నీ బాధపెట్టేవాటిని తుంచేసుకున్నాడు. మంచి కోరికల్నీ, మంచి ఆలోచనల్నీ, తనకీపరులకూ అందరికీ హితం కూర్చేవాటిని మరింతపెంచుకున్నాడు. ఆ ఆలోచనలకు అనేకానేక పరీక్షలు పెట్టుకున్నాడు. వాటిలోని సారాన్ని పూర్తిగా అనుభవించి గ్రహించాడు.

మంచి కోరికలు కలిగి వుండి, మంచి ఆలోచనలతో, మంచి పనులు చేస్తూవున్నప్పుడు కలిగే సంతోషం చాలా తృప్తిగా, తన్మయంగా వుంటుందనీ, తోటి జీవుల పట్ల దయగా వుండటం కన్నా గొప్ప భావమూ, సంతోషమూ మరొకటి లేదనీ, దయగా వుండటం వల్లన మైత్రీ సంతోషాలు వృద్ధి అవుతాయనీ, ద్వేషాలు నశిస్తాయనీ రూఢి పరుచుకున్నాడు. రూఢి పరుచుకున్న ప్రతీ వాటికీ సరిపడే పదాల్ని, ప్రజలకి అర్థమయేరీతిలో సంచయుయువర్చుకున్నాడు.

ప్రతిభావాన్నీ, అదే భావంతోటే రేయింబవళ్ళు కలిగివుంటూ యితర జీవుల్నుంచి యెదురయ్యే ప్రతిస్పందనల్ని గ్రహించేవాడు. సహనం అన్న భావంతో వుండాలనుకుంటే రేయింబవళ్ళు ఆ భావమే. మైత్రి అన్న భావంతో వుండాలనుకుంటే రేయింబవళ్ళు ఆ భావమే. సహనం, కరుణ, సహాయం, ఔదార్యం, ప్రేమ, కరుణ, దయ.... యిటువంటి భావాలన్నీ ఆయన కడుపునిండా. వరలంతా రోజులకి రోజులు, నెలలకి నెలలు అనుభవించి, చివరికి 'దయగా' వుండడం అనేది జీవుల మధ్య శత్రుత్వాన్ని కూడా తుంచేస్తుందనీ, ప్రేమానురాగాలకు, తక్కిన అన్ని వున్నత గుణాలకూ, సమస్త సంతోషాలకూ దారితీస్తుందని తెలుసుకున్నాడు.

అయితే యే తృప్తి అయినా, సంతోషం అయినా పూర్తిగా పొందాలంటే శరీరం కూడా అందుకు సిద్ధంగా వుండాలనీ, బక్కచిక్కిన యెండిపోయిన దేహానికి యీ సుఖం అనుభవించే అస్కారం వుండదని తెలుసుకున్నాడు. అందుకే ఆహారాన్ని తినడం ప్రారంభించాడు.

మళ్ళీ ఆహారం తినాలని యెక్కువెక్కువ తింటే యే ప్రయోజనమూ వుండదనీ, కష్టాలు కలుగుతాయనీ తెలుసుకున్నాడు. మంచి పనుల వల్ల కలిగే అనుభవాన్ని తృప్తిగా అనుభవించేందుకు, బతికి వుండేందుకు చాలినంత ఆహారం తింటే చాలుననీ యీ లక్షణమే జీవులలో చలాకీ తనాన్ని యిస్తున్నదనీ మనుష్యులలో యిది త్యాగనిరతికి దారితీస్తుందనీ వూహించాడు.

యిలా అతడు ప్రతిక్షణంలో యేం చేసినా, నిలుచున్నా, కూర్చున్నా, పడుకున్నా, నిద్రపోయినా, మేలుకున్నా, నడిచినా, ఆహారంతిన్నా, యే సంఘటన యెదురైనా, యే శబ్దంవినిపించినా, ప్రకృతిలో యే మార్పు వచ్చినా, అన్నిటి నుండీ జ్ఞానాన్ని పొందేలాగున ఆ జ్ఞానం మంచికే దారితీసేలాగున, తన సర్వశక్తియుక్తులన్నీ కేంద్రీకరించాడు.

బాధ అన్నది పుట్టడానికి గల కారణాలేమిటో తెలుసుకున్నాడు. ద్వేషం యెందుకు పుడుతున్నదో తెలుసుకున్నాడు. దుఃఖాన్ని యెలా పోగొట్టుకోవాలో తెలుసుకున్నాడు. అందుకుకావలసిన పద్ధతులను సమీక్షించుకున్నాడు. వాటిని అనుసరిస్తూ పూర్తి విజయం సాధించాడు.

లోక కళ్యాణం కోసం యెవరు యెటువంటి ప్రయత్నం చేసినా, వారిని స్వకీయమైన కోరికలు అడ్డువస్తాయి. వాటిని వదిలివేస్తే ఆకలిదప్పులు అడ్డువస్తాయి. అన్నింటినీ జయిస్తే తప్ప ఆ మనిషి చేసే కృషిలో పూర్తి విజయం సాధించలేడు. వొకోసారి ఆకోరికలవల్ల అసలు ఆశయమే పూర్తిగా నశించిపోవచ్చు. అందువల్ల అతడు లోకకళ్యాణంకోసం కోరికల్నీ స్వార్థాన్నీ జయించాలి. యీ విషయం చెప్పడానికి ముందు మొదట తానే వాటిని జయించి ప్రపంచానికి తన జీవితాన్నే వుదాహరణగా చూపాడు. తనలాంటి వారిని అనేకానేకమందిని తయారుచేసి యిటువంటిది అసాధ్యంకాదని కూడా నిరూపించాడు. అందుకే అతడు ఆచరణ తత్త్వప్రదాత అయినాడు.

ప్రకృతిమాత వొడిలో, తన ఆలోచనలతో, అనుభవాలతో తాను సాధించిన విజయాలు, సారాంశాలు అన్నీ క్రోడీకరించుకుంటూ, కొన్ని విషయాలలో పూర్తి నిశ్చయానికి రాలేక సిద్ధార్థుడు అరణ్యాలనుండి బయటికి రాసాగాడు. దారిలో పాల వృక్షాలతోపు కనిపిస్తే అక్కడ బస చేశాడు. అక్కడ యింకా రావి, మర్రి, రాజాయతన, న్యగ్రోధ మొదలైన చాలా చెట్లు వున్నాయి. ఆ ప్రదేశం చాలా ప్రశాంతంగా వుంది. కొద్ది దూరంలో నిరంజనానది ప్రవహిస్తుంది. అది యిప్పుడు ఫల్గునానదిగా పిలవబడుతూంది. ఆ నదినుంచే మరికొంత దూరంపోతే నేటి గయాపట్టణం వస్తుంది. అతడొక పాలవృక్షం క్రింద కూర్చుని, అక్కడ మంచు బాగా పడుతూ వుండడంతో నెమ్మదిగా దానికే యెదురుగా వున్న రావి చెట్టు క్రింద కూర్చున్నాడు. అంతలో కొంచెం దూరంలో తన పాడిపశువుకి వరి గట్టమ్మట పెరిగిన మెత్తటి గడ్డి కోసుకుని మోపు కట్టి తీసుకువెళుతున్న వొక రైతుబిడ్డ గౌతమబుద్ధునిచూసి, వచ్చి నమస్కారం పెట్టాడు. గౌతమబుద్ధుడతన్ని కరుణగా ఆశీర్వదించాడు. ఆ రైతు బిడ్డ- "అయ్యా- యీ చెట్టు క్రింద చిన్న చిన్న రాళ్ళు అవీ వున్నాయి. యీ మెత్తటి గడ్డి పరుచుకుని కూర్చోండయ్యా"- అంటూ ఆ రావిచెట్టుక్రింద తానే మెత్తటి గడ్డి పరచి, "వస్తానండయ్యా- మరింత గడ్డి కోసుకుని యింటికి వెళ్తాన" అంటూ వెళ్ళిపోయాడు. గౌతమబుద్ధుడతడు చూపిన ప్రేమకు యెంతో సంతోషించి- ఆ మెత్తని పచ్చికపైన- ఆ రావి చెట్టు క్రింద కూర్చుని, 'యేమైనా

సరే- యిన్నినాళ్ళ తపస్సు యిపుడు ఫలించాలి- నా మాంసం, నెత్తురు యెండిపోయి, చర్మం యెముకలకి అతుక్కుపోయినా సరే - సిద్ధి పొందకుండా యీ చెట్టు క్రిందనుంచి కదలను' - అని నిర్ణయించుకున్నాడు. నెమ్మదిగా ధ్యానంలో మునిగిపోయాడు. అలా యెన్ని రోజులైందో అతన్ని యేదీ కదిలించలేకపోయింది.

ఆ రావిచెట్టుకి ప్రక్కనే ఆ ప్రాంతపు వన దేవత ఆలయముంది. ఆనాటి ప్రజలు దేవతగా పూజించేవారు. వృక్షాల్ని పూజించేవారు. చెట్టుని నరకడానికి సాహసించేవారు కాదు. చెట్లనికూడా దేవతలుగానే భావించేవారు. అందుకు కారణం చెట్లు ఫలాలనూ, నీడనూ యిస్తుండటమే. ప్రతీ ప్రాంతానికీ ఆ ప్రాంతానికి చెందిన వనదేవత ఆలయం వుండేది. ఆలయం అంటే చాలా చిన్నకట్టడం. యెంత చిన్నదంటే అందులో ఒక మనిషి మాత్రమే కూర్చోగలడు. యిటువంటి ఆలయాలు యిప్పటికీ విశాఖ ప్రాంతంలో కనిపిస్తాయి. ప్రజలు పుత్రులకోరకూ, పెళ్ళిళ్ళకోరకూ, పంటలుబాగా పండేందుకూ యీ వనదేవతలకు మొక్కులు మొక్కుకుంటూ వుండేవారు. తమ కోరికలుతీరగానే యీ ఆలయానికి వచ్చి వనదేవతకు మొక్కులుతీర్చుకునేవారు. ఆ మొక్కులు యిప్పటిలా బీభత్సంగా, పక్షులు, జంతువుల బలులతో, నెత్తురు వరదలతో వుండేవి కావు. వారు దేవతలకు నైవేద్యంగా పరమాన్నం, బెల్లం, పండ్లు మొదలైనవాటిని సమర్పించేవారు. వారు మొక్కుకునేవీ అలాగే వుండేవి.

వారు, తమ పొలంలో పండిన పంటలో మొట్ట మొదట పండిన ఆహారాన్ని పెడతామని మొక్కుకునేవారు. యేమైనా చెట్లు నాటుకున్నప్పుడు వాటి ప్రథమ ఫలాలను యిస్తామని మొక్కుకునేవారు- పాడి పశువులు వున్నవారు అన్ని పశువుల పాలతో చేసిన పరమాన్నాన్ని మొక్కుకునేవారు. యిలా కట్టుకునేబట్టలు, దూరంగా దొరికే విలువైన పదార్థాలు, వస్తువులు మొక్కుకుని, వాటిని తెచ్చి వనదేవతకు సమర్పించేవారు. వనదేవత దగ్గరే కొంతవదిలి, మిగతాది ప్రసాదంగా తీసుకువెళ్ళేవారు. యిలా ఆ రోజుల్లో దైవనమ్మకం వున్నా అది పవిత్రంగా, ప్రకృతి సహితంగావుండేది. రాజులూ, చక్రవర్తులూ యజ్ఞయాగాలు చేసి, ఆ యాగాలలో వేలాది పశువులను హతమార్చుతూ, ఆ దుష్టసంస్కృతిని కాలక్రమేణా వూరువాడలా పురోహితులు వ్యాపింపచేసేదాకా భారత వుపఖండంలో వూరి దేవతలకు కోళ్ళను, మేకలను, యితర జీవులనూ బలియిచ్చే ఆచారమే వుండేది కాదు. యిప్పటి బలులు ఆనాటి క్రూర యజ్ఞాల ఫలితమే.

## మహా సంబోధి

అది వైశాఖ పూర్ణిమ రోజు. క్రీస్తు పూర్వం 528 వ సంవత్సరం. ఆరోజున వనదేవతకు, రావిచెట్టుకు తాము మొక్కుకున్న ఫలితంగా కుమారుని కన్నానన్న నమ్మకంతో కృతజ్ఞతతో సుజాత అన్న గృహిణి, వనదేవతకు తాము మొక్కుకున్న మొక్కును తీర్చేందుకు తలచి, వనదేవత ఆలయ పరిసరాల్ని శుభ్రంగా తుడిచి ముగ్గులు పెట్టిరమ్మనమని పున్నమ్మ అనే సేవకురాలిని వనదేవత ఆలయానికి తనకంటే ముందుగానే పంపించింది. తాను అన్నీ సిద్ధపరచుకోసాగింది. పున్నమ్మ వడివడిగా వనదేవత ఆలయానికి చేరుకుని నిర్మానుష్యంగా వుండే ఆ ప్రాంతంలో రావిచెట్టుక్రిందనే తపస్సు చేసుకుంటున్న సిద్ధార్థుని చూసింది. మొదటుగా ఆమెకు చాలాభయం వేసింది. అతడే వనదేవత అని, మనుషులు లేకపోవడం వల్ల కూర్చుని వున్నాడని అనుకుని తమ చూసినట్టుగా

తెలుస్తే యేం జరుగుతుందో అని చాలా భయపడిపోయింది. నెమ్మదిగా అక్కడ నుంచి యెటువంటి శబ్దమూ చేయకుండా బయటపడి, యింటివైపు యించుమించు పరుగులు పెట్టింది.

సుజాత అప్పుడే వనదేవత ఆలయానికి తీసుకు వెళ్ళవలసిన అన్ని సంబారాలనూ సిద్ధం చేసుకుని, బయలుదేరడానికి సిద్ధమవుతూ వుంది. పున్నమ్మ వచ్చిరావడంతోనే గుండెపట్టుకుంటూ ఆమెతో అక్కడ తాను చూసిన దృశ్యాన్ని వివరించి చెప్పింది. అతని కన్నులు ప్రశాంతంగా వున్నాయనీ, మనిషి దేవుడిమల్లే వున్నాడనీ, అయినా యెందుకో భయమేసిందనీ చెప్పింది.

సుజాత ఆమెకు ధైర్యం చెప్పింది. 'అతడు వనదేవతే అయివుంటాడు. నువ్వెంతో అదృష్ట వంతురాలివి. చూశావు. మళ్ళా మనం వెళ్ళేసరికి వుంటాడో అదృశ్యమైపోతాడో' అనుకుంటూ వడివడిగా యిద్దరూ యెన్నో ఆలోచనలతో, భక్తితో ఆ ప్రాంతానికి చేరుకున్నారు.

అక్కడ దయతో ప్రశాంతతతో నిండిపోయివున్న సిద్ధార్థుని చూడగానే గృహిణి సుజాతకు గొప్ప భక్తీ, ప్రేమ పుట్టాయి. తాను మొక్కుకున్న వనదేవతే యిట్లా ప్రత్యక్షమైనాడని, ఆమెకు సంతోషంతో కళ్ళమ్మట నీళ్ళు వచ్చేశాయి. మెల్లగా అతని దగ్గరకు యిద్దరూ చేరి అతడి కాళ్ళకు దండం పెట్టారు. అతడి ధ్యానం ముగిసేవరకూ సవ్వడిచేయకుండా అలానే చాలాసేపు వుండిపోయారు.

మెల్లగా, యెప్పటికో ధ్యానం నుండి విడివడిన సిద్ధార్థుడు తనకోసమే కాచుకుని కూర్చున్నట్లున్న ఆ యిద్దరు స్త్రీలనీ చూసి ప్రేమగా ఆశీర్వదించాడు.

ధ్యానంలో పడి, తిండితినడం మరిచి యెన్నాళ్ళయిందో, సిద్ధార్థుడప్పటికి చాలా ఆకలిగా, నీరసంగా వున్నాడు. భిక్షకు వెళ్ళేంత శక్తి కూడా అతడికి లేదు. వొకవేళ శక్తి వున్నా అతడికి భిక్షకు వెళ్ళాలన్న ఆసక్తే లేదు అన్నీ మరిచి ధ్యానంలోనే యించుమించు నలభైరోజుల్నుంచీ వుంటున్నాడతడు.

గృహిణి సుజాత తాను తెచ్చిన పరమాన్నాన్ని సిద్ధార్థునికి ప్రేమగా పెట్టింది. ఆమె ప్రేమకూ, వాత్సల్యానికీ సిద్ధార్థుడు యెంతో సంతోషపడ్డాడు. అతడి కళ్ళు చెమర్చాయి. కన్నతల్లే వచ్చి అన్నంతినిపించినట్లుగా అనిపించిందతడికి. ఆమె పెట్టిన ఆ పరమాన్నాన్ని యెంతో యిష్టంగా తిన్నాడు. యెంతో రుచిగా వుందతడికి. చాలా ఆకలిమీద కూడా వున్నాడు. అతని దేహానికి శక్తినిచ్చే పుష్టికరమైన ఆహారం కావాలిప్పుడు. అది మానవాళిచేసుకున్న అదృష్టంకొద్దీ సుజాతద్వారా సిద్ధార్థునికి లభించిందానాడు. ఆ పరమాన్నం తింటుంటే అతడి శరీరమంతా సూక్ష్మశక్తి వరదలా పొంగింది. వళ్ళంతా పులకరించసాగింది. తల్లి దగ్గర పసిబిడ్డ తింటున్నంత తృప్తిగా తింటూ, "అమ్మా! యీ పరమాన్నం చాలా బాగుంది. యెంతరుచిగా వుందమ్మా?! యింతకమ్మటి రుచి యెలా వచ్చిందమ్మా? నేనెప్పుడూ తినలేదు'', అన్నాడు.

ఆ మాటకామె పొంగిపోతూ, "వనదేవ ప్రభూ! మా ఆవులమందలో వందపాడి ఆవుల పాలుపితికి, యాభై ఆవులకు ఆహారంగా పోశాను. తిరిగి ఆ యాభై ఆవులపాలు యిరవై అయిదు ఆవులకు ఆహారంగా పోశాను. తిరిగి వాటి పాలు పన్నెండావులకూ, వాటి పాలు ఆరు ఆవులకూ పోసి, ఆ ఆరు ఆవులపాలతో యీ పరమాన్నాన్ని తయారు చేశాను. ప్రభూ! నీకు యీ విధంగానే నేను మొక్కుకున్నాను. నన్ను నా పుత్రుని దీవించు!" అని చేతులెత్తి నమస్కరించింది.

సిద్ధార్థుడు ఆమెతో, "తల్లీ! నీ బిడ్డ చిరాయువై వర్ధిల్లుగాక! కానీ తల్లీ ! పొరపాటు జరిగింది. నేనే దివ్య పురుషుడనూ కాదు. నీవు మొక్కుకున్న వనదేవతను కూడా కాను. మొదట నేనొక రాజకుమారుణ్ని. సత్యాన్వేషినై యోగినయ్యాను. ఆరు సంవత్సరాలుగా వివిధ దేశాలు

తిరిగాను. ఘోరారణ్యాలలో ప్రశాంతిగా తపస్సు చేశాను. యెన్నో సత్యాలు తెలుసుకున్నాను. యిటుగా వస్తూ దివ్యజ్ఞానోదయం కోసం యీ రావి చెట్టు క్రింద ధ్యానం చేసుకుంటూ వున్నాను. అన్న పానాదులను మరిచిపోవడం వల్ల దేహం చాలా శుష్కించిపోయింది. యిప్పుడైనా తినకపోతే, కనీస శక్తి కూడా లేక యిక్కడే నా జీవితం పరిసమాప్తి అయ్యేది. అటువంటిది పునర్జన్మ యిచ్చేంత బలంకల ఆహారాన్ని ప్రేమతో నాకు పెట్టావు. అమ్మా! నాకు చాలా ఆనందంగా వుందమ్మా! నీ ఋణం యెన్నటికీ తీర్చుకోలేను. నీ కుమారుడు చిరాయుస్సై, సంతోషంగా వర్ధిల్లాలని ఆశీర్వదిస్తున్నానమ్మా!" అన్నాడు.

తన మ్రొక్కును వనదేవతకు కాక, యీ సిద్ధార్థునికి చెల్లించినందుకు ఆ గృహిణి సుజాత యెంత మాత్రమూ చింతించలేదు. పైగా యెంతో సంతోషించింది. వనదేవతకు తన మ్రొక్కును సఫలంగా తీర్చినట్లే భావించింది. సిద్ధార్థుని దీవెనలకు ఆమెకు యెంతో ఆనందం కలిగింది. అతనికి కోరి కోరి కడుపునిండా పాయసాన్ని తినిపించింది.

సిద్ధార్థుడికి ఆ భోజనం చాలా గొప్పగా, తృప్తిగా అనిపించింది. ఆ వృక్షాన్ని వదిలి యెదురుగా వున్న మరొక రావిచెట్టు క్రిందకు చేరి పద్మాసనం వేసుకుని తిరిగి ధ్యానంలో లీనమయ్యాడు.

తనకు తెలిసిన జ్ఞానం అంతా తన ప్రజలకు చెప్పాలని ఆ రావిచెట్టు క్రిందే నిశ్చయించుకున్నాడు. యీ ప్రపంచంలో దుఃఖాన్ని తానొక్కడూ రూపుమాపలేడు. రూపుమాపగలనన్న నమ్మకం అసలివ్వలేడు. కానీ తాను చెప్పే మార్గం దుఃఖాన్ని నివారించ గలదు. నిర్మూలించగలదు. మనిషిని సమున్నతంగా తీర్చిదిద్దగలదు. యెందుకంటే తాను చెప్పేదంతా తన అనుభవాల సారాంశం. తాను దుఃఖాన్ని జయించాడు. ప్రపంచానికి సత్యమార్గాన్ని చూపించబోతున్నాడు.

తన మాటలు, బోధలు, యేవో కొంతంత గొప్పగా మాత్రమే వున్నాయని, వాటిలో పెద్ద మెచ్చుకోదగినంత గొప్పదనం లేదని యెవరైనా అనవచ్చు. తన మాటలు లక్ష్యపెట్టక పోవచ్చు. నిరసనగా చూడవచ్చు. అయినప్పటికీ తన మాటలు సత్యాలు తన జీవితం సత్యం. తన మాటలు, బోధనలు, ధర్మాలు అన్నీ తన తపస్సు ధ్యానం, త్యాగం, సత్యాన్వేషణ, అనుభవాల ఫలితం. అన్నీ సత్యమైనవి. కనుక యెప్పటికైనా అవి నలుగురూ ఆచరించేవవుతాయి. తాను చెప్పేమాటలు సత్యం. తాను సత్యం. సత్యమే ప్రపంచం. ప్రపంచమే సత్యం. తానే సత్యమూ ప్రపంచమూ అని నిర్ధారించుకున్నాడు. సత్యంపట్ల తిరుగులేని విశ్వాసాన్ని గుండెల్లో జ్యోతిలా వెలిగించుకున్నాడు.

తన సత్యబలంవల్ల ఆ రాత్రి (అతడికి) తనలోంచి, అడుగడుగున యెక్కడో మిగిలిపోయి వున్న కామ, క్రోధ, లోభ మద మోహమాత్సర్యాలు లాలసత్వాలు, అనుమానాలు అన్నీ వొక్కొక్కటీ బయటికివచ్చి విశ్వరూప ప్రదర్శనలు చేసి చివరికి తన యెదురుగానే భస్మమైపోయినట్లు అనుభవం కలిగిందతడికి. యీ విశ్వం అంతులేనిరహస్యాల అనంతనిధి. మనిషి వూహాకే అందనటువంటి రహస్యాలు వున్నాయి. తవ్వుతున్న కొద్దీ జ్ఞాన నిధులెన్నో తెలుస్తాయి. అయితే సామాన్య ప్రజల దగ్గరకి వచ్చేటప్పటికి వారి సమస్యలు వేరు. బాధలు వేరు. వారి దుఃఖాన్ని పోగొట్టాలంటే వొక పట్టాన తెగని, అంతులేని చర్చలకు అవకాశం యిచ్చే వాటిని పక్కకు పెట్టెయ్యక తప్పదు. జ్ఞానంలో వొక స్థాయిని పొందాక మాత్రమే చర్చించదగినవవి. యెంత జ్ఞానవంతుడికైనా జీవితకాలం పట్టే ప్రశ్నలవి. తాను దుఃఖాన్ని పరిమార్చాలని కోరుకున్నాడు. యీ అంతులేని చర్చలవల్ల కూడా దుఃఖం వుత్పన్న మవుతుందని తెలుసుకున్నాడు. దాంతో అతడు ప్రతిపాదించబోతున్న దుఃఖనిరోధమార్గం విశాలమైంది.

మరింత పట్టిష్టమైంది. మనిషిని దుర్భావముంచే యింద్రియలోలత్వం, అసంతుష్టి, తృష్ణ, కామం, మాంద్యం, పిరికితనం, సందేహం, కాపట్యం, వైమరుపు, లాభం, కీర్తి, గౌరవం పైన కోరికలు, పరదూషణ మొదలైన దుర్గుణాలన్నీ ఒక్కొక్కటి అతడి ముందర నిలిచి యెంతో ప్రేమ నటిస్తూ "బాగా చిక్కిపోయావు, యిక చచ్చిపోతావు, యెందుకొచ్చిన తపస్సు... హాయిగా బతకవయ్యా... అప్పుడే మన్నెన్నో మంచి పనులు చేయగలుగుతావు - యెందుకొచ్చిన ధ్యానాలు చెప్పు" అంటుంటే ఆ ప్రశ్నలకన్నింటికీ తన మహా తాత్విక భావాలతో వెంట వెళ్ళమనేట్టు సమాధానం చెప్పి, చివరికవి తన యెదుటనే శాశ్వతంగా నాశనమై పోయేటట్టు చేసివేశాడు.

ఆ రాత్రి మూడవ ఝాముకల్లా అతడి ఆలోచనలన్నీ విజయవంతమై, సంపూర్ణజ్ఞానం లభించిందతడికి. మానవాళి చరిత్రలో మహత్తరమైన రోజది. అతడి ముఖం గొప్ప కాంతితో నిండిపోయింది. అతనిని చేరిన ప్రతికాంతికిరణం తిరిగి యింద్రధనుస్సులా రంగు రంగులలో విస్ఫారి ప్రయాణించేది. అతడి దేహకాంతి అచ్చెరువు కల్గించేది. యీ రోజునుంచే అతడు గౌతమబుద్ధుడయ్యాడు. సంపూర్ణజ్ఞాని అయిన యీ సంఘటనని అందరూ 'మహాసంబోధి' అని పిలుస్తారు. మహాసంబోధి అయినాక ఆయన చేసిన మొదటి వుపదేశాన్ని 'ధర్మ చక్రప్రవర్తన' అని అంటారు. గౌతమబుద్ధుడు ఆ పేరుతోనే కాకుండా శాక్యముని, సిద్ధార్థ గౌతముడు, సర్వార్థసిద్ధుడు, తథాగతుడు, బోధిసత్వుడు, శాక్య సింహుడు, భగవానుడు, సర్వజ్ఞుడు, మారజిత్తు, ధర్మరాజు, జినుడు, లోకజిత్తుడు, సుగతుడు అన్నపేర్లతో కూడా ప్రసిద్ధుడయ్యాడు. మనిషిలోని దానవత్వాన్ని అణిచివేసి దివ్యత్వాన్ని పెంపొందించడానికి తన జీవితాన్ని అంకితం చేసిన మహానుభావుడాయన.

గౌతమబుద్ధుడికి ఆ జ్ఞానం అంతా ఒక్కసారిగా వచ్చిందికాదు. అది అనేక బాధల, వేదనల, అనుభవాల సారాంశం. తనని బాగా కదిలించి వేసిందీ, బాధపెట్టిందీ, తనని పరివ్రాజకుడయ్యేట్టు చేసిందీ తమ శాక్యులకూ, కోలీయులకూ మధ్యన జరిగిన వివాదమే అని గౌతమబుద్ధుడే ఒకచోట చెప్పాడు. ఆయన జ్ఞానమంతా యింకా అనేకానేక సత్యాన్వేషణాల సారాంశం. ఆ జ్ఞానాన్ని అందరికీ పంచాలన్న నిర్ణయానికి రావడమూ, పూర్తి జ్ఞానం కలగడమూ రెండూ ఆ రావి చెట్టు క్రిందనే. అదీ సుజాత పెట్టిన పరమాన్నం తిన్న తరువాతనే. అందుకే అతడికి సుజాత అన్నా, రావి చెట్టు అన్నా చాలా అభిమానం, గౌరవం. సరిగ్గా అందువల్లనే బౌద్ధులు కూడా సుజాతనూ, రావిచెట్టునూ యెంతో ప్రేమిస్తారు. గౌరవిస్తారు. ఆరోజు పున్నమిరోజు. బుద్ధుని జీవితంలోని ప్రధాన సంఘటనలన్నీ పున్నమిరోజునే జరిగాయి. అందుకనే ఆయా పున్నమిరోజుల్ని బౌద్ధులు పవిత్ర దినాలుగా భావిస్తారు.

'ఆ సంపూర్ణ జ్ఞానం కలిగిన స్థితిలో అతడు నడుస్తూ వుంటే అతడి నడక అతడికే దివ్యంగా అనిపించిందట. అతను నిలబడి వుంటే నిలబడటమే దివ్యంగా అనిపించిందట. అతడు కూర్చుంటే కూర్చుండటమే దివ్యంగా అనిపించిందట. గౌతమబుద్ధుడే ఒకచోట అన్నాడు. ఆ సంతోషంలో 'నేను' అన్న భావం లేదు. 'నాది' అన్న భావం లేదు. అన్నింటికీ అతీతమైన పరమానందమది. విశ్వప్రేమ అది. శరీరమూ, మనస్సు కూడా తమను తాము మరచిపోయిన అమరసౌఖ్యమది. ఆ నిర్వాణ సుఖాన్ని గురించి గౌతమబుద్ధుడే యిలా అన్నాడు-

"నేను ఆ రోజు పొందిన ఆనందం, జ్ఞానం యెంతో లోతైంది. చూడటానికి కళ్ళు చాలవు. అర్థం చేసుకోవడం, చాలా కష్టం. అదేమిటో వివరించి చెప్పటానికి కూడా మాటలు చాలవు. అది

అపురూపం. అత్యంత ప్రశాంతి. హేతువుకందనిది. కేవలం జ్ఞానులు మాత్రమే అర్థం చేసుకోవగలరు. కోరికలతో దహించుకుపోయేవారికి, దుఃఖంలో మునిగి వుండే వారికి, నేను, నాది అన్న భావం కలవారికీ, కరుణ, దయ అన్నవి లేనివారికి యీ నిర్వాణం యొక్క సౌఖ్యం తెలియడం అసాధ్యం. ప్రతివొక్కరూ జ్ఞానులై, యీ సౌఖ్యాన్ని పొందాలి. జీవితాన్ని చక్కదిద్దుకుని, నిర్వాణదిశగా సాగిపోవాలి. నేను, నాది అన్నది వదులుకుని యెప్పుడైతే మనిషి విశ్వమానవుడవుతాడో, యెప్పుడైతే స్వార్థత్యాగి అవుతాడో అప్పుడే అతడు నిర్వాణం అనే పరమ సౌఖ్యాన్ని అనుభవించగలడు."

సంపూర్ణజ్ఞాని అయిన తర్వాత కూడా గౌతమబుద్ధుడు యేడువారాలపాటు ఆ మహావనంలోనే గడిపాడు. బోధివృక్షం క్రింద మొదటివారం అంతా ఆ మహావనంలోనే స్వేచ్ఛ కలిగించే అపురూపమైన ఆనందంతో, యెన్నడువీడని శాంతితో ప్రశాంతంగా గడిపాడు. రెండవవారం అంతా ఆ బోధివృక్షాన్నే చూస్తూ, ఆరాధిస్తూ, కృతజ్ఞత చూపుతూ గడిపాడు. మూడవవారం అంతా ధ్యానంలో గడిపాడు. ధ్యానంలోనే విశ్వపర్యటన చేశాడు. నాలుగవ వారంలో అతడి పవిత్రదేహం నుండి పవిత్రతని తెలిపే పచ్చని కిరణాలు, స్వచ్ఛతను తెలిపే తెల్లని కిరణాలు, ఆత్మ ధృఢత్వాన్ని తెలిపే నీలిరంగుకిరణాలు, జ్ఞానాన్ని తెలిపే యెర్రని రంగు కిరణాలు, నిష్కామాన్ని తెలిపే నారింజ రంగు కిరణాలు వొక్కుమ్మడిగా వెలివడ్డాయి.

అయిదవ వారంలో అతడు అజపాల అనే వృక్షం క్రింద ధ్యానంలో వుండగా తన్హ, రతి, రాగ అనే అమ్మాయిలు అతడ్ని మోహించి వశం చేసుకోవాలని చాలా తపన, యాతన పడ్డారు కాని గౌతమబుద్ధుని తపోశక్తి ముందు నిలవలేక ఆశాభంగులై వెళ్ళిపోయారు.

ఆరవవారంలో అతడు ముచలింద అనే వృక్షం క్రింద ధ్యానం చేస్తుంటే కుంభవృష్టిగా వర్షం పడసాగింది. అతడు తడిసిపోకుండా, చలికి గురికాకుండా పడగ విప్పి రక్షించిందట. బహుశా ఆ కాలనాగు, ఆనాటి నాగజాతి మనిషిఅయివుండవచ్చు. గౌతమబుద్ధునికి సేవలు చేసివుండవచ్చు. ఆ కాలనాగుతో లేక ఆ నాగజాతి మనిషితో గౌతమబుద్ధుడిట్లా అన్నాడు. "తృప్తిగా వుండటమే సంతోషం. యెవరు సత్యాన్ని విన్నారో, యెవరు సత్యాన్ని చూస్తారో, వారిదే సంతోషం. యెవరికైతే యీ ప్రపంచంలోని జీవరాసులన్నింటిపట్లా కరుణ, సమ్మతి వుంటుందో వారిదే సంతోషం. యీ ప్రపంచంలో యెవరైతే రాగబంధాలకు అతీతులుగా వుంటారో, నాది అనేది లేకుండా జీవిస్తారో వారిదే అత్యున్నత సంతోషం."

7వ వారంలో అతడు రాజాయతన వృక్షం క్రింద ధ్యానం చేస్తుంటే 50వ రోజున తప్పు మరియు భల్లిక అనే వ్యాపారస్తులు మార్గమధ్యంలోవచ్చి గౌతమబుద్ధుడ్ని చూసి, ఆయన తేజస్సుకు అబ్బురపడి ఆయన దగ్గర మొట్టమొదటిసారిగా బౌద్ధాన్ని స్వీకరించారు. అప్పటికి బౌద్ధసంఘం లేకపోవడం వలన బౌద్ధత్రిశరణాలలోని బుద్ధం శరణం గచ్ఛామి- ధర్మం శరణం గచ్ఛామి అన్న రెండు శరణాలనే వారు పఠించారు. తమ పవిత్రమైన గురుతుగా యేమైనా యివ్వవలసిందిగా వారు కోరగా, తనదంటూ యేమీ లేని గౌతమబుద్ధుడు చివరికి తన కేశాలు కొన్ని వారికి బహూకరించాడు. వారు తమ స్వదేశమైన బర్మాకు వెళ్ళి అక్కడ బౌద్ధ ధర్మాన్ని వ్యాప్తి చేశారు.

ప్రపంచం తన బోధనలని పట్టించుకోదేమో, పాటించదేమో- పాపపంకిలమైపోయిన యీ ప్రపంచంలో జ్ఞానాన్ని బోధించడం సులువైన పనికాదేమో అన్న ఆలోచనలు కూడా అతనికిప్పుడు లేవు.. ఆయన యెదురుగా వున్న వొకే కోరిక... యీ ప్రపంచంలో దుఃఖాన్ని నిర్మూలించాలి. అందుకు

తన మార్గం దారి చూపిస్తుంది. తానే అందుకు సాక్ష్యం. అవిద్య, అజ్ఞానాలలో పడి దుఃఖభవసాగరంలో మునిగిపోతున్న దయనీయుల్ని రక్షించాలి. తాను చేరుకున్న ఆవలి ఒడ్డును చూపించాలి, అని దృఢంగా నిశ్చయించుకున్నాడు. మొదటగా తన జ్ఞానఫలితాన్ని తననెంతగానో అభిమానించి చేరదీసిన గురువులు ఆళారకాలాముడు, వుద్దకరామపుత్రులకు తెలపాలను కున్నాడు. వాకబు చేయగా వారు గతించినట్లు తెలుసుకుని చాలా బాధపడ్డాడు. యింకమిగిలింది. తనకు సేవలుగావుంటూ, తననుంచి జ్ఞానబోధను ఆశించిన ఆ అయిదుగురు శిష్యులూ. వారికే తన జ్ఞానాన్ని బోధించాలని గౌతమబుద్ధుడు నిశ్చయించుకున్నాడు. వాళ్ళు వెళ్ళేటప్పుడు కాశీపోతున్నామని చెప్పారు. గౌతమబుద్ధుడు కాశీ కేసి ప్రయాణించసాగాడు.

దారిలో అతడికి కోతులు యెదురై, యెవరెవరో తెచ్చిన పండ్లను అతడి చేతికి యిచ్చిపోతుండేవి. మనుష్యుల చేతుల్లోంచి పట్టుకుపోవడమే కానీ, తిరిగి మనుష్యులకే తెచ్చి యివ్వడమనేది ఎరగని సంఘటన. గౌతమబుద్ధుడికి యిలా కోతులు పళ్ళు యిస్తూ వుండటం చూసి చూసినవారు చాలా ఆశ్చర్యపోతూ వుండేవారు.

మార్గమధ్యంలో వుపకీవకుడనే శ్రమణుడు యెదురై, గౌతమబుద్ధుని ప్రశాంతవదనాన్ని చూసి సంతోషపడి. 'యెవరు మీరు? యెవరి శిష్యులు?' అని అడిగాడు. గౌతమబుద్ధుడు చిరునవ్వుతో "రాగాది సమస్త క్లేశాలను జయించిన వాణ్ణి. సంసార దుఃఖనిర్ముక్తికి అవసరమయ్యే జ్ఞానాన్నంతటినీ పొందాను. దేనియందూ కోరికలు లేనివాణ్ణి. కోరికల్ని నశింపచేసి విముక్తుడనయ్యాను. ప్రతీత్య సముత్పాద సత్యాన్ని స్వయంగా తెలుసుకున్నాను. నాగురువని యెవరిపేరు చెప్పగలను?' ' అన్నాడు. దానికాశ్రమణుడు, యేదో ప్రశ్నించాం-దానికతడేదో సమాధానం యిచ్చాడు సరిపోయింది అన్నట్లుగా 'ఆహా అలాగా!' అని తలవూపి వెళ్ళిపోయాడు. అతడికి తన జ్ఞానబోధ చేయాలని గౌతమబుద్ధుడు మొదట తలచాడు. జ్ఞానాన్ని పొందడానికి కూడా అవతలవ్యక్తి సిద్ధంగా వుండాలి కదా! యిదీ ఒక అనుభవం అయిందతడికి.

## ధర్మచక్రప్రవర్తనం

(బౌద్ధశకం మొదలైన రోజు. క్రీస్తు పూర్వం 528 వ సంవత్సరం. ఆషాఢ నెల పౌర్ణమి రోజు)

చివరికి కాశీ దగ్గరలోని సారనాథ్‌కు దగ్గరలో గల యిసిపట్నంలోని జింకలవనంలో తన మొదటి అయిదుగురు శిష్యుల్ని కౌండన్న, వప్ప, భద్దియ, మహానామ, అస్సజీలను చూశాడు. వారు గౌతమబుద్ధుని గుర్తు పట్టారు కానీ అతనిని ఆహ్వానించకూడదని మొదట ముఖాలు గంటు పెట్టుకున్నారు. కానీ అంతలోనే, గౌతమబుద్ధుడు చేరువవుతుంటే ప్రశాంతమైన దివ్యమైన ఆయన అంగికాన్ని కరుణతో మెరిసిపోతున్న ఆయన ముఖబింబాన్ని చూసి తామనుకున్నది మరిచిపోయి నమస్కరించారు. హిమాలయపర్వతాల్ని తలపించే అతని అంగికత్వం చూసి యెన్నడూ చూసి వుండని గొప్ప అతిథిలా ఆయనను గౌరవించారు.

బుద్ధుడు వారిని యెంతో దయతో పలకరించాడు. తానెప్పుడూ వున్నది లేనట్లుగా, లేనిది వున్నట్లుగా చెప్పలేదని మీకు తెలుసుకదా. నేను చెప్పేదంతా నా అనుభవాల సారాంశం. మీరు శ్రద్ధగా వినండి అని వారి పట్ల యెంతో ప్రేమగా, దయగా చెప్పాడు. తమకోసం యెంతో దూరం నుండి వచ్చి యింతప్రేమ కురిపిస్తున్న గౌతమబుద్ధుని వారు యెంతమాత్రం తృణీకరించలేకపోయారు.

ఒకరొకరే అతడితత్వ బోధనలు విని పరమానంద భరితులై, ముకుళించి అతని శిష్యులయ్యారు. అతని ధర్మానికి త్వరలోనే ఆకర్షితులయ్యారు. ఆరోజు నుంచి శ్రమణులు కానీ, బ్రాహ్మణులు కానీ, దేవతలు కానీ దురాత్ములు కానీ ఎవరూ కూడా ఆపవొల్లని ధర్మచక్రప్రవర్తనం ఆరంభమైంది.

అనతికాలంలోనే అతనికి పెక్కుమంది శిష్యులయ్యారు. ఆయన చెప్పిన బౌద్ధధర్మాన్ని వ్యాప్తి చేయడానికి ప్రతీ శిష్యుడు పూనుకొన్నాడు. బుద్ధుని బోధనలలో ధర్మవ్యాప్తి కూడా ఒకభాగం. అది కత్తితో సాధించేది కాదు. కరుణతో సాధించేది. బౌద్ధం హృదయపూర్తిగా విశ్వవ్యాప్తం కావడానికి కారణమదే. ధర్మం అనే చక్రాన్ని ముందుకు నడపండి అన్నాడాయన. అదే బౌద్ధ సాహిత్యంలో ధర్మచక్ర ప్రవర్తనంగా ప్రకాశించింది. నలభైఅయిదు సంవత్సరాలపాటు గౌతమబుద్ధుడు తన ధర్మప్రచారం చేశాడు. దాదాపు లక్షమైళ్ళు కాలినడకన ప్రయాణం చేశాడు. కనీసం ఎద్దులబండి కూడా ఎక్కేవాడు కాదు. దాదాపు అయిదారువందల మైళ్ళ పొడవు వెడల్పులు గల భూభాగం అంతా అతడు పర్యటించాడు. మహా సంబోధి తరువాత అతని చరిత్ర అంతా విశ్వ చరిత్రలో ప్రతీ యుగంలోనూ దేదీప్యమానంగా ప్రకాశించగల పావనచరిత్ర. మానవతకే, సమతకే పీఠం కట్టిన మహోత్కృష్ట చరిత్ర. తన బోధనలతో అప్పటిదాకా కదలకుండా వున్న ధర్మచక్రాన్ని మానవ కళ్యాణం వైపు, దుఃఖ నిర్మూలనం వైపు పరుగులు పెట్టించాడు.

పుస్తక ప్రచురణకున్న పరిమితులవల్ల ఆయన ప్రధాన తత్వ బోధనలను స్థూలంగా తరువాత ప్రకరణాలలో చదువుతారు.

గౌతమబుద్ధుడిది విశ్వప్రేమ. అది సర్వజనీనమైంది. జ్ఞాన యుక్తమైంది. అతడి వ్యక్తిత్వం అపూర్వమైంది. అతడి బోధన సమస్తమానవులకు ఆనందాన్ని ప్రేరణ.', కల్గిస్తుంది. సత్యమార్గంలో నడిచేట్టు చేస్తుంది. ఏ మనిషి అయినా సరే బౌద్ధ ధర్మం చదవక ముందూ, చదివిన తరువాతా, ఆచరించకముందూ, ఆచరించిన తరువాతా వేరు వేరుగా వుంటాడు. బౌద్ధం గురించి తెలిశాక మనిషిలో జరిగేమార్పు కరుణాత్మకమైంది. దుఃఖాన్ని కోరికల్ని నిర్మూలించేవైపు మనిషిని తీసుకువెళ్ళి నెమ్మదిగా అతడ్ని స్వార్థ రహితుడ్ని, త్యాగిని చేస్తుంది. విశ్వ మానవ కళ్యాణం కోసం బౌద్ధాన్ని ఆచరించేటట్టు స్వసుఖం కోసం మనిషి ఎవరికీ హాని చేయకుండా, తలపెట్టకుండా వుండేటట్లు చేస్తుంది.

ఒక క్షణంలో మనసులో నెలకొన్న భావన, మరొక క్షణంలో వుండకపోవడం, మొదట అనుకున్న భావానికి విరుద్ధంగా కూడా వుండటం, ఒకోసారి మొదట వున్న భావనే తిరిగి తిరిగి వుదయిస్తూ మనస్సుని వ్యాకుల పరచడం, మరికొన్ని ఆలోచనల తరువాత మనసు ప్రశాంతపడి వేరొక మార్గం తొక్కడం, పాత ఆలోచనలు మళ్ళా అప్పుడప్పుడూ పలకరించి బాధపెడుతూ వుండడం-ఒకోసారి ఏ బాదరబందీ గుర్తురాక ధ్యానానికీ, ఆలోచనకీ సులువుగా వుండడం. వీటిలన్నింటినీ గమనించిన గౌతమబుద్ధుడు, మనస్సై, తదేకంగా దృష్టి నిలిపాడు.

చెప్పాలంటే అతడి ఆరుసంవత్సరాల తపోదీక్ష అంతా మనస్సుపైనే సాగింది. ప్రతీ అనుభవంలోనూ మనస్సును పరిశీలించాడు. మనస్సు అనే అగ్నిలో ఆలోచనలనే ఆజ్యాన్ని పోసి ఆ అగ్ని గుండంలో తానే నిలువెల్లా దహించుకుపోయాడు. మనస్సు అనే అల్లరి చిన్నారిని ఒడిలోకి తీసుకుని ఆడించిపాడించి లాలించి, తన కన్న బిడ్డ కంటే ఎక్కువగా చక్కని దారిలో నడిపాడు.

తెలుసుకున్నాడతడు. మనస్సు అంటే సామాన్యమైనదికాదని. అది మనిషిని

దహించివేయనూగలదు, అతన్ని కన్నతల్లిలా ఓదార్చనూ గలదనీ, యిటువంటి మనసు తన ఒక్కడిదే కాదనీ, మనుషులందరికీ తనవంటి మనసే వుంటుందనీ. మనుషులెవరికీ తమ తమ మనస్సులపై ఆధిపత్యం లేకపోవడం వల్ల చాలా చిక్కులు యెదుర్కొంటున్నారనీ, అటువంటి చిక్కులు యెదుర్కొని అందరికీ సౌఖ్యంగా యెవరి మనో సామ్రాజ్యాన్ని వారే సఫలంగా యేలుకునే మార్గాన్ని తాను ప్రజలందరికీ చెప్పాలనీ కాంక్షించాడు.

చివరకు మనస్సుపైన విజయం సాధించాడు. మహా సంబోధి అదే. అందుకతడు అవలంబించిన పద్ధతులన్నీ అతడికి కరతలామలకమే. సంపూర్ణజ్ఞానం లభించిన ఆ వైశాఖ పున్నమిరోజున అతడి ఆనందానికి అంతులేదు. అతడు అసంకల్పితంగా పైకి అనేశాడు. "ఓయీ గృహ నిర్మాతా! నిన్ను కనుక్కున్నాను. యిక నీవు నాకు యిల్లును కట్టలేవు. నీవాసాలన్నీ విరిగిపోయాయి. నీ దూలం ధ్వంసమయ్యింది. నా చిత్తం నిర్వాణం పొందింది. అర్హత ఫలాన్ని నేను అందుకున్నాను" అని.

తరువాత వొకసారి తానే చెప్పాడు. ఆ గృహనిర్మాత యెవరో కాదు 'తృష్ణ' అనీ దాని యింకొక పేరే 'అహం' అనీ. తృష్ణ మనుషుల చేత తనదనే యిల్లు కట్టిస్తుందనీ, అందులోనే మగ్గిపోయేటట్టు చేస్తుందనీ, తనలో యిక ఆ తృష్ణకి అవకాశమే లేకపోవడం వల్ల అది వోడిపోయిందనీ, దాని కాళ్ళూ చేతుల్లా వాసాలూ దుంగలూ అన్నీ విరిగి వూడిపడ్డాయనీ, దానితో తృష్ణ అనే ఆ యిరుకైన గృహాన్ని ఛేదించి తాను విశ్వమానవుడైనాననీ చెప్పిన విశ్వంభర ప్రకటన అది.

బుద్ధుడు వొక యుగం కోసం కాకుండా సర్వయుగాలమానవుల కోసం పుట్టిన మహావ్యక్తి. అటువంటి త్యాగశీలి, అహింసామూర్తి, సత్యసంధుడు. మనభారత వుపఖండంలోనే పుట్టడం మనకు గర్వకారణం. అతడే మనిషినీ ద్వేషించలేదు. ద్వేషాన్ని ప్రేమతో జయించమన్నాడు. మనుష్యుల మధ్య, భార్యా భర్తల మధ్య, యజమాని-పనివాళ్ళ మధ్య, స్నేహితుల మధ్య యెదురయ్యే ద్వేషాల్నీ, శత్రుత్వాల్నీ రూపుమాపి, యిరువురూ సుఖంగా, సమానంగా, స్వేచ్ఛగా బ్రతికేటందుకు యిరువురికిరువురూ దోహదపడేవిధంగా తన బోధనలని రూపొందించాడు. యెక్కడా అతడు అతివాదంగా పోలేదు. మితవాదంగానూ పోలేదు. అతడి మార్గం మధ్యేమార్గం. సత్యానికి తప్పితే అతడే వర్గానికీ ప్రత్యేకంగా తన ధర్మాన్ని చెప్పిందిలేదు.

బౌద్ధధర్మదీక్ష పొందిన తరువాత మనిషి పాతవాసనలు, వాంఛలు కోల్పోయి విశ్వమానవకళ్యాణానికిపాటుపడే సరికొత్తమానవుడుగా అవతరించాలని వుద్బోధించాడు. ఆ సరికొత్త మానవుడు అప్పుడు సర్వశ్రేష్ఠుడైన బుద్ధపథగామి అవుతాడు.అతడిని యే కులం, జాతి, మతం, రంగు, లింగభేదం... యివేమీ అంటవు. "నదులు సముద్రంలో కలుస్తున్నాయి. అయినా యిది గంగాజలం, యిది యమునాజలం. యిది గోదావరిజలం అని పిలవబడుతున్నాయా? లేదు కదా! సముద్రంలో కలిసే వరకు మాత్రమే నదులు ఆయా పేర్లతో పిలవబడుతున్నాయి. అవి సాగరంలో సంగమించిన తక్షణమే అవి సముద్రం పేరుతో పిలవబడుతున్నాయి. ఆ విధంగానే నా ధర్మాన్ని స్వీకరించకముందు యెవరు యేయే కులానికి చెందాలో ఆయా కులస్థులుగా పిలువబడి వుండవచ్చు కానీ నా ధర్మాన్ని స్వీకరించిన తక్షణమే వారంతా బౌద్ధులవుతారు. వారికింక కులాలు, జాతులు వుండవు. అంతా బౌద్ధులే'. బౌద్ధుడిగా మాత్రమే పరిగణింపబడుతాడు'. యిదీ అతడి భావం. అతడు మనిషిలా సర్వసమానతా వేదికపై స్వేచ్ఛగా నడయాడే విశ్వమానవుణ్ని చేశాడు.

కొందరు అనుకుంటున్నట్లు అతడు బ్రాహ్మణులెవర్నీ ద్వేషించలేదు. బ్రాహ్మణులకిగానీ,

ఆనాటి సనాతన ధర్మానికిగానీ వొక పోటీగా ఆయనెప్పుడూ తన ధర్మాన్ని ప్రకటించలేదు. అలాగని తన ధర్మం ఆ ధర్మంలో భాగంగా కూడా ఆయన యెక్కడా ప్రకటించలేదు. వొక స్వేచ్ఛాయుతమైన ప్రజాస్వామ్యపద్ధతిలో ఆయన తన ధర్మాన్ని అభివ్యక్తి చేశాడు. బ్రాహ్మణులంటే యెంత ఆదర్శంగా వుండాలో చెప్పాడు. పుట్టుకతో బ్రాహ్మణత్వం కాదీ, మరేకులంగానీ రాదని స్పష్టంగా చెప్పాడు. వున్నతాదర్శాలతో బ్రతికేవాళ్ళెవరైనా బ్రాహ్మణులే అని చెప్పాడు. పుట్టుకతో మనుషులందరూ సమానమే అని చెప్పాడు. అతడు యే వ్యక్తినీ, యే వర్గాన్నీ ఉల్లంఘించలేదు. సత్యానికి అడ్డొచ్చిన దేన్నీ అతడు ఖాతరు చెయ్యలేదు. నిర్ద్వంద్వంగా తన అభిప్రాయాలు చెప్పాడు. అందుకు యెప్పుడూ భయపడలేదు. అభిమానం చంపుకోలేదు. అతడిలోని ప్రత్యేకత అదే. యేది చెప్పినా హితవుగా చెప్పాడు. ద్వేషమే యెరుగని విశ్వమానవుడికి ప్రత్యేకంగా బ్రాహ్మణుల పట్ల ద్వేషభావముందని చెప్పడం అసత్యాన్ని ప్రచారం చేయడమే కాగలదు. లోకంలో సత్యం యొక్క కళ్ళు మూసి వేయడం యెవరికీ సాధ్యమయ్యే విషయం కాదు. సత్యం చాలా శక్తివంతమైనది. యీ సృష్టిలో శాశ్వతంగా మిగిలేది యేదీ లేదనీ, ప్రతిదీ నశించి పోతుందనీ సత్యమొకటే నిలుస్తుందనీ చెప్పాడతడు. మనుష్యులు ధార్మికంగా జీవించాలని చెప్పాడు. జాతికులభేదాలను నిరసించాడు. యజ్ఞాలంటే యెలావుండాలో చెప్పాడు. మనుష్యులందరూ సమానమే అని చెప్పాడు. తమకోసం యేదైనా నిర్ణయించుకునే అధికారం బహుజనులకేవుందని చెప్పాడు. బహుజన హితాయ.. బహుజన సుఖాయ అన్నాడు.

స్నేహితులంటే యెలా వుండాలో చెప్పాడు. సజ్జనుని లక్షణాలెట్లా వుంటాయో చెప్పాడు. సజ్జనుడు చేయకూడని పనులేమిటో చెప్పాడు. మానవుడిని అసాంతం నాశనం చేసేవేమిటో చెప్పాడు. తల్లిదండ్రులు-పిల్లలు, గురుశిష్యులు, భార్యాభర్తలు వీరి మధ్య బాధ్యతలు-అనుబంధాలు యెలావుండాలో చెప్పాడు. జీవితంలో సుఖశాంతులు పొందాలంటే యేం చేయాలో చెప్పాడు.

మనుష్యుల పతనానికి కారణాలేమిటో, ద్వేషాన్ని యెలా నాశనం చేసుకోవాలో, జీవితంలో ప్రతిక్షణమూ జాగరూకతతో వుండడం యెంత అవసరమో, శీలమ్యం, స్నేహం, దయ, సహాగుణాలు మానవుని వున్నతికి యెలా తోడ్పడుతాయో చెప్పాడు. మంచి పనులేమిటో చెప్పాడు. చెడ్డపనులేమిటో చెప్పాడు. మనిషి వున్నతికి ధ్యానం యెంత బాగా వుపయోగపడుతుందో చెప్పాడు. ప్రజాసంఘాలు యెలా వుండాలో, యెలా వుంటే అవి నిలబడతాయో చెప్పాడు. ఆయన బోధనల్ని యిప్పటికీ శిరోధార్యంగా వుండడమే ఆయన బోధనల యొక్క ప్రాధాన్యతను తెలుపుతుంది.

అతడు బోధించిన అష్టాంగమార్గం ప్రకారం నడుచుకుంటే మనిషేకాదు, అతడు నివసించే సంఘం కూడా నీతివంతమవుతుంది. యెంతవిలువైన ఆదర్శాలు వున్నా, నీతిలేని బతుకు బతకడం అత్యంత హేయమనీ, అటువంటి బతుకు అసలు ఆదర్శాన్నే ఛిన్నాభిన్నం చేస్తుందనీ, మనిషిని పతనంచేసేస్తుందనీ ఆయన చెప్పాడు. ఆయన బోధనల్ని అంతిమంగా సమాజాభ్యుదయానికే దారితీయడం నిజంగా వొక గొప్ప ప్రత్యేకత. మానవజాతికతడు మహోపాధ్యాయుడు. యెటువంటి భయమూ, ఆశా, గుడ్డి నమ్మకమూ, బానిసత్వమూ లేకుండా స్వయంగా, స్వేచ్ఛగా, నిర్భయంగా, జ్ఞానదృష్టితో స్వచ్ఛంగా యెవరికి వారు ధ్యానయుతంగా అమలుపరుచుకోగల వుదాత్తధర్మం ఆయన ప్రవచించిన బౌద్ధధర్మం. అది ఆచరణాత్మ శాస్త్రం. విశ్వమానవకళ్యాణమే దాని ధ్యేయం. అటువంటి ధర్మం యిప్పటికీ అదొక్కటే.

అతడు గొప్ప త్యాగి. ధర్మాన్ని కనుగొన్న తరువాత అతడు తన రాజ్యానికి వెళ్ళిపోయి రాజ్యపాలన చేసుకోవచ్చు. అతడాపని చేయలేదు. తన ధర్మాన్ని విశ్వమానవులందరికీ పంచాలి. పరివ్యాప్తి చేయాలి. అందుకు రాజరికం అడ్డే. అయితే రాజుల వలన వుపయోగం వుంది. వారు తోడ్పడితే ధర్మం తొందరగా వ్యాప్తి చెందుతుంది. అందువల్ల తన ధర్మవ్యాప్తిలో రాజుల సాయాన్ని తీసుకున్నాడే గానీ, తానే తిరిగి రాజు అవలేదు. జీవితమంతా ధర్మవ్యాప్తికే ధారపోశాడు. కడకు కొడుకునీ, తమ్ముడ్నీ కూడా బౌద్ధ భిక్షువులుగా చేసి, తన త్యాగానికి హద్దులు లేవని చూపాడు. సంపూర్ణజ్ఞానిగా మారిన తరువాత కపిలవస్తు వచ్చినప్పుడు భార్య యశోధర బుద్ధుని చూసి దుఃఖం ఆపుకోలేకపోతుంది. కన్నీటితో అతడి పాదాలను కడుగుతుంది. కుమారుడు రాహుల్‌ని పిలిపించి, తండ్రిని చూపించి, 'తండ్రి ఆస్తిలో వాటా కోరమని' అడుగుతుంది. ఆ మాటకు బుద్ధుడు చిరునవ్వు నవ్వాడు. "నా ఆస్తి అంతా నా జ్ఞానమే. బాబూ! నీకు వాటా కావాలా? అంటూ" కుమారుడ్ని ప్రేమగా దగ్గరకు తీసుకుని, ఆ పిల్లవాడు వుత్సాహం చూడగానే, ఆపిల్లవాడికి కూడా ధర్మదీక్ష యిచ్చాడు. మవ్వెలావో సన్యసించావు, నీ కొడుకు అయినా యీ రాజ్యానికి రాజు కావాలి.. అయినా అతడికి కూడా బుద్ధ దీక్షనిచ్చావు యిది న్యాయం కాదని శుద్ధోదనుడు విలవిలలాడిపోతాడు. మానవ కళ్యాణం కోసం తన ధర్మం కన్నా మించిన ధర్మం లేదనీ, యే రాజరికమూ యిందుకు సాటిరాదనీ యిలా బుద్ధుడు ఆచరణాత్మకంగా రుజువు చేశాడు. ఆ ధర్మసాధన కోసం యెటువంటి సుఖసాధనాలూ సుఖాలూ కోరుకోకుండా వొంటిపూట భోజనంతో కాళ్ళకు పాద రక్షలు కూడా లేకుండా జీవితాంతం వేలాది మైళ్ళు విరామం లేకుండా పర్యటించాడు. త్యాగానికి అతడికంటే వేరే నిర్వచనమే లేదు.

యీ ధర్మం నాది-యిది తన పేరు మీదుగానే నిలిచిపోవాలని అతడు కోరుకోలేదు. యీనాటి మతాచార్యుల్లా యేనుగు అంబారీలెక్కలేదు. పల్లకీలెక్కి వూరేగలేదు. నిలువెత్తు ధనాలు తూయించుకోలేదు. ఆస్తులు మూటకట్టుకోలేదు. తనంటే ప్రజలు పిచ్చెత్తి పోయేటట్లు చేసుకోలేదు. యెటువంటి మూఢత్వాన్నీ పెంచలేదు. తావొక్కడివల్ల ప్రపంచం మారుతుందనిగానీ, తాను దేవుడిననిగానీ, లేక దేవదూతననిగానీ, ఆదివాడుననిగానీ, తనమాటకు తిరుగులేదనిగానీ, తనను నమ్ముకుంటే కడతేర్చుతాననిగానీ, తనద్వారా స్వర్గసుఖాలు లభ్యమవుతాయనిగానీ, లోకాన్ని వుద్ధరించడానికి అవతరించాననిగానీ, తానే చివరివాడిననిగానీ, ఆద్యంతాలు లేనివాడిననిగానీ, ఆయన చెప్పలేదు.

మనుష్యులు స్వార్థ, అజ్ఞానాలతో వొకరి నొకరు పీడించుకోకుండా హింసించుకోకుండా, యెవరికివారు ఆత్మ శిక్షణ గరుపు కోవడానికి వొక భక్తీ దార్శ్యతా కలిగిన ధర్మాన్ని, సత్యం, న్యాయం కలిగిన ధర్మాన్ని అతడు మనకి అందించాడు. అదే బౌద్ధ ధర్మం. అతడు ప్రకటించిన మాటలు సరళంగా వున్నా అవి సాదాసీదా మాటలు కావు. వాటి గురించి ఆలోచిస్తున్న కొద్దీ, తెలుసుకుంటున్న కొద్దీ లోతులు తెలుస్తుంటాయి. అందువల్ల ఆయన బోధనల్ని మననం చేసుకున్న ప్రతీ వొకసారి, ఆ బోధల్ని అర్థవంతంగా అర్థం చేసుకోవడమే కాకుండా, మరింతలోతుగా గాఢంగా అర్థంచేసుకునేందుకు ప్రయత్నించాలి. మరింతగా విశ్లేషించుకోవాలి. వుదాహరణకి అతడు వుపదేశించిన 'మంచి' అన్నమాటలో సమైక్యత, సామ్యత, అంతా వొక్కటే, సముచ్చయం, సరియైన, సమమైన, సమత్వం, సరిసాటి, మృదువైన, స్థిరత్వము, శాంతము, నెమ్మది, కల్మషం లేని సుఖం, తృప్తి, పరిపూర్ణత, పరిపక్వత, ప్రశాంతత మొదలైన అర్థాలు వస్తాయి. వీటన్నిటినీ

అవగతం చేసుకోగలిగినప్పుడే ఆ పదం తాలూకా పూర్తి అర్థాన్ని జీర్ణించుకోగలుగుతాము. అనుభవించగలుగుతాము.

ధర్మదీక్షనివ్వడంలో అతడెటువంటి పాక్షికతా చూపలేదు. సత్యంపట్ల అతనికున్న దృఢనమ్మకానికీ, అతడి విశాలహృదయానికీ అదే రుజువు. ఆ నాటి సంఘం యిటువంటి సర్వ మానవసమానత్వభావాలను అసలు వూహించనేవూహించి వుండదు. అయినా అతడు మనుషులందరూ సమానమే అంటూ మంగలి కులస్థుడైన వుపాలికీ, పేదలూడ్చే సునీతుడికీ, జాలరి కుటుంబం వాడైన సతికీ, వేశ్య ఆమ్రపాలికీ, బాధలకు తట్టుకోలేక ఆత్మహత్య చేసుకోబోయిన బానిసస్త్రీ రజ్జమాలకీ, పుట్టుకతో అస్పృశ్యులంటూ సంఘం చీదరించుకున్న స్వపాక సుప్రియులకీ, కుష్ఠురోగియైన సుప్రబుద్ధుడికీ, చండాలిక అయిన ప్రాకృతికీ, బందిపోటు అయిన అంగులిమాలుడికీ యింకెంతోమంది సంఘబహిష్కృతులకు, రాజకుటుంబీకులు, ధనవంతులు, పండితులు, ఆచార్యులతో సమానంగా ధర్మదీక్షనిచ్చాడు. ధర్మదీక్షలు పొందినతరువాత యెవరిపట్లా యెచ్చుతగ్గులు పాటింపబడవు. అందరూ సమానమే. అందరూ కలిసిమెలిసి వుండాల్సిందే. ఒకరినొకరు గౌరవించుకోవాల్సిందే. పూర్వాశ్రమాన్ని మరచిపోవాల్సిందే. యేవొక్కరికీ ప్రత్యేకమైన సదుపాయం యేమాత్రమూ వుండదు. యిలా అందర్నీ ఒకేగాటన ధర్మంలో కలిపేసుకుంటే, ఆ ధర్మం కలుషితమైపోదా? అని ప్రశ్నిస్తే "ప్రజలకై పవిత్ర స్నాన ఘట్టాన్ని నిర్మించాము. అందులో మునిగి పాపపంకిలాన్ని కడిగేసుకోవచ్చు- అయితే యీ కొలనులోకి మురికివాళ్ళు దిగవద్దు, దుమ్ము-ధూళి కడుక్కున్న వాళ్ళు పవిత్రమైన వాళ్ళు, మచ్చలేని వాళ్ళు మాత్రమే దిగి స్నానం చేయవచ్చు- అని నేనవచ్చా? అలాంటి మాటల వల్ల యింక నా ధర్మంలో మంచేముంటుంది? " అని స్పష్టంగా, తన ధర్మంలో వివక్షత అనేది లేదని స్పష్టంగా సమాధానం యిచ్చాడు.

యెక్కడైనా, 'అస్పృశ్యులు' అన్న మాట వచ్చినప్పుడు అతడామాటని చాలా కంటగించుకునే వాడు. ఒక సందర్భంలో అతడు అస్పృశ్యత అన్నమాటనే తీవ్రంగా ఖండిస్తూ, "అస్పృశ్యుడంటే యెవరో తెలుసా? ముక్కోపి, పగబట్టినవాడు, దుష్టుడు, అగౌరవపరచేవాడు, చపలుడు, వంచకుడు, జీవఘాతకుడు, నిర్దయుడు గ్రామాలను నాశనం చేసేవాడు, పరులని ఆజ్ఞాపించేవాడు, దొంగతనంతో సంగ్రహించేవాడు, అప్పుయెగవేసేవాడు, దురాశాపరుడు, దారినపోయేవారిని చంపేవాడు, దోచుకునేవాడు, అబద్ధసాక్ష్యం చెప్పేవాడు, బంధుమిత్రుల భార్యలతో చరించేవాడు - సంపదకలిగి వుండి కూడా తల్లి దండ్రులని పోషించనివాడు, మంచి అడిగితే స్వార్థం చేర్చి సలహా యిచ్చేవాడు. యిలాంటి : వారంతా అస్పృశ్యులు. పుట్టుకతో యెవరూ అస్పృశ్యులు కారు" అని చెప్పాడు.

ఆ విధంగా యెటువంటి భేదభావం లేకుండా తన ధర్మాన్ని చెప్పడం వల్ల, అప్పటివరకూ హీనులుగా, అస్పృశ్యులుగా, కడజాతివారిగా చూడబడిన వారందరికీ అప్పటివరకూ వూహించే వూహించివుండని వున్నత సాంఘికస్థాయి యేర్పడింది. వారు తమ శక్తియుక్తులను, జ్ఞానాన్ని సాంఘిక స్థాయిని పెంపొందించుకుని, అప్పటిదాకా తమను హీనంగా చూసిన వారికెందులోనూ తీసిపోమని రుజువు చేసుకోగల్గారు. అతని జ్ఞానం యొక్క సారమే మానవసమానత్వం. దళిత బహుజనులకు డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ చూపించిన మార్గం, బౌద్ధధర్మమే. యిది వారు తప్పక పాటించాలి. అంతేకాదు సమసమాజ నిర్మాణానికి, దేశాలలో శాంతి భద్రతలు కాపాడుకోవడానికి, సంఘంలో శాంతి సమరసభావాలు వ్యాప్తిచెంది, యెల్లరూ సుఖజీవనం సాగించడానికి బుద్ధుని

బోధలు అంతర్లీనంగా యెంతో దోహదపడతాయి. ఏ ధర్మానికైనా యీ సద్ధర్మ చింతన పునాది కాగలుగుతే అది తప్పక విజయం సాధిస్తుంది. ప్రపంచవ్యాప్తంగా మారుతున్న సామాజిక పరిస్థితులు బౌద్ధధర్మాన్ని వేదికమీదకు తీసుకు వస్తున్నాయి. యిది యెల్లరూ ఆహ్వానించదగ్గ శుభ పరిణామం.

బౌద్ధధర్మాన్నుంచి మనిషి తెలుసుకోగలిగిన నేర్చుకోగలిగిన ఎన్నో వున్నాయి. బాల్యంనుంచీ పాఠ్యాంశాలుగా వుండదగినవవి. స్నేహం, సౌభ్రాతృత్వం, ప్రేమ, ధ్యానం, త్యాగం, సేవ, దయ, మైత్రి మొదలైన మానవ వున్నత గుణాల గురించి తెలుసుకోవడంలో వాటిని అమలు చేయడంలో బౌద్ధధర్మం ప్రతివయస్సులోనూ ఒక గొప్ప ఆలంబన కాగలదు. మానవ జీవితాన్ని చరితార్థం చేసుకోవాలంటే బౌద్ధ ధర్మం గొప్ప అండ. తోడు. నీడ.

మనిషి అధిష్ఠించగల అన్ని వున్నత శిఖరాలనూ అతడు అధిరోహించాడు. మనిషి యెంతటి త్యాగం చేయగలడో అంతత్యాగాన్ని అతడు చేసి చూపాడు. తాను అధిరోహించిన అన్ని శిఖరాలనూ అందరూ అధిరోహించగల మార్గాన్ని అతడు మానవాళికి అందించాడు. అతని గురించి తెలుసుకోవడం, చర్చించడం, రాయడం, పాటించడం యివన్నీ కూడా యెంతో సంతోషం కల్గిస్తాయి. నాలుగువాక్యాల్లో రాయాలంటే అతడి వున్నత భావన యిలా వుంటుంది :

సత్యం ప్రపంచాన్ని జయించుగాక<br>
శాంతం మనుష్యుల్ని పాలించుగాక<br>
జీవులన్నీ సుఖంగా జీవించుగాక<br>
జగతినిండా సమత వర్థిల్లు గాక

ప్రతిదినం ఆయన బోధనలను పఠించడం యెంతో మంచిది. మానవాళికి ఆయన బహూకరించిన ధ్యానాన్ని అభ్యసించడం మరెంతో మంచిది. బౌద్ధధ్యానం ఒక మంత్రాన్నో బీజాక్షరాన్నో జపిస్తూ చేసేదికాదు. అదొక గొప్ప వాస్తవ ప్రాపంచిక చింతన. యీ ప్రపంచంలో తనకున్న స్థానమేమిటో. కర్తవ్యమేమిటో యెప్పటికప్పుడు సమరాలోచిస్తూ మనిషిని అర్థవంతమైన ఆలోచనలద్వారా ఒక వొడ్డుకి చేరుస్తుంది. చేరవలసిన ప్రయాణానికి మనిషిని, సంసిద్ధుణ్ని చేస్తుంది. యిది వివరంగా అష్టాంగ మార్గంలో, 'ధ్యానసమాధి' అన్న అంశంలో వస్తుంది.

చెప్పాలంటే మనస్సులోని ఆలోచలను పరిశుద్ధంగా మెరుగు పరుచుకోవడమే ధ్యానం. మనస్సు మంచిగా, స్వచ్ఛగా, సంతోషంగావుంటే ఆ మనిషి చేసే పనులు కూడా మంచిగా, స్వచ్ఛగా, సంతోషంగా వుంటాయి. మనస్సుని అట్లా పరిశుద్ధంగా, నిర్భయంగా, వుండేటట్లు చేయడానికి ధ్యానం వుపయోగ పడుతుంది. 'యిది' మంచి - యిది చెడు, యిది కావలసింది - యిది వదిలి పెట్టవలసింది, అనేటటువంటి విచక్షణ ధ్యానం ద్వారా విస్పష్టంగా కలుగు తుంది -యింక మనం ఆ మహానుభావుని బోధనామృత ప్రవాహంలోనికి అడుగు పెడదాము

బుద్ధం శరణం గచ్ఛామి<br>
ధమ్మం శరణం గచ్ఛామి<br>
సంఘం శరణం గచ్ఛామి

---

## అధ్యాయం - II

# విశ్వమానవ కళ్యాణకారకములైన గౌతమబుద్ధుని బోధనలు - ఆర్య అష్టాంగమార్గం

మొట్టమొదటి ధర్మచక్ర ప్రవర్తన సందర్భంలోనూ, ఆ తరువాత పెక్కు సందర్భాలలోనూ అష్టాంగమార్గం గురించి ఆయన యిలా బోధించారు :

ప్రియమైన శిష్యులారా !

ప్రపంచం అంతా నిత్యసంఘర్షితమై, బాధలతో, దుఃఖంతో నిండివుండటం చూసి నేనెంతో వ్యధ చెందాను. యీ ఘర్షణలను నివారించి శాంతిని స్థాపించాలన్న ధ్యేయంతో, దుఃఖ ద్వేషాల్ని రూపు మాపగలిగే సత్యమార్గాన్ని తెలుసుకోవాలన్న కాంక్షతో, అన్ని బంధాలనూ వదులుకుని స్వేచ్ఛగా నా అన్వేషణ సాగించాను. యిన్నో కడగండ్లు పడ్డాను. నా అన్వేషణ ముగిసింది. నేను సత్యాన్ని కనుగొనగల్గాను. దుఃఖంయొక్క మూలాన్ని దర్శించగల్గాను. నేను అవతలిఒడ్డుకు చేరుకున్నాను. నాకిప్పుడు దుఃఖం అన్నది లేదు. నేను సత్యాన్నే ధ్యానిస్తాను. నేను సత్యాన్నే ఆచరిస్తాను. నేను సత్యంగురించే మాట్లాడతాను. నేనెల్లప్పుడూ సత్యాన్నే తలపోస్తాను. సుఖదుఃఖాల కతీతమైంది నా మార్గం. యీ మార్గంలో యీ శరీరమందువుండగానే నా యొక్క జీవితం ముగిసింది. నిర్వాణం చెందాను. అదొక గొప్ప ఆనందానుభూతి. వర్ణించలేనటువంటిది. నాలో 'నేను' అన్న భావం నశించి పోయింది. ఆ స్థానాన్ని సత్యం ఆక్రమించింది. ఆ విధంగా సత్యంలో నేను శాశ్వతంగా మిగిలిపోతున్నాను.

యీ శరీరాన్ని చాలించిన తరువాత మీరు బుద్ధుని మరెక్కడను చూడలేరు. కేవలం సత్యమునందే బుద్ధుని దర్శించగలుగుతారు. బుద్ధత్వానికి సత్యానికి తారతమ్యం లేదు. మీరు నా (సత్యము యొక్క) సంతతి. నేను మీ తండ్రిని. నా ద్వారా మీరు దుఃఖంనుండి విడివడుతారు. నేను అవతలి ఒడ్డుకు చేరియుంటినిగాన అట్టి ప్రదేశమును చేరుటకు మీకు తోడురాగలను. భిక్షువులారా! ప్రాపంచిక బంధాలనుండి, స్వర్గ చాపల్యాలనుండి నేను విముక్తుడనయ్యాను. యిట్లానే మీరు కూడా యీ రెండు పాశాలనుండి విముక్తులవండి. ఆ స్థితిని సాధించి, భిక్షువులారా! బహుజనుల హితమునకై, సుఖమునకై, లోకముపైన దయతో - దేవతలు, మనుష్యులు వీరికళ్యాణానికై, ధర్మోపదేశమునొసగుటకు ప్రవృత్తులుకండి. ఊరూరతిరిగి మీరీపని చేయాలి. ఒకత్రోవ యిద్దరు నడిచి వెళ్ళకూడదు. యీ ధర్మ మార్గముమొదట కళ్యాణ ప్రదం. నడుమ కళ్యాణ ప్రదం అంతమందూ కళ్యాణ ప్రదం. యీ ధర్మ మార్గాన్ని లోకానికి వుపదేశించండి.

నేను పొందిన మహానందాన్ని మీరందరూ పొందాలి. అందుకోసం నాకు వుపయోగపడిన జ్ఞానమంతా మీకు వుపదేశించడానికి వచ్చాను. మీరందరూ దుఃఖాన్ని నిర్మూలించుకొని, యీ జ్ఞానాన్ని పదిమందికీ పంచండి. కృషిచేయవలసింది మీరే. నేను ఆ మార్గాన్ని మీకు చూపెడుతున్నాను.

ప్రియమైన శిష్యులారా! వినండి! నేను చెప్పేదంతా నిజం. మీరు అర్థంచేసుకోలేక పోతే, తిరిగి మీరే మళ్ళా నన్ను అడుగవలసి వస్తుంది. అందువల్ల జాగ్రత్తగా, శ్రద్ధగా నామాటలు వినండి. యిది నాకో, మీకో, మరెవరికో దుఃఖంపోయే మార్గం కాదు. యిది సర్వమానవాళికీ దుఃఖం

నిర్మూలమయ్యే మార్గం. యిది నేను కనుగొన్నాను. విజయం సాధించాను. యిది సర్వులకూ చెందాలి. విశ్వవ్యాప్తికావాలి. లోకమంతా కళ్యాణకాంతితో నిండిపోవాలి. ప్రియమైన శిష్యులారా! అందుకు మిమ్ములనే మొదటగా యెంచుకున్నాను. నా మాటలు శ్రద్ధగా వినండి. నేను మార్గదర్శిని మాత్రమే.నామీదవున్న గౌరవాన్ని తీసి ప్రక్కనపెట్టి నావాక్యాలను పరీక్షపెట్టి చూడండి. "తనచేతికి వచ్చింది అసలు బంగారమా కాదా తెల్సుకోవడానికి స్వర్ణకారుడు దానిని కాల్చి. నరికి,రుద్ది, పరీక్షించే విధంగా నావాక్యాలను నో భిక్షువులారా! నా మీద గౌరవంతోకాకుండా మీ అనుభవం అనే ఒరిపిడిలో పెట్టి పరీక్షచేసి నిలబడితేనే తీసుకోండి లేదంటే విసిరివేయండి".

ప్రియమైన శిష్యులారా! తథాగతుని (తనను) మీరెవరూ పేరు పెట్టి పిలువకూడదు. మిత్రునిగా సంబోధించ కూడదు. యెందుకంటే బుద్ధుడు తాను సర్వభూత సమత - భూత దయగల వాడు. మానవాళికంతటికీ తండ్రి.

శిష్యులారా! యీ ప్రపంచంలో బుద్ధులు పుట్టినా పుట్టకపోయినా చెప్పినా చెప్పకపోయినా యీ విశాల ప్రపంచంలో వున్నవన్నీ యేర్పడినవన్నీ అనిత్యాలు. అశాశ్వతాలు. యీ విధాన్ని కనుగొన్న బుద్ధుడు, దీనిని సంపూర్ణంగా తెలుసుకుని తాను తెలుసుకున్నది ప్రపంచానికి తెలియ పరుస్తాడు. ప్రసిద్ధ పరుస్తాడు. బోధిస్తాడు. యీ ప్రపంచంలో వున్నవన్నీ యేర్పడినవన్నీ అనిత్యమనీ. అశాశ్వతమనీ చెప్తాడు.

అలాగే యీ ప్రపంచంలో బుద్ధులు పుట్టినా పుట్టకపోయినా చెప్పినా చెప్పక పోయినా యీ విశాల ప్రపంచంలో యేర్పడిన వాటన్నింటినీ దుఃఖం వెన్నాడుతూనే వుంటుంది. యీ విధాన్ని కనుగొన్న బుద్ధుడు, దీనిని సంపూర్ణంగా తెలుసుకుని, యీ ప్రపంచం అంతా దుఃఖంతో కూడుకొని వున్నదని యీ ప్రపంచానికి తెలియ పరుస్తాడు. బోధిస్తాడు. ప్రసిద్ధపరుస్తాడు.

యీ ప్రపంచంలో బుద్ధులు పుట్టినా పుట్టకపోయినా. యీ విశాల ప్రపంచంలో వున్న వాటికీ, యేర్పడిన వాటికీ 'నాది' అన్నది లేదు. 'ఆత్మ' అన్నది లేదు. యీ విధాన్ని కనుగొన్న బుద్ధుడు, దీనిని సంపూర్ణంగా తెలుసుకుని, యీ ప్రపంచంలో యెవరికీ 'నాది' అన్నది యేదీ లేదని యీ ప్రపంచానికి తెలియపరుస్తాడు. బోధిస్తాడు. ప్రసిద్ధ పరుస్తాడు.

నిర్వాణము పొందడంవల్లనేనీవిధాన్ని కనుగొన్నాను. ప్రియమైన శిష్యులారా! యిది గ్రహించండి అవలోకించండి. ధ్యానించండి. ఆచరించండి. యీ ప్రపంచం అశాశ్వతం. దుఃఖం. యిందులో 'నాది' అన్నది యెవరికీ, దేనికీ లేదు. యిందులో మనుష్యులని ప్రత్యక్షంగా పట్టి పీడిస్తుందేది దుఃఖం. ప్రపంచంలో మొల్లిసలా అవరించుకుని వున్న యీ దుఃఖమే. దీని నిర్మూలనకు నా చేత అన్వేషణ చేయించింది. నేను చివరికి నాలుగు సత్యాలను కనుగొన్నాను. అందులో మొదటిది - 'యిది దుఃఖం'

యీ దుఃఖాన్ని పోగొట్టుకోవడానికి సుఖభోగాలలో జీవించడమే మార్గం అని అనుకోవడమూ తప్పే. నిరాహారంతో, తపోసమాధిలో కృంగికృశించిపోవడమూ తప్పే. యివి రెండూ తీవ్రమైనవే కాక దుఃఖాన్ని యెంత మాత్రమూ తగ్గించలేవు. భిక్షువులారా! శ్రద్ధగా వినండి నాది మధ్యే మార్గం . యిది మీకు లోతైన దృష్టినందిస్తుంది. జ్ఞానం అందిస్తుంది. అంతేకాదు మీకు శాంతి కలిగేట్టు మిమ్మల్ని నడిపిస్తుంది. ఆత్మావలోకనమై, సంపూర్ణజ్ఞానం కలుగుతుంది. అపురూపమైన నిర్వాణం లభ్యం అవుతుంది. యేమిటా మధ్య మార్గం? యిది చతురార్య సత్యాలతో, ప్రతీత్య సముత్పాదంతో కూడిన ఆర్య అష్టాంగ మార్గం.

భిక్షువులారా! ముందుగా యీ ప్రపంచం అంతా దుఃఖంతో కూడుకుని వున్నదన్న యదార్థాన్ని గుర్తించండి. యిది దుఃఖం. యీ ప్రపంచం అంతా దుఃఖం తో కూడుకుని వుంది.

యీ ప్రపంచంలో యెవరు యెంతకాలం బ్రతుకుతారో చెప్పలేము. జీవితం చాలా చిన్నది. బాధాకరమైనది. యే జన్మ అయినా చివరికి మరణంతో ముగుస్తుంది. మట్టితో చేసిన కుండ యెప్పటికైనా పగలక మానదు. అలాగే జీవితం కూడా. పిన్నలు-పెద్దవారు, పిరికివారు-ధైర్యస్థులు, అజ్ఞానులు-మేధావులు అన్నతేడా లేకుండా వారిని మృత్యువు వరిస్తుంది. మృత్యువారినుండి వారినెవరూ కాపాడలేరు. యిది సత్యం. 'జన్మించడం' వల్లనే కదా భవిష్యత్తులో కష్టాలు, మృత్యువు మొదలైన దుఃఖాలు కలిగేవి? జన్మించడంతోనే జీవికి ఆకలిదప్పులు మొదలవుతాయి. ఆ విధంగా జన్మించడం కూడా దుఃఖకారణమే.

యిలా జన్మించడం, ఆకలిదప్పులు కలగడం, రోగాలు రావడం, ముసలితనం రావడం, చివరికి చావు.... యివన్నీ దుఃఖం కల్గించేవే. యీ దుఃఖాలన్నీ భౌతికమైనవి. మొదటిదశకు చెందినవి.

ఆ తరువాత మానసికమైన దుఃఖాలెన్నో వున్నాయి. అయిష్టంగా వుండే వాటిని కలిగి వుండటం, యిష్టమైనవి లభ్యం కాకపోవడం, నచ్చని మనుష్యుల మధ్య బతకాల్సి రావడం, నచ్చిన వారెక్కడో దూరంగావుండడం, ఆత్మీయుల వియోగం, యిష్టంలేనిపనులు చేయాల్సిరావడం, యిష్టంవున్న పనులు చేయలేని నిస్సహాయస్థితిలోవుండడం— యివన్నీ మనిషికి అలవిమాలిన దుఃఖాన్ని కల్గిస్తాయి. దుఃఖంలో యిది రెండవ దశ.

మూడవదశలో పైనచెప్పిన దుఃఖాలకు పెద్దగా స్థానంవుండదు. మూడవదశలోని దుఃఖం అంతా మనిషికి యీ ప్రపంచం గురించీ, యితరుల గురించే వుంటుంది. యితరులు పడే బాధ, వారి అజ్ఞానం, వారికి తానేమి చేయలేకపోవడం. యివన్నీ యెంతో దుఃఖం కల్గిస్తాయి. యెంత శ్రమిస్తున్నా, ఆలోచిస్తున్నా నిస్సహాయ స్థితే యెదురై దుఃఖమే చివరికి మిగులుతూ వుంటుంది.

ప్రపంచంలోని యీ దుఃఖాల్ని పోగొట్టుకోవడానికి మహార్షులు యెన్నో పద్ధతులు బోధించారు. యే పద్ధతీ పూర్తిగా విజయం సాధించలేదు. కఠోర నియమాలతో, తపస్సుతో మనస్సునీ, శరీరాన్నీ శుష్కింప చేసుకున్నా దుఃఖం తీరలేదు. సుఖించడమే సరైందని, నీతినియమాలు బాధ్యతలు విడిచి ప్రాపంచిక భోగాలలో మునిగితేలిపోయినా దుఃఖం తీరడం లేదు. మరేమి చేయాలి?

నేను చెప్పే మార్గంలో నడిచినట్లయితే సర్వులకూ దుఃఖం తొలగిపోతుంది. నా మార్గం యెందులోనూ అతిని అంగీకరించదు. నేను చెప్పేది సైతం మీరు గుడ్డిగా నమ్మనక్కరలేదు. బుద్ధి వివేచన చేయండి. ఆ తరువాతనే యీ మార్గాన్ని అనుసరించండి. దేనినీ పాతగ్రంథాలు, స్మృతులు చెప్పాయని నమ్మకండి. దేశం, జాతి యొక్క నమ్మకం కాబట్టి నమ్మకండి. మీరు పుట్టినప్పటినుంచీ వస్తున్నదికదా అని నమ్మకండి. యోచించండి. కారణాల్ని అన్వేషించండి. కనుగొనండి. మీరు. యిది మీకు- అందరికీ మంచిది అని నిశ్చయానికి వచ్చిన తరువాతనే నమ్మండి. నమ్మాక ఆ విధంగా జీవించండి - యితరులకి సాయం చేయడానికి మీ జీవితాన్ని ఖర్చు పెట్టండి. యీ ప్రపంచంలోగానీ, తనలోగానీ, దుఃఖాన్ని పోగొట్టుకోదలచిన వారు మొదట నేను చెప్పిన, 'యీ ప్రపంచంలో ప్రతీదీ దుఃఖంతో కూడుకున్నదన్న' సత్యాన్ని అంగీకరించాలి. యిది ఆర్యసత్యం. అంటే సమున్నతమైన, సంపూర్ణమైనసత్యం. అత్యంతప్రాచీనం నుంచీ వున్నటువంటి సత్యం.

యీ ప్రపంచం అంతా దుఃఖంతో కూడుకుని వుంది అన్న వాస్తవాన్ని అంగీకరించినప్పుడు,

మనిషికి బాధ అన్నది తానొక్కడే పడుతున్నది కాదనీ, అది విశ్వవ్యాపితమై వున్న బాధలో వొక భాగమనీ తెలుసుకుంటాడు. యింక రెండవ సమున్నత సత్యం- దుఃఖ సముదయం. అంటే- "ప్రతీ దుఃఖానికీ కూడా కారణం వుంది"

కారణం లేకుండా యెటువంటి దుఃఖమూ వుత్పన్నం కాదు. అయితే యీ దుఃఖాలన్నింటికీ కూడా వొక కారణం వుంది. అదేమిటంటే అవిద్య, అజ్ఞానం, వాటివలన వుత్పన్నమయ్యే కోరికలని కలిగివుండడమే.

యెప్పుడూ యేదో వొక కోరికతో కొట్టుమిట్టాడుకుంటూ వుండడం, అసంతృప్తిలోనే బతుకీడుస్తూవుండడం, విలాసవస్తువులుకొనాలని, భోగాలు అనుభవించాలని, ఆస్తులు సంపాదించాలని, అంతస్తులు కట్టాలని తపించిపోవడం.. యివన్నీ దుఃఖాన్నే కల్గిస్తాయి. యీ లోకంలో కోరికలన్నీ నెరవేరితే, పరలోకంలో కూడా సుఖాలు అనుభవించాలని కోరికపుడడం.. యిలా కోరికల మీద కోరికలు.. అజ్ఞానం వల్ల పుట్టే యీ అంతులేని కోరికలే దుఃఖాలన్నింటికీ కారణం. దుఃఖాలు కలిగించే యీ కోరికలకన్నింటికీ మూలకారణం అవిద్య. అజ్ఞానం. కోరికలున్నంతకాలం దుఃఖం నీడలా వెన్నంటి వుంటుంది. యీ కోరికల వలన తనకూ, యితరులకూ. యితర జీవులకూ కూడా ఖేదమే మిగులుతుంది. దుఃఖమే ప్రబలుతుంది. భోగవిలాసాలనుండి, ఆశామోహాలనుండి, విషయవాసనలనుండి, కామపరితాపాలనుండి దుఃఖం వుత్పన్నమవుతుంది. యిలా ప్రతీ దుఃఖానికీ వొక కారణముందనీ, దానికి మూలకారణం అవిద్య అని తెలుసుకోవాలి. యీ ప్రపంచ పదార్థాలన్నీ నిరంతరం మార్పుచెందుతూ వుంటాయనీ, అశాశ్వతమైనవనీ, సర్వ్వరాధారభూతితాలనీ తెలుసుకోవాలి. యీ విషయాలు తెలుసుకోగలిగినప్పుడు దుఃఖానికి నిరోధం కూడా వుందని తెలుసుకోగలుగుతారు. అదే మూడవ ఆర్య సత్యం- "దుఃఖ నిరోధం". దుఃఖనిరోధం అంటే- యీ దుఃఖాలన్నింటికీ నివారణ వుందని అర్థం.

యెటువంటి దుఃఖం అయినా సరే సాధనతో నివారణ అవుతుంది. నివారణలేని దుఃఖమంటూ యేదీ లేదు. జ్ఞానవంతంగా ఆలోచించినప్పుడు దుఃఖాన్ని గుర్తించినట్లుగానే, దుఃఖానికి గల కారణాన్ని గుర్తించినట్లుగానే, దుఃఖానికి నిర్మూలనకూడా వుందన్న సంగతి బోధపడుతుంది. దుఃఖాన్ని కలిగించే వాటిని మనస్సు నుండి వదిలివేయడమే దుఃఖనివారణోపాయం. కోరికలలో మంచి కోరికలు వుంటాయి. చెడ్డ కోరికలు వుంటాయి. చెడ్డకోరికలని తుంచేసుకోవాలి. ఆ స్థానంలో మంచి కోరికల్ని స్థాపించాలి. మంచి ఆలోచనల్ని పెంపొందించుకోవాలి. యితరుల పట్ల త్యాగబుద్ధితో యీ కోరికల్ని వదిలించుకోవాలి. మన దుఃఖం వంటిదే యితరుల దుఃఖం అని తెలుసుకోవాలి. కోరికల్ని నిర్మూలించనంతకాలం మనకి దుఃఖం తప్పదు. మితిమీరిన కోరికలనిర్మూలనే దుఃఖాలన్నింటికీ నివారణ. భౌతికమైన కోరికలలో యెంత మితి పాటిస్తే అంతమంచిది.

యీ దుఃఖాలన్నింటినీ నిర్మూలించివేసేందుకు అష్టాంగమార్గం అనే ఆచరణీయ మార్గం వుంది. యిది నాలుగవ సమున్నత సత్యం. దుఃఖ నిరోధ మార్గం ఆర్య అష్టాంగమార్గం.

యీ అష్టాంగ మార్గాన నడిచేవారు దుఃఖం యొక్క అంతం వరకూ ప్రయాణిస్తారు. మార్గాలలోకెల్ల వుత్తమమైన మార్గం యీ అష్టాంగమార్గం. యీ మార్గం ప్రారంభంలో కళ్యాణకరమైనది. మధ్యలో కళ్యాణకరమైనది. చివరలో కూడా కళ్యాణకరమైనది. దుఃఖంయొక్క మూలాల్ని కనుగొని, యీ మార్గాన్ని నేను నడిచి విజయుడ్నయిన తరువాతనే యీ మార్గాన్ని నేను లోకానికి

చూపెడుతున్నాము. యీ అష్టాంగమార్గాలలో వరుసగా యెనిమిది దశలున్నాయి. అవి:

1. సమ్యగ్ దృష్టి (పాలి: సమ్మదిత్థి, తెలుగు: జ్ఞాన దృష్టి)
2. సమ్యక్ సంకల్ప (పాలి: సమ్మా సంకప్ప, తెలుగు: సముతా సంకల్పం)
3. సమ్యగ్ వాక్కు (పాలి: సమ్మావాచ, తెలుగు: మైత్రీ భాషణ)
4. సమ్యగ్ కర్మాంత (పా: సమ్మకమ్మంత, తెలుగు:నిండైన ప్రవర్తన)
5. సమ్యగా జీవం (పాలి: సమ్మ ఆజీవ, తెలుగు: పరిశుద్ధ జీవనం)
6. సమ్యక్ వ్యాయామం (పాలి: సమ్మావాయామ, తెలుగు: స్వచ్ఛతకై పరిశ్రమ)
7. సమ్యగ్ స్మృతి (పాలి: సమ్మాసతి, తెలుగు: వివేక చింతన)
8. సమ్యక్ సమాధి (పాలి: సమ్మా సమాధి, తెలుగు: పరమార్థ సాధన)

బౌద్ధునికి కావలసిన శీల, సమాధి, ప్రజ్ఞలు మూడూ యీ అష్టాంగమార్గాలలో వున్నాయి. సమ్యక్ వాక్కు, సమ్యగ్ కర్మాంత, సమ్యగా జీవం యీ మూడు 'శీల' కోవలోకి వస్తాయి. సమ్యక్ వ్యాయామం, సమ్యగ్ స్మృతి, సమ్యక్ సమాధిలు యీ మూడు 'సమాధి'లోకి వస్తాయి. సమ్యగ్ దృష్టి, సమ్యగ్ సంకల్పం, యీ రెండు 'ప్రజ్ఞ'. యీ మార్గాలన్నింటినీ పొక్కొక్కటిగా సాధకుడు కృషి చేయాలి. విజయం సాధించాలి. ప్రతీ దశలోనూ విజయం అనేది వుంది. యేదీ అసాధ్యం కాదు. వివరంగా చెప్పాలంటే

1. సమ్యగ్ దృష్టి : దీనినే జ్ఞానదృష్టి అని అనవచ్చు. 'సదభిప్రాయం' 'సదాలోచన' అనికూడా అనవచ్చు. యీ ప్రపంచం సర్వం దుఃఖం. అనిత్యం. అనాత్మం. యీ ప్రపంచ పదార్థాలన్నీ మానవుడు, అతని శరీరం, మనస్సులతో సహా ప్రతీత్యసముత్పన్నాలు. అనగా పరస్పరాధార భూరితాలు. నిరంతర పరివర్తన శీలాలు. అశాశ్వతాలు. యే పదార్థానికీ వేరొక పదార్థం యొక్క ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో లేకుండా తనదంటూ ప్రత్యేకమైన స్వభావం యేమీ వుండదు. మరొక పదార్థం లేకుండా అదిమనలేదుకూడా.'అది వున్నందువలన యిది వుంటుంది' అది వచ్చినప్పటి నుంచీ యిది వుంటుంది. అది లేకపోతే యిది వుండదు. అది లేనందువల్ల యిదీ వుండదు. యీ ప్రపంచంలో ప్రతీదీ దుఃఖం అనుభవిస్తుంది. ప్రతీదీ అశాశ్వతమైనది. నశించిపోతుంది. కొత్తది పుడుతుంది. శాశ్వతంగా వుండే ఆత్మ అంటూ దేనికీ లేదు. యేదైనా శాశ్వతంగా వుండడం అనేది జరుగదు. అది అసాధ్యం. యిదే ప్రతీత్య సముత్పాదం. సమ్యగ్ దృష్టితో మనం యీ జ్ఞానాన్ని గ్రహించాలి.

యీ ప్రపంచంలో దుఃఖానికి కారణం, అవిద్య-అజ్ఞానం వాటి వల్ల పుట్టుకొస్తున్న కోరికలు. అవిద్య-అజ్ఞానాలకి కారణం ప్రతీత్య సముత్పాదం తెలుసుకోలేకపోవడమే. అనిత్యాన్ని నిత్యమనుకోడం, అనాత్మను ఆత్మ అనుకోవడం, దుఃఖాన్ని సుఖం అనుకోవడం, అశుచినే శుచి అనుకోవడం యీ విధమైన విపర్యాసాలే అవిద్యకు కారణం. యీ అవిద్య అలాగే వుండిపోదు. అది అనేక సంస్కారాలు పుట్టేందుకు కారణమవుతుంది. అజ్ఞానం, అదర్శనం, మోహం మొదలైనవి పుట్టించి అనేక అవాంఛనీయ దుశ్చరితాలకు తోవ చేస్తుంది. సుచరితాలకు దూరం చేస్తుంది. అవిద్య అనంతమైన సంసారసాగరంలో మనిషిని ముంచుతూ యథార్థజ్ఞానాన్ని గుర్తించనివ్వదు. నేను, నాది అనే భావాలు యేర్పడతాయి. పదార్థాలే శాశ్వతం అనే భావాలు కలుగుతాయి. మనిషి వాటికి

బంధీ అవుతాడు. తనకు యిష్టమైన వాటిని సమకూర్చుకోవడం కోసం, తనకు యిష్టం కాని వాటిని దూరం చేసుకోవడంకోసం అష్టకష్టాలుపడుతారు. సంసారసాగరంలో మునిగితేలుతూవుంటారు. యిటువంటి అవిద్య వల్ల మానవులు చేసే కర్మల్లో అభివ్యక్తమయ్యే మానసిక-శారీరక ప్రవృత్తులే సంస్కారాలు. యిటువంటి సంస్కారాల వల్ల విజ్ఞానం వుద్భవిస్తుంది. యీ విజ్ఞానం అంతా అనిత్యమైన వస్తుసమూహాల గురించే వుంటుంది. ఆ విధంగా దుఃఖాల్ని పెంచేదిగానే వుంటుంది. వుద్భవించే దుఃఖాలకు కట్టుబడేసేటట్టుగానే వుంటుంది- అది దుఃఖాన్ని నిరోధించే, తృష్ణ నిరోధంగా పరమార్థ దర్శనంగా వుండదు. అందువల్ల అనిత్యాన్ని నిత్యంగా, అనాత్మను ఆత్మగా, దుఃఖాన్ని సుఖంగా భావించే సంస్కారాల వల్ల వుద్భవించే విజ్ఞానం అంతా మనిషిని తిరిగి అటువంటి అనంతమైన దుఃఖసాగరంలో ముంచి వేయడానికే దారి తీస్తుంది. యీ విజ్ఞానం నుండి నామరూపాలు వుద్భవిస్తాయి. వీటి నుండి చక్షు, శ్రోత్ర, ఘ్రాణ, జిహ్వా, కాయ, మనస్సులనే షడాయతనాలు వుద్భవిస్తాయి. వీటి నుండి స్పర్శ, స్పర్శ నుండి వేదన, వేదన నుండి తృష్ణ, తృష్ణ నుండి వుపాదానం (చక్షువు, శ్రోత్రం, ఘ్రాణం, జిహ్వ, కాయం, రూపం, శబ్దం, గంధం, రసం మొదలైన 24 రూపాలు) వుపాదానం నుండి భవం, భవం నుండి జాతి, జాతి నుండి జరామరణ శోక పరిదేవనాలు మళ్ళీ వాటినుండి అవిద్య, అవిద్య నుంచి సంస్కారాలు.. యిలా తిరిగి తిరిగి ద్వాదశాంగ చాక్రికంగా భవచక్రం యిలా దుఃఖ పూరితంగా సాగిపోతూనే వుంటుంది.

యీ భవచక్రంలో కొట్టుకుపోయే వారందరూ యిదే సుఖం అనుకుంటారు. యిదే శాశ్వతం అనుకుంటారు. ఆత్మలా కొనసాగిపోతామనుకుంటారు. తమ వాదాన్ని నిరూపించుకునేందుకు యెన్నో ఆధారాలు చూపిస్తారు. యెన్నో సిద్ధాంతాలు చెప్తారు. కాని అవన్నీ కూడ పైన చెప్పిన ద్వాదశాంగాల ఆధారంగా చూపించేవే. యీ దశాంగాలు సైతం ప్రతీత్య సముద్భవాలే. వీటిలో వేటికీ కూడా శాశ్వతత్వం వుండదు. అయినా వరే మనుష్యులు అవిద్య, అజ్ఞానాల వల్ల వుద్భవించే విపర్యాసాల వల్ల అనిత్యాన్ని నిత్యంగా అయదార్థాన్ని యదార్థంగా, యదార్థాన్ని అయదార్థంగా, దుఃఖాన్ని సుఖంగా, సుఖాన్ని దుఃఖంగా, అశుచిని శుచిగా, అనాత్మను ఆత్మగా, భావించుకుంటూ, నామ లక్షణ రూపాలైన సంస్కృతి సత్యాలనే యదార్థాలుగా భావిస్తూ అవే శాశ్వతమనుకుంటారు. వాటి ద్వారా పొందే ప్రియ స్పర్శే సుఖంగా భావిస్తుంటారు. అవి అశాశ్వతం కనుక చివరకు అవి దుఃఖాన్నే మిగిలిస్తాయన్న సంగతి గుర్తించ నిరాకరిస్తారు. ఆ స్పర్శలకు ఆలంబనమయే పదార్థాల మీద లాలసత్వం పెంచుకుంటారు. అవే కావాలని కోరుకుంటారు. వాటినే ఆశ్రయిస్తుంటారు. అప్రియ స్పర్శనందించే పదార్థాల మీద దౌర్మనస్యం పెంచుకుంటారు. వాటిని ద్వేషిస్తారు. వాటిమీద అయిష్టం పెంచుకుంటారు.యిలా మోహ రాగద్వే... లు పెంచుకుని దుఃఖసాగరంలో కొట్టుమిట్టాడుతూ వుంటారు.

మనుష్యులందరికీ బాధలు వున్నాయని, యీ బాధలన్నీ అజ్ఞానం - అవిద్యల వల్ల పుడుతున్నాయని మితిమీరిన కోరికల్ని నాశనం చేసుకొన్నవారందరికీ శాంతి దొరుకుతుందన్న సంగతి తెలుసుకోవాలి. దుఃఖాన్ని నిర్మూలించడానికి బౌద్ధధర్మం కొండంత అండ అని తెలుసుకోవాలి.

యీ విధంగా యి ప్రపంచం అశాశ్వతమని, అనిత్యమని, దుఃఖ భూయిష్టమని, యిందులో యెవరికీ నాది అనేదేదీ లేదని మీ మాంస చేయాలి. ప్రపంచంలో మార్పులు సహజమని, దుఃఖాల్ని తలుచుకుని ఎల్లప్పుడూ కుంగిపోకూడదని తెలుసుకోవాలి. మనిషికి జ్ఞానం కన్నా

సౌఖ్యమిచ్చేది యింకొకటి లేదనీ, జ్ఞానంతో సర్వదుఃఖాలనూ తరిమికొట్టవచ్చనీ, జ్ఞానానికి పరిమితులు లేవనీ, జ్ఞానం వలన మనిషి తానేమిటో తెలుసుకోగలుగుతాడనీ, నేను, నాది అనే భావాల్ని వశింప చేసుకొని అతడు విశ్వమానవుడవుతాడనీ తెలుసుకోవాలి. తన మనస్సునే మార్గదర్శకంగా చేసుకుని మనిషి వెలుగుచూడగలుగుతాడని తెలుసుకోవాలి. జ్ఞానమన్నది నైతికప్రవర్తన ద్వారా అలవడుతుందనీ, దయ, ప్రేమ, త్యాగం, సౌభ్రాతృత్వం యివన్నీ నైతిక జీవితంలో భాగాలనీ తెలుసుకోవాలి. నైతిక ప్రవర్తన ద్వారానే జ్ఞానాన్ని మెరుగుపరుచుకోవలసివుందన్న విషయాన్ని అతడు స్పష్టంగాతెలుసుకోవాలి. పూహాజనితమైన సిద్ధాంతాలను, నమ్మకాలను విడిచి పెట్టాలని తెలుసుకోవాలి.

బాధాకరమైనఆలోచనలను మంచిఆలోచనల చేత జయించగలమన్న సంగతి తెలుసుకోవాలి. ప్రేమాభిమానాలను పెంచుకుంటే ద్వేషభావం మనస్సులోనుంచి నైదొలగి పోతుందనీ. మనుష్యులపట్ల, తోటిజీవాలపట్ల కరుణామయత్వాన్ని పెంపొందించుకుంటే హింసా ప్రవృత్తి తొలగిపోతుందనీ. యితరుల క్షేమాన్ని అభిలషిస్తూ వుంటే అయిష్టత అదృశ్యమై పోతుందనీ. సమతా భావం పెంపొందించుకుంటే వ్యతిరేకభావాలు నశించిపోతాయనీ. శారీరకంగా యెటువంటి ఆపేక్షకి తావీయకుండా వుంటే తృష్ణ అనేదే మనలోంచి నైదొలగి పోతుందనీ. క్షణ భంగురమైన ప్రకృతి స్థితిగతులను పరిశీలిస్తూ వుంటే గర్వం, స్వార్థం యివన్నీ అంతర్ధానమై పోతాయనీ అతడు గ్రహించాలి. తనయొక్క, యితరుల యొక్క దుఃఖాన్ని నివారించడానికి ఆర్యసత్యాలు, అష్టాంగ మార్గం, ప్రతీత్య సముద్పాదం తోడునీడగా వుంటాయన్న సత్యాన్ని యెల్లప్పుడూ జ్ఞాపకం వుంచుకోవాలి. యిదే జ్ఞానదృష్టి. దీనినే బుద్ధుడు ప్రవచించిన పాళీ భాషలో సమ్మాదిత్థి అంటారు. సమ్యక్ దృష్టి వలన మంచికీ సత్యానికీ లోక కళ్యాణానికీ భంగం కలిగించే సమస్తపాపాలనుంచీ విముక్తి అయేశక్తి లభిస్తుంది. యిది గ్రహించడమే సమ్యక్ దృష్టి

## సమ్యక్ సంకల్ప

దీనినే సమతాసంకల్పం అనవచ్చు. యెంత జ్ఞానం వున్నా దానిని ఆచరణలోనికి తెచ్చుకోవడానికి సంకల్పం వుండాలి. అది సమతా సంకల్పం అయినప్పుడే జ్ఞానానికి తగిన సంకల్పం అవుతుంది. మనిషిలో సంకల్ప శక్తి అనే దొకటి వుంది. మనిషి తనకొక ధ్యేయం అంటూ యేర్పరచుకుంటే మనస్సులో వున్న సంకల్ప శక్తిని మేల్కొలిపి కార్య రూపంలోకి తీసుకురావచ్చు. మనిషి యెంత బంధితుడూ, దుఃఖితుడూ అయినా సరే స్వేచ్ఛాపథంనైపు వొక్క అడుగువేస్తే చివరికి పూర్తి స్వేచ్ఛను పొందుతాడు. అటువంటి సంకల్పాన్ని యిచ్చే శక్తి మనిషి మనస్సులోనే వుంది. యే మనస్సు అయితే మనిషిని దుఃఖితుణ్ణి, బంధితుణ్ణి చేస్తున్నదో ఆ మనసే అతణ్ణి సంతోషితుణ్ణి స్వేచ్ఛాజీవినీ కూడా చేయగలుగుతుంది. అటువంటి మనస్సుని సదాలోచనలతో గుప్పెటలో పెట్టుకోవడమే సమతాసంకల్పం.

సమతాసంకల్పం ద్వారా అతడు తన జ్ఞానాన్ని ఆచరణలోకి తెచ్చుకోవాలి. యెందుకోసమైనాగానీ యితరులనుగానీ, యేజీవి గానీ ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ బాధించకుండా, హింసించకుండా మెసులుకోవాలి. చిన్న చిన్న జీవులపట్లనే సమభావం లేనప్పుడు యింక పెద్ద విషయాలు యెందుకూ చెప్పుకోవడం? అందువల్ల అతడు మొదట తోటి జీవులపట్ల

సమభావం యేర్పరచుకోవాలి. తనలాంటివే కదా అవి కూడా, అవి కూడా సంతానాన్ని కంటున్నాయి, వాటికీ ప్రేమాభిమానాలున్నాయి వాటికీ వుండవలసినంత జ్ఞానం వుంది బాధా సంతోషం ప్రేమ జీవులకన్నింటికీ ఒక్కటే కదా! అందువల్ల యే జీవినీ హింసించకూడదన్న సంకల్పాన్ని చేసుకోవాలి. యిటువంటి సదాలోచనే అతన్ని లోకహితుడ్ని చేస్తుంది.

యిందుకొరకే జ్ఞాన దృష్టి యెంతో సహాయపడుతుంది. అంతా అశాశ్వతమే అయినప్పుడు అన్నీ మట్టిలోనే కలిసిపోయేటప్పుడు యెందుకీ స్వార్థాలు? విషయ వాసనలు - తన స్వార్థం కొరకు యితరులను యెంత కొంచెం అయినాసరే బాధ పెట్టడాలు? అని అనిపిస్తుంది. 'నాది' అనేదేదీ లేదన్న విషయం తెలుసుకున్నాక తనకంటూ యింక ప్రత్యేకత యేదీ వుంచుకోకూడదని అతను సంకల్పించుకోవాలి యితరుల సంతోషంలో తన సంతోషం చూడగలగాలి. అప్పుడే గతంలో యేర్పరచుకున్న పాపనిశ్చయాలన్నీ దగ్ధమైపోతాయి.

తనలాగే యితరులు కూడా. మనకి దెబ్బతగిలితే నెప్పి యెలాగో వారికీ అంతే. మనకి సంతోషమెలాగో వారికీ అంతే. మనం కోరుకునే స్వేచ్ఛ, జ్ఞానం, సుఖం యివేవీ యితరులకి కొంచెంకూడా బాధించకూడదన్న సంకల్పం తీసుకోవాలి.

యితరులు మన పట్ల ద్వేషభావంతో వుండవచ్చు. అయినా వారిని మనం ప్రేమించడమే సరైందన్న సంకల్పాన్ని మనం తీసుకోవాలి. ద్వేషం ద్వేషం వల్ల పోదనీ, ప్రేమవల్లనే పోతుందన్న జ్ఞానాన్ని - ప్రేమగా వుండటం ద్వారా, ప్రేమగా వుండాలన్న సంకల్పం తీసుకోవడం ద్వారా రుజువు చేయాలి. అప్పుడే ద్వేషించే వారి మధ్య ప్రేమగా, స్వార్థపరుల మధ్య నిస్వార్థంగా, సంతోషంగా బతుకుతూ, యిటువంటి బతుకులోని గొప్పతనాన్ని పదిమందికీ చూపించగలుగుతాము. వారు కూడా యిటువంటి వున్నత జీవితాన్ని పొందడానికి దోహదం చేయగలుగుతాము.

సంకల్ప శక్తి ద్వారా మన ప్రవర్తనని మార్చుకోవడం చేత మనలో వున్న అవలక్షణాలన్నీ పోతాయి. స్వార్థత్యాగంద్వారా కల్మషం లేని నిర్మలమైన సుఖం కలుగుతుంది. ప్రేమ, వాత్సల్యాలతో కూడిన దయా దాక్షిణ్యాల ఫలితంగా యీర్ష్యా ద్వేషాలు, కోపాలు, అసహ్యపడటాలు, యితరులను కాదనుకునే స్థితి మొదలైన అవలక్షణాలన్నీ పోతాయి. ప్రతిజీవినీ ప్రేమించాలన్న సంకల్పం వల్ల జీవనవిధానంలో క్రూరత్వానికీ, హింసకూ తావు లేకుండా పోతుంది. తద్వారా మనస్సు శాంతి, మమతలతో నిండి దుఃఖం తగ్గిసుఖం పెరుగుతుంది.

యిలా మంచి భావాలను, సమతాభావాలను సంకల్ప శక్తితో ఆచరణీయంగా చేసుకోవడం మనిషియొక్క వున్నత నైతికాభివృద్ధికి యెంతో తోడ్పడుతుంది. దీనినే బుద్ధుడు ప్రవచించిన పాళీ భాషలో 'సమ్మాసంకప్ప' అని అంటారు. అష్టాంగ మార్గంలో యిది రెండవది. ప్రతిదీ ఒక దాని తరువాత ఒకటి ముఖ్యమైనట్టిది.

## ౩. సమ్యక్ వాక్కు

దీనినే మైత్రీభాషణ అనవచ్చు. సత్యంభాషణే మైత్రీ భాషణ. అష్టాంగ మార్గంలో యిది మూడవది.

మైత్రీ భాషణవలన మనిషి ప్రపంచానికి తన వంతు మేలు చేయడమే కాకుండా, తాను

కూడా పరిశుద్ధుడవుతాడు. సమాజంలో అశాంతి కల్గించే అబద్ధాలాడటం, కల్లబొల్లి కబుర్లాడటం, పరుషంగా మాట్లాడటం, నిందించడం, సంస్కారహీనమైన, సంయమనం లేని మాటలు మాట్లాడటం, వొకరిగురించి హీనంగా మాట్లాడటం, నిందించడం, వ్యంగ్యంగా సందేహంగా, అవమానకరంగా మాట్లాడటం, వెటకారం చేయడం, దుర్భాషలాడటం, వదరుబోతుతనం, దేహంలో చేతులు, కాళ్ళు, కళ్ళుముక్కు, నోరు వాలికల చేత తప్పుడు ప్రకటనలు చేయడం.., యిటువంటి పాపిష్టి పనుల నుంచి అతడు మైత్రీభాషణ ద్వారా దూరం కాగలుగుతాడు. పైన చెప్పిన వికృత మాటలు పరస్పర నిందలు అధికమై కుటుంబాలలో, సంఘంలో యిన్నో అశాంతులకు హింసలకు దారితీస్తాయి. అందువల్ల యిప్పుడైనా సరే, యిటువంటి పరిస్థితులలోనైనాసరే యితరులు యెట్లా మాట్లాడుతున్నాసరే మనం సత్యభాషణం మాత్రమే చేయాలి. మైత్రీభాషణ మాత్రమే చేయాలి. లేకపోతే మనస్పర్థలు చెలరేగుతాయి. స్నేహాలు నాశనమవుతాయి. చివరికి దుఃఖాన్నే కల్గిస్తాయి. మైత్రీభాషణకి ప్రాణమిచ్చినప్పుడే దుఃఖం సగం తొలగిపోతుంది. పరిస్థితిని బట్టి అది పూర్ణ సంతోషానికి కూడా దారితీస్తుంది. తోటి జీవులతో సైతం అతడు మైత్రీభాషణ మాత్రమే చేయాలి. తనను చీదరించుకోవాలనీగానీ, దండించాలనీగానీ, తనపై క్రూరత్వం, ధార్ష్టికమాటల పెత్తనం చేయాలనీగానీ యే జీవులూ కోరుకోవు. అవికూడా మనప్రేమనే కోరుకుంటాయి. మనమాటలను అర్థం చేసుకుంటాయి. కొద్ది ప్రయత్నం మీద మనం చెప్పినట్లు నడుచుకుంటాయి. మనిషికేమీ తీసిపోనంతగా కృతజ్ఞతను చూపుకుంటాయి. వాటిలోకూడా యిన్నో వుత్తమగుణాలు వుంటాయి. వాటిపట్ల మనం కరుణగా, మైత్రిగా వుండాలి. మూగజీవాలైనా, మన మాటలు అర్థం చేసుకుని, మనం చెప్పినట్లుగా నడుచుకునే వాటిని చూస్తే ప్రతివొక్కరికీ సంతోషం కలుగుతుంది.

అన్నిగుణాలలోకల్ల మైత్రీగుణం చాలా గొప్పది. ప్రేమ, కరుణ మున్నగు భావాలన్నీ యీ మైత్రిలో నిండుగా వుంటాయి. యిటువంటి మైత్రి గల భాషణవల్ల ద్వేషభావాలు నశించిపోయి స్నేహ సౌభ్రాతృత్వాలు అలవడుతాయి. మైత్రీభాషణ యేవొక్కరికో పరిమితమైంది కాదు. అది విశ్వజనీనమైంది. యితరులు దురుసుగా మాట్లాడవచ్చు. మనపై నిందలు వేయవచ్చు. మనకు యిష్టం లేనట్లుగా ప్రవర్తించవచ్చు. అయినా సరే మనం మైత్రీభాషణనే చేయవలసి వుంటుంది. మైత్రీభాషణ ద్వారానే వారిని మనం అర్థం చేసుకుంటూ, మనల్ని వారు అర్థం చేసుకునేటట్లుగా తోడ్పడవలసి వుంటుంది. సత్యభాషణ అందించే ప్రయోజనం నిరుపమానమైనది. కేవలం సత్యభాషణ ద్వారానే నిర్వాణ స్వర్గ ద్వారాలను తెరువవచ్చు. అమరపథానికి దారివేయవచ్చు.

మనం మాట్లాడే మాటలు నిజమై వుండాలి. నిజం చెప్పడమైనాసరే హితవుగా చెప్పాలి. నిజానికి మనం కట్టుబడి వుండాలి. అది నమ్మదగినదిగా వుండాలి. స్థైర్యంగా, గట్టి నమ్మకంతో వుండాలి. అతడెప్పటికీ అబద్ధం ఆడకూడదు. అతనికి వుపయోగపడేందుకైనా, యితరులకి వుపయోగపడేందుకైనా, మరే ప్రయోజనంకోసమైనా సరే అతడు అబద్ధం ఆడకూడదు. అక్కడ చెప్పిన మాటలు యిక్కడ, యిక్కడ చెప్పిన మాటలు అక్కడ చెప్పకూడదు. విరోధాలు పెంచకూడదు. వాద. విరోధం కలిగించే, అపనమ్మకాన్ని పుట్టించే, భయసందేహాల్ని పుట్టించే మాటలు అసలు మాట్లాడనే కూడదు.

మాటలతో అతడు మైత్ర్యాన్ని ప్రోత్సహించాలి. శత్రువుల మధ్య శత్రుభావాల్ని తగ్గించి వేయాలి. శత్రువుల్ని మిత్రులుగా చేయడమే అతడి ధ్యేయం కావాలి. సమైక్యతే అతడి ఆశయం

కావాలి. యెవరితోటి అయినా అతడి మాటలు శాంతంతో, సౌమ్యంతో, సహనంతో, సాధుత్వంతో వుండాలి. మర్యాదగా, అభిమానంగా, ఆమోదయోగ్యంగా వుండాలి. సమయం యెరిగి మాట్లాడాలి. మంచి మాట కూడా సరైన సమయంలో మాట్లాడలేకపోతే ఆ మాట అంతా వ్యర్థమైపోతుంది. సరైన సమయంలో సరైన విధంగా, తార్కిక న్యాయంతో, మితంగా, పూర్తి అర్థంతో మాట్లాడుతూ జ్ఞాన విధిని తలపించాలి. జ్ఞానాన్ని పెంచుకుంటూ పోవాలి.

పదిమంది సభికులూ, శ్రోతలూ, మిత్రులూ, పరిచయస్తులూ వున్నప్పుడే కాదు, కీకారణ్యాలలో సైతం మనిషి నోరును అదుపులో పెట్టుకోవాలి. మౌనం యొక్క గొప్పతనాన్ని తెలుసుకుని దానిని పాటించాలి. భీకరారణ్యాలలో అయినా, మునిరేపిన మబ్బుల్లో అయినా, మహాపర్వతలోయల్లో అయినా- గృహస్థు బంగారు నిధిని దాచుకున్నంత భద్రంగా మౌని మౌనాన్ని దాచుకోవాలి. యెంత జ్ఞానాన్ని సంపాదించుకున్నా మాట్లాడేటప్పుడు మాత్రం మితంగా వుండాలి. అతడు కొండలమీద నుంచి హోరున శబ్దం చేసుకుంటూ పడే జలపాతంలా కాకుండా సగం నిండిన కుండలా కాకుండా కదులోలైన సముద్రఅగాధంలా మౌనం పాటించాలి. మైత్రీభాషణ అని, యితరులు వింటున్నారు కదా అని యెక్కువ మాట్లాడకూడదు. మీరు మాట్లాడినప్పుడు ధర్మాన్ని గురించి మాట్లాడండి. లేకపోతే సమున్నతమైన, సర్వోత్తమమైన మౌనాన్ని ధరించండి. వాక్కుని అదుపులో పెట్టుకున్నవాడే జ్ఞాని అవుతాడు. దయలేని వాళ్ళు ద్వేషాలు ప్రచారం చేయవచ్చు గాక, మంచివాళ్ళని సైతం దూషించవచ్చు గాక, జ్ఞాని అది తనకు సంబంధించింది కాదనే భావించాలి. యెంత సరదా పుట్టినప్పటికీ పోచుకోలు కబుర్లు మాట్లాడకూడదు. వీధికూడళ్ళ దగ్గర, అంగళ్ళ దగ్గర మాట్లాడుకునే పనికిమాలిన వాదవివాదాలలోకి దిగకూడదు. యుద్ధాల గురించీ, భీభత్సాల గురించీ, జగడాల గురించీ, అక్రమ సంబంధాల గురించీ, దయ్యాల గురించీ, దేవుళ్ళ గురించీ, మహిమల గురించీ, కట్టుకథల గురించీ, బుద్ధీ జ్ఞానం లేని, విలువైన కాలాన్ని ధ్వంసం చేసే మాటలు మాట్లాడకూడదు. అటువంటి మాటలు మాట్లాడే చోట, ఆ మాటలను మంచివైపుకూ, జ్ఞానం వైపుకూ, పదిమందికీ పనికి వచ్చే వైపుగా మరల్చాలి. అలా చెయ్యలేకపోతే, అక్కడ వుండటం తప్పనిసరి అయితే మౌనంగా వుండాలి. లేకపోతే అక్కడనుంచి వెళ్ళిపోవాలి. యెప్పటికీ కూడా పనికిమాలిన మాటలకు ప్రోత్సాహం యివ్వకూడదు. విడిపోయిన మిత్రుల్ని కలిపేట్టుగా, ద్వేషాలురగిలిన వారిని కలిపేట్టుగా మాత్రమే శాంతిగా మితంగా అతడు మాట్లాడాలి. విభేదాలు పెరిగేటటువంటి మాటలు మాట్లాడకూడదు. యిక్కడి మాటలు అక్కడ, అక్కడి మాటలు యిక్కడ చెప్పకూడదు. గుండెల్ని తాకేటట్టుగా, సంతోషం కలిగించేటట్టుగా, ప్రేమాభిమానాలు మొలకెత్తేటట్లుగా మాత్రమే అతడు మాట్లాడాలి. సత్యాన్ని కొలబద్దగా తీసుకుని, అర్థవంతమైన, ధర్మానికి సంబంధించిన మాటలతో, క్రమశిక్షణతో, సరియైన సమయంలో సరైన విధంగా మంచిని ప్రేరేపించేటట్లుగా అతడు మాట్లాడాలి. మీతో మనుష్యులు యుక్తంగా మాట్లాడవచ్చు లేదా అమర్యాదగా యుక్తం కానివిధంగా మాట్లాడవచ్చు. నిజం మాట్లాడవచ్చు-అబద్ధాలు మాట్లాడవచ్చు. కరుణగా మాట్లాడవచ్చు. లేదా నిర్దయగా మాట్లాడవచ్చు. యోగ్యమైన మాటలు మాట్లాడవచ్చు లేదా నిరుపయోగంగా మాట్లాడవచ్చు. సహానుభూతితో మాట్లాడవచ్చు- వ్యతిరేకానుభూతితో మాట్లాడవచ్చు. అయినా మీ మనస్సులు ఆందోళన చెందకుండా ఏ కఠినమాట కూడా మిమ్మల్ని బాధపెట్టకుండా ఉండేటట్లుగా మీ మనసుల్ని సమాధానపరచుకోండి- వారి వారి క్షేమ సంక్షేమాలే అపారమైన దయతో యిటువంటి క్రోధక్రౌర్యాలూ మనస్సులో చోటుచేసుకుండా కోరుకోండి.

కొంతమంది, జ్ఞానాన్ని తెలుసుకునే నెపంమీద వాదవివాదాలు రెచ్చగొట్టేటట్లుగా. "నేను చెప్పింది నీకేం అర్థం కావడం లేదు; దానికి నేనేం చెయ్యను?" "నేను చెప్పేది నీకెలా అర్థమవుతుంది . ఆమాత్రం యింగిత జ్ఞానం లేకపోతేయెలా?" 'బుర్రాబుద్ధీ వుండాలి'. "నేను చెప్పేది నీకెలా అర్థమవుతుందిలే." "నేను వాస్తవమే చెప్పాను, నువ్వే అలాగ మాట్లాడుతున్నావు" ("ముందర అసలు విషయానికిరా." "ముందుది చివరా, చివరది ముందూ చెప్తావేమిటి?"" "నీవాదంలో పసలేదు-ప్రయోజనమసలే లేదు" "నీది తప్పు అని నిర్ధారణ అయిపోయింది" "చెప్పదలుచుకున్న మాటలే చెప్పు" యిట్లా మాట్లాడుతూ వుంటారు. యిటువంటి శుష్కవాదం పెంచే మాటల వల్ల యెటువంటి ప్రయోజనమూ వుండకపోగా, మనుష్యులు గాయపడి, కలహాలు, శత్రుత్వాలు, నిందలు, క్రోధం పెరిగిపోతాయి. యెంతటి జ్ఞానికైనా కావలసింది వినయం. మనభాషణ మైత్రి కల్గించేటట్లుగా వుండాలేగాని, మిత్రుత్వానికి అపకారం చేసేటట్లు వుండకూడదు. జ్ఞానం పెంపొందేటట్లు వుండాలేకాని, అజ్ఞానంలోనే వుండిపోయేటట్టు, మరింత అజ్ఞానంలో కూరుకునిపోయేటట్లు వుండకూడదు. పాపసంభాషణ కన్నా హీనమైనది ప్రపంచంలో మరొకటిలేదు. మనిషి దానినుంచి పూర్తిగా విముక్తుడు కావాలి.

యెవరైనా మిమ్మల్ని మీమొహాన్నే తిట్టడం మొదలుపెట్టవచ్చు. మీ మొహం మీద పిడికిలితో గుద్దవచ్చు. మట్టిబెడ్డలు విసరవచ్చు. యీడ్చుకెళ్ళి కర్రతో బాదగొట్టవచ్చు. కత్తితో తెగనరకవచ్చు. అయినాసరే మిమ్మల్ని మీరు దిటవుపరుచుకోవండి. నేనేమీ ఆందోళనపడటం లేదని, ఆ మాటలు నన్నేమీ బాధించలేదని, పైగా ఆ బాధపెట్టిన వారి క్షేమమే, యెటువంటి కోపమూ లేకుండా కోరుతున్నానని మనస్సుని సమాధానపరచుకోవండి. వారిపట్ల కూడా మైత్రీభావనే చెయ్యండి. చెడ్డ అన్నది మీలో లేనప్పుడు చెడ్డమాటలు మిమ్మల్నెలా చేరగలవు? మనకు యిష్టం లేని పదార్థాలు పోకరు మనకి యిస్తున్నప్పుడు మనం పుచ్చుకోకపోతే అవి వారి దగ్గరే వుండిపోతాయి కదా! అలాగే చెడ్డమాటలు కూడా మనం స్వీకరించకుండా తిరస్కరిస్తే అవి మీ దరిని చేరవు. అవి తిరిగి వారినే చేరతాయి. మనమాటలు ప్రేమకు, సమైక్యతకు, కరుణకు దోహదం చేయాలి. సరళంగా, హితవుగా వుండాలి. యెట్టి పరిస్థితులలోనూ వివేచన తప్పకూడదు. మైత్రీభాషణ అంటే యిదే. దీని ద్వారానే మనిషి అభివృద్ధి చెందగలడు. చుట్టూ వున్న మనుష్యులను, జీవులను సంతోషపెట్టి తనజీవితాన్ని చరితార్థం చేసుకోవగలడు. దీనినే సమ్యగ్వాక్కు అంటారు. పాళీలో సమ్మావాచ అంటారు.

## సమ్యక్ కర్మాంత

దీనినే నిండైన ప్రవర్తన అనవచ్చు. సద్వర్తనం అనికూడా అనవచ్చు. మన ఆలోచనలు, మన నిర్ణయాలు, మనమాటలే కాకుండా మన ఆచరణ కూడా నిండుగా వుండాలి. అలా వుండాలంటే తనంటే యేమిటో మనిషి పూర్తిగా యెరిగి వుండాలి. అతని ప్రతిప్రవర్తనా జ్ఞానయుతంగావుండాలి. అతడేం చేస్తున్నా అది అతడు పూర్తిగా యెరిగి వుండాలి. అతడు నడుస్తుంటే 'నేను నడుస్తున్నాను'. కూర్చుని వుంటే 'కూర్చుని వున్నాను'. 'వొంగి వుంటే 'వొంగి వున్నాను' అన్న సంగతి అతడి స్మరణలో వుండాలి. స్మరణ వుంటే జాగ్రత్త వస్తుంది. జ్ఞానం తోడవుతుంది. శారీరక అపస్మృత నుంచి అతడు బయటపడతాడు. మనస్సులో మంచి వున్నా, శరీరం యొక్క స్థితిని పట్టించుకోకపోతే, యే చెడు ఆలోచన వచ్చినా వెంటనే ప్రస్ఫుటమై, అతడి ఆంగికంలో తలబిరుసుతనం,

గంటుమొహం, వికారపు చేష్టలు బయటపడతాయి. అందువల్ల మనిషి తన శరీరం గురించి పూర్తి స్పృహతో వుండాలి. మనిషిని చూడగానే నిండుగా అనిపించాలి.

రెండవది నిండైన ఆలోచన. నిండైన మాట. వీటితో కూడిన నిండైన ప్రవర్తన. యెదురైన వారిలో యెన్నోవిధాలుగా వుండేవాళ్ళు, మామూలుగా వుండేవాళ్ళతో పాటు వుండవచ్చు. వారందరూ కూడా మనల్ని మనలుగానే, మంచిగానే భావించేటట్టు మన ప్రవర్తన వుండాలి. మన ఆంగికం, అందరిలోనూ సమభావాన్నే కల్గించాలి.

అతడు దేనికైనా సిద్ధపడివుండాలి. యెటువంటిస్థితి యెదురైనా అతడు దానిని మనస్ఫూర్తిగా ఆహ్వానించేటట్లు వుండాలి. మంచిస్థితి యెదురయితే అది మరింత మంచికి దారితీసేటట్టు చూడాలి. చెడ్డ స్థితి, బాధ కల్గించే స్థితి యెదురయితే అందుకు జరిగిన పొరపాటు యేమిటో హృదయపరిశీలన, శోధన చేసుకోగలిగి వుండాలి. యే స్థితి అయినా సమభావానికే దారితీసేటట్టు, యే స్థితిలో కూడా యితరులని బాధపెట్టకుండా వుండేటట్లు చూసుకోవాలి.

అతని శరీరం యే స్థితిలో వుందో తెలుసుకోగలిగినట్టే తన ఆలోచన యెలా వుందో కూడా అతడు యెప్పటికప్పుడు తెలుసుకోగలిగి వుండాలి. యిది చాలా ముఖ్యం. మన ఆలోచనలను బట్టే మన శరీరం యొక్క స్థితి, మన మాటా, మన ప్రవర్తనా ఆధారపడి వుంటాయి. యేమాత్రం పొరపాటుగా నడిచినా మనకుగాని యితరులకుగాని గాయాలు తగిలినట్టే యేమాత్రం పొరపాటుగా ప్రవర్తించినా మన మనసుగానీ, యితరుల మనసు గానీ గాయపడవచ్చు. "పొరపాటున మామూలుగా చంపేశాను, కసితీరా చిత్రవధ చేసి చంపివుండాల్సింది" అని వొక ఖూనీకోరు అసంతృప్తితో బాధపడటం కంటే, "మొత్తానికి బాగానే చంపావుకదయ్యా" అని యెవరైనా అంటే అది మరింత దారుణమైన విషయం. మానసికంగా కూడా యెటువంటి చెడ్డపనులూ తలపకూడదు.

నిండైన ప్రవర్తన అంటే మనసా, వాచా, కర్మణా నిండైన ప్రవర్తన. దీనికి మినహాయింపు యేమీ లేదు. దీనికి వ్యతిరేకమైన ప్రతిదీ పాపకార్యమే. యిటువంటి పాపకార్యాల నుండి అతడు విముక్తుడు కాకపోతే అతడెప్పటికీ దుఃఖాన్ని పోగొట్టుకోలేడు.

యిటువంటి నిండైనప్రవర్తన వల్ల శరీరం చేతగానీ, మనస్సుచేతగానీ చేసేటటువంటి చెడ్డపనుల నుంచి బయట పడతాడు. రక్షింపబడతాడు. హింసించడం, బాధపెట్టడం, దొంగతనం చేయడం, అసత్యంగా, అశ్లీలంగా ప్రవర్తించడం, అసభ్యంగా మాట్లాడటం, అక్రమసంబంధాలు పెట్టుకోవడం మొదలైన మాలిన్యాలు అతన్ని అంటవు. ఉత్తమమైన, మనిషిగా రూపుదాలుస్తాడు. ప్రతివాళ్ళపట్ల మర్యాదగా, కరుణగా వ్యవహరిస్తాడు. ధర్మాన్ని నిష్కళంకంగా పాటిస్తాడు. సంతోషాన్ని పొందుతాడు, పదిమందికీ పంచగలుగుతాడు.

అతడింకా మనస్సులో యే మూలనో వున్న మాలిన్యాలను నాశనం చేసుకోవాలి. తోటి ప్రజలకు మంచి ప్రబోధం అందేటట్లు చూడాలి. తోటివారిపట్ల సత్ప్రవర్తనతో మెలగడం ద్వారా, వారిలోని దైన్యతలను వారికి వారే తొలగించుకునే స్థైర్యాన్ని వారికి అందివ్వాలి. యితరులు మనపట్ల హానికరంగా పరిణమించినా, మనం వారికి హానికరంగా పరిణమించకూడదు. యితరులు యెలావున్నా మన ఆలోచన, ఆశయం, వాక్కు, వర్తన, జీవన విధానం, ప్రయత్నం, మానసికధోరణి, కేంద్రీకరణ అన్నీ కూడా మంచిగా మాత్రమే వుండాలి.

నిండైన ప్రవర్తన అంటే అదే. సమభావానికి యదార్థ రూపంగా వుండటమే నిండైన ప్రవర్తన. దీనినే పాళీ భాషలో 'సమ్మాకమ్మాంత' అంటారు.

# సమ్యగాజీవం

దీనినే సజ్జీవనం లేదా పరిశుద్ధ జీవనం అనవచ్చు. అతడు 'బతుకు-బతికించు' అన్న తత్వంతో తూ.చా. తప్పక బతకాలి. అదే పరిశుద్ధ జీవనం. ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ, తోటి మనుష్యులకు గానీ, జీవులకు గానీ, యెటువంటి అపకారం జరగకుండా అతడు బతకాలి. నిజమైన మనిషిగా బతకాలి. అటువంటి వున్నత జీవితానికి బద్ధుడై బతకాలి. బతుకన్నది బతుకు తత్వంలోనే బతకాలి. యే బతుకుకూ, యెవరి బతుకుకూ మనిషి బతుకు హానికరంగా పరిణమించకూడదు. వొకవేళ అది అతడి వృత్తి అయితే ఆ వృత్తిని అతడు విడిచిపెట్టేయ్యాలి.

ఆయుధాల వ్యాపారం, మాంసం వ్యాపారం, మాంసంకోసం పశువుల్ని కొని అమ్మే వ్యాపారం, పక్షి వ్యాపారం, మత్తు పదార్థాలు తయారుచేసే వ్యాపారం, మద్యపానవ్యాపారం-యిటువంటి వ్యాపారాలతో సంబంధం కలిగివున్న యితర వ్యాపారాలు మనుష్యులకీ మూగజీవులకీ అన్యాయంగా, ప్రాణఘాతంగా పరిణమిస్తాయి. యిటువంటి వ్యాపారాలలో వృత్తులలో ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ, సంబంధం కలిగివుండే వుద్యోగాలు చెయ్యకూడదు. యెవరికి, యేజీవికి జరిగే హానిలోనూ భాగస్వామ్యం పంచుకోకూడదు. అటువంటి వుద్యోగాలకు, వ్యాపారాలకు అతడు స్వస్తి చెప్పాలి. యివన్నీ పాపం కల్గించే జీవనాలు. యిటువంటి పాపజీవనాలనుంచి స్థిర నిర్ణయంతో అతడు విముక్తుడు కావాలి.

పరిశుద్ధ జీవనం కొరకు అతడు అయిదుపనులు చేయనన్న నియమాన్ని పాటించాలి. అవి. 1. ప్రాణహింస 2. దొంగతనం 3. వ్యభిచారం, 4. అసత్యం. 5. మత్తు పదార్థాల సేవనం. వీటికతడు దూరంగా వుండాలి. యీ పనులు చేయడం వల్ల యితరులకు హాని కలుగుతుంది. సంఘానికి హాని కలుగుతుంది. మానవత్వమే నశించిపోతుంది. అందువల్ల ప్రపంచక్షేమం, తన క్షేమం కోరే వారందరూ యిటువంటి వుద్యోగాలను, పనులను మానుకోవాలి. యిటువంటి పనులు చేసేవారు మంచి మానవత్వాల గురించి మాట్లాడటం యెంతమాత్రం న్యాయంగా వుండదు. యితరులు లాగుడుబోతుల్లై, అబద్ధాలకోరుల్లై, వ్యభిచారుల్లై, జీవహింసకుల్లై, దొంగలై వుంటే వుండవచ్చుగాక, తానుమాత్రం పరిశుద్ధుడై వుండాలి. పరిశుద్ధ జీవనానికి రుజువుగా జీవించాలి. యెన్నో సమస్యలు యెదురుకావచ్చు. యెన్నో విధాలుగా ప్రలోభపెట్టేవారు వుండవచ్చు. చిన్న తప్పే కదా అని అనిపించవచ్చు. యెవరూ చూడడం లేదు కదా, యెవరికీ తెలియదుకదా అని అనవచ్చు. తన మనసుకు తెలియకుండా యెవరూ చెడ్డపని చేయలేరు. చెడ్డపనికి సంఘం వేసే శిక్షతో పాటుగా అతడి మనసు వేసే శిక్షని కూడా అనుభవించవలసి వుంటుంది. చెడ్డపనుల లోలికి వెళ్ళకపోవడమే అన్నింటా వుత్తమమైనది. మనస్సులో కూడా అటువంటి ఆలోచనలు రాకుండా, జీవితాన్ని యిది మినహామిగిలిన వృత్తులలో, వ్యాపారాలలో, వుద్యోగాలలో నడుపుకోవాలి. సర్వసంగ పరిత్యాగియై, బౌద్ధ భిక్షువుగా మారడం యెంతో శ్రేయస్కరం. అలా వీలుకానివారు పైన చెప్పిన వుత్తమ నైతిక జీవితాన్ని గడపాలి. అతడలా స్వచ్ఛంగా బతకడమే పరిశుద్ధజీవనం.

అంతేకాదు అతడు జీవితంలో పరిపూర్ణత, సాధించాలి. ధ్యాన సాధనలో పరిపూర్ణత సాధించాలి. యిదే పరిశుద్ధ జీవనం. దీనినే సమ్మా ఆజీవ అని బుద్ధుడు ప్రవచించిన పాళి భాషలో అంటారు.

## సమ్యగ్ వ్యాయామం

దీనినే స్వచ్ఛతకై పరిశ్రమ అనవచ్చు. సత్ప్రయత్నం అనికూడా అనవచ్చు

యెంత జ్ఞానదృష్టి కలిగినా, యెన్ని సంకల్పాలు చేసుకున్నా, మైత్రీ భావంతో, నిండైన ప్రవర్తనతో, పరిశుద్ధంగా జీవితం గడుపుకొన్నున్నా మనస్సులో మాలిన్యాలు పూర్తిగా పోవు. స్వచ్ఛత ప్రశ్నార్థకంగానే వుంటూవస్తుంది. మనస్సులో చెడ్డవూహలు 'మేం వున్నాం సుమా?!' అని పలకరిస్తూనే వుంటాయి. స్వచ్ఛత ధావంతకాలం. మనిషికి పతనమయ్యే పరిస్థితి నీడలా వెన్నాడుతూనే వుంటుంది. మనిషి పాపప్రయత్నాలు చేస్తూనే వుంటాడు. అధోగతికి లోనవుతూనే వుంటాడు.

అందువల్ల అతడు మనస్సులో పూర్తి స్వచ్ఛతకోసం పాటుపడాలి. యిందుకు నాలుగు పద్ధతులున్నాయి. అవి : 1. మనస్సులో వచ్చిన, పొడచూపిన దుష్ట భావాలను నాశనం చేయడం; 2. మరింకే దుష్టభావాలూ మనస్సులో ప్రవేశించకుండా అడ్డు కట్టవేయడం; 3. యింతవరకు రాని మంచి భావాలను మనస్సులో నెలకొల్పు కోవడం 4. అప్పటికే వచ్చి వున్న మంచి భావాలను సంతోషంగా మరింత అభివృద్ధి చేయడం.

యీ నాలుగు పద్ధతులూ అతన్ని స్వచ్ఛమైన మనిషిగా తయారు చేస్తాయి. అయితే యీ క్రియ నిరంతరమూ కొనసాగుతూనే వుండాలి. యిది యెక్కువగా మనస్సుకే సంబంధించిన పరిశ్రమ. దీనికి సాధన అవసరం. ధ్యానచింతన అవసరం. యేదైనా మనస్సులో ఆ వూహను పూర్తిగా అనుభవంలోకి తెచ్చుకుంటే పదే పదే మనస్సును సమాధానపరుచుకుంటూ వుంటే మనస్సు తేలికపడుతుంది. ధ్యానానికి, తద్వారా పరిపూర్ణతకు మనస్సు అంగీకృతమవుతుంది.

మనస్సుని గుప్పిటలో పెట్టుకుని, దానిని పులుకడిగిన ముత్యంలా ప్రకాశింప చేసుకోవడమే స్వచ్ఛతకై పరిశ్రమ. యిదే సమ్యగ్ వ్యాయామం. స్వచ్ఛతగల మనస్సును పాపం అంటమన్నా అంటదు. అది ఆకుల కొనల నుండి నీరు జారి పోయినట్టుగా జారిపోతుంది. చెడ్డ భావాలస్థానే మంచి భావాలు పాదుకొని మొలకెత్తి మనకళ్ళ ముందే గుణాత్మకంగా మొగ్గ తొడుగుతాయి. స్వచ్ఛతకై చేసే పరిశ్రమ ఫలితం యిదే. దీనినే అని పాళీభాషలో సమ్మావాయామ అంటారు.

## సమ్యక్ స్మృతి

దీనినే వివేక చింతన అని అంటాము. దీనినే సన్మనస్కత అనికూడా అనవచ్చు. అష్టాంగ మార్గంలో వివేక చింతన యేడవది. యిది కూడా మనస్సుతో చేసే వ్యాయామమే. యీ వ్యాయామం మనిషికీ, మనస్సుకీ బలాన్నిస్తుంది. పుష్టినిస్తుంది. ధైర్యాన్ని యిస్తుంది. యీ వివేక చింతనలో మనిషిని సమున్నతుణ్ని చేసే గొప్ప ఆచరణపూర్వక తాత్వికత వుంది. ఆ తాత్వికత హేతు బద్ధమైనది. విశ్వవ్యాప్తమైనది. విశ్వమానవకళ్యాణకారకమైనది.

పాపపు ఆలోచనలను మట్టుపెట్టడమే వివేక చింతన.సమ్యక్స్మృతి.

తన గురించి, ప్రపంచం గురించి తనకి తాను చేసుకునే వ్యాయవింతనే వివేక చింతన. తన అంటే శరీరం. స్పందనలు, చిత్తం. ప్రపంచానికి సంబంధించి ధర్మం. దాని గుణాలు

వీటి గురించిన వివేకచింతన మనిషి వికాసానికి కెంతో తోడ్పడుతుంది.

శరీరానికి సంబంధించి అతడు. యీ దేహం వివిధరకాల పదార్థాలతో నిర్మింప

బడివుందనీ, యిది నశించి పోక తప్పదన్న యథార్థాన్ని అతడు నిత్యం స్ఫురణలోకి తెచ్చుకోవాలి. యీ శరీరానికి ముసలితనం తప్పదు... అని మాటి మాటికి చింతిస్తూ వుండాలి. యవ్వనమదంలో చేసే దుష్టమైన పనులు, దుష్టమైన ఆలోచనలు యీ చింతనవల్ల నాశనమవుతాయి.

యీ శరీరానికి రోగాలు తప్పవు. యెప్పటికైనా యీ శరీరం రోగాలపాలయి నాశనమై పోవాల్సిందే అని మాటిమాటికి గుర్తుచేసుకుంటూ వుండాలి. అప్పుడే ఆరోగ్యమదంలో చేసే దుష్టమైన పనులు, దుష్టమైన ఆలోచనలు యీ చింతనవల్ల నాశనమవుతాయి. యీ శరీరం మరణించక తప్పదు అన్న నిజాన్ని మాటిమాటికి గుర్తుచేసుకుంటూ వుండాలి. అందువల్ల బతుకుమీద రక్తితో చేసే అనేకానేక దుష్టమైన పనులు, ఆలోచనలు నశించి పోతాయి. యిష్టమైన వస్తువులు, మనుష్యులు.... వీరందరితోనూ నాకు వియోగం వున్నది అని గుర్తించాలి. యెప్పుడు యెవరు చనిపోతారో తెలియదు. యే వస్తువులు యెప్పుడు నశించి పోతాయో తెలియదు. యీ చింతనవల్ల ఆ యా వ్యక్తుల పట్ల కారుణ్య భావం పుడుతుంది. యెవరిపట్లా చెడ్డ చేయడానికి మనసొప్పదు. వియోగం కలగవచ్చునన్న భావన వల్ల ఆయా మనుష్యుల, ఆయా వస్తువుల విసలైన ప్రాముఖ్యత తెలిసి, వారిపట్ల కరుణాత్మకంగా, జాగరూకతగా మసలుకొనేటట్లు మనిషిని అతడి మనసు సంసిద్ధుడ్ని చేస్తుంది.

యిదంతా దేహానికి సంబంధించిన విషయం.

యిక స్పందనల విషయానికీ, మనస్సు విషయానికీ వస్తే మనలో నిరంతరం మెదిలే స్పందనలు, వేదనలు, సంవేదనలు శాశ్వతమైనవి కావనీ, వాటిలో హేతుభావం, పరిపూర్ణత లేనివి, పరస్పరం విభేదించుకునేవి అనేకమైనవి వుంటాయనీ అతడు తెలుసుకోవాలి. అప్పుడు యే స్పందనలైతే, యే సంవేదనలైతే జ్ఞానానికీ, సౌఖ్యానికీ, తన క్షేమానికీ, ప్రపంచక్షేమానికీ పనికివస్తాయో వాటినే స్వేచ్ఛగా రానిచ్చేందుకూ, మిగిలిన వాటిని నాశనం చేసేందుకూ అతడు పుద్యుక్తుడవుతాడు. పరిపూర్ణతలేని ఆలోచనలవల్ల, సంవేదనలవల్ల చెడేగానీ మంచిలేదనీ, నాశనమేకానీ బతుకు లేదన్న సంగతి తెలుస్తున్నకొద్దీ చెడ్డ ఆలోచనలను, చెడ్డ సంవేదనలను మనస్సునుంచి బయటికి పారద్రోలుకొనడం సులువు అవుతుంది.

ఆ విధంగా క్రమేపీ మనస్సు స్థిరపడుతుంది. వివేకంగా ఆలోచిస్తూ, వొకనాటికి తానే వివేకచింతనకు ప్రత్యక్ష సాక్ష్య మవుతుంది.

నేను కర్మజీవిని, నేను చేసిన పనులకు తగిన ప్రతిఫలం అనుభవించక తప్పదు. మంచి పనులు చేస్తే మంచి ఫలితం వుంటుంది. చెడ్డ పనులు చేస్తే చెడ్డ ఫలితం వుంటుంది. మనస్సులో యేర్పడే విరాళా విప్లవాలు చెడ్డకే దారితీస్తాయి, తానొక్కడే కాదు సమస్త ప్రాణులు జరా, వ్యాధి, మరణ ధర్మాలతో యేర్పడినవ్వనే. వీటన్నిటితోటీ నాకు వియోగం తప్పదు. అందువల్ల జీవితాన్ని చరితార్థం చేసుకునేందుకు, మంచి పనులు చేయడంలో తొందరపడాలి, ఆలస్యం చేస్తే ఆ స్థానంలో చెడ్డ పేరుకు పోతుందన్న సంగతులు ఆచరణ పూర్వకంగా, ప్రపంచంలో అనుక్షణం జరిగే మార్పుల ఫలితంగా తెలుసుకుని మనిషి తన జీవితాన్ని మంచిగా, వివేకంగా, పదిమందికీ క్షేమకరంగా నడుపుకోవాలి. జీవితంలో యెదురైన ప్రతి సందర్భాన్నీ అది యెటువంటి సందర్భం అయినప్పటికీ అతడు మంచి ఆలోచనల వైపుకి మళ్ళించుకోవాలి. జలాలను నేర్పుతో రైతులు తమకు యిష్టమైన రీతిలో పొలాలకు మళ్లిస్తున్న రైతుని చూసి రైతు నీళ్ళను మళ్ళించినట్లు తాము

కూడా అలాగే తమను తాము మల్చుకోవాలి. బాణాలు చక్కగా సూటిగా చేస్తున్న వాళ్ళ చూసి, తాను కూడా కుటిలంగా వున్న మనస్సును తనకు తానే సరిచేసుకోవాలి. పనికిరాని చెక్కలు అని ఏవం అనుకునే చెక్కలతో పనికి వచ్చే వస్తువుల్ని చేస్తున్న వడ్రంగిని చూసి, తాను కూడా పనికి రాని ఈ దేహాన్ని నిర్వాణ ఫలాన్ని అందుకొనేందుకు పనికి వచ్చే నిచ్చెనగా చేసుకోవాలి. అలా ప్రతి సందర్భాన మనోవాక్కాయ కర్మలన్నీ కుశల పక్షం వైపుగా మరలేలా తీసుకుని కృతకృత్యుడైన శివ!! పండితునిలాగా అతడు కృతకృత్యుడవాలి. జీవితంలో తన శక్తిని మరిచిన మనస్సుకి బలమైన అవసరం వివేక చింతన. దీనినే పాళీలో సమ్మా సతి అంటారు.

## ౮. సమ్యక్ సమాధి

దీనికే సమ్యవనము లేక పరమార్థ సాధన అనవచ్చు - బుద్ధుడు ప్రవచించిన పాళీభాషలో సమ్మ సమాధి అంటారు.

అష్టాంగ మార్గాలలో చిట్ట చివరిదీ పరమార్థ సాధన. దీనినే సమ్యక్ సమాధి అంటారు. దీనిని పూర్తి చేయడం ద్వారానే మనిషి సంపూర్ణ జ్ఞాని అవుతాడు.

పైన వివరించిన యేడు నైతిక ధర్మాలను ధ్యానిస్తూ మనస్సుని జ్ఞానంపై కేంద్రీకరించినప్పుడు మనిషికి మహోన్నతమైన ఆ నిర్వాణ స్థితి లభ్యమవుతుంది. ఆ నిర్వాణస్థితిని వర్ణించడానికి మాటలు చాలవు. సుఖదుఃఖాలకు అతీతమైనస్థితి అది. స్థితిలయాతీతంగావుండే శాశ్వస్థితి అది. అద్భుతమైన ప్రశాంతినిస్తుందాస్థితి. యెటువంటి రాగద్వేషమదమోహాదనలోభ మాత్సర్యాలు అతడినింక అంటజాలవు. మనస్సుని వున్నతపథం వైపు మళ్ళిస్తున్న కొద్దీ కేంద్రీకరిస్తున్న కొద్దీ నిర్వాణస్థితి దగ్గరవుతూ వుంటుంది. అయితే అతను పైన వివరించిన యేడు ధర్మాలలోనూ వుత్తీర్ణుడై, పరిశుద్ధుడై, స్వచ్ఛమైన మనిషిగా రూపుదిద్దుకోవలసివుంటుంది. జీవించి వున్నప్పుడే నిర్వాణాన్ని పొందగలగాలి. కానీ అందుకు మనస్సులో చాలా ఆటంకాలెదురవుతాయి. అందువల్ల అతడు మనస్సు గురించి తెలుసుకోవాలి.

మనస్సు గురించి బుద్ధభగవానుడిలా చెప్పారు.

"మన జీవితం మన మనస్సు చేతనే సృష్టించబడుతూ వుంది. మన ఆలోచనలే మనలను తీర్చిదిద్దుతున్నాయి. అందువల్లనే మనస్సులోని ఆలోచనలను యెప్పటికప్పుడు శ్రద్ధతో గమనిస్తూ వుండడం చాలా అవసరం. మనం చేసే పనులన్నీ మనస్సుచేత చేసేవే. ఆ మనస్సుని మనం పరిశుద్ధ పరుచుకోవాలి. కలుషితమైన మనస్సుతో మాట్లాడినా, పనులు చేసినా యెద్దుపాదాల వెంటడే బండి చక్రం వస్తున్నట్లు దుఃఖం అతన్ని వెంబడిస్తుంది. అదే పరిశుద్ధమైన మనస్సుతో మాట్లాడినా, పనులు చేసినా మన నీడ మనవెనకే వస్తున్నట్లు సుఖం మనవెంటే వస్తుంది".

"మనస్సుకునిలకడవుండదు. యెప్పుడూ చలిస్తూ వుంటుంది. దానిని బంధించి సంరక్షించడం చాలా కష్టం. బాణాల్ని తయారు చేసేవాడు బాణాల్ని తిన్నగా చేసేటట్లు బుద్ధిమంతుడు తన మనస్సును పరిశుద్ధమొనర్చుకోవాలి. మనస్సు తన యిష్టానుసారం పూర్వోద్భవంతంలో విహరిస్తూ వుంటుంది. దానిని నిరోధించడం చాలా కష్టం. అయినా సరే మనస్సుని నిగ్రహించుకోవడం చాలా వుత్తమం. యెందుకంటే నిగ్రహించుకొన్న మనస్సు గొప్ప ఆనందాన్ని సమకూరుస్తుంది".

"మనస్సు అగోచరంగా వుంటుంది. సూక్ష్మంగా వుంటుంది. నిగూఢ చైతన్యంలో దాగి

వుండి వూహా ప్రపంచాంలో విహరిస్తూ వుంటుంది. అందువల్ల బుద్ధిమంతుడు తన మనస్సుని సంరక్షించుకోవాలి. అట్లా సంరక్షించుకున్న మనస్సు యెల్లప్పుడూ ఆనందాన్నే చేకూరుస్తుంది".

"చంచలమనస్కులు ధర్మమార్గాన్ని అనుసరించలేరు. శ్రద్ధా విశ్వాసాలు సడలినవారు పరిపూర్ణ జ్ఞానాన్ని పొందలేరు. అందువల్ల మనస్సుని చలించకుండా శ్రద్ధావిశ్వాసాలతో వుండేలాగా చూసుకోవాలి". "శత్రువు, శత్రువుకి హాని కలుగచేస్తాడు. ద్వేషించేవాడు తన ద్వేషికి హాని కలుగచేస్తాడు. కాని దారితప్పినమనస్సు తనకులానే అందరి కంటే యెక్కువ హాని కల్గిస్తుంది. తల్లి, తండ్రి మరియు బంధువులలోకానికి మేలు కలుగజేస్తారు. అయినా సన్మార్గమునందున్న తన మనస్సు తనకు అందరికంటే యెక్కువ మేలు చేకూరుస్తుంది".

మనస్సులో వికల్పవృత్తులు తలెత్తకుండా చూసుకోవాలి. మనస్సు భవిష్యత్తుకు పరుగులు తీసి గాలిమేడలు కడుతుంది. లేదా గతానికి పరుగులు తీసి జరిగిపోయిన సంఘటనలని మరోవిధంగా జరిగినట్టు వ్యతిరేకంగా వూహిస్తుంది. యిలాంటి వికల్పవృత్తం వల్ల మనస్సు అలసిపోవడం, మానసికశక్తి వృధాకావడం తప్పించి వేరే ప్రయోజనం లేదు. కనుక మనస్సు యొక్క కదలికల మీద సదా గమనిక కలిగివుండి దాన్ని వర్తమానంలోనే వుంచగలిగితే సంసారమోహ బంధాలు మాయమవుతాయి."

"గమనించి పట్టుకోవడానికి చాలా కష్టమైనటువంటిది, మిక్కిలి సూక్ష్మమైనటువంటిది. తనకు యిష్టమైన విషయాల మీద శరవేగంతోపోయి వాలేది అయిన చిత్తాన్ని మేధావి అయినవాడు సన్మార్గంలో పెట్టి రక్షించుకోవాలి. అలా రక్షింపబడిన మచ్చిక చేసుకున్న మనస్సు సుఖాన్ని యిస్తుంది".

"చక్కగా నేసిన యింటికప్పులో నుండి వాన చినుకులు లోనికి యెట్లా ప్రవేశించవో అట్లే వివేకవంతమైన మనస్సులోనికి విషయవాంఛలు దూరలేవు."

నీటిలోనుండి తీసి నేలపై పడవేసిన చేపవలె చిత్తము మారుని (కోరికల నుండి, దుష్టత్వం, ద్వేషాలనుండి) లోనుండి తప్పించుకోవడానికి గిలగిల కొట్టుకొంటుంది.

"ఒంటరిగా యెంత దూరమైనా పయనించు శక్తి శరీరరహితమైన మనస్సుకి వుంది. అట్టి చిత్తాన్ని హృదయకుహారంలో అణచిపెట్టి వశపరచుకునేవాడు మారుని కోరికల బారి నుండి, దుఃఖాన్నుండి విముక్తుడవుతాడు.

"విరోధి చేయు హానికంటే,విద్వేషి చేసే అపకారముకంటే స్వార్థాయుతమైన మనసు. మిక్కిలి యెక్కువ కీడు చేస్తుంది."

"తల్లిగాని, తండ్రిగాని, యితర బంధువర్గము కాని చేయలేని మేలును సుశిక్షితమైన మనస్సు చేయగలదు."

అటువంటి మనస్సును అష్టాంగమార్గంలో ప్రతిసారి నిత్యసజీవంగా మళ్ళిస్తూ అది యింక చెడువైపుకు వెళ్ళకుండా, తానే మంచికీ జ్ఞానానికీ మారుపేరు అయిపోయేటట్లుగా ధ్యానమార్గంలో వుత్తీర్ణత సాధించాలి. యిది యెప్పుడూ చేయవలసిందే. యెందుకంటే మనస్సు పాపిష్టది. యేకొంచెం అవకాశం చిక్కినా కోరికల సుడిగుండంలోకి మనిషిని నెట్టివెయ్యగలదు.

అందువల్ల మనస్సుపై సంపూర్ణఅధికారం పొందేందుకూ జీవితంలో దుఃఖాన్ని

పోగొట్టుకోవడానికీ, ధర్మమార్గాన పయనించి సుఖశాంతులు అనుభవించడానికీ జీవితాన్ని చరితార్థం చేసుకోవడానికీ యీ సమాధి వుపయోగపడుతుంది. అందుకతడు రెండువిధాలుగా అభివృద్ధి చెందాలి. 1. ధ్యాన కేంద్రీకరణ 2. పరమార్థ సాధన.

ధ్యానకేంద్రీకరణ చేస్తూన్నకొద్దీ, మనస్సుకు వుండే నాలుగు మహోన్నత స్థితులు-బ్రహ్మవిహారాలు అనుభవమవుతూ అతడ్ని మహామానవుడిగా తయారు చేస్తాయి. అంతేకాకుండా అతడు పరమార్థసాధన కొరకు యేదైనా మహత్తర కార్యంలో మనస్సునీ, శరీరాన్నీ కేంద్రీకరించాలి. ఆ మహత్తరకార్యం: పదిమందికీ మేలు చేకూర్చే ఆ మహత్తరకార్యం చేపట్టినప్పుడు, యెదురయ్యే అన్ని రకాల సవాళ్ళను, ధ్యానయోగం ద్వారా మనస్సుని విస్తృతపరచుకుంటూ యెదుర్కోవాలి. ధ్యానంవల్ల ఆ మహత్తరకార్యసాధనలోని మలుపుమెలుకువలు, లోటుపాట్లు, మానవ సహజహేతువుకు అందకుండా దాగిన రహస్యాలు తెలుస్తాయి. దానితో ఆ మహత్తరకార్యాలు విజయవంతమవుతాయి. యిందుకై అతడు ప్రాణాలను సైతం ధారపోయగల త్యాగాన్ని అలవరచుకుంటాడు. సంఘం బాగుకొరకు, సంఘంలో మంచి విలువల పునరుద్ధరణ కొరకు జీవితాన్ని కేంద్రీకరిస్తే, తన శక్తియుక్తులన్నీ అందుకు ధారపోస్తే క్రమేణా ఆ విలువలు పరిరక్షింపబడి తద్వారా జనులకు శాశ్వతమైన సుఖశాంతులు లభిస్తాయి. యింక ఆయా జనులకు అటువంటి కష్టాలే వుండవు. మహత్తర కార్యం అంటే అటువంటిది. పాప స్వభావాన్ని పూర్తిగా నాశనం చేసి, మహత్తర కార్యసాధకుడిగా చరిత్రలో మిగిలిపోవడమే అమరత్వం. బౌద్ధ ధ్యానం అందుకతడికి సంపూర్ణంగా సహకరిస్తుంది. అతడ్ని వుత్సాహవంతుడ్ని చేస్తుంది. నిర్వాణం అంటే అదే. అమరత్వం అంటే అదే. బోధిసత్వం అంటే కూడా అదే. యిదే సమ్యక్సమాధి. మానవాళి శ్రేయస్సుకు గౌతమబుద్ధుడూదిన కొత్త వూపిరి. యింక ఆ మహత్తర ధ్యానంలోనికి ప్రవేశించండి.

మనస్సుకి నాలుగు ఘనమైన స్థితులు వుంటాయి. అవి : మైత్రి, కరుణ, ముదిత (సహానుభూతి), వుపేక్ష (సమభావం). వీటిన్ని ధ్యానించే వ్యక్తి వీటిని వొక్కొక్కటిగా, నిరంతరంగా, తన చుట్టూ అంటే పది దిక్కులా, పైనా క్రిందా చుట్టూ అంతా కూడా, కాలం అనే కొలబద్దలేవి లేకుండా భూత, భవిష్యత్, వర్తమానాలలో, మర్త్య, స్వర్గ సమస్తలోకాలలో యీ మైత్రి, కరుణ, ముదిత, వుపేక్షా భావాలే నిండి వుండునట్లు ధ్యానించాలి. వీటిలో చెట్లు, జీవరాసులు, కొండలు, ప్రకృతి, గొప్పతనం, యెత్తు లోతు, విశాలత్వం, అనంతత్వం, గాలి, నీరు, అగ్ని, ఆకాశం— సమస్తం వస్తాయి. పైన వివరించిన నాలుగు ఘనస్థితుల్నీ వొక్కొక్కటిగా తన చుట్టూ వున్న విశ్వమంతటికీ వ్యాపింప చేస్తూ, ఆ భావాన్ని తనలోనూ, విశ్వంలోనూ - విశ్వ పదార్థమంతటిలోనూ నిలుపుకోవాలి. నాలుగవ ఘనస్థితి అయిన వుపేక్ష (సమభావం) లో కూడా అతడు పూర్తిగా విజయుడవాలి.

యీ ధ్యానంలో పరిపూర్ణుడైన వాడికి, అత్యున్నతమైన, పరిపక్వమైన సమతాస్థితి లభిస్తుంది. అటువంటి వాడికి విరోధమన్న భావం లేశమైనా వుండదు. వొక చేతిపై గంధం రాసినవాడినీ, మరొక చేతిని గొడ్డలితో నరికిన వాడినీ కూడా వొకే విధంగా చూడగల సంస్కరించగల మహోన్నత స్థితి లభిస్తుంది.

యీ చక్కని జ్ఞానస్థితిని పొందడానికి మొదట అతడు నాలుగు విధాలైన వివేక చింతనలో ప్రవీణుడు కావాలి. ఆ చింతనలు : కాయ, వేదన, చిత్త, ధర్మ చింతనలు. శరీరం గురించిన చింతనే కాయ చింతన. స్పందనల గురించిన చింతనే 'వేదన'. మనసు గురించిన చింతనే 'చిత్త'. జ్ఞానం గురించిన చింతనే ధర్మచింతన.

ఈ చింతనలన్నింటినీ అతడు కోరికలు, కష్టాలు, అటువంటి తలంపులు తనకు గాని, తనవల్ల ఇతరులకుగాని లేకుండా వుండేటట్లు కేంద్రీకరిస్తూ కొనసాగించాలి. ఒక్కొక్క చింతనని ధ్యానిస్తున్నప్పుడు మరెన్నో తలపులు, ఆలోచనలు, జ్ఞాపకాలు వస్తూవుంటాయి. వాటిని స్వేచ్ఛగా వదిలి పెట్టేస్తూ మనస్సుని తానెంచుకున్న ధ్యాన చింతనవైపుకు నెమ్మదిగా తీసుకు రావాలి. ప్రతీ చింతనా మనస్సునిండా పూర్తిగా నిండాలి. అది నెమ్మదిగా విశ్వవ్యాపితం కావాలి.

ఈ నాలుగు చింతనలలోని 'కాయ' చింతన గురించి తెలుసుకుందాము. ఇది చాలా ముఖ్యమైనది. మిగిలిన మూడు చింతనలకీ ఆ తరువాతి బ్రహ్మవిహారాలకీ ఇది ప్రథమసోపానం.

## 1. కాయ (శరీర) చింతన

ఈ కాయ చింతనలో ఆరుస్థితి ధ్యానాలున్నాయి. అవి 1. ప్రాణాయామం 2. శారీరక స్థితి ధ్యానం 3. శారీరక చలనధ్యానం: 4. శారీరక పదార్థ ధ్యానం 5. శరీరోద్భవ ధ్యానం 6. మృత్యుధ్యానం.

### 1. ప్రాణాయామం :

ఈ ప్రాణాయామాన్ని ఏక చెట్టుక్రిందకాని, ప్రశాంతంగా వుండే ప్రదేశంలో గానీ, గదిలోగానీ, బాసింపట్టు వేసుకుని, వెన్నెముకని నిటారుగా వుంచి, మనస్సునంతటినీ 'శ్వాస' పైనే కేంద్రీకరించాలి. ఇంకేమీ ఆలోచించకూడదు. కేవలం శ్వాస పైనే కేంద్రీకరించాలి. ఆలోచనలన్నింటినీ మనం తీస్తున్న శ్వాసపైనే కేంద్రీకరిస్తూ, శ్వాసని గమనిస్తూ, శ్వాస యొక్క శబ్దాన్ని వింటూ, శ్వాసలోపలికి పోయే విధానాన్నీ బయటికి వదిలే విధానాన్నీ గమనిస్తూ వుండాలి.

శ్వాసని లోపలికి పీలుస్తూ - 'శ్వాసని లోపలికి పీలుస్తున్నాను, శ్వాసని లోతుగా లోపలికి పీలుస్తున్నాను' అని అనుకోవాలి. శ్వాస బయటికి వదులుతూ ఏ విధంగా వదిలితే ఆ విధంగా నెమ్మదిగా వదిలితే నెమ్మదిగా, వేగంగా వదిలితే వేగంగా శ్వాస బయటికి వదులుతున్నాను' అని అనుకోవాలి. కొద్దిగా గాలి పీలుస్తే కొద్దిగా గాలి పీల్చినట్టుగా అనుకోవాలి. కొద్దిగా గాలి బయటికి వదిలితే కొద్దిగా గాలి బయటికి వదిలినట్టుగా అనుకోవాలి. సాధారణంగా దొరకని తనలో 'తన'కి తాను అనుసంధానమవడమనే అత్యద్భుత ప్రక్రియ ఇది - ఈ వ్యాయామం ద్వారా తనలో వున్న 'తాను' తనకిలభ్యమవుతాడు - గొప్ప తోడవుతాడు.

కొంతసేపు తరువాత - అట్లా గాలి పీల్చి వదులుతూనే శ్వాస శబ్దం వింటూనే అసలు శ్వాస అంటే ఏమిటో అది ఎలా జరుగుతోందో యోచన చేయాలి. శ్వాస అంటే ఏక చైతన్య రూపం. ఇది నిరంతరం శరీరంలో జరుగుతూనే వుంటుంది. అసలు దేహమంతా చైతన్యంగా వుండటానికి ఈ శ్వాస అన్న చైతన్యమే కారణం. శ్వాస అంటే మరో మాటలో ప్రాణమే.

కనుక ఈసారి శ్వాస పీలుస్తున్నప్పుడు 'చైతన్యాన్ని లోపలికి పీలుస్తున్నాను. చైతన్యాన్నిచ్చే శ్వాసని లోతుగా పీలుస్తున్నాను'. అని మనస్ఫూర్తిగా మననం చేసుకోవాలి. అలాగే శ్వాస వదిలేటప్పుడు కూడా ఆ విధంగా మననం చేసుకోవాలి. శరీరమంతా ప్రశాంతిగా, విశ్రాంతిగా అయేటట్లు ఈ శ్వాస విధానాన్ని, దానిపైనే కేంద్రీకరిస్తూ మనస్ఫూర్తిగా అమలు జరపాలి.

దుస్తులు కుట్టేపనివాడు దుస్తులు సరిగా కుట్టేందుకు బట్టలకు కావలసిన ఆకారంలో కత్తిరించినట్లు, ప్రాణాయామం చేస్తున్న మనిషి తనకు కావలసిన విధంగా, తనకు సరిపడే విధంగా

శ్వాసని పీల్చుతూ, వదలాలి. అంతేగాకుండా అతడు - యీ శ్వాస అన్నది తనకే కాదనీ, అందరికీ యిలానే శ్వాస వుంటుందనీ, వుచ్ఛ్వాస నిశ్వాసలు అందరిలోనూ జరుగుతాయనీ మననం చేసుకోవాలి.

యిలా శ్వాసపైన మనస్సుని కేంద్రీకరిస్తున్న కొద్దీ, శ్వాస వ్యాయామం (ప్రాణాయామం) చేస్తున్న కొద్దీ తనలోనూ యితరులలోనూ జరిగే శరీరానికి అత్యంతముఖ్యమైన శ్వాస యొక్క వాస్తవస్థితిగతులను అర్థం చేసుకుంటాడు. ఆ శ్వాసజ్ఞానం అతడిలో వివేక చింతననీ, గ్రహింపు శక్తినీ అభివృద్ధి చేస్తుంది. స్వతంత్రంగా నిలబడేందుకు, తోడ్పడుతుంది. మిగతా అన్ని ధ్యానాలనూ, చింతనలనూ, ధ్యానాలనూ అభివృద్ధి చేసుకునేందుకు వుపయోగపడుతుంది. యిది మహామానవతా మూర్తి గౌతమ బుద్ధుడు వుపదేశించిన బోధన అని అతడు మననం చేసుకుంటూ, తనలో వస్తున్న మార్పుల్నీ, అభివృద్ధుల్నీ గమనించుకుంటూ, వాటి ఆధారాలతో యీ ధర్మ మార్గాన్నీ, జ్ఞానాన్నీ, ధ్యానాన్నీ విశ్వసించాలి. రుజువైన సత్యాలతో, నమ్మకంతో ముందుకు పోగిపోవాలి.

యీ సాధన నిత్యం నిర్ణయించుకున్న వేళకు జరిగేటట్టు చూసుకొంటే మంచిది. నిద్రలేచిన వెంటనే, నిద్రపోయేముందు యీ సాధన చేయడం చాలా మంచిది. అయితే యెప్పుడు చేసినా అది ఆనందమే కల్గిస్తుంది.

ధ్యానంలో 'శ్వాస' గురించి మనస్ఫూర్తిగా, పైన చెప్పిన విశేషాలతో, వివేకచింతన చేయడం, శ్వాస యెగుడుదిగుడులను గమనించడం, అనుకున్న విధంగా ఆలోచించడం... యిది కాయాన్ని గురించిన ధ్యానంలో మొదటిమెట్టు. యిక:

## 2. శారీరక స్థితి జ్ఞానం :

ప్రతిమనిషికి సాధారణంగా నాలుగు శారీరక స్థితులు వుంటాయి. అవి 1. నిలబడటం 2. కూర్చోవడం 3. నడవడం 4. పడుకోవడం. యించుమించు శారీరక క్రియలన్నీ యీ నాలుగు స్థితుల్లోనే సంభవిస్తాయి. శారీరక స్థితుల్లో, వాటి గురించిన చింతనల్లో యీ నాలుగు స్థితులూ చాలా ప్రధానమైనవి.

యీ శారీరక స్థితి యొక్క జ్ఞానం మనిషిలో నిరంతరం వుండాలి. యిది రోజులో యేదో కొన్నూట కొద్దిసేపు చేసే ధ్యానం కాదు. యీ శరీర స్థితి అనే ధ్యాన చింతన అతని జీవితంలో భాగం కావాలి. యేమిటా చింతన?

అతడు నిలబడి వుంటే తాను నిలబడివున్నానన్న ప్రత్యేకమైన స్పృహ అతడికి వుండాలి. నిలబడివున్నప్పుడు నేను నిలబడివున్నాను-సరిగా నిలబడి వున్నాను అని అతడు మనస్సులో లోతుగా అనుకోవడం - ఆ యెరుకకలిగి వుండడం వల్ల సరిగా, సవ్యంగా నిలబడకపోవడం, అసభ్యంగా నిలబడటం, యితరులలో విముఖావం కల్గించని విధంగా నిలబడటం, యిటువంటి దోషాలు తొలగించిపోతాయి. అతడటువంటి అంగీకరదోషం చేయకుండా ధ్యానించిన అతడి మనసు అతడ్ని కాపాడుతుంది. అట్లాంటి దోషాలు చెయ్యకుండా అతడి శరీరాన్ని సక్రమమైన, సహజమైన స్థితిలో వుంచుతుంది. అతడు దుస్తులు ధరించే తీరు పటువుగా, మన్నింపుగా వుంటుంది. మూత్ర విసర్జన, స్నానపానాదులు యితరులకి తెలియకుండా, అసభ్యతగా అనిపించకుండా నిర్వర్తించుకుంటాడు.

అతడు కూర్చునివుంటే తాను కూర్చునివున్నానన్న ప్రత్యేకమైన స్పృహ అతడికి వుండాలి. కూర్చునివున్నప్పుడు 'నేను కూర్చుని వున్నాను-నేను సరిగా కూర్చుని వున్నాను' అని మనసులో నిండుగా అనుకోవడం, ఆ యెరుక కలిగి వుండడం వల్ల సరిగా, సవ్యంగా కూర్చోకపోవడం, అసభ్యంగా కూర్చోవడం, యితరులలో సమభావం కల్గించని విధంగా కూర్చోవడం, యిటువంటి దోషాలు నశించిపోతాయి. అతడటువంటి ఆంగిక దోషం చేయకుండా, ధ్యానించిన అతడి మనసు అతణ్ణి కాపాడుతుంది. అట్లాంటి దోషం చేయకుండా అతడి శరీరాన్ని, సక్రమమైన, సహజమైన స్థితిలో వుండేటట్టు ప్రేరేపిస్తుంది. కూర్చున్నప్పుడు చేసే పనుల్లో జాగ్రత్తగా వుండేందుకు దోహదపడుతుంది.

అతడు నడుస్తూవుంటే తాను నడుస్తున్నానన్న ప్రత్యేకమైన స్పృహ అతడికి వుండాలి. నడుస్తూన్నప్పుడు, 'నేను నడుస్తూ వున్నాను-నేను సరిగా నడుస్తూ వున్నాను' అని మనసులో నిండుగా అనుకోవడం వల్ల , ఆ యెరుక కలిగి వుండడం వల్ల సరిగా, సవ్యంగా నడవకపోవడం, అసభ్యంగా నడవడం, యితరులని యెగతాళి చేస్తూ నడవడం, యితరులలో సమభావం కల్గించని విధంగా నడవడం యిటువంటి దోషాలు నశించి పోతాయి. అతడటువంటి ఆంగికదోషం చేయకుండా, ధ్యానించిన అతడి మనసు అతణ్ణి కాపాడుతుంది. అట్లాంటి దోషాలు చేయకుండా అతడి శరీరాన్ని సక్రమమైన, సహజమైన స్థితిలో వుండేటట్టు ప్రేరేపిస్తుంది. నడుస్తున్నప్పుడు జాగ్రత్తగా, వళ్ళు దగ్గర పెట్టుకుని నడిచేటందుకు దోహదపడుతుంది.

అతడు పడుకుని వుంటే తాను పడుకుని వున్నానన్న ప్రత్యేకమైన స్పృహ అతడికి వుండాలి. పడుకుని వున్నప్పుడు, 'నేను పడుకుని వున్నాను-నేను సవ్యంగా పడుకుని వున్నాను' అని మనసులో నిండుగా అనుకోవడం ఆ యెరుక కలిగి వుండటం వల్ల సరిగా, సవ్యంగా పడుకోకపోవడం, అసభ్యంగా పడుకోవడం, యితరులలో సమభావం కల్గించని విధంగా పడుకోవడం యిటువంటి దోషాలు నశించిపోతాయి. అతడు అటువంటి ఆంగికదోషం చేయకుండా ధ్యానించిన అతడి మనసు అతణ్ణి కాపాడుతుంది. అట్లాంటి దోషాలు చేయకుండా అతడి శరీరాన్ని సక్రమమైన, సహజమైన స్థితిలో వుండేటట్లు ప్రేరేపిస్తుంది. పడుకున్నప్పుడు చేసే పనులు జాగ్రత్తగా, వళ్ళు దగ్గర పెట్టుకుని చేసేందుకు, చేయకూడని పనులను చేయకుండా వుండేందుకు దోహదపడుతుంది.

యీ నాలుగు శారీరక స్థితులు ప్రతి వొక్కరిలోనూ వుంటాయనీ, అందరూ యీ క్రియలు జరుపుతారనీ మననం చేసుకోవాలి.

యిలా ధ్యానాన్ని పై నాలుగు శారీరక స్థితులపై కేంద్రీకరిస్తున్న కొద్దీ అతడు తనలోనూ, యితరులలోనూ జరిగే శారీరకచలనాల యొక్క వాస్తవ స్థితిగతులను తెలుసుకుంటాడు. తన శారీరక స్థితులను, చలనాలను సక్రమమైన దారిలో వుండేటట్టు చూసుకుంటాడు. అంతేగాక యీ శారీరక స్థితులు యెవరిలోనైనా సక్రమంగా లేనప్పుడు కారణాలను వేగంగా వూహించి, అవి సానుభూతి కల్గించేవి, మనిషి అవసరం కావలసివచ్చేవి అయితే వెంటనే సాయపడేందుకు వుద్యుక్తుడవుతాడు.

శారీరక స్థితులపై యిటువంటి ధ్యానచింతన సక్రమంగా, ధర్మబద్ధంగా జీవించడానికీ, ప్రమాదరహితంగా, జాగరూకతతో జీవించడానికీ వివేకవంతమైన, గ్రహింపు శక్తిని అభివృద్ధి చేసుకోవడానికీ, స్వతంత్రంగా జీవించేందుకూ, ప్రాపంచిక బంధాలకు దాసుడుగాకుండా వుండేందుకూ,

బంధితుడుగాకుండా వుండేందుకూ తోడ్పడుతుంది. యితరులకి సాయపడటంలో కాపాడటంలో ఆలస్యం జరగకుండా వుండేటట్లు తోడ్పడుతుంది. యిదంతా కూడా అతడు మననం చేసుకోవాలి.

ధ్యానంలో, యీ శారీరక స్థితులపైన జ్ఞానం-శరీరాన్ని గురించిన ధ్యానంలో రెండవమెట్టు. యీ రీతిలో అతడు స్వచ్ఛతకు, సభ్యతకు, జాగ్రత్తకు సజీవ చిహ్నంలా తయారవుతాడు.

### 3. శారీరక చలన జ్ఞానం :

తన శరీరావయవాలతో మనిషి ప్రతినిత్యం వందలాది పనులు చేస్తాడు. మాట్లాడతాడు. వింటాడు. చూస్తాడు. తింటాడు. బట్టలుధరిస్తాడు. పనిచేస్తాడు. సైగలు చేస్తాడు. యితరులకి జ్ఞానం బోధిస్తాడు. యిలా అతడు చేసే అన్ని పనులపైనా 'ఆ పనులు చేస్తున్నప్పుడు' 'ఆ పనులు చేస్తున్నాను' అన్న ప్రత్యేకమైన స్పృహ అతడికి వుండాలి. అతడు మాట్లాడుతుంటే, "నేను మాట్లాడుతున్నాను" "బట్టలు ధరిస్తుంటే బట్టలు ధరిస్తున్నాను" "పని చేస్తుంటే పని చేస్తున్నాను' ' అని అతడు భావించాలి. అప్పుడు అతడుచేసే ఆయా పనులు సక్రమంగా, సహజంగా నిర్వర్తించడానికి, యీ యెరుక వుపయోగపడుతుంది. అతన్ని జాగ్రత్త పరుస్తుంది. తప్పులులేకుండా, రాకుండా ప్రవర్తించేటట్లు మనిషిని నియంత్రిస్తుంది. అందువల్ల ప్రతిమనిషీ తానే పని చేస్తున్నా ఆ పని చేసే ముందుగానీ, చేసేటప్పుడుగానీ, ఆ భావాన్ని ముందుగానే మానసికంగా లోతుగా తాదాత్మ్యమవాలి. యిది కూడా ధ్యానంలో భాగమే. చాలా ముఖ్యమైనది కూడా. తన దేహభాగాలపైన, ఆయా భాగాలు చేస్తున్న పనులపైన నియంత్రణ జరుపడానికే కాకుండా, యేపని అయినా పంచేంద్రియాల తోడ్పాటుతో, సంపూర్ణజ్ఞానంతో చేసేటట్లు యీ యెరుకజ్ఞానం అతడికి వుపకరిస్తుంది.

అంతేకాదు, అతడు, యీ విధమైన జ్ఞానం తన చుట్టూ వున్న మనుష్యులలోనూ, జంతువులలోనూ కూడా వున్నదన్న వాస్తవాన్ని గ్రహించాలి. వొక మనిషి తింటున్నా, పడుకున్నా, రుచి చూస్తున్నా, దాహం పుచ్చుకుంటున్నా అతడాపనులు చేస్తున్నాడని గ్రహించాలి. అప్పుడు ఆయా పనులు చేస్తున్నప్పుడు వారు తొట్రుపాటుపడినా, సహాయం కావలసివచ్చినా, అందుకు సిద్ధపడేటట్లు మనసు తయారవుతుంది. యీ విధంగా శారీరక చలన జ్ఞానాన్ని పెంపొందించుకోవడం వల్ల యితరుల గురించి మనకు బాగా అర్థమవుతుంది. వారి మనస్సు మనకి తొందరగా, చక్కగా, విశదంగా అర్థమవుతుంది.

తన యొక్క, యితరుల యొక్క శారీరక చలనాలపై యిటువంటి యెరుక జ్ఞానం అతడు సక్రమంగా, ధర్మబద్ధంగా, ప్రమాదరహితంగా, నాగరీకతతో శారీరకపనులు నిర్వర్తించడానికి, వివేకచింతననీ, గ్రహింపుశక్తినీ అభివృద్ధి చేసుకోవడానికీ, ప్రాపంచిక బంధాలకు బానిస గాకుండా వుండేందుకూ, బంధితుడు కాకుండా వుండేందుకూ తోడ్పడుతుంది. యితరులకి సాయపడడంలో ఆలస్యం జరగకుండా వుండేటందుకు వుపయోగపడుతుంది. యిదంతా కూడా అతడు మననం చేసుకుంటూ వుండాలి.

యిటువంటి జ్ఞానంపై మనస్సుని కేంద్రీకరించడం వల్ల స్వచ్ఛంగా వుండే, సభ్యతగా వుండే, జాగ్రత్తకూ, సంస్కారానికీ, జ్ఞానానికీ అతడొక నిలువుటద్దంలా తయారవుతాడు.

మనిషి తనగురించి తాను తెలుసుకునే దేహచింతనా జ్ఞానంలో యిది మూడవమెట్టు. యీ చింతనలో అతడింకా మూడు మెట్లని అధిరోహించవలసి వుంది. పైన చెప్పిన మూడూ యెరుక జ్ఞానాలు. మిగిలినవి మూడూ ధ్యానానికి సంబంధించినవి.

శారీరక చింతన గురించి చేయవలసివున్న మూడు ధ్యాన పద్ధతులలో యిది మొదటిది. సాధకుడు, 'యీ శరీరమంతా పాదాల నుంచి శిరస్సు దాకా అశాశ్వతమైన చర్మంతో కప్పబడి వుందనీ, తలమీద, శరీర భాగాలపైన జుత్తు, గోళ్ళు మొదలైన స్పర్శ తెలియని భాగాలు వున్నాయనీ, శరీరం అంతా రక్తం, మాంసం, యెముకలు, చీము, చీమిడి, గులిమి, కన్నీళ్ళు, మూత్రం, మలం మొదలైన పదార్థాలతో నిండివుందనీ, గుండె, మూత్రాశయం, కాలేయం ప్రేగులు, మెదడు మొదలైన అశాశ్వతమైన దేహభాగాలున్నాయనీ' అతడు తన ధ్యానంలో ప్రత్యేకంగా శ్రద్ధగా ధ్యానించాలి. యీ దేహమంతా కూడా పైనుంచీ కిందవరకూ చెప్పలేనన్ని చిరుగులు, కన్నాలు వున్న, చర్మంతో చేసిన సంచీ అనీ, యీ సంచీనిండా పైన చెప్పిన అశాశ్వతమైన, పాడైపోయే, నాశనమైపోయే మాంసభాగాలు నిండివున్నాయనీ అతడు గ్రహించాలి. అంతేకాదు, యీ విధంగానే అందరి దేహాలూ, జీవుల దేహాలూ విస్మృతమై వుంటాయనీ, యే దేహానికీ శాశ్వతత్వం లేదనీ, అన్ని దేహాలూ నశించి పోయేవేననీ, యిందులో మిగిలేదే మీలేదనీ అతడు గ్రహించాలి.

యీ విధంగా కేంద్రీకరించిన శారీరక పదార్థ ధ్యానం వలన అతడిలో, తన యొక్క, యితరుల యొక్క శారీరక పదార్థాల అశాశ్వత గురించిన వాస్తవజ్ఞానం మనసునిండా కలుగుతుంది. యీ దేహం అశాశ్వతం అని అతడికి లోతుగా అర్థమవుతున్న కొద్దీ అతడిలో స్వార్థం నశించి పోతూవుంటుంది. వివేకచింతన, గ్రహింపుశక్తీ బాగా అభివృద్ధి అయి ప్రాపంచిక బంధాలకు లొంగనివ్వకుండా, ఆ బంధాలలో యిరుక్కుపోకుండా తనను తాను కాపాడుకునే శక్తి పెరగడంతో పాటు, యితరులకి సాయపడే ఔదార్యం పెరుగుతుంది. అహంకారం తరుగుతుంది.

అతడు స్వేచ్ఛగా, విస్తారంగా ఆలోచించగలుగుతాడు. అతడి జీవన విధానంలో గంభీరమైన నైతిక అభివృద్ధి కనిపిస్తుంది.

## 5. శరీరోత్పన్న ధ్యానం :

సాధకుడు, యీ శరీరం వుద్భవించడానికి గల కారణాలను ప్రత్యేకంగా ధ్యానించాలి. విశ్వవ్యాప్తమైన పదార్థాల నుండి యీ శరీరం వుద్భవించినదన్న విషయాన్ని అతడు గ్రహించాలి. యీ శరీరంలో దృఢమైన పదార్థం వుంది. యీ శరీరంలో ద్రవ పదార్థం వుంది. యీ శరీరంలో వేడిమి వుంది. యీ శరీరంలోనే చైతన్యం వుంది. "యివన్నీ విశ్వంలో వుండే పదార్థాలే. ఆ పదార్థాల సంయోగం వల్ల యీ శరీరం అనే చలన పదార్థం యేర్పడింది.

మాంసం కొట్టువాడు జంతువును చంపి, చర్మం వూడదీసి, లోపల ఆ జంతువులోని పదార్థాలు కొన్ని బయటకు తీసి, దుకాణం ముందర వ్రేలాడగట్టి, అతడు అదంతా జంతువు కాదు, మాంసంయిది ఫలానా అది ఫలానా మాంసం మాత్రమే అని అనుకుంటాడు. అంతేగానీ అది జంతువు అని అనుకోడు. అట్లానే సాధకుడు యీ దేహం అంతా మాంసపదార్థమయం, యిందులో 'తాను' అన్న ప్రత్యేకత యేమీ లేదు అని అతడు గ్రహించడమే కాకుండా ఆ విషయాల్ని, ఆయా కారణాల్ని అతడు లోతుగా ధ్యానించాలి. అంతేగాకుండా, జీవులన్నీ యిటువంటి పదార్థాలతోనే నిర్మితమయ్యాయనీ, మనిషి చనిపోతే, యే పదార్థానికాపదార్థం వేరైపోతుందన్న వాస్తవాల్ని అతడు ధ్యానించాలి.

ఈ విధంగా కేంద్రీకరించిన శరీరోద్భవధ్యానం వలన అతడిలో వివేకచింతన, గ్రహింపుశక్తి అభివృద్ధి అయి, విశ్వపదార్థంలో తామూ ఒకభాగం మాత్రమే అన్న జ్ఞానంలోతుగా కలిగి, ప్రాపంచిక బంధాలకు బానిసకాకుండా, ఆ బంధాలలో ఇరుక్కుపోకుండా తనను తాను కాపాడుకుంటూ, ఇతరులు కూడా అలా స్వేచ్ఛగా, జ్ఞానయుతంగా జీవించాలని అభిలషిస్తాడు. అతడిలో నైతికస్థైర్యం బలీయమవుతుంది.

6. మృత్యుధ్యానం :

సాధకుడు, ఏ శవాన్నయినా, ఏ విగతజీవినైనా చూడటం సంభవిస్తే ఆ శవం వున్న పరిస్థితిలోనే తామూ వున్నట్లు తనను తాను ధ్యానించుకోవాలి.

ఏ శవమైనా అతడికి రంగులు మారిపోయి, కాంతి విహీనమై, దుర్వాసన వేస్తూ, నీరు కారిపోతూ, శిథిలమైపోతూవుంటే, తన దేహం కూడా అట్లాగే రంగులు మారిపోయి, దుర్వాసన వేస్తూ, శిథిలమైపోతుందని అతడు ధ్యానించాలి. తనకి చావు తప్పదని అతడు గ్రహించాలి. ఏ శవమైనా, కాకులు, గ్రద్దలు, రాబందులు,కుక్కలు, నక్కలు, పురుగులు తింటూ వుండగా,కనిపిస్తే తన దేహాన్ని కూడా అట్లాగే కాకులు, గ్రద్దలు, రాబందులు, కుక్కలు, నక్కలు, పురుగులు పీక్కుతింటూన్నట్లుగా అతడు వూహించాలి. దానిలాగే తనకూ చావు తప్పదు అని ధ్యానించాలి.

అట్లాగే ఏ శవమైనా సగం కాలిపోయివున్నా సగం మట్టి అయిపోయి, ఎముకల గూడు మిగిలినట్లువున్నా, వాటికి కొంతమాంసం అతుక్కునివున్నా లేక బాగా ఎండిపోయి వుత్త అస్థిపంజరమే మిగిలిపోయినా, అస్థిపంజరం విరిగిపోయి చెల్లా చెదురై అక్కడో ఎముకా ఇక్కడో ఎముకా కనిపించినా, ఎముకలు కూడా అరిగిపోయి బూడిదలా మిగిలినా.. అట్లాయే విధంగా వున్నా తన శరీరం కూడా అలాగే అవుతుందనీ, అలా అవకుండా ఏటువంటి ప్రత్యేకతా ఈ శరీరానికి లేదనీ అతడు గ్రహించి ధ్యానించాలి.

ఇలా తన శరీరం మాత్రమే కాదనీ అన్ని శరీరాలూ ఇట్లానే విచ్ఛిన్నమై చివరికి అంతమైపోతాయనీ అతడు గ్రహించి అవిరతంగా ధ్యానించాలి.

'ఈ విధంగా కేంద్రీకరించిన మృత్యుధ్యానం వలన అతడిలో నాది, నేను అన్న అహంకారం నశించిపోతుంది. వివేకచింతన, గ్రహింపుశక్తి పెరుగుతాయి. దానితో దుఃఖభూయిష్టమైన ప్రాపంచిక బంధాలలో ఇరుక్కుపోకుండా, ఆ బంధాలకు బానిసైపోకుండా స్వేచ్ఛగా, సంతోషంగా, శాంతంగా, పరులకుపకారిగా, వుదారస్వభావిగా, జ్ఞానిగా వుండగలుగుతాడు. మార్పు చెందుతాడు.

ఈ ఆరువిధాలైన కాయచింతన, నిర్వాణం అనే అమరసామ్రాజ్యానికీ, తద్వారా సంపూర్ణశ్రేయస్సుకీ పాటుపడగల వ్యక్తి చేసే చర్యలకు ప్రాతిపదిక కాగలదు. తనలో నాది, నేను అన్నవి లేవనుకున్నవాడే అతడు విశ్వమానవుడవుతాడు–నిస్స్వార్థంగా సంఘసేవైనా చేయగలుగుతాడు–కనీసం ఏ జీవికీ ఎవరికీ హాని తలపెట్టకుండా ఆదర్శంగా జీవించగలుగుతాడు.

## 2. వేదనా చింతన

ఈ భాగంలోకి వచ్చాక అతడు తనలో పొడచూపుతున్న స్పందనల గురించి లోతుగా పట్టించుకుంటూ, ఆ స్పందనల నుండి తానువేరవుతూ వాటిని ధ్యానించాలి. ఆ స్పందనను ప్రత్యేకంగా 'ఆ స్పందన'గా చూడగలగాలి. ఒక సంతోషకరమైన స్పందన అతడిలో కలిగితే, 'ఇది

ఆ సంతోషకరమైన స్పందన' అని ధ్యానించాలి. వికారకరమైన స్పందన అయితే 'యిది వికారకరమైన స్పందన' అని అతను గ్రహించి ప్రత్యేకంగా మనసులో ధ్యానించాలి. ఒకవేళ ఒకస్పందన అటు సంతోషకరమైనదీ, యిటు వికారకరమైందీ కానప్పుడు- ఆ స్పందన 'అటు సంతోషకరమైందీ, యిటు వికారకరమైందీ కాదు' అని ధ్యానించాలి.

ఒక స్పందన శరీరానికి సంతోషాన్ని యిచ్చే స్పందన అయితే, 'యిది శరీరానికి సంతోషం కలిగిస్తున్న స్పందన' అని అతడు ధ్యానించాలి. ఒకవేళ అది 'శరీరానికి బాధ కల్గిస్తున్న స్పందన అయితే', 'యిది శరీరానికి బాధ కల్గిస్తున్న స్పందన' అని ధ్యానించాలి. అది శరీరానికి సంతోషమూ, బాధా రెండూ కలిగించని స్పందన అయితే ఆ విధంగా 'యీ స్పందన శరీరానికి సంతోషమూ, బాధా యేదీ కల్గించడం లేదని అతడు ధ్యానించాలి.

ఒక స్పందన అతడి మనసుకు సంతోషాన్ని యిచ్చే స్పందన అయితే, యిది 'మనస్సుకి సంతోషం కల్గిస్తున్న స్పందన' అని అతడు ధ్యానించాలి. మనస్సుకు దుఃఖం కల్గించే స్పందన అయితే 'యిది మనస్సుకి దుఃఖం కల్గించే స్పందన' అని అతడు ధ్యానించాలి. ఆ స్పందన మనస్సుకు సంతోషంగానీ, దుఃఖంగానీ యేదీ కల్గించని స్పందన అయితే, 'యిది మనస్సుకు సంతోషం గానీ, దుఃఖంగానీ కలిగించని స్పందన' అని అతడు ధ్యానించాలి.

అంతేకాదు, యిటువంటి స్పందనా వైవిధ్యాలు ప్రతి మనిషిలోనూ నిరంతరం కలుగుతూనే వుంటాయన్న వాస్తవాన్ని అతడు గ్రహించి ఆ విధంగా ధ్యానించాలి. స్పందనలు కలగడంలో తనకు ప్రత్యేక ప్రత్యేకతలేవీ లేవని అతడు ధ్యానించాలి.

యీ విధమైన శరీరంలో కలిగే 'వేదన' అనే మనస్స్పందనా జ్ఞానం యొక్క కేంద్రీకరించిన ధ్యాన చింతన వలన మనుష్యునిలో వివేకచింతన, గ్రహింపుశక్తి అభివృద్ధి అవుతాయి. తన యొక్క, యితరుల యొక్క మనస్స్పందనారీతులు అర్థమవుతున్నకొద్దీ, మంచి భావాలు మంచి స్పందనలూ, చెడ్డ భావాలు, చెడ్డ స్పందనలూ కల్గిస్తాయన్న వాస్తవాన్ని అతడు పూర్తిగా గుర్తించి, అతడావిధంగా తనకీ, యితరులకీ శాంతి సంతోషాలు కల్గించే స్పందనలనే అభివృద్ధి చేసుకుంటాడు. యీ విధంగా అతడి దృష్టి విశాలమవుతుంది. యీ వాస్తవాల్ని కూడా అతడు ధ్యానించాలి. వాస్తవాన్ని గుండెల్లో నింపుకుంటున్న కొద్దీ, వాస్తవం యొక్క విశాలత, విశ్వజనీనత, అవి అతడిలో కల్గించే సంతోషతరంగాలు ద్విగుణీకృతమవుతాయి.

యీ విధంగా బుద్ధుడు ప్రవచించిన ధ్యానయోగంలో వేదనాచింతన మనుష్యుని ధర్మాభివృద్ధిలో రెండవమెట్టుగావుండి, అతడిని 'చిత్త' అనే ధ్యానం వైపుకు దృష్టి సారించేటట్టు చేస్తుంది.

## 3. చిత్త చింతన

యీ భాగంలో మనస్సుపడుతున్న యెగుడుదిగుడుస్థితుల గురించి ధ్యానిస్తాము. వేదనలు, స్పందనలు యెన్నయినా కలుగుతూ వుండవచ్చు. వాటన్నిటికీ కీలకమైన మనస్సు వుంటున్న స్థితిని తెలుసుకోవడం చాలాఅవసరం. అసలు 'మనస్సు' అన్నది యే స్థితిలో వుంటున్నది అన్న విషయం గ్రహించగల్గినప్పుడే, అది యెలా వుండాలో అన్న సంగతి తెలుస్తుంది. ప్రస్తుతంలో, వర్తమానంలో మనస్సువున్న స్థితిని గురించి సరి అయిన అంచనా, వాస్తవస్థితి తెలుసుకోకుండా,

ఆ మనస్సు ఎలా వుండాలో ఆదేశిస్తే మనస్సు ఆ స్థితిని ఆదరించలేక అందుకోలేక ఆదరించినా ఆచరించలేక కప్పదాట్లు వేస్తుంది. ప్రతి స్థితికీ దాని వెనుక మరొక స్థితి వుంటుంది. దాని తరువాత కూడా మరొక స్థితి వుంటుంది. మనం దానిని ఎత్తుపల్లాల మధ్య కొట్టుకొనిపోకుండా, నిర్వాణమనే, సద్మార్గసాధన అనే వున్నతస్థితికి తీసుకువెళ్ళడానికి ప్రయత్నించాలి. అందుకు ధ్యానం అన్నది సాధన అయితే 'చిత్తచింతన' అన్నది దానిలోని వున్నతమైన మూడవమెట్టు.

యీ ధ్యానంలో మనిషి మనస్సు కోరికల దాహంలో మునిగి వుంటే కోరికల దాహంతో మునిగివున్నదనీ, యే కోరికయూ లేకుండా స్వేచ్ఛగా వుంటే స్వేచ్ఛగా వున్నదనీ, సోమరితనంగా వుంటే సోమరితనంగా వుందనీ, వుత్సాహంగా వుంటే వుత్సాహంగా వుందనీ, గందరగోళంలో వుంటే గందరగోళంగా వుందనీ, ప్రశాంతంగా వుంటే ప్రశాంతంగా వుందనీ, వత్తిడిగా వుంటే వత్తిడిగా వుందనీ, శాంతిగా వుంటే శాంతిగా వుందనీ, వాస్తవ స్థితిలో వుంటే వాస్తవ స్థితిలో వుందనీ, అవాస్తవ స్థితిలో వుంటే అవాస్తవ స్థితిలో వుందనీ, ధ్యానలగ్నమై వుంటే ధ్యానలగ్నమై వుందనీ, పరిపరి విధాలపోతుంటే పరిపరివిధాలపోతూ వుందనీ, ఐహికప్రపంచం పై లగ్నమై వుంటే ఐహికప్రపంచంపై లగ్నమైవుందనీ, ఆముష్మిక ప్రపంచం పై లగ్నమై వుంటే ఆముష్మిక ప్రపంచంపై లగ్నమై వుందనీ, ఎప్పటికప్పుడు అప్పటి మనోస్థితిలయల గురించిన స్పష్టమైన స్థితిని గుర్తించి ఆవిధంగా ధ్యానం చేయాలి. యింకా అతను మనోస్థితి అంటే తన వొక్కడికే వుండేదికాదనీ, అందరికీ యిటువంటి స్థితులు వుంటాయనీ, యితరుల మనోస్థితి గురించి కూడా తాను అవగాహన చేసుకోవలసివుందనీ అతను ధ్యానించాలి.

యీ విధంగా మనస్సుని చిత్తచింతనపై కేంద్రీకరించి ధ్యానించడం వలన అతడిలో, అతని యొక్క, యితరుల యొక్క మనోస్థితులు అర్థమై, వాటికి సరి అయిన దారిని, వుండవలసిన తీరుని వివరించే, క్రమశిక్షణాగరమే వివేకచింతన, గ్రహింపుశక్తి అభివృద్ధి అవుతాయి. యిది రూఢీ అయిన సత్యం. అందువల్ల సాధకుడు యీ సత్యాన్ని కూడా మనసు నిండుగా లోతుగా ధ్యానించాలి. తానిందులో విజయుడ్నవుతానన్న నమ్మకాన్ని దృఢపరచుకోవాలి. గతంలోనూ, వర్తమానంలోనూ ఎప్పటికప్పుడు మనస్సు వుంటున్న స్థితి తెలుసుకున్నప్పుడే, అది యిక ముందెలా వుండాలన్న తీరుని గ్రహించేందుకు అనుకూలంగా వుంటుందన్న సత్యాన్ని ఆచరణలో పెట్టేందుకే యీ చిత్త చింతన. ప్రతిమనిషికీ యిది ఆహారంలాగే అత్యంత అవసరం. అప్పుడే మనోబలం, స్థైర్యం, అభివృద్ధి అవుతాయి. ఆ మనిషి తనకాళ్ళమీద తాను నిలబడగలుగుతాడు.

## 4. ధర్మ చింతన

యీ ధర్మ చింతనా ధ్యానంలో అయిదు ధ్యానాలు కలిసి వున్నాయి. అవి వరుసగా 1. అయిదు నీవారణాచింతనలు 2. అయిదు విచారణాచింతనలు 3. ఆరు యింద్రియజ్ఞాన చింతనలు 4. యేడు జ్ఞాన సముపార్జనా చింతనలు 5. నాలుగు ఆర్య సత్యా చింతనలు.

యీ అయిదు ధ్యానాలూ తెలుసుకుంటే మొత్తం ధ్యానపద్ధతులన్నీ అవగాహన అవుతాయి. మనిషి చిత్త శాంతికి, నిర్వాణానికి దారి తీస్తాయి. యీ ధ్యానాలను పదేపదే కేంద్రీకరణ జరిగేవరకూ కేంద్రీకరించవలసి వుంటుంది. యీ అయిదు ధర్మచింతనా ధ్యానాలు వివరంగా

1. అయిదు నివారణా చింతనలు : మనిషి ధర్మచింతనకు అయిదు ఆటంకాలు ఎదురుతూ

వుంటాయి. అవి యింద్రియలోలత్వం, కోపం, పామరితనం, ఆందోళన, అనుమానం యీ అయిదూ మనిషి ధర్మాచరింతనకు ఆటంకాలుగా మాత్రమే గాక మనిషిని పీడిస్తూ కూడా వుంటాయి. అందువల్ల వీటిని తొలగించుకోవడానికే యీ విచారణాధ్యానాలు.

యే విధంగా వాటిని నివారించాలి? వాస్తవాన్ని వాస్తవంగా గుర్తించడం ద్వారా తరువాత యెటువంటి మార్పురావలసి వుందో తెలుసుకోగలుగుతాము దానిని ఆచరించేందుకు మనసే మనిషిని సన్నద్ధుణ్ణి చేస్తుంది. అందువల్ల మొదట వర్తమానం యిలా వుంది అన్నదాన్ని మనసునిండా గుర్తించాలి. ధ్యానించాలి.

శరీరం యింద్రియసుఖాల్ని కోరుకుంటూ వున్నట్టయితే నాకు యింద్రియసుఖాలపైన కోరికలు కలుగుతూవున్నాయి, అని, ఆ కోరికలు లేకపోతే నాకు ఆ కోరికలు లేవు అని అతడు ధ్యానించాలి. అంతేకాదు యీ యింద్రియసుఖాల్ని యెలా జయించగలమో, జయించిన తరవాత అవి యెలా తిరిగి రాకుండా నాశనమైపోతాయో కూడా అతడు ధ్యానించాలి.

కోపంగా వున్నట్లయితే అతడు తాను కోపంగావున్నానన్న విషయాన్ని గుర్తించి దానిని ధ్యానించాలి. కోపంగా లేకపోతే తాను కోపంగా లేనన్న విషయాన్ని ధ్యానించాలి. అంతేగాకుండా కోపాన్ని యెలా జయించగలమో, జయించిన తరువాత అది తిరిగి తన దరికి చేరకుండా యెలా వుంటుందో కూడా అతడు ధ్యానించాలి.

పామరితనం, బద్ధకం ఆవరించి వుంటే తనను పామరితనం, బద్ధకం ఆవరించి వున్నాయని అతడు గుర్తించి ధ్యానించాలి. అవి లేకపోతే అవి లేవని ధ్యానించాలి. అంతేగాకుండా వాటిని యెలా జయించగలమో, వాటిని జయించిన తరువాత అవి తిరిగి తన దరిచేరకుండా యెలా వుంటాయో కూడా అతడు ధ్యానించాలి.

ఆందోళనగా వున్నట్లయితే ఆందోళనగా వున్నట్లు గుర్తించాలి. అదే విధంగా ధ్యానించాలి. ఆందోళనగా లేకపోతే తాను ఆందోళనగా లేనని ధ్యానించాలి. అంతేకాకుండా ఆందోళన యే విధంగా నశిస్తుందో, నశించిన తరువాత ఆందోళన తిరిగి రాకుండా యెలా వుంటుందో కూడా ధ్యానించాలి. అనుమానాలు పీడిస్తూ వుంటే తనను అనుమానాలు పీడిస్తున్నట్లుగా అతడు గుర్తించాలి. అనుమానాలు యేమీ లేకపోతే తనకెటువంటి అనుమానాలూ లేవని గుర్తించాలి. అదేవిధంగా ధ్యానించాలి. అంతేగాకుండా అనుమానాలు యెలా నివృత్తి అవుతాయో, నివృత్తి అయిన తరువాత ఆ అనుమానాలు మళ్ళీ పుట్టకుండా యెలా వుంటాయోనన్న విషయాన్ని కూడా అతడు ధ్యానించాలి. ఆ విధంగా అతడు తనకు యెదురవుతున్న యీ అయిదు రకాల అడ్డంకులనూ తెలుసుకోవడమే కాకుండా అతడు ప్రతిమనిషినీ యీ ఆటంకాలు పట్టి పీడిస్తూవుంటాయన్న విషయాన్ని గుర్తెరిగి, ఆవిషయాన్ని కూడా ధ్యానించాలి.

యీ అయిదు విచారణాచింతనలధ్యానంవలన మనిషి తనకు యెదురవుతున్న యీ అయిదు ఆటంకాల గురించీ, అవి యెలా వస్తున్నాయో, యెలాపోతున్నాయో, అవి యెలా వస్తాయో, అవి యెలా నశిస్తాయో స్పష్టంగా తెలుసుకుంటాడు. యీ ఆటంకాలనేవి అశాశ్వతాలు అన్నసంగతి రూఢిపడుతున్న కొద్దీ అతడు శాశ్వతమైన సత్యం కొరకు తపన చెందుతాడు. యీ ఆటంకాలు అందరికీ కలుగుతూ వారిని పతనం చేస్తున్నాయన్న సంగతి తెలుస్తున్న కొద్దీ వాటిని వదలగొట్టుకోవడం తనకీ ప్రపంచానికీ యెంతో మేలని గ్రహిస్తాడు.

2. అయిదు విచారణా చింతనలు :

అయిదు విచారణా చింతనల తరువాత యీ అయిదు విచారణా చింతనల ధ్యానాన్ని అతడు అనుసరించాలి. అవి 1. రూపం 2. వేదన 3. సన్న (స్పందన) 4. సంఖార (సంస్కార) 5. విన్నాన (విజ్ఞాన). యీ అయిదు విచారణాచింతనా ధ్యానం ప్రకారం ధ్యాని,

"యిది రూపం, యిది యిలా వుద్భవించింది. యిది యిలా నశించిపోతుంది", అని ధ్యానించాలి.

"యివి వేదనలు. యివి యిలా వుద్భవిస్తున్నాయి. యివి యిలా నశిస్తాయి", అని ధ్యానించాలి.

"యివి స్పందనలు, యివి యిలా వుద్భవిస్తున్నాయి. యివి యిలా నశిస్తాయి", అని ధ్యానించాలి."

"యిది సంస్కార. యిది యిలా గోచరిస్తుంది. యిది యింకా స్పష్టంగా తెలుస్తుంది", అని ధ్యానించాలి.

"యిది వివేకజ్ఞానం. యిది యిందువలన కలుగుతూ వుంది. యిది మరింత జ్ఞానానికి దారితీస్తుంది", అని ధ్యానించాలి.

యీ విధంగా యీ అయిదువిచారణాచింతనా ధ్యానం వలన శాశ్వతత్వాన్ని గురించి తెలుసుకుంటాడు. యీ రూపం, వేదన స్పందనలు, సంస్కారాలు, వివేకజ్ఞానం యివన్నీ అశాశ్వతమైనవనీ, యివి మారుతూ మరొక వున్నతస్థితికి తీసుకువెళ్తాయనీ అతడు తెలుసుకుంటున్నకొద్దీ అతడు సత్యంవైపు మరింత గాఢంగా ఆకర్షితుడవుతాడు. యీ చింతనల యొక్క విశ్వవ్యాప్తతని అర్థం చేసుకుని ప్రపంచానికి సత్యం యొక్క అవసరం యెంత వుందో గ్రహించి, దానిని తెలుసుకునేందుకు మరింతగా వుద్యుక్తుడవుతాడు.

3. ఆరు యింద్రియ జ్ఞాన చింతనలు :

కళ్ళు-దృష్టి, చెవులు-శబ్దాలు, ముక్కు-వాసనలు, నోరు-రుచులు, చర్మం-స్పందనలు, మనస్సు-ఆలోచనలు యివే ఆరు యింద్రియ జ్ఞానాలు. యిటువంటి యింద్రియ జ్ఞాన చింతన ధ్యానం వల్ల మనిషి తనను స్వార్థానికీ అజ్ఞానానికీ కట్టిపడేస్తున్న యీ యింద్రియాలను గురించి సంపూర్తిగా తెలుసుకుంటాడు.

యిదిగో యివి కళ్ళు. దీని వలన దృష్టి కలుగుతుంది. యీ దృష్టి వలనే కోరికలనే సంకెళ్ళు కలుగుతున్నాయి. యిటువంటి సంకెళ్ళు యెటువంటి దృష్టి వలన కలుగుతున్నాయో, వాటినెలా జయించాలో, జయించాక, కోరికల సుడిలో పడవేసేటటువంటి దృష్టి మనకెలా కలుగదో అతడు గుర్తించి ధ్యానించాలి.

యివి చెవులు. యివి శబ్దాల్ని వింటాయి. యీ వినికిడి శక్తి వలన కూడా కోరికలనే సంకెళ్ళు పడుతున్నాయి. యిటువంటి సంకెళ్ళు యెటువంటి మాటలు, శబ్దాలు వినడం వలన కలుగుతున్నాయో, వీటినెలా జయించాలో, జయించాక తనని కోరికల్లో పడదోసేటటువంటి శబ్దాలు మనకెలా కోరికలు కల్గించవో తెలుసుకుని దానిని ధ్యానించాలి.

యిది ముక్కు. యిది వాసనలు పసిగడుతుంది. యీ ఆఘ్రాణ శక్తి వలన కూడా మనిషికి

కోరికలనే సంకెళ్ళు పడుతున్నాయి. యిటువంటి సంకెళ్ళు యెటువంటి వాసనల వలన పడుతున్నాయో, వీటినెలా జయించాలో, జయించాక యీ ఆఘ్రాణ శక్తి తనలో యెలా కోరికలు కలిగించదో తెలుసుకుని అతడు దానిని ధ్యానించాలి.

యిది నోరు. యిది రుచుల్ని గ్రహిస్తుంది. యీ జిహ్వా చాంచల్యం వలన మనిషి కోరికలనే సంకెళ్ళలో పడిపోతున్నాడు. యిటువంటి సంకెళ్ళు యెటువంటి పదార్థాల వలన పడుతున్నాయో, వీటినెలా జయించాలో, జయించాక యీ జిహ్వాశక్తి తనలో యెలా కోరికలు రగిలించదో తెలుసుకుని అతడు దానిని ధ్యానించాలి.

యిది చర్మం. యిది స్పందనల్ని గ్రహిస్తుంది. యీ స్పందనల వలన కూడా మనిషి కోరికలనే సంకెళ్ళలో యిరుక్కుంటున్నాడు. యిటువంటి సంకెళ్ళు యెటువంటి చర్మ స్పందనల వలన పడుతున్నాయో వీటినెలా జయించాలో జయించాక యిందెలా యివి పునరుత్పత్తికావో తెలుసుకొని, అతడు ఆ విధంగా దానిని ధ్యానించాలి.

యిది మనస్సు. దీనికి ఆలోచనలు కలుగుతాయి. యీ ఆలోచనల వలన కూడా మనిషి కోరికలనే బందిఖానాలో యిరుక్కుంటున్నాడు. యిటువంటి దుస్థితి యెటువంటి ఆలోచనల వలన కలుగుతూవుందో, యీ ఆలోచనలను యే విధంగా జయించాలో యీ ఆలోచనలను జయించాక తిరిగి మళ్ళీ యిటువంటి ఆలోచనలు యెలా కలుగవో తెలుసుకుని ఆ ప్రకారం అతడు ధ్యానించాలి.

యీ విధమైన ఆరు యింద్రియ జ్ఞాన చింతనా ధ్యానం వలన మనిషి తన యింద్రియాల వలన యే విధంగా కోరికల సుడిగుండంలో పడిపోతున్నాడో తెలుసుకుంటాడు. యికముందు అలా పడిపోకుండా తనను తాను కాపాడుకుంటాడు. తనతోపాటు మనుషులందర్నీ వారి వారి యింద్రియాలు సత్యాన్ని, ధర్మాన్ని తెలుసుకోకుండా అడ్డుపడుతున్నాయని, వారిని కోరికల సుడిగుండాలలో పడవేస్తున్నాయని తెలుసుకుని, యిటువంటి ధ్యానం యొక్క అవసరాన్ని దృఢంగా తెలుసుకుంటాడు. యీ ధ్యాన చింతన వలన అతడిలో దృఢత్వం, వివేక చింతన, గ్రహింపుశక్తి మరింతగా అభివృద్ధి అవుతాయి. సత్యాన్ని తెలుసుకునే మార్గం సుగమంఅవుతూ వుంటుంది.

## 4. యేడు జ్ఞాన సముపార్జనా చింతనలు :

1. జ్ఞానజాగృతి 2. జ్ఞాన శోధన 3. జ్ఞాన దృఢత్వం 4. జ్ఞానాభినివేశం 5. జ్ఞాన శాంతి 6. జ్ఞానేంద్రీకరణ 7. జ్ఞానసమత్వం యీ యేడూ జ్ఞాన సముపార్జనా చింతనలు. వీటిని ధ్యానించడమంటే గొప్ప జ్ఞాన స్థితికి సన్నిద్ధం కావడమే. ధ్యానంలో చివరిమెట్లివి. జ్ఞానం కోసం జాగరూకత వహించడం మొదలుకొని, జ్ఞాన సమత్వం సాధించేవరకూ వున్న యేడు చింతనా ధ్యానాలు అనుభవానికి చివరిమెట్లు అనే చెప్పుకోవచ్చు. మానవ మస్తిష్కం అపూర్వ అత్యున్నత శిఖరాలనందుకొన్న ధ్యానచింతన యిది.

యీ ధ్యాన చింతన ప్రకారం సాధకుడు :

జ్ఞానజాగృతి : తాను జ్ఞానానికై జాగరూకతతో వున్నానా లేదా అన్నది గుర్తిస్తాడు, జ్ఞానం పట్ల జాగరూకతతో వుంటే జాగరూకతతో వున్నానని ధ్యానిస్తాడు. జాగరూకతతో లేకపోతే లేకుండా వున్నానని ధ్యానిస్తాడు. జాగరూకత అన్నది యెలా లభ్యమవుతుందో, యే విధంగా దానిని అభివృద్ధి చేసుకోవచ్చునో తెలుసుకుని ఆ విధంగా ధ్యానిస్తాడు.

జ్ఞాన శోధన : తాను జ్ఞానానికై శోధన చేస్తున్నాడో లేదో అన్నది గుర్తిస్తాడు. తాను జ్ఞాన శోధన

చేస్తూవుంటే జ్ఞాన శోధన చేస్తున్నానని ధ్యానిస్తాడు. జ్ఞానశోధన చేయక పోతూవుంటే జ్ఞాన శోధన చేయడం లేదని ధ్యానిస్తాడు. జ్ఞానశోధన అన్నది యెలా చేయాలో, యే విధంగా అది అభివృద్ధి అవుతుందో అతడు ఆలోచనలు చేసుకుని ఆ దిశగా, ఆ విధంగా ధ్యానిస్తాడు.

జ్ఞాన దృఢత్వం : తాను జ్ఞాన దృఢత్వంతో వున్నాడో లేదో అన్నది గుర్తిస్తాడు. తాను పొందిన జ్ఞానం పట్ల దృఢంగా వుంటే దృఢంగా వున్నానని ధ్యానిస్తాడు. దృఢంగా లేకపోతే దృఢంగా లేనని ధ్యానిస్తాడు. జ్ఞాన దృఢత్వాన్ని ఎలా పొందాలో అది ఏవిధంగా లభ్యమవుతుందో ఆ విధంగా ఆలోచనలు చేసుకుని ఆవిధంగా ధ్యానిస్తాడు.

జ్ఞానాభినివేశం : తాను జ్ఞానం పట్ల అభినివేశంతో వున్నాడో లేదో అన్నది గుర్తిస్తాడు. తాను జ్ఞానాభినివేశంలో వుంటే జ్ఞానాభినివేశంతో వున్నట్లు ధ్యానిస్తాడు. జ్ఞానాభినివేశంలో లేకపోతే తాను జ్ఞానాభినివేశంతో లేనట్లు ధ్యానిస్తాడు. జ్ఞానంపై అభినివేశం యెంత అవసరమో, దానిని యెలా అభివృద్ధి చేసుకోవాలో, దానిని యేవిధంగా అభివృద్ధి చేసుకోగలమో అతడు ఆలోచనలు చేసి గ్రహించి ఆ విధంగా అతడు ధ్యానిస్తాడు.

జ్ఞానశాంతి : తాను జ్ఞానం వలన లభించే శాంతిలో వున్నాడా లేదా అన్నది గుర్తిస్తాడు. తాను ఆ విధమైన జ్ఞాన శాంతిలో వుంటే ఆవిధంగా వున్నట్టు ధ్యానిస్తాడు. తాను జ్ఞానశాంతిలో లేకపోతే తాను జ్ఞానశాంతిలో లేనట్టు ధ్యానిస్తాడు. జ్ఞానం వలన యెలా శాంతి లభిస్తుందో, ఆ శాంతిని యెలా అభివృద్ధి పరచుకోగలమో అన్నది తెలుసుకుని, ఆ జ్ఞానశాంతి కొరకు తగువిధంగా ధ్యానిస్తాడు.

జ్ఞాన కేంద్రీకరణ : తాను జ్ఞానకేంద్రీకరణ చేస్తున్నాడో లేదో అన్నది గుర్తిస్తాడు. తాను జ్ఞానంపై కేంద్రీకరణ చేస్తూ వుంటే తాను జ్ఞానకేంద్రీకరణ చేస్తున్నట్టుగా ధ్యానిస్తాడు. తాను జ్ఞానంపై కేంద్రీకరణ చేయలేకపోతూ వుంటే జ్ఞాన కేంద్రీకరణ చేయలేకపోతున్నట్టుగా ధ్యానిస్తాడు. జ్ఞానకేంద్రీకరణ యెలా సాధ్యపడుతుందో, అది యెంత అవసరమో గుర్తించి ఆ విధంగా జ్ఞానకేంద్రీకరణను ధ్యానిస్తాడు.

జ్ఞాన సమత్వం : తన జ్ఞానం సమత్వాన్ని సాధిస్తున్నదో లేదో అన్నదిగుర్తిస్తాడు. తాను జ్ఞానసమత్వంతో వుంటే తాను జ్ఞానసమత్వంలో వున్నట్టుగా ధ్యానిస్తాడు. తాను జ్ఞానసమత్వం సాధించలేకపోతూ వుంటే తనలో సాక్షిత్వం కనిపిస్తూ వుంటే ఆ విధంగా ధ్యానిస్తాడు. జ్ఞాన సమత్వాన్ని యెలా సాధించవచ్చో, అందుకోసం యెంత కృషి చేయాలో అతడు ఆలోచనలు చేసుకుని గుర్తించి ఆ విధంగా జ్ఞాన సమత్వాన్ని ధ్యానిస్తాడు.

యీ విధంగా ధ్యాని తనలోని మానసిక బలాన్ని మరింత పెంచుకుంటాడు. యితరులందరిలో కూడా ధ్యానం అభివృద్ధి చేసుకోగల మనోశక్తి వుంటుందని గుర్తిస్తాడు. వారి గురించి కూడా ఆలోచిస్తాడు. ధ్యానిస్తాడు. ఆ విధంగా అతడికి ధ్యానంలో విశ్వవ్యాప్తత అలవడుతుంది.

యీ విధమైన జ్ఞాన సముపార్జనా చింతనల కేంద్రీకరణ వలన మనోభావాలు యేవిధంగా వున్నతదశకు చేరుకుంటాయో, అవి యే విధంగా ప్రవాహంలా వెళ్ళిపోతూ వుంటాయో, అంతేకాకుండా యిదంతా కూడా యే విధంగా శాశ్వతత్వంలో భాగమో అతడు తెలుసుకుంటాడు. తనలో 'నాది, నేను, నావి' అన్న భావాలు నశించి, తాను విశ్వవ్యాప్తమైనప్పుడే, జ్ఞానానికి ప్రతిరూపంగా భాసిల్లగలడని. అప్పుడే వివేకచింతన అభివృద్ధి చెంది, గ్రహింపుశక్తి పెరిగి, స్వచ్ఛగా యీ ప్రాపంచిక సంకెళ్ళ నుండి విముక్తుడవుతాడు. విశ్వజనీనమైన సత్యమే తానవుతాడు. జ్ఞానాన్ని బోధించగల వున్నత స్థితిని పొందుతాడు.

5. నాలుగు ఆర్య సత్యాలు :-

ఇంక అతడు ధ్యానంలో చివరిమెట్టు మీద వున్నాడు. లోకకల్యాణానికి ఆరంభం పలుకుతాడు. అందుకతడు ఈ నాలుగు ఆర్యసత్యాలను ధ్యానిస్తాడు.

అతడు ఏ దుఃఖాన్ని అయినా మొదట, 'ఇది దుఃఖం' అని గుర్తిస్తాడు. ధ్యానిస్తాడు.

'ఈ దుఃఖానికి కారణముంది'- అదీ విధంగా సంభవిస్తుంది అని గ్రహిస్తాడు. ధ్యానిస్తాడు.

'ప్రతి దుఃఖానికి నిరోధం వుంది-దుఃఖం అశాశ్వతం', అన్నది కూడా గుర్తిస్తాడు. అశాశ్వతమైన ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు, దుఃఖం కూడా అశాశ్వతమే- అని గుర్తిస్తాడు. ధ్యానిస్తాడు.

దుఃఖ నిరోధానికి గౌతమ బుద్ధుడు బోధించిన ఆర్య అష్టాంగమార్గం వున్నదని అతడు గుర్తిస్తాడు. ధ్యానిస్తాడు. ఆ అష్టాంగమార్గాలను ధ్యానిస్తాడు. ఆచరిస్తాడు. దుఃఖనిర్మూలన చేసుకుంటాడు. అష్టాంగమార్గాలను పాటించడానికి ధ్యానాన్ని ఆలంబనగా చేసుకుంటాడు. ధ్యానం వలన అతడి మనసు పరిశుద్ధమై, ఆచరణ వల్ల అది హేతుబద్ధమై, అంతిమంగా అతడు వికారాలన్నీ, బంధనాలన్నీ తొలగించుకుని సత్యంలో లీనమవుతాడు. తానే సత్యంగా భాసిస్తాడు.

బుద్ధ భగవానుడు స్వయంగా అనుభవపూర్వకంగా కనుగొని బోధించిన జ్ఞానధ్యానయోగం ఇది. ఈ ధ్యానం వలన ఆందోళన, భయం, కామం, ఆతురత, చెడు ఆలోచనలు, చెడునడత, అహం, స్వార్థం, కాలం వృథాపుచ్చడం,మందకొడితనం, స్వార్థ హేతువాదం, ఇతరులని నిందించడం మొదలైన ఎన్నో దుర్లక్షణాలు నాశనమై పోతాయి. వేలాది సంవత్సరాలుగా ఆచరిస్తున్న మనోధర్మమిది.

ఈ నాలుగు కాయ, వేదన, చిత్త, ధర్మ చింతనలన్నీ అభ్యసించిన తరువాత ఆ ధ్యానికి ఇంకా మిగిలి వున్నవి మనస్సుకి వున్న నాలుగు ఘనమైన స్థితులు. పై నాలుగు ధ్యానాలలో ఉత్తీర్ణుడైనప్పుడు మాత్రమే ఈ ఘనమైన స్థితులలో అపూర్వత్వాన్ని అతడు పూరా అనుభవించగలుగుతాడు. ఆ నాలుగు ఘనమైన స్థితులు ఏమంటే ఈ అధ్యాయంలో మొదటనే వివరించిన మైత్రి, కరుణ, ముదిత (సహానుభూతి), ఉపేక్ష (సమభావం). వీటినే బ్రహ్మవిహారాలు అంటారు.

## చతుర్ బ్రహ్మ విహారాలు

### మైత్రి

మైత్రి అంటే ఈ ప్రపంచంలోని జీవరాసులన్నింటిపట్లా కరుణ, స్నేహభావం, సమభావం కలిగి వుండటం. తనలాగే ప్రతిజీవి కూడా పుట్టడం, పెరగడం, మరణించడం అనే జీవక్రియల్ని నిర్వహిస్తూ వుంటుందనీ, తనకులాగానే వాటికి కూడా ఎన్నో బాధలు ఒడిదుడుకులు వుంటాయనీ, మనిషి అన్నవాడు చేతనైతే వాటి సమున్నత స్థితికి తోడ్పడాలనీ, ఈ మైత్రి స్థితి తన చుట్టూ వుండే కొద్దిపాటి ప్రదేశానికే సంబంధించినదిగా అతడు భావించకూడదనీ, ఈ విశ్వంలో ఎక్కడ ఏ జీవి బాధపడుతున్నా అది తనదే అని భావించాలనీ, ఈ మైత్రీ భావనకు సరిహద్దులనేవి లేవనీ, ఆకాశమంత ఎత్తులోనూ సముద్రగర్భాలంత లోతులోనూ, ప్రపంచమంత విశాలంలోనూ, నలుదిక్కులా సర్వకాలాలలో కూడా జీవులపట్ల ఈ మైత్రీ భావనను మనిషి ధ్యానం ద్వారా నెలకొల్పుకోవాలనీ పునీతుడవాలని గౌతమబుద్ధుడు ఉపదేశించాడు.

### కరుణ

కరుణ అంటే జీవరాశుల పట్ల మాత్రమే కాకుండా తోటి మనుష్యుల పట్ల మైత్రి, సమభావం

కలిగివుండడం. తనలాగే యితరులు కూడా పుట్టడం, పెరగడం, జ్ఞానాన్ని పొందడం, మరణించడం అనే జీవనక్రియలలో భాగస్థులై వుంటున్నారనీ, వారికి కూడా యెన్నో బాధలు ఒడిదుడుకులు వుంటున్నాయనీ, మనిషి అన్నవాడు వారిని సమున్నత స్థితికి తీసుకువచ్చే విధంగా వారికి తోడ్పడాలనీ, దుఃఖాన్ని నిరోధించే యీ ధ్యాన పద్ధతుల్నీ, ఆర్య సత్యాలనీ, అష్టాంగమార్గాన్నీ వారికి బోధించాలనీ, కరుణ అంటే తన చుట్టూ వున్న కొద్దిపాటి సంఘానికి మాత్రమే సంబంధించినదిగా అతడు భావించకూడదనీ, యీ విశ్వంలో యెక్కడ యే దేశంలో మనుష్యులు బాధలుపడుతున్నా ఆ బాధలు తమవే అని బౌద్ధులందరూ భావించాలనీ, యీ కరుణా భావానికి సరిహద్దులు లేవనీ, ఆకాశమంత యెత్తులోనూ, సముద్ర గర్భమంతలోతులోనూ, ప్రపంచమంత విశాలంలోనూ, సర్వకాలాలలోనూ పలుదిక్కులా కూడా వున్న జీవులన్నింటిపట్ల, మనుష్యుల పట్ల యీ కరుణా భావనను అభివృద్ధి చేసుకోవాలనీ, దీనిని ధ్యానం ద్వారా సాధించి, పదిమందికి యీ సంతోషమార్గాన్ని చూపాలనీ పునీతులవ్వాలనీ అతడు మానవాళికి ప్రేమతో బోధించాడు.

## ముదిత

దీనినే 'సహానుభూతి' అనవచ్చు. యీ విశ్వంలోని సమస్త జీవరాసుల పట్లా, యీ ప్రపంచంలోని మనుష్యులందరిపట్లా, వారు యే బాధలు పడుతున్నారో, యెన్ని సమస్యలెదుర్కొంటున్నారో అన్ని విధాలుగానూ సహానుభూతి చెందడమే ముదిత. యిందువల్ల ప్రతి వ్యక్తి బాధలు అర్థమై అవలోకితమైబాధల యొక్క విభిన్నతను, లోతును మాత్రమేకాక, వాటి పుట్టుకకు గల కారణాలూ, అవి తొలగించడానికి చేయవలసిన పనులు కూడా అవగాహనకు వస్తాయి. అయితే యీ సహానుభూతి, యిది తనది కాకపోయినా, తనకు సంబంధించింది కాకపోయినా, తనకు యిష్టమైనది కాకపోయినా అప్పుడు కూడా యీ విధమైన సహానుభూతిని అనుభవించడమనేదే యీ స్థితిలో పరమోత్కృష్టమైనది. యీ సహానుభవధ్యానం వలన యితరుల, యితరజీవుల బాధలలో, మనుష్యులలో వారి సంవేదనలలో కూడా యెటువంటి భేదభావమూ చూపకుండా పాలుపంచుకునే అవకాశం కలగడమే కాకుండా, వారు ఆనందపడటానికీ, సాంత్వన పొందడానికీ, బౌద్ధమార్గం వైపుకు మళ్ళడానికి కూడా కారణమవుతుంది. జీవుల కష్టసుఖాలు అర్థమై, వాటి దుఃఖాన్ని నిర్మూలించడానికి మనిషిగా చేయవలసిన పనులను, బాధ్యతలనుతెలుసుకుని ఆ విధంగా కృషి చేసి వాటి జీవితాలలో ఆనందాలు నింపాలని ఆయన మానవాళికి ప్రేమతో బోధించాడు.

## వుపేక్ష

దీనినే సమత లేక సమభావం అనవచ్చు. సమభావం అంటే వర్ణించడానికి వీలుకానంతగా యితరులతో, యితరజీవులతో మమేకత. తనికి సంబంధం వున్నాలేకపోయినా సరే యితరులు, యితరజీవులు ఆనందంగా వుంటే తామూ ఆనందపడతాడు. అవి బాధపడుతుంటే తామూ బాధపడతాడు. చిన్నబోతాడు. యే జీవినీ ద్వేషించలేని నిస్పృహాయస్థితిలోకూడా తనవంతు సహానుభూతిని అందిస్తాడు. తన ప్రాణాన్నే అందుకు ధారపోస్తాడు. అతడి త్యాగానికి యెత్తు, లోతు, దిక్కులు, సరిహద్దులు, కాలం అన్నటువంటివేమీ వుండవు. యితరులు సమభావాలతో వుండకపోవచ్చు. తాను మాత్రం సమభావంతోనే సత్వరంగా వుండి, ఆ సమభావాన్నే వ్యాప్తి చేస్తాడు. ప్రకృతిలోగానీ, సంఘంలోగానీ అసమభావాలు, క్రౌర్యం మొదలైన చెడులక్షణాలు కనిపిస్తే, అవి నశించేవిధంగా తాను సమభావాలను అభివృద్ధి పరుస్తాడు. సమభావాలను వెల్లివిరుస్తూ ప్రపంచంలో బోధనం

ద్వారా, ఆచరణ ద్వారా వ్యాప్తి చేస్తూ వాటికి దారుఢ్యాన్ని కల్గిస్తాడు. సమభావాలు దారుఢ్యం చెందడం ద్వారా అసమభావాలు అణిగిపోయేటట్లు, లేక వాటంతట అవి నాశనమయిపోయేటట్లు లేక తమంతట తాము సమభావంలో రూపాంతరం చెంది కలిసిపోయేటట్లు, సమభావాల వెల్లువలో అవి అస్తిత్వాన్ని కోల్పోయేట్లు చేస్తాడు. యిందుకతడు కత్తిపట్టడు. వీరత్వం ప్రదర్శించడు. తానే సమభావమై, సమభావాన్ని బోధనల ద్వారా, ఆచరణద్వారా యితరులు కూడా జ్ఞానవంతులయేటట్లు, ఆచరించేటట్లు, కర్తవ్యపరాయణులయ్యేటట్లు చేస్తూ అసమభావాలకోరలు వాటంతట అవే వూడిపోయేటట్లు చేస్తాడు.

యిదే సమభావం. వుపేక్ష.

సమభావమే బౌద్ధంలో అత్యున్నత స్థితి.చెప్పాలంటే సమభావమే బౌద్ధం. యీ స్థితిని యితరులలో, యితర జీవులలో సాధించడానికి దేహత్యాగం కూడా అవసరమయేటట్లయితే అందుకేమాత్రం వెనుకాడకూడదంటాడు గౌతమబుద్ధుడు. వొక అత్యున్నత స్థితిని సాధించడానికి జీవికి అత్యంత ప్రియమైన జీవించడాన్ని కూడా త్యాగం చేయమంటాడు. నేను, నాది అనేది లేనప్పుడు.. యీ దేహంపు 'తనది' గా భావించడమేమిటి? జ్ఞానాన్ని పొంది ఆచరించడానికి దేహం వొక ఆలంబన. జ్ఞానాన్నీ సమభావాన్నీ యితరులలో కూడా ఆచరింపచేయడానికి యీ దేహం వుపయోగపడేటట్లయితే, అందుకు దాన్ని పూర్తిగా ప్రాణం పోయేంత వరకూ, ఆ తరువాతా కూడా వుపయోగించడం కన్నా మహోన్నత ధర్మం లేదంటుంది బౌద్ధ ధర్మం.

కనుకనే బౌద్ధ ధర్మం యీ నాటికీ సరిహద్దులు లేని మానవత్వానికి పరాకాష్ఠగా వర్ధిల్లుతూంది. మరణించాక యెందుకూ పనికిరాని కళ్ళు మొదలైన శరీర భాగాలను కూడా యెవరికీ త్యాగం చేయలేని స్వార్థం పట్టిపీడిస్తున్న మనుష్యులలో, మరణించాక కండ్ల దానం, విజ్ఞానాభివృద్ధికి తమ శరీరదానం యివ్వడంలో అగ్రగాములుగా వుంటున్న బౌద్ధులూ, వారి బౌద్ధ ధర్మం మనందరిలో కూడా భాగం కావాలి. లోకాన్ని మానవతా వెలుగులతో నింపాలి.

మనం అందరం బౌద్ధులమవాలి. స్వార్థత్యాగులమవాలి. బౌద్ధ ధ్యానం యొక్క అంతిమ విజయం అదే. అదే స్వార్థత్యాగం. స్వార్థత్యాగమే బౌద్ధం.

ఆ బౌద్ధం పుట్టిన పుణ్యభూమి మన భారతపుప ఖండం.

ఆ బౌద్ధం సర్వ ప్రపంచమంతా నిండాలి. విజయం సాధించాలి. అందుకే ధ్యానమే మొట్టమొదటి ఆలంబన. ధ్యానమే మనిషికి అత్యద్భుతమైన, అత్యున్నతమైన, ప్రాణప్రదమైన మిత్రుడు.

అందరిలోనూ యీ మహోన్నత బౌద్ధధ్యానం వర్ధిల్లాలి. తనలోనూ బయటా పరమోత్కృష్టమైన సమతామమతలు నింపాలి. ధ్యానం మనస్సుని పరిశుద్ధం చేస్తుంది. దేహాన్ని రక్షిస్తుంది. మంచి ప్రవర్తనకు మార్గం నిర్దేశిస్తుంది. మనిషి భవితనే మార్చివేస్తుంది - ఆయనిలా అన్నారు.

"భిక్షువులారా!" పులి, తన పసికూనల్ని కోరలు గుచ్చుకోకుండా, అలాగని వదిలి వెయ్యకుండా యెంత దయగా జాగ్రత్తగా భద్రతగల ప్రదేశానికి తీసుకువెళ్తుందో అలాగే మీరు కూడా ప్రజలను నిర్వాణం అనే పరమసుఖం లభ్యమయ్యేటట్లు విశ్వకళ్యాణం అనే పరమార్థసాధనకు వారు పాటుపడేటట్లు యీ ధర్మాన్ని ప్రజలకు బోధించండి. జీవితాలను చరితార్థం చేసుకోవండి.

-------

## మంచి పనులు చేయడంలో ఆలస్యం చేయకూడదు

మంచిపనులు చేయడానికి త్వరపడాలి. ముందుకు దూకాలి. మనస్సును చెడ్డపనులకు, చెడ్డ ఆలోచనలకు, దూరంగా వుంచాలి. మంచిపని చేయడానికి ఆలస్యం చేయకూడదు. తను ఆలస్యం చేస్తే మనస్సు ఆ సమయంలో చెడ్డపనుల్లోనూ, పనికి రాని ఆలోచనల్లోనూ మునిగిపోతుంది. అందుకే మంచి పనులు చేయడానికి త్వరపడాలి. మంచిపనులు చేయడానికి తన సమస్త మనోభౌతిక శక్తులనన్నీ కేంద్రీకరించాలి.

ఒకడు చెడ్డపని చేసినా అతడు అటువంటి పనుల్ని మరల మరల చేయకుండా వుండుగాక. పాపపు పనుల్లో అతడు ప్రీతిని పొందకుండా వుండుగాక. యెందుకంటే పాపపు పనులన్నీ దుఃఖానికే కారణాలవుతాయి.

ఒకడు మంచిపని చేస్తే అతడు అటువంటి మంచి పనుల్ని మళ్ళీ మళ్ళీ చేయుగాక. మంచిపనులు చేయడంలో అతడు ఆనందాన్ని పొందుగాక. యెందుకంటే మంచి పనులన్నీ ఆనందాన్నే కల్గిస్తాయి.

చెడ్డ పనుల్ని 'యిది కొద్ది మాత్రమే' అని తలచకూడదు. నీటిబొట్టు ఒక్కొక్కటీ పడుతూ పడుతూ కుండ నిండిపోయినట్లు, మూఢుడు కొంచెం కొంచెంగా పాపాలు చేస్తూ చివరికి తనను తాను పాపాలకూపంగా మార్చివేసుకుంటాడు.

మంచి పనిని, 'యిది కొద్ది మాత్రమే' అని తలచకూడదు. నీటిబొట్లు ఒక్కొక్కటీ పడుతూ కుండనిండినట్లు, మంచివాడు కొంచెం కొంచెంగా మంచిపనులు చేస్తూ క్రమంగా తనను తాను పుణ్యమయుడిగా తీర్చి దిద్దుకుంటాడు.

చేతిపైన గాయం లేకపోతే విషం అంటుకున్నా హాని కలుగదు. అలాగే పాపం చేయని వాళ్ళకి పాపం అంటుకోదు.

దుమ్మును గాలికి యెదురు విసిరేస్తే తిరిగి వేసిన వాడిపైకే వచ్చే విధంగా, నిర్దోషియైన వాడిమీద, నిర్మల హృదయుడిపైన వేసే నిందలూ, పాపపు పనులన్నీ తిరిగి పాపియే అనుభవించుతాడు.

ఆకాశంలో వున్నా, సముద్రాలలో దాగినా, కొండగుహల్లో వున్నా, మరెక్కడున్నా తాను చేసిన పాపపు పనుల నుండి, మృత్యువు నుండి మనిషి తప్పించుకోలేడు.

పాపపు పనులు చేసేవాడు యిహంలోనూ పరంలోనూ కూడా శోకిస్తాడు. తన పాపాలు చూసి తానే దుఃఖిస్తాడు. చెడ్డ పనులు చేసేకొద్దీ అతడి దుఃఖం పెరుగుతూనే వుంటుంది.

మంచిపనులు చేసేవాడు యిహపరసౌఖ్యాలు రెండూ అనుభవిస్తాడు. తాను చేసిన మంచి పనులను చూసి అతడు చాలా సంతోషిస్తాడు. మంచి పనులు చేసేకొద్దీ అతడి ఆనందం పెరుగుతూనే వుంటుంది.

## పరుషవాక్యాలు పలకడం చాలా ప్రమాదం

పరుష వాక్యాలను యెన్నటికీ పలుకకూడదు. అది చాలా ప్రమాదం. అవి మరల మరల

తిరిగి అట్లా మాట్లాడిన వాళ్ళకే తిరిగివస్తాయి. కోపంతో కూడిన మాటలు చాలా బాధ కల్గిస్తాయి. వీటికి దెబ్బకి దెబ్బ వుంటుంది.

అటువంటి పరిస్థితులలో పగిలిన గంటలాగా నిశ్శబ్దంగా వుండగలిగితే ప్రశాంతమైన నిర్వాణాన్ని అతడు చేరుకున్నట్లే. అప్పుడతడిలో కలహమే వుండదు.

యితరుల తప్పులెన్నడం మానుకొని, మనుష్యుడు తన తప్పులను మాత్రమే సరిదిద్దుకోవాలి. చెప్పేమాటల్ని చేతల్లో చూపించినప్పుడే సుగంధాన్ని వెదజల్లే సుందర పుష్పంలా రాణిస్తాడు.

## సజ్జనుడి లక్షణాలేమిటి?

"సింగాలా! సజ్జనుడు విడిచి పెట్టవలసిన అయిదు దుర్గుణాలు వున్నాయి. అవి: 1. జీవ వినాశము 2. దొంగిలించడము 3. స్త్రీలపట్ల దుష్ప్రవర్తన 4. అబద్ధాలాడడం 5. దుర్వ్యసనాలు. యీ అయిందింటినీ సజ్జనుడెప్పటికీ మెచ్చుకోడు. సజ్జనుడికి యీ దుష్టచర్యలు చేయకుండా వుండడానికి ఆశ, శాంతం, జ్ఞానం, నిర్భయం తోడ్పడుతాయి. అందువల్ల దురాశ, క్రోధం, అజ్ఞానం, భయాలకు లోనుకాకుండా, దూరంగా వుండగలుగుతాడు. అప్పుడే బహుళపక్ష చంద్రుని వలె అతడి కీర్తి వృద్ధి చెందుతుంది.

## సజ్జనుడు చేయకూడని పనులేమిటి?

సజ్జనుడెప్పటికీ కూడ, వున్మత్తతను కలిగించి, వివక్షగా జ్ఞానాన్ని నశింపచేసే మత్తు పదార్థాలను, పానీయాలను సేవించకూడదు. యీ దుర్గుణం వల్ల అతడు ధనం పోగొట్టుకుంటాడు. జగడాలు పెంచుకుంటాడు. తరుచూ రోగాలపాలవుతాడు. అపఖ్యాతి పాలవుతాడు. సిగ్గూ, శరం లేకుండా ప్రవర్తిస్తాడు. తన బుద్ధి కుశలతనంతటినీ పోగొట్టుకుంటాడు.

సజ్జనుడెప్పటికీ కూడా వేళకానివేళలలో పనీపాటూ లేకుండా వీధులలో సంచరించకూడదు. అందువల్ల అతడు తనను తాను రక్షించుకొనలేని స్థితిలో వుంటాడు. అతడి భార్యా బిడ్డలు తమని తాము రక్షించుకోలేని స్థితిలో పడతారు. అతడి సిరి సంపదలు రక్షణ లేక వుంటాయి. అతడ్ని లోకులు దుష్టకార్యాలు చేసేవాడిగా చూస్తారు. వదంతులకీ, అపదలకి కూడా గురవుతాడు.

సజ్జనుడు వినోద విలాసాలలో తరచూ పాల్గొనడు. వినోద విలాసాలే ధ్యేయంగా వుండేవాడు. నృత్య ప్రదర్శన యెక్కడ, గాన కచేరీ యెక్కడ? గానా బజానా యెక్కడ? భజన మేళా యెక్కడ? పటవాద్యమెక్కడ? అంటూ నిత్యం వాటి గురించే తలపోస్తూ విలువైన కాలాన్ని వృథా చేస్తాడు.

సజ్జనుడెప్పటికీ జూదాల్లో పాల్గొన కూడదు. అట్లా జూదాల్లో పాల్గొనేవాడు గెలిచిన వ్యక్తిపై మత్సరం పెంచుకుంటాడు. పోయిన డబ్బుకోసం దుఃఖిస్తాడు. అతడి సంపద నశిస్తుంది. అతడి మాటకు నలుగురిలోగానీ, న్యాయ స్థానంలోగానీ విలువ వుండదు. అతడ్ని స్నేహితులు, అనుచరులు కూడా అసహ్యించుకుంటారు. అతడ్ని పెళ్ళి చేసుకోనేందుకు యే స్త్రీ కూడా అంగీకరించదు.

సజ్జనుడెప్పటికీ కూడా సోమరితనానికి అలవాటు పడడు. సోమరితనానికి అలవాటు పడిన వ్యక్తి, చలిగా వుందనీ, యెండగా వుందనీ, చాలా ప్రొద్దు పోయిందనీ, సాయంత్రమై పోయిందనీ, యింకా పొద్దు పొడవనే లేదనీ, చాలా ఆకలిగా వుందనీ లేక అతిగా తిన్నందువల్ల భుక్తాయాసంగా వుందనీ యేదో వొక కుంటిసాకు చెప్పి పని చేయకుండా తప్పించుకుంటాడు. యీ విధంగా తన

నిత్య బాధ్యతలను వదిలి చరించడం వలన సిరిని కూడబెట్టలేడు సరికదా, వున్న సిరిని కూడా పోగొట్టుకుంటాడు.

## మానవుడిని అశాంతం నాశనం చేసేవేమిటి?

1. బారెడు ప్రొద్దెక్కే వరకూ నిద్రించడం 2. స్త్రీలని అగౌరవ పరచడం, వారి పట్ల అసభ్యంగా ప్రవర్తించడం, వారిని స్వార్థంతో చూడటం 3. క్రోధాన్ని పెంచుకోవడం 4. పరులకు కీడు తల పెట్టడం 5. దుష్ట జన సాంగత్యం 6. దురాశ కల్గి వుండటం- యీ ఆరు దుష్ట లక్షణాలు మానవుణ్ణి అశాంతం నాశనం చేస్తాయి.

## ద్వేషాన్ని యెలా పోగొట్టుకోవచ్చు?

మనమీలోకానికి కలిసిమెలిసి జీవించడానికై వచ్చి వున్నామని చాలామందికి తెలియదు. అల్లా తెలిసిన వాళ్ళు పరస్పరం తగవులాడుకోనడు.

నన్ను అవమాన పరిచెను, నన్ను బాధించెను, నన్ను ఓడించెను, నన్ను దొంగిలించెను- యీ రీతిగా యెవడు తలచకుండా వుంటాడో అటువంటివాడి ద్వేషం తగ్గిపోతుంది.

పాపపుపనులు చేసేవాడు యీ లోకంలోనూ, పరలోకంలోనూ కూడా దుఃఖిస్తూనే వుంటాడు. ఆ పాపపు పనులు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా బాధపడుతూనే వుంటాడు.

మంచి పనులు చేసేవాడు యీ లోకంలోనూ, పరలోకంలోనూ కూడా సంతోషిస్తూనే వుంటాడు. మంచిపనులు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా సంతోషమే పొందుతూ వుంటాడు.

## జీవితంలో సుఖశాంతుల్ని పొందాలంటే!!!

ఓ వ్యాఘ్రపద్యా! యీ జీవితంలోనే సంసారిక క్షేమాన్ని, సుఖాన్ని పొందవలెనంటే యీ దిగువ నాలుగు మార్గాలు యెన్నదగినవి: అవి:

1. నిరంతర కృషి
2. జాగరూకత
3. సత్సాంగత్యము
4. క్రమబద్ధమైన జీవిత విధానం

నిరంతర కృషి అంటే, యే విధమైన వృత్తిలో అయినా సామర్థ్యవంతమైన కష్టపడి విజాయితీగా పని చేయడం. విచక్షణా బుద్ధితో బాధ్యతలను నిర్వర్తించడం. అటువంటి కృషిని నిరంతర కృషి చేయుడం అని చెప్పవచ్చు.

జాగరూకతతో మెలగుట అంటే గృహస్థు కష్టపడి చెమటోడ్చిన డబ్బుని దొంగల బారినుండి, రాజులబారినుండి, కుటిలబుద్ధిగల దాయాదుల బారినుండి, వృధా ఖర్చుల నుండి కాపాడుకోవాలి. యిదియే సంసారిక జాగరూకత.

సత్సాంగత్యమనగా, యెట్టి పట్టణంలో నివసిస్తున్నా సంస్కారంకల పురుషులతో, యువకులతో, నిత్యం జ్ఞాన యుక్తమైన సంభాషణలతో సత్కాలక్షేపం చేయాలి. దాతృత్వ బుద్ధిగల వారినిగూడి దాతృత్వ బుద్ధితో మెలగాలి. జ్ఞానులతో కూడి జ్ఞానాన్ని పెంచుకోవాలి. యిదే సత్సాంగత్యం అంటే.

ఏ గృహస్థు ఆదాయ వ్యయాలను సమంగా చూసుకొంటూ, కేవలం లోభిగాకుండా, లేక కేవలం వ్యయపరుడు గాకుండా, ఆదాయాన్ని మించిన ఖర్చుపెట్టకుండా, ఆదాయాన్ని దృష్టిలో వుంచుకుని జీవితం సాగిస్తాడో, అదే క్రమబద్ధమైన జీవన విధానమనవచ్చు. స్వర్ణకారుడు యే విధంగా త్రాసును సమముగా, త్రాసుదండెన్ని నిలిపి బంగారాన్ని తూస్తాడో, ఆ విధంగా జీవితంలో ఆదాయాన్ని బట్టి ఖర్చు చేయడమే గృహస్థుకి క్రమబద్ధమైన జీవన విధానం.

## పతన హేతువు లేమిటి?

ఒక కొలనుకి నీటిని బయటకు పంపే తూములు నాలుగు, నీటిని లోపలకు తీసుకువచ్చే కాల్వలు నాలుగు వున్నాయనుకుందాం. కాలువలు మూసి తూములు తెరిచి వుంచితే వర్షాలు కురిసినా క్రమంగా నీరు తగ్గిపోవునట్లు, స్త్రీలపట్ల అపచారం, మద్యపానం, జూదం, దుష్టమైన సాంగత్యం యీ నాలుగు దుష్టగుణాల వల్ల మనిషి పతనమైపోతాడు.

## యెప్పుడూ అజాగ్రత్తగా వుండకూడదు

జాగ్రత్తగా వుండడం అమృతత్వానికి బాట. అజాగ్రత్తగా వుండడం మృత్యువుకి బాట. అప్రమత్తులెన్నటికీ మరణించరు. ప్రమత్తులు జీవించి వున్నా మరణించిన వారే అవుతారు.

అజాగ్రత్తకెన్నటికీ లోనుకాకూడదు. విషయవాసనల్లో, కోర్కెల్లో మునిగిపోకూడదు. అప్రమత్తులు, అంటే జాగ్రత్తగా వుండేవాళ్ళు ధ్యాన నిష్ఠాగరిష్ఠులై ఆఖరున పరమసుఖప్రాప్తిని పొందుతారు.

ప్రయత్నశీలుడు, జాగరూకుడు, మంచి పనుల్లో మునిగివుండేవాడు, అన్నిబాగా ఆలోచించి మాత్రమే పనులు చేసేవాడు, ఆత్మ సంయమనం కలవాడు, ధర్మబద్ధంగా జీవితాన్ని గడిపేవాడు, మరియు అప్రమత్తుడైనవాడుఅయినవాడి కీర్తి ప్రతిష్ఠలు పెరుగుతూనే వుంటాయి.

నిద్రపోయే వాళ్ళ మధ్య మేల్కొని వుండేవాడు, ప్రమత్తులమధ్య అప్రమత్తంగా వుండేవాడు, చురుకైన గుర్రంలాగా యితరుల్ని అధిగమించి ముందుకు సాగిపోతాడు.

శ్రద్ధగా వుండేవాడు యీ లోకాన్ని, దేవతాలోకాన్ని, యమలోకాన్ని కూడా జయిస్తాడు. పువ్వుల్ని యేరుకునేవాడు మంచి పువ్వుల్నే యేరుకునే విధంగా శ్రద్ధాళువు కళంకరహితమైన ధర్మమార్గాన్ని కనుక్కొంటాడు.

అప్రమత్తుడైనవాడు జాగరూకతతో వుండేవాడు తన చుట్టూ యెటువంటి వరదవెల్లువా ముంచలేని ద్వీపాన్ని నిర్మించుకోగలుగుతాడు. అప్రమత్తతే తన ధనంగా భావిస్తాడు. సోమరితనం అంటే భయపడతాడు. అప్రమత్తత వల్ల అతడు చాలా సంతోషితుడవుతాడు. శోకరహితుడవుతాడు. విజ్ఞాన పర్వత శిఖరాన్ని అధిరోహించి క్రిందనున్న అవివేక దుష్టభూయిష్టమైన లోకాన్ని చూస్తాడు. వారిని కూడా పైకి తీసుకు వచ్చేందుకు అపారమైన దయతో అహరహం శ్రమిస్తాడు.

## సంపద కల్గించే నాలుగు సద్గుణాలేమిటి?

కొలనులోని తూములు మూసి వుంచితే, వర్షాలు సామాన్యంగా కురిసినా నీటిమట్టం పెరిగేటట్లు 1. స్త్రీల పట్ల మాతృగౌరవ భావం కలిగి వుండటం 2. మద్యపానం చేయకుండా

వుండడం 3. జూదం ఆడకుండా వుండటం 4. సజ్జన సాంగత్యం. యీ నాలుగు సద్గుణాల వల్ల సంపద పెరిగి తద్వారా జీవితంలో సుఖశాంతుల్ని పొందుతాడు.

## మనిషికి ఆధ్యాత్మిక ప్రగతి చాలా అవసరం

ఓ వ్యాఘపజ్జా! గృహస్థుని ఆధ్యాత్మిక ప్రగతికి యీ నాలుగు నియమాలను పాటించాలి. అవి. 1. విశ్వాసము 2. సత్ప్రవర్తన 3. దాతృత్వం 4 జ్ఞానం

విశ్వాసం : తథాగతుని సంబుద్ధత్వాన్ని అవగాహన చేసుకొని, తనను అర్హతునిగా, మహా జ్ఞానిగా, జ్ఞానశీల సమన్వితునిగా, సమస్త విశ్వము నెరిగిన వానిగా, అప్రతిహతునిగా, దేవమానవుల గురువుగా, తథాగతుని భక్తితో విశ్వసించడమే విశ్వాసిగా జీవించుట.

సత్ప్రవర్తన : జీవహింస చేయకుండా, దొంగతనం చేయకుండా, స్త్రీలపట్ల అక్రమంగా ప్రవర్తించకుండా, అబద్ధాలు ఆడకుండా, మత్తు పదార్థాలు సేవించకుండా జీవించడమే సత్ప్రవర్తనతో జీవించడం.

దాతృత్వ బుద్ధి : నిర్మల హృదయంతో, దాన బుద్ధితో, ఔదార్యంతో, పేదసాదలకు సాయపడుతూ, అన్నార్తులకు అన్నమిస్తూ జీవించడమే దాతృత్వ బుద్ధితో జీవించడం.

జ్ఞానిగా జీవించడం : అస్తిత్వానికి కారణభూతాలైన పంచపదార్థాల వునికి, అంతర్ధాన లక్షణాలను తెలుసుకుని, దుఃఖ నివృత్తిమార్గాన్ని తెలుసుకుని జీవించడమే జ్ఞానిగా జీవించడం. 'నేను' అనే అహంకారాన్ని వదిలివేస్తే గృహస్థునికీ, సన్యాసికీ యెటువంటి భేదం లేదు.

## చెడ్డ పనుల ఫలితం

ఎవరైనా కలుషితమైన మనస్సుతో మాట్లాడినా, చెడ్డ పనులు చేసినా, యెద్దు వెనకాలే బండిచక్రం వస్తున్నట్లు దుఃఖం అతన్ని వెంబడిస్తుంది.

పరిశుద్ధమైన మనస్సుతో మాట్లాడేవానికి, కర్మలు చేసేవాడికి వెనకాల నీడలాగా సుఖం అతని వెంట వస్తుంది.

## మూర్ఖుడితో సహవాసం యెంతమాత్రం మంచిది కాదు

తనకు తగిన సజ్జనుడు లభించకపోతే యేకాకిగా జీవించడమే మనిషికి ఉత్తమం. మూర్ఖునితో సహవాసం యెన్నటికీ తగదు.

దుష్ట మనస్కునితో స్నేహం చేయకూడదు. ఆత్మసంయమనం లేని వాని వెంట వెళ్ళకూడదు. ఆత్మ సంయమనం కలవానితో మాత్రమే స్నేహం చేయాలి. శుద్ధ మనస్కునితో మాత్రమే స్నేహం చేయాలి. బ్రతుకు బాటలో జ్ఞాని, మేధావి, యింద్రియ నిగ్రహం లేని సజ్జనుడు స్నేహితుడిగా లభించకపోతే, అరణ్యంలో ఒంటరిగా జీవించే గజరాజువలే జీవించాలి. అవివేకితో సహవాసముకంటే యేకాంత వాసము మేలు. పాపము చేయకుండ ఒంటరిగా అరణ్యములో యేనుగు వలె బ్రతుకుట మేలు.

## పశ్చాత్తాప పడవలసి వచ్చే పనులు చేయకూడదు

ఏ పనులు చేయడం వల్ల ముందు ముందు పశ్చాత్తాప పడవలసి వస్తుందో ఏ పనులు

చేయడంవల్ల దాని ఫలితాన్ని అశ్రువారలతో అనుభవించవలసివస్తుందో అటువంటి పనులు చేయకూడదు. యేటువంటి పనులు చేయడం వల్ల పశ్చాత్తాప పడవలసిన పరిస్థితి రాదో, యే పనులు చేస్తే దాని ఫలితాన్ని సంతోషపూర్వకంగా అనుభవించగలమో అట్టి పనులు మాత్రమే చేయాలి. అటువంటి పనులే శ్రేష్ఠమైనవి.

## పాపానికి తగ్గ ప్రతిఫలం తప్పకుండా వుంటుంది

పాలు పెరుగుగా మారడానికి కొంత సమయం పట్టినట్టు, పాపపు పనికిఫలితం వెంటనే రాకపోయినా, బూడిదలో వుండే అగ్నిలా అది పాపిని హరించి వేస్తుంది. సజ్జనులైన నిర్దోషులను హింసించువాని పాపము అతన్నే కట్టి కుడుపుతుంది. యెదురు గాలిలో విసిరిన దుమ్ము తన మీదనే పడుతుంది. సముద్ర మధ్యానికి పోయినా, ఆకాశంలోకి వెళ్ళినా, పర్వతశిఖరాలనధిరోహించినా, నేల నాలుచెరగులలో యెచటకేగినా పాపకర్మలకి ఫలితం అనుభవించక తప్పదు.

ఆకసము కొసకు అరుగవచ్చుగాక, సముద్రగర్భమును చొచ్చుగాక, పర్వత శిఖరములు అధిరోహించుగాక, నేల నాలుగు చెరగులలో యెచటకేగినను, యెవరికైననూ, మృత్యువు తప్పించుకొనతరము కాదు.

## ఆవతలి వొడ్డుకు మార్గం

తథాగతుడు బోధించినట్టుగా యెవరు జీవిస్తారో వారు అవతలి వొడ్డుకి చేరుకుంటారు. యీ మార్గంలో వారు యీ వొడ్డు నుంచి ఆ వొడ్డుకి చేరుకుంటారు. యిదే అవతలి వొడ్డుకు వెళ్ళే మార్గం. అవతలి వొడ్డుకు వెళ్ళగలిగే మార్గమిదే. నేను ఆ దోవ చూపిస్తాను.

## యెవరిని సేవించాలి?

భూమిలో వుండే నిధినిక్షేపాల్ని చూపించినట్లు జ్ఞాని నీలో వుండే దోషాల్ని చూపిస్తాడు. అటువంటి జ్ఞానినే సేవించాలి. అటువంటి జ్ఞానిని అనుసరించేవాడు శుభమే చూస్తాడు కానీ అశుభాన్ని చూడడు. అటువంటి జ్ఞాని లభించి హెచ్చరిక చేయుగాక, వుపదేశించుగాక, చెడుని నివారింప చేయుగాక. అటువంటి వాడు సజ్జనులచే ప్రేమించబడతాడు. దుర్జనుల చేత ద్వేషించబడతాడు.

నూరు సంవత్సరాల వరకూ ప్రతి మాసం సహస్ర ప్రదక్షిణ హోమాలు చేయడం కంటే తన్ను తాను జయించిన వాడిని సేవించుట శ్రేయస్కరం.

## కావలసిన విధంగా మనస్సుని మరల్చుకోగలగాలి

శ్రామికులు నీటిని కాలువల ద్వారా పారిస్తారు. బాణాలు తయారు చేసేవాడు బాణాల్ని తిన్నగా తయారు చేస్తాడు. వడ్రంగి కొయ్యను కావలసిన విధంగా మరల్చుకుంటాడు. అట్లాగే జ్ఞానులు కూడ తమ మనస్సులని మంచి వైపుకు మరల్చుకోవాలి.

## శాంతిని పొందేవాళ్ళు యెవరు?

సత్య,ధర్మ మార్గాల నెరిగిన జ్ఞానులు గంభీరమైన, స్వచ్ఛమైన, మరియు కలుషరహితమైన

సరోవరం వలె శాంతిని పొందుతారు.

## నిర్వాణమనే అమృతత్వాన్ని అనుభవించేవాళ్ళు యెవరు?

యెవని మనస్సు మెలుకువలో శిక్షణ పొందిందో, యెవడు భోగ్యవస్తువుల్ని విడిచిపెట్టి ఆనందానుభూతిని పొందుతాడో, యెవడు కోరికలనెడి అంధకారాన్నుండి బయటికి వచ్చి ప్రకాశిస్తాడో అటువంటివాడు శరీరముండగానే నిర్వాణమనబడే అమృతత్వాన్ని అనుభవిస్తాడు.

## పవిత్ర హృదయులు యెటువంటి మార్పులు తీసుకు వస్తారు?

గ్రామాల్లో గానీ, అరణ్యాల్లో గానీ, పర్వతాల్లో గానీ యెక్కడెక్కడ పవిత్రాత్ములు సంచరిస్తారో అట్టి ప్రదేశాల్ని వారు ఆహ్లాదంగా తయారు చేస్తారు. యితరులు సంచరించజాలని అరణ్యాల్ని సైతం ఆహ్లాదంగా తయారు చేస్తారు. యెందుకంటే వారికి కోరికలనే బరువు భారాలు లేవు. అందువల్లనే యితరులు పొందలేని ఆనందాన్ని వారు పొందుతారు.

## యెలా జీవించుట మేలు?

యేకాగ్రత లేక అజ్ఞానంతో నూరు సంవత్సరాలు జీవించడం కంటే ధ్యాన నిష్ఠతో వొక దినము జీవించుట మేలు.

సోమరిగా ప్రయత్న హీనునిగా నూరు సంవత్సరాలు జీవించడం కంటే దృఢ చిత్తంతో, శౌర్యంతో, ప్రయత్నశీలుడై వొక్కదినం జీవించుట మేలు. అర్హతులుండే చోటు అది పల్లె కావచ్చు-అడవి కావచ్చు-కొండ కావచ్చు- కాకపోవచ్చు అది రమణీయమైంది.

## అహింస-మనిషి ధర్మం

జీవితం అందరికీ ప్రియమైంది. అపాయం అంటే ప్రతిజీవి భయపడుతుంది. మనుష్యుడు యిది గమనించాలి. చంపుటగానీ, చంపడానికిగానీ కారకుడు కాకూడదు.

యెటువంటి సుఖాన్ని అందరూ ఆశిస్తారో, అట్టి సుఖం కోసం యితరులకి హాని చేసేవాడు యికముందు సుఖాన్ని కనుక్కోలేడు.

యెటువంటి సుఖాన్ని అందరూ ఆశిస్తారో, అటువంటి సుఖం కోసం యితరులకి యెటువంటి హానీ చేయనివాడు యికముందు సుఖాన్ని కనుక్కొంటాడు.

## పండితుడెలా వుండాలి?

పండితుడు, తాను మొదట చేసి చూపిన పిమ్మటనే యితరులను ఆ పనులను చేయుమని చెప్పాలి. అటువంటి పండితునికి పతనం వుండదు. ఆదేశం కంటే స్వకీయమైన అనుష్ఠానమే మేలు. తన్ను తాను వశపరుచుకొనినవాడు యితరులను సులువుగా లోబరచుకొనగలడు. ఆత్మ సంశయం దుష్కరమైనది. తన్ను తాను బాగు చేసుకోవాలన్న కోరిక గలవాడు- తన్ను తాను జాగరూకతతో కాపాడుకోవాలి. పండితుడు రాత్రి యామములో మూడింట వొకట మేల్కొని యుండవలెను.

## ఎవడిపాపం వాడిదే

మహాత్ములు - పరమ పవిత్రులు అయినవారి దారలను దుష్టుడు ఎగతాళి చేసి పాపము పండిన పిదప కష్మాక లత ఫలించిన పిదప (బహుశ బీరపాదులాంటి పాదు) ఎండి వాడిపోవునట్లు ఆత్మవినాశం పొందుతాడు.

తన చేతనే తన పాపములు చేయబడుతున్నాయి. తన చేతనే తాను వినాశనం పొందుతున్నాడు. ఎవరిపాపములు వారికే సంబంధించి వుంటాయి. కనుక పవిత్రత - అపవిత్రత ఎవరివి వారివే - ఒకడు మరియొకని పవిత్రుని చేయజాలడు.

వజ్రము మణులను ఛేదిస్తుంది. అట్లానే తాను చేసిన పాపము - తన యందు పుట్టిన పాపము తననే కట్టి కుదుపుతుంది. మాలువాలతకపాలవృక్షము పైకి ఎగబ్రాకి - ఆ చెట్టు కొమ్మలనే ఆవరించి వేసినట్లు దుర్గుణమని దుష్టగుణము అతడినే అణచి వేస్తుంది.

## పాపి చివరికేమవుతాడు?

పాపి, పాపపు పనులు చేస్తున్నప్పుడు, మంటలు మండుతున్నావన్న సంగతి మరిచిపోయి, చివరికి ఒక రోజున ఆ మంటల్లోనే తాను దహించుకుపోతాడు. ఇనుము నుండి పుట్టే తుప్పు చివరికి ఆ ఇనుమునే తినివేసినట్లు దుష్టుడి దుష్ట చర్యలు అతడ్ని దుర్గతికే తీసుకుపోతాయి. తప్పుని ఒప్పుగానూ, ఒప్పుని తప్పుగానూ తలపోసేవారు తమ తప్పుడు తలపుల వలన అధోమార్గాన పడిపోతారు. మూఢుడు- జ్ఞానవేశం చేత నిశ్చింతగా వుండవచ్చు. చివరికి పూర్వపుణ్యము (మంచి పనుల ఫలితాల) నశించుట తోడనే తల తిరిగి విపత్తులో చిక్కుకుంటాడు.

## నిందలు ఎవరికైనా తప్పవు

ఎంతటి గంభీరమైన గుర్రమైనా కొరడా దెబ్బల్ని తప్పించుకోలేని విధంగా, ఎంతటి గొప్పవాడైనా నిందల్నుంచి, నెపాలనుంచి తప్పించుకోలేడు.

## ఆనందోత్సవాలేల?

ప్రపంచం అంతా అగ్నిలో ప్రజ్వరిల్లుతూ వుంటే యీ ఆనందోత్సవాలేల? హాస్యపరిహాసాలేల? ఓ మనిషీ?! నువ్వు గాఢాంధకారంలో వుంటే దీపం కావాలని కోరుకోవా?

## సద్గుణాలు అమరమైనవి

రాజుల యొక్క, సౌందర్యమైన రథాలు అరిగి, త్రుప్పు పట్టి శిథిలమై పోయినట్లు, శరీరం ముసలిదైపోయి నశించిపోతుంది. కానీ మంచి వారి సద్గుణాలకు మాత్రం చావు లేదు. వుండదు.

## కృషి చేయనివాళ్ళు ఏమవుతారు?

యవ్వనంలో, ఆత్మ సంయమనం లేక, జీవిత ధ్యేయమైన ధర్మానుష్ఠానికై కృషి చేయనివారు- శక్తి హీనమైన ముసలి కొంగలు దీనంగా సరస్సులో చేపల్ని చూస్తున్నట్లు-వ్యధ చెందవలసి వస్తుంది.

## ఎవరైనా ముందర తనను తాను సంస్కరించుకోవాలి

ఇతరులని సంస్కరించాలని పూనుకునేవాడు మొదట తనను తాను సంస్కరించుకోవాలి. అప్పుడే నిజంగా ఇతరులకి ఉపదేశించగలుగుతాడు.

ధర్మమార్గమేదో కనుగొన్న తరువాతే ఆ మార్గాన్ని ఇతరులకు ఉపదేశించాలి. అప్పుడే నిజంగా ఇతరులకి ఉపదేశించగలుగుతాడు.

## ఎవరైనా తనను తానే ఉద్ధరించుకోవాలి

ఎవడు పాపాలు చేస్తే వాటి ఫలితాన్ని వాడే అనుభవిస్తాడు. ఎవడు పాపాలు చెయ్యకపోతే వాడే పరిశుద్ధుడవుతాడు. శుద్ధాశుద్ధాలు ఎవడివి వాడివే. ఎవరూ మరొకర్ని పరిశుద్ధుడిగా మార్చలేరు. తనను తాను ఎవడికి వాడే ఉద్ధరించుకోవాలి.

ఇతరులకి హితం చేయబోయి తన హితానికి హాని తెచ్చుకోకూడదు. ఎవరికి వారే కృషి చేసుకోవాలి. మహాసియులు మార్గాన్ని మాత్రమే చూపిస్తారు. బాగుగా యోచించి ధర్మమార్గాన అనుసరించేవారు మారుని బంధాల నుండి విముక్తులవుతారు.

లెమ్ము! నీకు నీవే మేల్కొనుము. నీకు నీవే శిక్షణనిమ్ము. నీ ఆశ్రయము నందే ఎల్లవేళల అప్రమత్తుడవై, సర్వోత్కృష్టమైన ఆనందము నందు విలసిల్లు. నీకు నీవే ప్రభువువి. నీకు నీవే ఆశ్రయానివి. సోమవిష్! నీ జీవిత నౌకను భారరహితం చేసుకో. భార రహితమైనప్పుడది శీఘ్రంగా పయనిస్తుంది. పాపకరములైన కోర్కెలు ఆశామోహాల నుండి భారరహితమైతే నిర్వాణానికి ప్రయాణిస్తావు.

## ఎవడు యముడికంటే శక్తిమంతుడు?

ఈ ప్రపంచాన్ని ఎవడు నీటిపై నురుగు బొట్టుగానూ మరియు కనిపించెడి మాయారూపంగానూ గ్రహిస్తాడో అటువంటివాడి ముందు యమధర్మరాజు కూడా శక్తిహీనుడైపోతాడు.

## జ్ఞానోదయమైనాక అందరూ సమానంగానే ప్రకాశిస్తారు

మొదట ఎవరైనా అజ్ఞానిగా వున్నా, తరువాత అతడికి జ్ఞానోదయమైతే, మేఘాల నుండి బయట పడిన చంద్రుని వలె ఈ లోకంలో జ్ఞాన ప్రకాశాన్ని వెదజల్లుతారు.

మొదట ఎవరైనా పాపపు పనులు చేసినా, తరువాత తన మంచిపనులచేత, మేఘాల నుండి బయట పడిన చంద్రునివలె ఈ లోకంలో జ్ఞానప్రకాశాన్ని వెదజల్లుతారు.

## బుద్ధ భగవానుడు-తన గురించి

సింహాసేనాపతీ! నేను కాయ దుశ్చరితాలు, వాగ్దుశ్చరితాలు, మనోదుశ్చరితాలు- వీటి అక్రియని ఉపదేశిస్తాను. అందువల్ల కొందరు నన్ను అక్రియావాదిగా తలుస్తారు. సింహా! నాయందింక సంప్రదాయముంది. దానిలో సత్యవాదులైన మనుషులు నన్ను క్రియావాది అంటారు. అది ఏమిటి? నేను కాయసుచరితాలు, వాక్సుచరితాలు, మనస్సుచరితాలు- వీటి క్రియల్ని ఉపదేశిస్తాను. నా యందు వేరొక సంప్రదాయముంది. దాని సంబంధంతో సత్యవాదులు నన్ను ఉచ్ఛేదవాదిగా

అనుకుంటారు. అవి యేవి? నేను లోభము, ద్వేషము, మోహము మొదలైన సర్వపాపకారక మనోవృత్తుల యొక్క వుచ్ఛేదాన్ని వుపదేశిస్తాను.

సింహసేనాపతీ! నాయందింకో సంప్రదాయం వుంది. అందుచేత సత్యవాదులు నన్ను జుగుప్సిగా యెంచుతారు. నేను కాయ దుశ్చరితాల్ని, వాగ్దుశ్చరితాల్ని, మనోదుశ్చరితాల్ని కంటగించుకుంటాను. పాపకరములైన పనులు నాకు గిట్టవు.

యితర సంప్రదాయం నాలో యింకొకటి వుంది. అందుకే నన్ను సత్యవాదులు వినాశకుడంటారు. లోభ-ద్వేష-మోహాదుల వినాశనాన్ని వుపదేశిస్తాను.

సింహసేనాపతీ! వీటితో పాటు నాలో వేరొక మార్గం కూడా వుంది. అందుచేత సత్యవాదులు నన్ను తపస్విగా యెంచుతారు. పాపకారకములైన అకుశల కర్మలను నేను తపింప చేస్తాను.ఆ తపస్సు చేత పాపకారకములైన అకుశల కర్మలు మూలమట్టుగా నశించిపోతాయి. మరల మొలకెత్తవు. అందుచేత సింహసేనాపతీ నేను తపస్విని.

## మన పనులే మనకు ఆస్తి

మన పనులకు (కర్మలకు) మనమే కర్తలం

మన పనులే మనకు ఆస్తి

మన పనులే మనకు పరంపర

## సత్యాన్ని కాపాడేవాడ్ని సత్యమే కాపాడుతుంది

హితాహితాల్ని విచారించకుండా, తొందరపాటు నిర్ణయాలు తీసుకునేవాడు ధర్మమార్గాన్ని అనుసరించలేడు. వివేకి ప్రశాంత చిత్తంతో హితాహితాల్ని విచారిస్తాడు. మరియు సత్యం, అహింస, శాంతులతో భిన్నాభిప్రాయాల్ని సేకరించి సరైన నిర్ణయాలు తీసుకుంటాడు. అట్టివాడ్ని సత్యం కాపాడుతుంది. అతడు సత్యాన్ని కాపాడుతాడు.

## సత్యవాది యెవరు?

శాస్త్ర పాండిత్యాన్ని వెదజల్లినంత మాత్రాన యెవడును సత్యవాదికాలేడు. పండితుడు కాకపోయినా, ధర్మమార్గాన్ని మరువక యెవడు తన పనిని తాను సక్రమంగా నిర్వహించుకుంటాడో వాడే సత్యవాది.

## దోషాలెంచే వాడికి దోషాలే అభివృద్ధి అవుతాయి

యితరుల దోషాలు యెంచడం చాలా సులభం. కానీ తన దోషాల్ని కనుక్కోవడం కష్టం. కొందరు పరుల దోషాల్ని గాలిలో యెగిరే ధాన్యపు పొట్టులాగా చూపిస్తారు. కానీ తమ దోషాల్ని మాత్రం, కపటజూదరి పాచిక దాచినట్లు కప్పిపుచ్చుకుంటారు.

యితరుల దోషాలు యెంచుతూ సదా వాటినే తలపోసేవాడి దోషాలు వృద్ధి అవుతూనే వుంటాయి. అంతేకాదు అతడు అలా వుండటంవలన తన దోషాల నుంచి విముక్తుడవడానికి కూడా అవకాశాలు పోగొట్టుకుంటున్నాడు. స్వర్ణకారుడు సువర్ణాన్ని అగ్నిలోపుటం పెట్టి అందులోని

మలినాల్ని తొలగించే విధంగా, బుద్ధిమంతుడు అనుక్షణమూ తన దోషాల్ని వొక్కొక్కటీ స్వల్పస్వల్పంగా మరల మరల పోగొట్టుకుంటూ పరిశుద్ధుడు కావాలి.

## సర్వానర్థాలకూ కారణం యింద్రియ నిగ్రహం లేకపోవడమే

హింసాత్మక ప్రవృత్తి కలవాడు, దొంగిలించేవాడు, స్త్రీలని అగౌరవపరచేవాడు, మద్యపానం చేసేవాడు, తన మూలాన్ని తానే పెరికి వేసుకుంటున్నాడు. కాబట్టి వో మానవుడా! యింద్రియ నిగ్రహం లేకపోవడమే సర్వానర్థాలకీ మూలమని తెలుసుకో. పేరాశ, భోగలాలసతలవంటి దుర్గుణాలు నిన్ను దీర్ఘమైన దుఃఖంలో పడద్రోస్తాయన్న మెలకువతో నిన్ను నీవు కాపాడుకో. భోగవిలాసాలనుండీ, ఆశామోహాలనుండీ, విషయవాసనల నుండీ, కామంనుండీ, పరితాపంనుండీ దుఃఖం పుడుతుంది. వీటి నుండి విముక్తుడవైతే భయాన్నుండి, దుఃఖాన్నుండి కూడా విముక్తుడవవుతావు. శీలం సంపన్నుని, జ్ఞానదృష్టి కలవారిని, ధర్మాచరణాపరుని, సత్యవాదిని, చేయవలసిన పనిని చేయువానిని లోకమందలి ప్రజలు ప్రేమిస్తారు.

## మేల్కొనిన బుద్ధులు యేమని చెప్తారు?

మేల్కొనిన బుద్ధులు యీ విధంగా చెప్తారు. త్యాగం అంటే వోర్పు కలిగి వుండడమే. నిర్వాణమే సర్వశ్రేష్ఠం. యితరులని బాధించేవాడు, నిందారోపణలు చేసేవాడు సన్యాసి కాలేడు. మనోవాక్కాయ కర్మలతో యితరులను, జీవులను హింసించకుండా వుండాలి. యింద్రియ నిగ్రహం కలిగి వుండాలి. మితంగా భుజించాలి. యేకాంతంగా విశ్రమించాలి. వున్నతమైన చైతన్యం కొరకు కృషి సల్పాలి. బుద్ధుల జన్మ సుఖప్రదమైనది. సంఘమందలి కలిసికట్టుతనం సుఖప్రదమైనది. కలిసికట్టుతనంతో జీవించు జీవితం సుఖదాయకమైనది.

యింకా యీ విధంగా అంటారు.

పరస్పరం ద్వేషించుకునే వారి మధ్య ప్రేమతో, ఆనందంతో జీవిస్తాము. ఆదర్శమవుదాము. అనారోగ్యాల నడుమ ఆరోగ్యంతో, ఆనందంతో, అశాంతితో వున్న వారిమధ్య శాంతితో, ఆనందంతో జీవించుదాము. ఆదర్శమవుతాము. సర్వసంగపరిత్యాగులమైఆనందంతో జ్యోతిస్వరూపులమై జీవిద్దాము. అందరికీ ఆదర్శప్రాయమవుదాము. యేకాంతం యొక్క ప్రశాంతతను, నిర్మలత్వము యొక్క ఆనందాన్ని యెరిగి, పాప భయరహితులమై ధర్మానందాన్ని పొందుదాము.

## మంచి స్నేహితుడు

మంచి స్నేహితుడు యెప్పటికీ తన స్నేహితులను మోసగించడు. చెడ్డ చేయకుండా వుండడంతోనే సంతోషం లభ్యం అవుతుంది.

## మాటలు వెయ్యేల?

మాటలు వెయ్యేల? అనర్థ పద సంహితమైన వెయ్యి మాటలకంటే అర్థవంతమైన వాక్య శ్లోకం చాలు. వేయి శ్లోకాలేల? నిరర్థక శ్లోకాలు వల్లె వేయడమెందుకు? శాంతి దాయకమైన వాక్యశ్లోకం చాలు.

## సుఖంగా యెలా జీవించగలుగుతాము?

ద్వేషాన్ని విడనాడి-ద్వేషించే వారిమధ్యనే నివసించాలి. యితరుల యెడ అనురాగముతో మెలగుట నేర్చుకోవాలి. కోరికలతో నిండిపోయిన వారి మధ్య యెటువంటి కోరికలూ లేకుండా జీవించెదముగాక. రోగులమధ్య ఆరోగ్యముగా బ్రతికెదముగాక. వుత్సుకుల మధ్య అనుత్సుకులమై యుందుముగాక. వుత్సుకులైన మనుష్యుల మధ్య ప్రశాంతులమై విహరించెదముగాక. 'నాది' అనేది యేదీ లేనప్పుడు మనం స్వయం ప్రకాశులగు దేవతలవలె శాశ్వతానంద సౌఖ్యాలతో తేలియాడవచ్చును. జయము వలన వైరము, అపజయము వలన దుఃఖము కలుగుతాయి. జయాపజయాలకు దూరమైనవాడు ప్రశాంతపడతాడు సుఖం పొందుతాడు.

విషయలోలత్వమును మించిన అగ్ని లేదు. ద్వేషమును మించిన దోషము లేదు. శరీరమును మించిన దుఃఖము లేదు. శాంతిని మించిన సుఖము లేదు. ఆకలకన్న మిక్కుటమైన రోగము లేదు. యీ సత్యాన్ని తెలుసుకున్నవాడు నిర్వాణము కంటే ఆనందము లేదని గ్రహిస్తాడు.

పూజ్య సందర్శనము- సత్సాంగత్యము ఆనందదాయకము. మూర్ఖ సంపర్కము లేకుండుట అన్నిటికంటే సుఖప్రదము.మూర్ఖసాంగత్యము దీర్ఘదుఃఖప్రదము. అవివేకులతో చేరుట శత్రుమధ్యమున మన్నట్లే. విజ్ఞుల సంపర్కము బంధు సమాగము వలె సుఖప్రదమైనది. ఆకసము నందు నక్షత్రముల మధ్య చంద్రుడు సంచరించునట్లు మేధావులు, ప్రాజ్ఞులునైన సజ్జనుల సాంగత్యము నడయుటమేలు.

## అన్నింటినీ మించిన దారుణాలేమిటి?

కామానికి మించిన అగ్ని జ్వాలలేదు. ద్వేషానికి మించిన కీడు లేదు. పొందికలేమికి మించిన బాధలేదు. పూహాభ్రమలకు మించిన వలయము లేదు. కోరికలను మించిన వాడిగల ప్రవాహము లేదు. విషయ భోగముల యెడ పరితపించెడు కోర్కెల దాహం అన్నింటికంటే పెద్దరోగం. పొందికలేమి అన్నింటికంటే పెద్దదుఃఖం.

## వుత్తమమైనవేవి?

ఆరోగ్యమే మహాభాగ్యం. సంతుష్టియే వుత్తమధనం. ఆత్మస్థైర్యమే వుత్తమబంధువు. నిర్వాణమే వుత్తమ సుఖం.

## యే పనులు చేయదగినవో వివేచనతో చేయాలి

చేయదగు పనిని చేయక, చేయరాని పనిని చేసే డంబాచారి యొక్క కోర్కెల దాహం పెరుగుతూనే వుంటుంది.

చేయదగిన పనిచేస్తూ, చేయరాని పని చేయకుండా యోచనతో నిర్వహించుకొనే వివేకి యొక్క కోర్కెల దాహం అంతమై పోతుంది.

## క్రోధాన్ని జయించినప్పుడే మనిషి దేవతలను సమీపిస్తాడు

క్రోధాన్ని విడవాలి. డంబాన్ని వదిలి వేయాలి. క్రోధాన్ని నిగ్రహించుకొనేవాడే సమర్థుడైన

సారథి. కేవలం కళ్ళెపు పగ్గాల్ని చేత బూనినంత మాత్రాన సమర్థుడైన సారథికాలేనట్టే. తనలో నుండి వెల్లులికి వచ్చే క్రోధాన్ని నిగ్రహించుకో గలిగిన వాడే సమర్థుడైన సారథి.

క్రోధాన్ని శాంతంతో జయించాలి. చెడును మంచి చేత జయించాలి. లోభిని వుదారంతో జయించాలి. అసత్యవాదిని సత్యంతో జయించాలి.

సత్యాన్నే పలకాలి. క్రోధానికి లోనుకాకూడదు. యితరులు యేమైనా అడిగితే కొంచెమైనా సరే యివ్వాలి.

క్రోధం మూడు రకాలుగా వుంటుంది.

శరీరం యొక్క క్రోధాన్ని కనిపెట్టాలి. చెడ్డ నుండి, చెడ్డ సైగల నుండి, కళ్ళతో, ముక్కుతో, నోరుతో యితర అవయవాలతో యెటువంటి తప్పుడు ప్రకటనలు చెయ్యకూడదు. యెటువంటి చెడ్డ సైగలూ చెయ్యకూడదు. శరీరంతో యెవరికీ హాని చెయ్యకూడదు. యెవరి ఆత్మగౌరవాన్ని కించపరచకూడదు. శరీరాన్ని చక్కగా మంచిగా వినియోగించాలి. శరీరాన్ని నిగ్రహించుకోవాలి.

వాక్కు యొక్క క్రోధాన్ని కనిపెట్టాలి. వాక్కుని నిగ్రహించాలి. వాక్కుతో యెటువంటి హానీ చేయకూడదెవరికీ. వాక్కుతో యేంవీ బాధ పెట్టకూడదు. వాక్కుని చక్కగా వినియోగించాలి.

మనస్సు యొక్క క్రోధాన్ని కనిపెట్టాలి. మనస్సుని నిగ్రహించాలి. మనస్సులో యెవరికీ హాని తలపెట్టకూడదు. మనస్సును చక్కగా వినియోగించాలి.

## సోమరిపోతులేమవుతారు?

సోమరిపోతులు, అతిగాతిని అటూ యిటూ దొర్లుతూ వుండే తిండిపోతులు, చెత్తకుప్పలసైన తిరుగాడే పందిలాగా పునర్జన్మ పొంది మృత్యువునందే తిరుగాడుతారు.

## యెల్లప్పుడూ స్వాగతం లభించేదెవరికి?

శీలదర్శన సంపన్నుడు, ధర్మాత్ముడు, సత్యవాది, కర్తవ్యపరాయణుడు అయిన మనుజానిం అందరు అనురాగముతో చూస్తారు. దూరదేశములకు పోయి చిరకాలమునకు తిరిగి స్వదేశానికి వచ్చిన వానిని ప్రియబంధువులు ఆనందముతో స్వాగతము పలికినట్లే, పుణ్యకార్యములు చేసిన వానికి స్వాగతం లభిస్తుంది.

## ప్రియమైన ప్రతిదీ దుఃఖాన్నే మిగిలిస్తుంది

ప్రియ, అప్రియాలకు అతీతుడై యుండాలి. ప్రియమైన దానిని చూడలేకపోయినా, అప్రియమైన దానిని చూచినా దుఃఖమే. కాబట్టి దేనియందూ ప్రీతిచూపకండి. యెందుకంటే ప్రియ వియోగము దుస్సహము. ప్రీతినుండి శోకం కలుగుతుంది. ప్రీతి నుండి భయం యేర్పడుతుంది. ప్రియా ప్రియములు లేనివాడికి శోకం వుండదు. భీతి వుండదు. రతి నుండే శోకభయాలు పుడతాయి. రతి నుండి ముక్తుడైన వాడికి శోకమెక్కడిది భయమెక్కడిది? కామము నుండి శోకభయాలు పుడతాయి. కామవిరహితునకు శోకముండదు- భయము వుండదు. తృష్ణ వలన శోకభయాలు పుడతాయి. తృష్ణ లేని వానికి శోకము లేదు. భయమెక్కడిది? వుత్తమ జ్ఞాన సముపార్జన గురించి ఆలోచించకుండా యింద్రియలౌల్యములో గడిపేవాడు తన క్షేమానికే భంగం

కలిగించుకుంటాడు. అట్టివాడు జ్ఞానయోగిని చూసి అసూయ చెందాల్సి వస్తుంది.

## స్వార్థపరుడు సౌఖ్యాన్ని పొందలేడు

స్వార్థమే పరమావధిగా బ్రతికేవాడు, తన స్వార్థం కోసం, తన సుఖసంతోషాలకోసం, యితరుల కష్టసుఖాలను లక్ష్యపెట్టనివాడు. వారిని పీడించుకు తినేవాడు-యెన్నటికీ యిహంలోనూ, పరంలోనూ కూడా సౌఖ్యాన్ని పొందలేడు.

## అజ్ఞానమే అన్నిటినీ మించిన కళంకము

అధ్యయనం చేయకపోవడం వ్యక్తికి కళంకం. వూడ్చి శుభ్రం చేయకపోవడం గృహకళంకం. తగిన వ్యాయామం చేయకపోవడం శరీర కళంకం. దాతకు లోభం కళంకం. యిహపరలోకాలకి పాపపు పనులు కళంకాలు. అజ్ఞానమే అన్నిటినీ మించిన కళంకము. భిక్షువులారా! ఆ కళంకము నుండి మీరు విముక్తులై పాపరహితులు కండు.

## బ్రతుకుబాటలో సుఖప్రదమైనవి

బ్రతుకుబాటలో అక్కరయందు మిత్రులు వుండడం సుఖప్రదం పరస్పరం ఆనందాన్ని పంచుకోవడం సుఖప్రదం. శరీరం వీడకముందే మంచిపనులు చేయడం సుఖప్రదం. దుఃఖాన్నంతటినీ విడనాడటం సుఖప్రదం.

యీ లోకంలో తల్లిగా వుండడం సుఖప్రదం. తండ్రిగా వుండటం సుఖప్రదం. యీ లోకంలో శ్రమణుడిగా వుండటం సుఖప్రదం.

జీవితాంతంవరకు శీలంతో వుండడం సుఖప్రదం. దృఢమైన విశ్వాసం కలిగి వుండడం సుఖప్రదం. పాపరహితుడవడం సుఖప్రదం. జ్ఞానోదయం కలిగివుండి సుఖప్రదం.

## సత్యమేవజయతే

సత్యమనేది బహుమానములన్నింటినీ జయించును. సత్యమనేది రుచి అన్ని రుచులను జయించును. సత్యమనేది సుఖము అన్ని సుఖములను జయించును. కోర్కెలలేమి అన్ని దుఃఖాలనూ జయించును.

సత్యాన్ని ప్రేమించేవారు సత్యాన్నే విశ్వసిస్తారు. సత్యము మనిషిని పవిత్రుడ్ని చేయును. మానసిక, శారీరక దుఃఖాలను పోగొట్టును. సత్యము మనుష్యుల్ని పాపము నుండి రక్షించును. చీకటి నుండి వెలుగుబాటు వైపుకు మరల్చును.

సత్యం గొప్ప నిధినిక్షేపం. సత్యానికి జనన మరణాలు లేవు. ఆద్యంతాలు లేవు. సత్యాన్నే ఆహ్వానించండి. సత్యమే మృత్యువునుండి కాపాడి అమృతత్వానికి చేరుస్తుంది.

సత్యం మరియు 'నేను, నాది, నాకు' అనే అసత్యాల తారతమ్యాన్ని గ్రహించండి. నేను, నాది, నాకు అనేది స్వార్థ చింతన అన్ని అనర్థాలకూ మూలం. సత్యమే న్యాయానికి, ధర్మానికి, కరుణకు, ప్రేమకు మూలం. 'నేను' అనునది స్వార్థాన్ని పెంచుతుంది. 'నేను' (నాది, నాకు) నుండి వెలువడినవి తప్ప వేరే అనర్థాలు లేవు. అన్ని యీర్ష్యాద్వేషాలకూ, కామక్రోధాలకు, అనుమానతలకు, దోపిడీలకు,

రక్తపాతాలకు నేను, నాది, నావి అన్నవే మూలమై వున్నాయి. అన్ని దుష్ట కృత్యాల్ని ప్రేరేపించే 'నేను' అనేది వాడే మారుడు.

వస్తు సమూహాలపై దృష్టి, కోరికలు పడిన వెంటనే మనస్సు నందు 'నేను' అనునది ప్రవేశించి విషయ భోగాల వైపుకు మనస్సును ప్రేరేపిస్తుంది. సుఖాలవైపుకు ఆకర్షిస్తుంది. 'నేను' అనేది మాయ యొక్క తెర. నేను, నాది, నావి నుండి ఉత్పన్నమైన సుఖాలన్నీ అశాశ్వతమైనవి. నేను అనేది అన్ని దుఃఖాలకూ మూలం. యిన్నటికీ తనివితీరని కోర్కెలకు హేతువు.

జనన మరణాలతో కూడిన సంసారమనేది (స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ తదితర) లోకాలన్నీ దుఃఖ భూయిష్టమైనవి. మరియు బాధాకరమైనవి.

కానీ అన్ని దుఃఖాలకీ సత్యమే నివారణోపాయం. సత్యమే మనస్సుకు శాంతి చేకూర్చును. సత్యమే అన్ని అనర్థకములను రూపుమాపును. మరియు కోర్కెలనెడి అగ్నిజ్వాలలను శాంతింప చేయును. సత్యమే నిర్వాణమునకు చేర్చును.

సత్యమే మనల్ని దుఃఖాన్నుండి రక్షిస్తుంది. అందువల్ల సత్యాన్నే మనస్సునందు నెలకొల్పండి. తోటిమానవులలో నెలకొల్పండి.

రాజరథములు కూడా శిథిలమై పోతాయి. అట్లాగే యీ శరీరాలు కూడ. వృద్ధాప్యం, జబ్బులతో కృశించి నశించి పోతాయి. ధర్మమెప్పుడూ శిథిలమై క్షీణము కాదు. సజ్జనులు యీ సంగతి పరస్పరం గ్రహించాలి.

## మిమ్మల్ని మీరు కాపాడుకొనండి

నేను, నాది అన్న ఆలోచనలను విడిచిపెట్టండి. ఉత్తమంగా బతికేందుకు, చెడ్డని సర్వత్రా. విడిచిపెట్టండి. ఈవిధంగా మిమ్మల్ని మీరు కాపాడుకొనండి.

## నైతిక పతనులేమవుతారు?

యౌవనములో బ్రహ్మచర్య సంపదల నార్జించక సౌశీల్యము చెడినవారు-చేపలు లేని చిన్ని మడుగులోని కొంగవలె నశించి పోతారు.

యౌవనములో బ్రహ్మచర్యసంపదల నార్జించక సౌశీల్యము చెడిన వారు విరిగిన పాత విల్లువలె కూలిపోయి తమ పూర్వస్థితిని తలుచుకుని పరితపిస్తారు.

## నన్ను ప్రేమించేవారు అందర్నీ ప్రేమించాలి

శాంతికి మార్గం వుంది. ద్వేషం ద్వేషం వలన పోదు. ప్రేమ వల్లన, కరుణ వల్లన మాత్రమే ద్వేషం పోతుంది. విశ్వశాంతికి మార్గం యిదే. యెవరు నన్ను ప్రేమిస్తారో వాళ్ళు అందరినీ ప్రేమించాలి. స్వార్థాన్ని జయించిన వాణ్ణి యెవరూ జయించలేరు. అతడు అజేయుడు. ప్రతివాళ్ళూ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోరుకుంటారు. యెదుటివారి స్వేచ్ఛకు యెవరూ అడ్డుపోరాదు.

## మానవాళి పురోభివృద్ధికి పాటుపడండి

భిక్షువులారా! జాగరూకులుకండి. మీ మనస్సులను స్వచ్ఛంగా తయారు చేసుకొనండి. మనస్ఫూర్తిగా, దృఢంగా, జాగ్రత్తగా, మానవాళి క్షేమానికి, పురోభివృద్ధికై పాటుపడండి.

## తన సమాధిని తానే తవ్వుకుంటున్న వాడెవడు?

ప్రాణిహింస చేయువాడు-అసత్యవాది-పరధనము అపహరించువాడు-పరభార్యాగతుడు-మద్యపానము చేసేవాడు-యిహ లోకమునందే తనకు తానే సమాధిని తవ్వుకొనుచున్నాడు.

## దోషాలెంచేవాడికి మరింత దుఃఖం పెరుగుతుంది

యితరుల దోషాల్ని లెక్కించడానికి యెటువంటి ప్రజ్ఞ అవసరం లేదు. తనతప్పులు తెలుసుకొనుట చాలకష్టం. యితరుల తప్పులను సులువుగా పొట్టువలె తూర్పారబట్టవచ్చును. మోసగాడు జూదం పాచికలను దాచునట్లు- మనుజులు తమ దోషాల్ని కప్పిపుచ్చ వచ్చును. రంధ్రాన్వేషణాపరాయణుడు-యితరులపై చిర చిరలాడుతాడు. తనను అవమానించినట్లు భావిస్తాడు. అటువంటి వాడికి విషయ వికారములు తగ్గవు సరికదా అధికం అవుతాయి.

## ధ్యాన ప్రయోజనం

ధ్యానం వలన జ్ఞానం కలుగుతుంది. ధ్యాన చ్యుతి వలన అజ్ఞానం దాపురిస్తుంది. లాభ నష్టాలు కల్గించు యీ రెండు త్రోవలను తెలిసికొని వివేకమార్గమును మాత్రమే అనుసరించాలి.

## మంచి స్నేహితుడెవరు?

ఓ గృహస్థుడా! యీ క్రింది వారిని నలుగురిని నీ ప్రాణమిత్రులుగా గుర్తించు.

1. ఆపదలకు అడ్డపడేవాడు
2. కష్టసుఖాల్లో ఒకే రీతిగా మెలిగేవాడు
3. మంచి సలహాలు మాత్రమే యిచ్చేవాడు
4. నిజమైన సానుభూతి ప్రదర్శించేవాడు

యింకా వివరంగా చెప్పాలంటే ఆపదల్లో అడ్డుకునే మిత్రుడు నిన్ను పనీపాటా లేని పరిస్థితి గురించి రక్షిస్తాడు. నీ నిర్లక్ష్య ప్రవర్తన వలన నీ సిరి పోకుండా రక్షిస్తాడు. నీ ఆపదల్లో తాను మేరువై నిలుస్తాడు. నీలేమిలో నీకు కావలసిన దాని కంటే రెట్టింపు సమకూరుస్తాడు.

కష్టసుఖాల్లో ఒకే రీతిగా మెలిగే స్నేహితుడు తన రహస్యాల్ని నీ దగ్గర దాస్తాడు. నీ రహస్యాల్ని తన గుండెలో దాచుకుంటాడు. నువ్వు లేమిలో వున్నప్పుడు నిన్ను వదిలిపెట్టి వెళ్ళిపోడు నీ కోసం తన ప్రాణమైనా యిస్తాడు.

మంచి సలహాలు మాత్రమే యిచ్చే స్నేహితుడు, నువ్వు చెడ్డపనులు చేయకుండా నివారిస్తాడు. మంచి పనులు చేయడానికి ప్రోత్సాహం యిస్తాడు. నీకు తెలియని దాని గురించి నీకు వివరంగా చెప్తాడు. సమస్యలు లేని చోటుకి మార్గం చూపిస్తాడు.

సానుభూతి చూపే ప్రాణమిత్రుడు యెప్పుడూ కూడా నీ లేమి చూసి తాను ఆనందించడు. నీ కలిమిలో తాను ఆనందిస్తాడు. నీ గురించి చెడుగా యితరుల్ని మాట్లాడనీయడు. నీ గురించి మంచిగా మాట్లాడేవారిని శ్లాఘిస్తాడు.

## దుష్ట స్నేహితులెవరు?

ఓ గృహస్థుడా! యీ క్రింది నలుగురినీ స్నేహ రూపంలో వున్న శత్రువులుగా పరిగణించు

1. మిత్రుని సంపదను అపహరించి అనుభవించేవాడు

2. కేవలం మాటలు మాత్రం చెప్పి తప్పించుకొనేవాడు

3. పొగిడి పనులు చేయించుకొనేవాడు

4. తనకు నాశనం తెచ్చేవాడు

ఇంకా వివరంగా చెప్పాలంటే మిత్రుని సంపదను అక్రమంగా అనుభవించేవాడు మిత్రుడి భాగ్యాన్ని దోచుకుంటాడు. కొద్ది మాత్రమే ఇచ్చి హెచ్చు భాగ్యం కోరుతాడు. భయంతో మాత్రమే బాధ్యత నిర్వహిస్తాడు. స్వలాభం కొరకు మాత్రమే స్నేహం చేస్తాడు.

మాటలు మాత్రం చెప్పి తప్పించుకునే మిత్రుడు, గతంలో నీతో గల తన స్నేహం గురించి వర్ణిస్తాడు. భవిష్యత్తులో నీతో మరింత స్నేహంగా వుంటానంటాడు. వట్టిమాటలు చెప్పి నీ అభిమానం చూరగొంటాడు. ఆపదల్లోవున్నప్పుడు అసహాయత ప్రదర్శిస్తాడు.

పొగిడి పనులు చేయించుకునే మిత్రుడు నీ చెడ్డ పనుల్ని సమర్థిస్తాడు. నువ్వు చేసే మంచి పనుల్ని గర్హిస్తాడు. నీ సమక్షమందు పొగుడుతాడు. నీ పరోక్షమందు నిందిస్తాడు.

నీ నాశనాన్ని కోరే మిత్రుడు, నువ్వు మద్యపానం చేసేటప్పుడు మిత్రుడుగా పాల్గొంటాడు. నీవు వేళగాని వేళల్లో అర్థరహితంగా తిరిగేటప్పుడు నీతోపాటు తిరుగుతాడు. నీతో నాటకాలకీ, విలాసాలకీ వస్తాడు. జూదమాడేటప్పుడు నీ సహచరుడుగా వుంటాడు. కనిపించినప్పుడు మాత్రమే మిత్రమా! మిత్రమా! అని ఎంతో అపేక్ష కనపరుస్తాడు. వీరు కేవలం స్వలాభం కొరకే అలా నటిస్తారు.

విజ్ఞుడు ఇటువంటి మిత్రుల్ని శత్రువులుగా భావించి వదిలిపెడ్తాడు.

## బాధ్యతలు-అనుబంధాలు

### 1. తల్లి దండ్రులు- పిల్లలు

పిల్లలు తమ తల్లి దండ్రుల్ని తమ జీవితానికి తూర్పు దిశగా భావించి వారికి ప్రణమిల్లాలి.

1. నన్ను పోషించినందుకు నేను వారిని పోషిస్తాను. 2. నేను వారి బాధ్యతలను నిర్వహిస్తాను. 3. నా కుటుంబ గౌరవ సాంప్రదాయాల్ని నిలబెడతాను. 4. నావంశానుగతమైన కీర్తికి అర్హుడనై బతుకుతాను. 5. గతించిన జ్ఞాతుల పేరున దానాలు చేస్తాను- అన్న బాధ్యతలను కలిగి వుండాలి.

అందుకు ప్రతిఫలంగా తల్లిదండ్రులు కరుణావాత్సల్యాలతో తమ పిల్లల్ని 1. కీడు నుంచి కాపాడుతారు. 2. మంచి చేయడానికి ప్రోత్సాహం ఇస్తారు. 3. తగిన సంబంధం చూసి పెళ్ళి చేస్తారు. 4. మంచి జీవనోపాధికై తర్ఫీదునిస్తారు. 5. సరి అయిన సమయం వచ్చినప్పుడు తమ వారసత్వపు హక్కుల్ని అప్పగిస్తారు.

### 2. గురుశిష్యులు

శిష్యులు తమ గురువును తమ జీవితానికి దక్షిణదిశగా భావించి వారికి మ్రొక్కాలి.

1. ఆసనము నుండి లేచి నిలుచుట ద్వారా గురువుయెడ తన భక్తిని ప్రదర్శించాలి. 2. గురువుల ఆజ్ఞలను శిరసావహించాలి. 3. జ్ఞానార్జనపై ఆసక్తిని ప్రదర్శించాలి. 4. గురువులకు సపర్యలు చేయాలి. 5. విద్యాబోధన సమయంలో శ్రద్ధాశక్తులు ప్రదర్శించాలి.

అందుకు ప్రతిఫలంగా గురువు వాత్సల్యంతో శిష్యులకు

1. అత్యుత్తమ రీతిలో శిక్షణ గరుపుతారు. 2. తమ బోధనలను శ్రద్ధగా గ్రహించేటట్లు చేస్తారు. 3. వారికి లలిత కళలు, విజ్ఞాన శాస్త్రాలయందు తర్ఫీదు నిస్తారు. 4. తమ స్నేహితులతో, సహచరులతో పరిచయం చేస్తారు. 5. సర్వ విధాలా వారికి రక్షణ కల్పిస్తారు.

### 3. భార్యాభర్తలు

ఓ గృహస్థా! భర్త బాధ్యతతో తన భార్యను తన జీవితానికి పశ్చిమదిశగా భావించి మ్రొక్కాలి.

1. ఆమె యెడ ఆదరణ, దయ కలిగి వుండాలి.
2. ఆమెను అసహ్యించుకొనకూడదు.
3. ఆమెకు విశ్వాసపాత్రుడై వుండాలి.
4. ఆమెకు గృహసంబంధమైన అధికారాన్ని అప్పచెప్పాలి.
5. ఆమెకు యిష్టమైన ఆభరణాలు సంపాదించి పెట్టాలి.

దీనికి ప్రతిఫలంగా భార్య తన భర్త యందు భక్తి గౌరవాలతో మనసారా-

1. తన విద్యుక్తధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తుంది
2. బంధువుల యెడ, భృత్యుల యెడ దయతో ప్రవర్తిస్తుంది.
3. భర్తకు విశ్వాసియై వుంటుంది.
4. భర్త సంపాదనను రక్షిస్తుంది.
5. తన బాధ్యతలను నేర్పుతో, సమర్థతతో నిర్వర్తిస్తుంది.

యీ విధంగా భార్యాభర్తలు యిద్దరూ తమ తమ బాధ్యతలు గుర్తెరిగి జీవించుట ద్వారా ధన్యులవుతారు.

### 4. స్నేహితులు

ఓ గృహస్థా! మిత్రుల పట్ల స్నేహభావంతో వారిని తన జీవితానికి ఉత్తర దిశగా భావించి మ్రొక్కాలి. వారి పట్ల

1. దాతృత్వం కలిగి వుండాలి
2. మర్యాదగా మాట్లాడాలి
3. సహాయభూతుడై వుండాలి.
4. నిస్స్వార్థ బుద్ధితో మెలగాలి
5. నీతికి కట్టుబడి వుండాలి.

దీనికి ప్రతిఫలంగా వాళ్ళుకూడా నీ పట్ల

1. క్లిష్ట పరిస్థితులలో నిన్ను సదా రక్షిస్తారు
2. క్లిష్ట పరిస్థితులలో అతని సంపదను రక్షిస్తారు
3. ఆపదలో ఆశ్రయమిచ్చి ఆదుకొంటారు

4. క్లిష్ట పరిస్థితులలో సైతం నిన్ను విడువరు

5. నీ కుటుంబం యెడల సానుభూతి కలిగి వుంటారు.

యీ విధంగా మిత్రులు తమలో తాము సహజ సానుభూతులను చూపుకోవడం ద్వారా సుఖజీవనాన్ని గడుపుతారు.

## ప్రేమ, కరుణ, మైత్రి

జ్ఞానార్జన అందరికీ అందుబాటులో వేయగలగాలి. అలాగని జ్ఞాన సముపార్జన మాత్రమే చాలదు. ప్రజ్ఞ చూపగలగాలి. ప్రజ్ఞ మాత్రమే చాలదు. దానికి శీలం తోడు కావాలి. ప్రజ్ఞ శీలంతో పాటు కరుణ చాలా అవశ్యకమైంది. ఆ కరుణకంటే మైత్రి మరీ గొప్పది. మైత్రి విశ్వమంత విశాలమైంది. సమస్త జీవరాసుల్నీ ప్రేమించేది. నిజమైన ప్రేమతో, కూడిన మైత్రితో మరే అపస్మృత్యపు సాధనలు పదహారోవంతుకు కూడా సాటిరావు.

## మనవల్లనే

మనవల్లనే యీ పాపాలు
మనవల్లనే యీ బాధలు
మనమే యీ పాపాలను పరిమార్చగలం
మనమే స్వచ్ఛంగా మారిపోగలం కూడా.

## ద్వీపకల్పం

మంచి పనులు చేయడం ద్వారా, గట్టిగా కృషి చేయడంద్వారా, స్వయంగా క్రమశిక్షణకు ధ్యానానికి పూనుకోవడం ద్వారా యెటువంటి వరదవెల్లువా నిన్ను ముంచి వేయకుండా నీ చుట్టూ ద్వీపకల్పాన్ని నిర్మించుకో

## దుఃఖానికి కారణాలు

స్వార్థం, అజ్ఞానం, ద్వేషం - యివే దుఃఖానికి కారణాలు

## చేయవలసినవి

కాదు, అంధఆచారాలను పాటించడం, పవిత్ర నదుల్లో మునగడం - యివి కాదు నిర్వర్తించవలసిన పనులు. జీవరాసులన్నింటి పట్ల దయ కలిగి వుండడం, కోరికల పనికిమాలిన ఆలోచనల బారిన పడకుండా మనస్సును మన ఆధీనంలో వుంచుకోవడం, యివీ చేయవలసిన పుణ్య కార్యాలు.

## స్వేచ్ఛ పొందే దెవరు ?

యెవరు సర్వాన్ని కనుగొంటారో, యెవరు అన్నిటా పరిశుద్ధుడో, యెవరు సాటి మనుషులకు సహాయం చేస్తూ వుంటారో - వారు స్వేచ్ఛని అనుభవిస్తారు.

### అపూర్వ అవకాశం యిది

దుర్లభమీ మానవ జీవితం
దుస్సహమీ మర్త్యుల జీవితం; అయినా

వదులుకోకే అపూర్వ అవకాశం

## యేది వుత్తమమైంది ?

యే మనిషి అయితే మనసులో విశ్వాసంతో ధర్మసూత్రాలను ఆచరించే ధార్మికత తీసుకుంటాడో, ప్రాణహాని తలపెట్టకుండా, తాను యివ్వనిదాన్ని తీసుకోకుండా, న్యాయ ప్రవృత్తికి దూరంగా, చెడు ప్రవర్తన చేయకుండా, అబద్ధం చెప్పకుండా, వెర్రెక్కించే ఘాటైన మత్తుపానీయాలకు దూరంగా, ధార్మికతారాహిత్యానికి, దూరంగా వుంటాడో, అదే దాపోటంగా చేసే దాన ధర్మాలకన్నా నిరంతర భిక్షాదానం కన్నా, విహారదానంకన్నా మార్గ దర్శకత్వాన్ని ఆమోదించడం కన్నా వుత్తమమైంది.

## దుష్టుణ్ణి యెలా గుర్తించాలి?

దుష్టుడు అడక్కపోయినా యితరులను తప్పులెన్నుతాడు. అడిగితే యేకరువు పెడతాడు. అడిగినా యితరుల మంచి యెంచడు. అడక్కపోతే నోరు మెదపడు. గట్టిగా అడిగితే కొంచెం మాత్రమే చెబుతాడు.

అడిగినా తన దోషాలు చెప్పడు. అడక్కపోతే సరేసరి. గట్టిగా అడిగితే కొన్ని ఒప్పుకుంటాడు. కానీ వివరాలివ్వడు. తనలో కొద్దిపాటి మంచి వుంటే అడక్కపోయినా పెద్ద చేసి గొప్పగా చెప్పుకుంటాడు. ఒక వేళ అడిగితే వున్నవీ లేనివీ చక్కగా కల్పించి మరీ చెప్తాడు.

## వాచిక ధర్మాలు

తెలిసికూడా తెలియనట్లు మాట్లాడడం, తెలియకపోయినా తెలిసినట్లు మాట్లాడడం, చూసీ చూడనట్లు మాట్లాడడం, చూడకపోయినా చూసినట్లు మాట్లాడడం, అల్పలాభాపేక్షతో అబద్ధాలాడటం, అక్కడిదిక్కడ, యిక్కడిది అక్కడ చెప్పడం, పొసగని మాటలుచెప్పి సిగపట్లు పట్టేటట్లు మాట్లాడడం, అపవాదులు సృష్టించడం, మొరటుగా, హీనంగా, పరుషంగా, పక్కదారిగా మాట్లాడడం అధర్మవాచికాలు.

ధర్మపరుడెన్నడూ యీ విధంగా మాట్లాడకూడదు. అతడు వున్నదున్నట్లుగా చెప్పాలి. కలుపుకోలుతనంగా, సమ్మతంగా మాట్లాడాలి. సౌమ్యంగా, స్నేహపాత్రంగా, హృదయపూర్వకంగా అందర్నీ పలకరించాలి. సత్యాన్నే అతడు ధరించాలి. యిదే వాచిక ధర్మం.

## మంచి ఆలోచన

మంచి ఆలోచన అనే విత్తనాన్ని నాటు
    ఆచరణ అనే మొక్కగా యెదిగించు
ఆచరణ అనే విత్తనాన్ని నాటు
    అలవాటు అనే చెట్టుగా పెరిగించు
అలవాటు అనే విత్తనాన్ని నాటు
    గుణం అన్న వృక్షంగా మార్చు
గుణం అనే విత్తనాన్ని నాటు
    సంఘానికే మహత్తర భాగ్యంగా మారిపో

## శుభ కామన

బాధలు పడువారు బాధల నుండి విముక్తులయెదరుగాక భయపడు వారికి ధైర్యం అలవడుగాక అణగారిపోయిన వాళ్ళు గర్వంగా తలయెత్తుకుని జీవింతురు గాక అనారోగ్యంతో వున్న వాళ్ళు ఆరోగ్యం పొందెదరుగాక

## ధన్యుడెవరు ?

వెయ్యి పద్యాలు వల్లించి, వాక్య పంక్తిని కూడా అర్థం చేసుకోని వారికన్నా, ఒక పంక్తి చదివి అర్థం చేసుకుని ఆ ప్రకారం ఆలోచనలను అదుపులో పెట్టుకుని నడుచుకునేవాడు ధన్యుడు. యెన్ని పాఠాలు వల్లెవేస్తే యేం ప్రయోజనం? వాక్య, ధర్మవాక్యాన్ని అర్థం చేసుకుని దాని ప్రకారం నడుచుకునే వాడు ధన్యుడు. వుత్తమ జీవనానికి, విజ్ఞానానికి ఆచరణే మార్గం. హిమవత్పర్వతపు మంచువలె సజ్జనులు దూరంనుండే ప్రకాశిస్తారు. కానీ దుర్జనులు చీకటిలో విసిరిన బాణంలాగా దాగి వుంటారు

## మిత్రులనెలా పొందగలం?

యివ్వడం ద్వారా మిత్రుల్ని పొందవచ్చు. మిత్రత్వం, ప్రేమ, దయ, అభిమానం, స్నేహం, కరుణ, ఆప్యాయత అన్నీ కూడా యివ్వడం ద్వారా మనిషి పొందగలడు.

## విజేత బాధ్యతేమిటి?

గెలిచినవాడు తన దక్షత వుపయోగించి, వోడినవాడిని అనునయపరచి, దయాదృష్టితో యెలాంటి గర్వాన్ని ప్రదర్శించకుండా, సుహృద్భావంతో అతిథి మర్యాదలు చూపాలి. అంతేగాని ఆత్మనిగ్రహాన్ని కోల్పోయి, నీచస్థాయికి దిగజారి, వోడినవాడిని నిందావాక్యాలతో బాధించకూడదు. యిట్లా బాధించడం, అవమాన పరచడం నీచాతినీచమైన విషయం.

యెవ్వరూ పాటివారిని హేళన చేయడం, అవమానించడం చేయరాదు. యెవ్వరూ మరొకర్ని ద్వేషించడం తగదు.

## ఆయన సందేశం

మేల్కొనివున్నవారు యిది (నా సందేశం) వినండి. నిద్రిస్తున్న వారు మేల్కొనండి. నిద్రించుటకంటే మేల్కొని వుండుట శ్రేయస్కరం. మేల్కొనివున్న వారి భయం లేదు

"సబ్బపాపస్స అకరణం
కుసలస్స వుపసంపదా
సచిత్తపరియోదపనం
యేతం బుద్ధాన శాసనం"

యే పాపములను చేయరాదు. మంచినే ఆచరించాలి. మనస్సును పరిశుద్ధ పరచుకోవాలి. యిదే బుద్ధాను శాసనం."క్షమయే మహా తపస్సు. నిర్వాణమే పరమపదము." యిది బుద్ధాను శాసనం. పరులపై పగబట్టువాడు శ్రమణుడు కాడు. పరహింస చేయువాడు బౌద్ధుడు కాడు. యితరుల నిందింపరాదు. హింసింపరాదు. మిత భోజనము - యే కాంత వాసముతో ధర్మమునందాసక్తి కలిగి. జిజ్ఞాసతో జీవితం గడపాలి. యిదే బుద్ధుని శాసనం. ప్రేమ శాసనం.

------

## అధ్యాయం - III

# బౌద్ధధర్మ అనుసరణ - ఆరాధన - పఠన

### ఆరాధన అవసరమేనా?

ఈ సమస్త ప్రకృతినీ, మనిషినీ నడిపే అతీతమైన శక్తి ఒకటి వున్నదనీ, ఆ శక్తి అభీష్టం నియంత్రణం మేరకే ఈ ప్రకృతి, మనుషులూ యిలా వుంటున్నారనీ చెప్పే తాత్విక భావాలను గౌతమబుద్ధుడు తోసి పుచ్చాడు. అతీతశక్తుల పేర, దేవుళ్ళ పేర పూజలు, యాగాలు, బలులు చేసే పద్ధతుల్ని అతడు తృణీకరించాడు.

ఈ సమస్త విశ్వం అనిత్యమనీ, పదార్థమయమనీ, యిది నిరంతరం మార్పులు చెందుతూ వుంటుందనీ, దీనిలో దేనికీ 'నా' అన్నది లేదనీ బుద్ధుడు బోధించాడు. మానవుడు అజ్ఞానం వల్ల, మూఢనమ్మకాలవల్ల జీవితాన్ని దుఃఖభాజనం చేసుకుంటున్నాడనీ, యిటువంటి అతీతశక్తుల ప్రసక్తిలేకుండా మనిషి తన విశిష్ట మేధా సంపత్తితో జీవితాన్ని చరితార్థకం చేసుకోగలడనీ, దుఃఖాన్నుండి విముక్తుడు కాగలడనీ చెప్తూ అందుకు మార్గాన్ని కూడా గౌతమబుద్ధుడు వుపదేశించాడు. ఆ మార్గం భౌతికవాద ప్రేరితమైనటువంటిది. హేతువాద పూరితమైనది. అజ్ఞానమూఢవిశ్వాసాలను నశింపచేసేటటువంటిది. ప్రత్యేకించి అధ్యాత్మిక మైనట్టిది. మనిషిని మహామనిషిగా, త్యాగిగా మార్చేటటువంటిది.

అటువంటి మార్గాన్ని చూపించిన గౌతమబుద్ధుని, మిగతా మతస్థులు చేసే విధంగా పూజా పునస్కారాలు చేయడం, ఆయనను దైవంగా ఆరాధించడం న్యాయమేనా? సబబేనా? అన్న ప్రశ్న రావడం సహజం.

బుద్ధుడు బ్రతికివున్న కాలంలో యిటువంటి ఆరాధన యేమీ వున్నట్టు లేదు. అంతా జ్ఞానబోధనగా, క్రమశిక్షణాపూరిత ఆచరణగా మాత్రమే అందరూ అతని తత్వాన్ని బోధనలను అవధరించడం జరిగేది. బౌద్ధ భిక్షువులకు కచ్చితమైన మార్గసరళి వుండేది దానిని అతిక్రమించే వారిని అనర్హులుగా చేయడం జరిగింది.

బుద్ధుని తరువాత రెండువందలేళ్ళకి బౌద్ధ తత్వం నుండి ఒక బలమైన వర్గమేర్పడి మహాయానశాఖగా రూపు దిద్దుకుంది. వారు మారుతున్న కాలపరిస్థితులకనుగుణంగా బౌద్ధ ధర్మాచరణలో కొంత సడలింపుల్ని మార్పుల్ని కోరుకున్నారు. గౌతమబుద్ధుడు కూడా భిక్షుసంఘంలో క్షుణ్ణంగా పరిశీలన, అధ్యయనం చేస్తే ధర్మాచరణలో మార్పులు తెచ్చుకోవచ్చునని చెప్పాడు. అయినా అటువంటి మార్పులను థేరవాదంగా పిలువబడుతున్న బుద్ధుని కాలంనుంచీ వస్తున్న బౌద్ధ ధర్మాచార్యులు అంగీకరించలేదు. ఆ మార్పులు అసలు బౌద్ధ ధర్మానికే చేటు తెచ్చేవిగా వారు భావించారు.

కాలగతిని యెవరూ మార్చలేకపోయారు. చీలిన మహాయానశాఖ మరింత బలిష్టమైనది. థేరవాదం కూడా తన వునికిని మహాయానమంతగా కాకపోయినా భారత, శ్రీలంక దేశాలలో గట్టిగానే నిలబెట్టుకుంది. మహాయానశాఖ జ్ఞానముపార్జనలో మరింతముందుకు నడిచింది. స్వార్థ, వినాశక, అనైతిక శక్తులు బలపడి రాజాశ్రయాలు పొందుతూ బౌద్ధం నెలకొల్పిన విశ్వమానవ

సౌభ్రాతృత్వాన్ని అవహేళన చేసే, నాశనం చేసే పరిస్థితులు పెరుగుతున్నాయి. సామాన్య ప్రజలు యిది ధర్మం దీనిని ఆచరించవలసింది అని చెప్తే వినేటట్లుగా లేరు. రాజాశ్రయాలు సంపాదిస్తున్నవారి ప్రచారాలు, వారికి లభిస్తున్న ఆదరణ వారు కల్పిస్తున్న పూజా విధానాలు మనుషులలో యెక్కువ తక్కువ వున్నారని చెప్తున్నప్పుడు యెక్కువైనవాళ్ళు పొందే ఆనందం యివన్నీ బౌద్ధ ధర్మానికి చేటుగా దాపురించాయి.

దానితో యెక్కువ తక్కువలు చూడకపోయినా, విశ్వమానవ తత్వాన్ని వదలకపోయినా, బుద్ధుని మాత్రం తేజోస్వరూపుడిగా, భగవంతునిగా, అతిలోక మానవుడిగా వి శ్రీకరించడం జరిగింది. ఆరాధనకు బౌద్ధగ్రంథాల ఆధారంగా బుద్ధుని మూర్తిమంత్వాన్ని రూపకల్పన చేయడం జరిగింది. తామూ రాజాశ్రయాలను సంపాదించడం జరిగింది. దానితో మహాయాన శాఖ వేళ్ళునన్నుకుని, బౌద్ధధర్మం సామాజికాభివృద్ధిలో తనవంతు కృషి చేసి, ఆకాలం నాటి దేశ రాజకీయాలను ప్రజాక్షేమానికి అనుగుణంగా వుండేటట్లు దాదాపు వేయిసంవత్సరాల పాటు బలీయమైన ప్రభావం వేయగల్గింది. బౌద్ధ ధర్మం విశ్వవ్యాప్తమైంది. బుద్ధుని ఆరాధనకు అంతటి ప్రాచీన చరిత్ర వుంది.

అయితే, యీ ఆధునిక కాలంలో కూడా బుద్ధుని దేవునిలా ఆరాధించవలసిన అవసరం వుందా యిది మూఢత్వాన్ని సరికొత్త గా పాదుకొల్పడం కాదా అని చాలామందికి అనిపించవచ్చు.

బౌద్ధధర్మం - నిత్యాచరణ ధర్మం. యిది జీవితధర్మంగా అనుసరించినప్పుడే మనిషి విజయుడవుతాడు సంపూర్ణ మానవుడవుతాడు. యిందుకతడు ప్రతిక్షణం బుద్ధుని వుపదేశాలను స్మరణకు తెచ్చుకుంటూ వుండాలి. ఆ బోధనలపై మనస్సును కేంద్రీకరించాలి. యీ ప్రకరణంలో యిస్తున్న బుద్ధస్తుతి. త్రిశరణం పంచశీలతో కూడిన యేకాదశ సుచరితం పఠించడం ద్వారా యెవరైనా యెవరికివారే బౌద్ధధర్మాన్ని, బౌద్ధమతాన్ని స్వీకరించవచ్చు తాము బౌద్ధమతస్థుల మని ప్రకటించుకోవచ్చు కేవలం బౌద్ధ భిక్షువుద్వారా మాత్రమే తీసుకోవాలన్న ఖచ్చితమైన నియమమేమీ లేదు. అలా తీసుకుంటే మంచిదే మంచిపనులు చేయడంలో ఆలస్యం తగదు మార్పుకోరే మనసే బౌద్ధానికి సాక్షి. ఆ వ్యక్తి ఆచరణ ద్వారా అది వెల్లడవుతుంది.

కేవలం బుద్ధుని బోధనలను పఠించడం వలన మాత్రమే యెవరైనా పూర్తి విజయం సాధించగలుగుతే అది చాలా గొప్ప విషయం.

బుద్ధుని బోధనలను అనుసరించేందుకు, ఆ సిద్ధాంతాలు మన జీవితంలో భాగం అయ్యేందుకు. మనలని సదా హెచ్చరికచేస్తూ మనల్ని సన్మార్గంలో పెట్టేందుకు, ఆయన బోధనలను ప్రతీనిత్యం ఒక పద్ధతిలో పఠించితే చాలామంచిది. జీవితంలో జరిగిన మంచి చెడులను విశ్లేషించుకుని, వ్యక్తిగతంగా చేసిన తప్పులు పునరావృతం కాకుండా, జాగ్రత్తపడేందుకు బుద్ధుని ఆరాధన, బోధనలు యెంతో వుపకరిస్తాయి. ఆయన చెప్పిన బోధనలను ధర్మాలను వరుసగా ధ్యానించడమే బుద్ధుని ఆరాధన. ఆయన మన యెదురుగానే వున్నట్లు వూహించుకుంటే జాగరుకతతో వుండేందుకు మరింత అవకాశం వుంటుందన్న ఆలోచనవలన బుద్ధుని ప్రతిమను ఆరాధించడం, పూజించడం జరుగుతుంది. 'భగవానుడు' అంటే పెద్దవాడు, గొప్పవాడు అన్న అర్థమే కాని దేవుడు మహిమలు కలవాడు అన్న అర్థంలేదు. బుద్ధుని విషయంలో అటువంటి అర్థంతీసుకోవలసిన అవసరమే లేదు.

బుద్ధుని ఆరాధన అందమైన కల్పన. మనస్సుకి సంతుష్టిని. స్థైర్యాన్ని యిస్తుంది. విగ్రహాన్ని

అతీతమైనశక్తిగా భావించము. దానికి నైవేద్యాలు సమర్పించము. బలులు అన్నమాటే లేదు. మంత్రతంత్రాలసలే లేవు. ఆ విగ్రహాన్ని మన గురువుగా, కొండంత అండగా భావిస్తాము. మన తప్పులను మనమే వేలెత్తి చూపుకుంటాము. ఆయనని స్తుతించడం కూడా ఆయన చెప్పిన బోధనలను జ్ఞప్తికి తెచ్చుకునేటట్లుగా సహజ ధోరణిగా వుంటుంది. యే మూఢత్వమూ, స్వార్థమూ, మొక్కుబడులూ లేని సహజసుందరమైన నిర్మలారాధన యిది.

చెప్పాలంటే బుద్ధుని ఆరాధన అంతర్గతమైన అనుభవం. అది మన మనస్సును మనం చక్కదిద్దుకోవడమే. దానిని స్వచ్ఛంగా, నిర్మలంగా, న్యాయబద్ధంగా, సహజ సుందరంగా తయారు చేసుకోవడమే. ఆయన తన జీవితమంతా ప్రజలకు అర్పించాడు. ఆయన జీవితంలో ప్రతీ సంఘటనా యెంతో మానవీయమైనటువంటిది. యెటువంటి ఆరాధనా అవసరం లేదనే వారు సైతం, వారు నమ్మిన వారి పటాలను, ఛాయాచిత్రాలను యింట్లో జ్ఞాపికగా వుంచుకుంటారు. అటువంటిది ప్రేమేతానైన, సత్యమేతానైన, గౌతమబుద్ధుని స్మరించడానికి ఆయన ప్రతిమగానీ, పటంగానీ యింట్లో వుంచడంవలన అది మంచికే దారి తీస్తుంది. మంచిని ఆరాధించడం, ఆరాధించేది మంచిని కావడంవల్ల అది మంచికే దారి తీస్తుందన్నది అనుభవసత్యం.

ఆరాధన పలానావిధంగా చెయ్యాలన్న నియమం యేదీ లేదు. కొందరు చెప్పిన దంతా పాటిస్తారు. కొందరు యింకా యెక్కువ పాటించవచ్చు. కొందరు మితంగా పాటించవచ్చు. కొందరు మనస్సులో అలా కాసేపు ధ్యానించవచ్చు. అదీ మన భాషలోనే.

ఆ ధ్యానం అర్థంకాని ధ్వనుల సమూహంకాదు. మన భాషలోనే. మనకి అర్థమయ్యే రీతిలోనే. అంతర్జాతీయత కొరకు బౌద్ధులు ఆరాధనలో ముఖ్యమైన త్రిసరణం, పంచశీలలు మాత్రం బుద్ధుడు ప్రవచించిన పాళీ భాషలోనే పఠిస్తారు. తెలుగు, పాళీ రెండూ యివ్వడం జరుగుతూంది. ధర్మావలంబికులు యేదైనా పాటించవచ్చు. రెండూ పఠించడం మంచిది.

బుద్ధుని ఆరాధన - ఆస్తికత్వపు దైవారాధన కాదు. అజ్ఞానానికి దారితీసే మూఢారాధన కాదు. అదొక స్మృతిగీతం హృదయనాదం. జ్ఞాన ప్రమాణం. అమరత్వానికి మనో ప్రయాణం. సర్వభూత సమతా సంకల్పం. సహజమైన తెలుగులో చెప్పాలంటే జ్ఞానయుతంగా యెవరికీ హానికరం కాకుండా మంచిపనులు చేస్తూ హృదయశుద్ధి చేసుకోగలవని యెవరికివారు అనుదినమూ వొట్టుపెట్టుకోవడం. అటువంటి బుద్ధుని ఆరాధన తెలుసుకుంటే అది మంచి విషయమే అని ప్రతీ వొక్కరూ భావిస్తారు. ధ్యానించిన వారికి ఫలితం మంచి వైపుకే వుంటుందెపుడూ.

## బుద్ధ స్తుతి

"నిరోధమనే సమాధినుంచి లేచి తేజోమయుడైన బుద్ధ భగవానుని యీ పుష్పాలద్వారా పూజిస్తున్నాను. యీ పుష్పాలు చూడడానికి యెంతో అందంగా వున్నాయి. యెంతో పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. వాటి వునికి కూడా మహత్తరంగా వుంది. అయినప్పటికీ యివి అతి త్వరలోనే వడిలిపోయి, అందాన్ని కోల్పోయి, దుర్గంధాన్ని కల్గిస్తాయి. వీటి యొక్క వునికి వ్యర్థమై నశించి పోతాయి. యీ ప్రకారంగా వుత్పన్నమయ్యే ప్రతీ పదార్థమూ నాశనమయ్యేదిగా, దుఃఖంతో నిండి వుండేదిగా వుంది. అదే రీతిగా పుట్టినది ప్రతీదీ అనాత్మయే. దేనికీ 'నాది' అంటూ యేదీ లేదు. ప్రతీదీ మారుతూ నశించిపోతూ వుండేదే.

యీ స్తుతి వందన మరియు పూజ యొక్క ప్రభావం వలన నాలో కామక్రోధాది సకల పాపములు తొలగుగాక.

భగవానుడు, అర్హంతుడు, సమ్యక్ సంబుద్ధుడు అయివుండి యెవరి ధర్మం మధురాతి మధురంగా చెప్పబడిందో యెవరిశిష్యగణం సన్మార్గానువర్తనులై చరించుచున్నారో, అట్టి బుద్ధ భగవానునికి, ఆయన ధర్మమునకు సంఘ సహితముగా నేను యీ పుష్పములతో పూజిస్తున్నాను.

యీ ప్రకారంగా పరిశుద్ధమైన హృదయంతో ఆచరిస్తున్న బుద్ధ పూజ ద్వారా బౌద్ధ ధర్మం చిరకాలం స్థిరంగా వుండుగాక. సర్వజనులు సదా సుఖింతురు గాక.

బుద్ధ భగవానునికి తన ఛాయలో ఆశ్రయమిచ్చి తాను రాగ ద్వేషమోహమద మాత్సర్యాల వంటి శత్రువులను జయించుటకు, సర్వజ్ఞత పొందుటకు దోహదకారిణైన బోధివృక్షానికి ప్రణమిల్లుతున్నాను. లోకనాథుడైన బుద్ధుని పూజలు సైతం అందుకున్న బోధిరాజమా! నీకు నాప్రణామములు.

బౌద్ధ ధర్మ ప్రతి పత్తిలో నేను బుద్ధ, ధర్మ సంఘాలను పూజిస్తున్నాను. నిశ్చయంగా బౌద్ధ ధర్మ ప్రతిపత్తి ద్వారా, జనన, వృద్ధాప్య మృత్యువులనుండి ముక్తి పొందగలను. యీ పుణ్యకర్మ ద్వారా నేను నిర్వాణపథం చేరువరకు నాకు మూర్ఖుల సాంగత్యం కలుగకుండా వుండుగాక. సదా సత్పురుషులతో మైత్రి వృద్ధి చెందునుగాక. పుడమిసస్యశ్యామలమగునట్లు సకాలములో వర్షాలు కురియునుగాక. యిట్టి సంపదతో ప్రజలు సమృద్ధిగా సుఖశాంతులు పొందెదరుగాక. పరిపాలకులు ధార్మిక బుద్ధితో పాలింతురుగాక.

## బుద్ధునికి ప్రణామములు

## నమోతస్స భగవతో అర్హతో సమ్మాసంబుద్ధస్స

యథార్థజ్ఞాని పూజ్యభగవాన్ బుద్ధునికి నమస్కారములు

### త్రిశరణం

బుద్ధం శరణం గచ్ఛామి

ధమ్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి

నేను బుద్ధుని శరణు పొందుచున్నాను

నేను బుద్ధుడు ప్రవచించిన ధర్మాన్ని శరణు పొందుచున్నాను

నేను బుద్ధుడు ప్రవచించిన ధర్మాన్ని వ్యాప్తిచేయుటకు జీవితాలను అంకితం చేసిన

భిక్షు సంఘాన్ని శరణు పొందుచున్నాను

దుతియంపి బుద్ధం శరణం గచ్ఛామి

దుతియంపి ధమ్మం శరణం గచ్ఛామి

దుతియంపి సంఘం శరణం గచ్ఛామి

నేను రెండవసారి బుద్ధుని శరణు పొందుతున్నాను.

నేను రెండవసారి బుద్ధుడు ప్రవచించిన ధర్మాన్ని శరణు పొందుతున్నాను

నేను రెండవసారి బుద్ధుడు ప్రవచించిన ధర్మాన్ని వ్యాప్తి చేయుటకు జీవితాలనంకితం చేసిన

భిక్షు సంఘాన్ని శరణు జొచ్చుతున్నాము.

తతియంపి బుద్ధం శరణం గచ్ఛామి
తతియంపి ధమ్మం శరణం గచ్ఛామి
తతియంపి సంఘం శరణం గచ్ఛామి
నేను మూడవసారిగా బుద్ధుని శరణు జొచ్చుతున్నాను
నేను మూడవసారి బుద్ధుడు ప్రవచించిన ధర్మాన్ని శరణు జొచ్చుతున్నాను
నేను మూడవసారి బుద్ధుడు ప్రవచించిన ధర్మాన్ని వ్యాప్తి చేయుటకు జీవితాలంకితం చేసిన
భిక్షు సంఘాన్ని శరణు జొచ్చుతున్నాను.

## ఏకాదశ సుచరితం

(యిందులో మొదటి అయిదూ పంచశీల)

1. పాణాతిపాతా వేరమణీ సిక్ఖాపదమ్ సమాదియామి
   నేను జీవహింస చేయనను నియమమును పాటింతును
2. అదిన్నాదానా వేరమణీ సిక్ఖాపదమ్ సమాదియామి
   నేను పరుల వస్తువులను దొంగతనము చేయనన్న నియమమును పాటింతును
3. కామేసు మిచ్ఛాచారా వేరమణీ సిక్ఖాపదమ్ సమాదియామి
   నేను వ్యభిచరించనన్న నియమమును పాటింతును
4. ముసావాదా వేరమణీ సిక్ఖాపదమ్ సమాదియామి
   నేను అసత్యము పలుకనను నియమమును పాటింతును
5. సురామేరయ మజ్జపమా దట్ఠానా వేరమణీ సిక్ఖాపదమ్ సమాదియామి
   నేను మత్తును కల్గించు విచక్షణా జ్ఞానమును పోగొట్టు మద్యపానమును విసర్జింతునను
   నియమమును పాటింతును
6. పిసునాయవాచాయ వేరమణీ సిక్ఖాపదం సమాదియామి
   నేను అతిగా మాట్లాడనను నియమమును పాటింతును
7. ఫరుసాయ వాచాయ వేరమణీ సిక్ఖాపదం సమాదియామి
   నేను పరుషముగా మాటలాడనను నియమము పాటింతును
8. సంఫప్పలాపవాచాయ వేరమణీ సిక్ఖాపదం సమాదియామి
   నేను పిచ్చిమాటలాడనను నియమమును పాటింతును
9. అభిజ్ఝాయ వేరమణీ సిక్ఖాపదం సమాదియామి
   నేను లోభము నుండి విరక్తుడనై వుందునన్న నియమమును పాటింతును.
10. వ్యాపాదా వేరమణీ సిక్ఖాపదం సమాదియామి
    నేను క్రోధము నుండి విరక్తుడనై వుందునన్న నియమమును పాటింతును.
11. మిచ్ఛాదిట్ఠి వేరమణీ సిక్ఖాపదం సమాదియామి
    నేను వుచ్ఛేదవాదము, శాశ్వతవాదము మొదలైన వాదముల నుండి విరక్తుడనై వుందునన్న
    నియమమును పాటింతును.

## సంకల్పం

యిమాయధమ్మానుధమ్మ పటిపత్తియా బుద్ధం పూజేమి
యిమాయ ధమ్మానుధమ్మ పటిపత్తియా ధమ్మం పూజేమి
యిమాయ ధమ్మానుధమ్మ పటిపత్తియా సంఘం పూజేమి
అద్ధాయిమాయ పటిపత్తియా జాతి జరామరణ మహా పరిముచ్చిస్సామి
యిమినా పుణ్ణకమ్మేన మామేవ బాలసమాగమో
సతమ్ సమాగమో హోతు యావ నిబ్బాన పత్తియా
దేవో వస్సతుకాలేన సస్స సంపత్తి హేతుచ
ఫీతోభవతు లోకో చరాజా భవతు ధమ్మికో॥

బౌద్ధ ధర్మప్రతిపత్తికై నేను బుద్ధ, ధర్మ, సంఘములను పూజించుచున్నాను. నిశ్చయముగా బౌద్ధ ధర్మ ప్రతిపత్తి ద్వారా జనన, వృద్ధాప్య మృత్యువుల నుండి ముక్తి పొందగలను. యీ పుణ్యకర్మ ద్వారా నేను నిర్వాణ పదమును చేరువరకు నాకు మూర్ఖుల సాంగత్యము కలుగకుండును గాక! సదా సత్పురుషులతో మైత్రి వృద్ధి చెందును గాక! పృథ్వి సస్యశ్యామలమగునట్లు సకాలములో వర్షములు కురియును గాక! యిట్టి సంపదలతో ప్రజలు సమృద్ధిగా సుఖ శాంతులు పొందెదరు గాక. పరిపాలకులు ధార్మిక బుద్ధితో పాలింతురు గాక.

భూమ్యాకాశములు నిండియున్న సకల జీవరాశులు, అనంతశక్తి సంపన్నులైన దేవనాగులు యీ పుణ్యఫలమును పంచుకొందురుగాక! యీ బౌద్ధ ధర్మమును శాశ్వతముగా రక్షింతురు గాక.

బుద్ధస్తుతి, త్రిశరణాలు, పంచశీలతో కూడిన యేకాదశ సుచరితం, సంకల్పం శ్రద్ధగా మనసు పెట్టి ధ్యానించిన తరువాత అష్టాంగమార్గాన్ని సమ్యక్‌సమాధిలోని ధ్యాన పద్ధతుల్ని యితర బోధనలను వీలైతే యీ విధంగా ప్రతి మాటనీ లోతుగా భావిస్తూ పఠించాలి.

అనిత్యం సర్వం అనాత్మం దుఃఖం పరస్పరాధారా భూరితం స్వభావ శూన్యం ప్రతీత్య సముత్పాదం అవిద్యాశ్రితం పరమార్థ సందర్శితం యిది తథాగత బోధనామృతం మానవాళ్ళకి మహోన్నత సాధనం యిది చతురార్య సత్యం యిది దుఃఖం దుఃఖ సముదయం-దుఃఖ నిరోధం దుఃఖ నిరోధమార్గం-ఆర్య అష్టాంగ మార్గం సమ్యగ్ దృష్టి సమ్యక్ సంకల్ప సమ్యగ్ వాక్కు, సమ్యగ్ కర్మాంత సమ్యగాజీవం, సమ్యగ్ వ్యాయామం సమ్యక్ స్మృతి సమ్యగ్ సమాధి కాయవేదన చిత్తధర్మ ధ్యానం మైత్రి కరుణ ముదిత ఉపేక్ష బ్రహ్మ విహారం నిర్వాణం పరమార్థ సాధనం విశ్వ మానవ కళ్యాణం-విశ్వ మానవ కళ్యాణం.

అనిరోధమనుత్పాదమనుచ్ఛేదమశాశ్వతమ్
అనేకార్థమనానార్థమనాగమమనిర్గమమ్
యః ప్రతీత్యసముత్పాదం ప్రపంచోపశమం శివం
దేశయామాస సంబుద్ధస్తం వందే వదతాం వరమ్

యీ భావాలు, ఆదర్శాలు జీవితంలో భాగాలుగా అవుతున్న కొద్దీ, మనిషికి స్థిరచిత్తత, శాంతి, కరుణా, త్యాగాలు అంతకంతకూ అభివృద్ధి అవుతూ, జీవితాన్ని విశ్వ మానవ కళ్యాణానికి ఆచరణ దిశగా తీసుకువెళ్ళి జీవితాన్ని చరితార్థం చేస్తాయి. అనిర్వచనీయమైన, స్థిరమైన శాంతిని తనకూ, తనవల్లలోకానికీ ప్రసాదిస్తాయి. బౌద్ధారాధన శుభం. బౌద్ధ ధర్మ పఠనం శుభం. బౌద్ధ ధ్యానయోగం శుభం బౌద్ధ ధర్మాచరణం శుభం. శుభం.

## అధ్యాయం - IV

# గౌతమబుద్ధుడు-బౌద్ధం-సాంఘిక విప్లవం

ఒక మౌని. తాత్వికుడు. అహింసావ్రతుడు, యెటువంటి ఆయుధబలమూ లేనటువంటి వాడు, తనధర్మం చేత. ధర్మాచరణ చేత. అపార కరుణా సముద్ర హృదయం చేత తన కాలంలోనే ఒక మహాసాంఘిక విప్లవం నడిపాడంటే, దాని ఫలాలు అందరూ సమానంగా అందుకునేటట్టు చేయగలిగాడంటే అతడి తదనంతరం పదిహేనువందల సంవత్సరాలపాటు ఆ ధర్మం పూవు పువ్వులై దేశ దేశాల వికసించిందంటే, దేశదేశాలా యింకా  అప్రతిహతంగా కొనసాగుతూ వున్నదంటే ఆశ్చర్యం వేస్తుంది.

యిది యెలా సాధ్యమైంది?

అతడి గొప్ప తాత్విక చింతన వలనే యిది సాధ్యమైంది. అతడి తత్వ చింతన అంతా సత్యంపైన ఆధారపడింది. అందువల్లనే అది హిమాలయమంత యెత్తుకు యెదగగలిగింది. అతడి ధర్మం మానవధర్మం. యీనాటి ప్రజాస్వామ్యం, సర్వమానవసమానత్వం, సర్వజీవ సంక్షేమం. పర్యావరణపరిరక్షణ అన్నీ ఆయన ధర్మంలో ఆనాడే ప్రముఖస్థానం వహించాయి. రాజ్యాంగంలో రాసుకున్నా యెన్ని చట్టాలు చేసుకున్నా యిప్పటికీ అవి మనకి గగనకుసుమాలుగానే వుంటున్నాయి. దానికి కారణం ఆయనే చెప్పినట్టు, 'అవిద్య-అజ్ఞానం'.

ప్రపంచానికి జ్ఞానం అందించేటందుకు 'నా' అన్నది తొలగించేసుకోవలసివుందని అతడు శిష్యులకు బోధించాడు. జ్ఞానాన్ని తెలుసుకునేందుకోసం. విలాసాలను త్యజించి. మితమైన కోరికలతో జీవించమనీ. జ్ఞానమార్గాన్నీ. ధర్మమార్గాన్నీ  అనుసరించమనీ, తన సుఖంకోసం యెవరికీ. యే జీవికీ కించిత్ అపకారం కూడా చేయవద్దని అతడు ప్రజలకు బోధించాడు. అధర్మంగా డబ్బు సంపాదించడాన్ని అతడు గర్హించాడు. నిరసించాడు. అజ్ఞానంలో, మూఢ విశ్వాసాలలో దురలవాట్లలో కూరుకుపోయి జీవితాన్ని పతనం చేసుకోవద్దన్నాడు. సత్యాన్నే ప్రేమించమన్నాడు. సత్యంగా బతకమన్నాడు. సత్యంలోనే తనకీ యితరులకీ కూడా సుఖముందన్నాడు.

ఆనాటి సమాజంలో మనిషికి విలువలేదు. ప్రాణాలకు రక్షణ లేదు. జీవితానికి భద్రత లేదు. జ్ఞానాన్ని నిరాకరించారు. అతడు కేవలం బతకడంకోసం మాత్రమే బతకాలి. సంపదలు సృష్టించాలి. సమస్త సంపదలన్నీ రాజుల, రాజ్యాధికారుల, మండలాధీశుల గుప్పిట్లో వుండేవి. తమ బాధలు కలబోసుకుని అధికారులను యేమనడానికైనా వారికి హక్కులేదు. వారిలో వారు కలవకుండా కులభేదాలు సృష్టించారు. వారిలో వారికి ధర్మం పేర అడ్డుగోడలు సృష్టించారు. దేవుడు, ఆత్మ, కులం మొదలైన పలాయన భావతత్వాలు ప్రవేశపెట్టారు. యజ్ఞయాగాదులంటూ పశుసంపదల్ని హరించేస్తూ గ్రామీణ ప్రజల్ని నరక బాధల పాల్జేసేవారు.

యిటువంటి దారుణ, సంక్లిష్ట సమాజంలో గౌతమబుద్ధుడు పుట్టాడు. తన హేతుబద్ధమైన ఆలోచనలతో, తాత్వికచింతనతో నిర్హేతుక భావాలను, ప్రజలను అజ్ఞానంలో, బానిసత్వంలో పడేసే భావాలను తుత్తునియలు చేశాడు. నిరర్థక తర్కవితర్కాలకు దారి తీసే దేవుడు, ఆత్మ మొదలైన మీమాంసల్ని నిర్ద్వంద్వంగా తృణీకరించాడు. కొత్త ఆలోచనల మహాసాగరంలో ప్రజలు వెల్లువలా పొంగిపోయేటట్టు చేశాడు.

ప్రజావాక్కు యెంతటి శక్తివంతమైనదో నిరూపించాడు. రాజులు, మహారాజులు సైతం దిగిరాక తప్పలేదు. ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా వారెలా రాజ్యం చేయగలరు? ఒక నిరాయుధుడైన వ్యక్తిని, ప్రజలలో అత్యంత ప్రేమాభిమానాలు కలిగిన వ్యక్తిని, అందరికీ మేలు కల్గించే వ్యక్తిని తృణీకరించి, లేదా చంపి వాళ్ళేంసాధించగలరు? మరింత చెడిపోవడం తప్ప?

తానొక్కడివల్ల యీ ప్రపంచం మారిపోతుందని గౌతమబుద్ధుడు వూహించలేదు. యెక్కడా చెప్పలేదు. అసలు జన సామాన్యానికి తాను ప్రవచించిన జ్ఞానం చేరాలి. అప్పుడే ప్రజలు జ్ఞానవంతులవుతారు. చైతన్యవంతులవుతారు. అందుకే గౌతమబుద్ధుడు ప్రారంభంలోనే తన శిష్యుల్ని ధర్మానికి ప్రచారకులుగా నియమించాడు. తనకు దీటుగా వారిని మలిచాడు.

గౌతమబుద్ధుడే కాదు. ఆనాటి అతడి శిష్య ప్రశిష్యులందరూ మహాజ్ఞానులు. త్యాగజీవులు. ధర్మప్రచారకులు. వారికెటువంటి స్వార్థాలూ లేవు భేదభావాలసలేలేవు. అటువంటి శిష్యుల్ని తయారు చేశాడు. వారందరూ క్రమ శిక్షణతో విస్తారంగా బ్రతికేటట్టు చేశాడు. అర్హతులైనవారికే ప్రజలకి బోధించే అవకాశం యిచ్చేవాడు. యెవరినైనా అర్హతుడని ప్రకటించే అధికారం తన వొక్కడికే కాకుండా ముఖ్యమైన శిష్యులకు, జాగరూకులైన వారికి, ధర్మబద్ధులైన వారికి యిచ్చాడు.

ఒక బౌద్ధ భిక్షువు అంటే కేవలం ఒక భిక్షువు కాదు. ఆ వూరికి, లేదా అతడు పర్యటించే చోట్ల జనులకు అతడొక మహోపాధ్యాయుడు. గురువు, జ్ఞాని. మానవత్వం, సత్యం మూర్తీభవించిన మహావ్యక్తి. యెటువంటి స్వార్థమూ, కోరికలూ లేని ప్రజాక్షేమి. అటువంటి వారిని ప్రజలు ప్రేమించకుండా, అభిమానించకుండా, శిష్యులవకుండా, తామూ కొందరు కొంతకాలమైనా అటువంటి భిక్షువులవకుండా, ధర్మ ప్రచారకులవకుండా యెలా వుండగలరు? వారినెవరు యెలా ఆపగలరు?

గౌతమబుద్ధుడు తన జ్ఞానాన్ని మొదట చేరవలసిన చోటుకే చేర్చాడు. మొదట ఆ జ్ఞానాన్ని అతడు సామాన్యులకు అందించాడు. సత్యాన్వేషకులైన మేధావులను కూడా ' భిక్షువులుగా, ధర్మ ప్రచారకులుగా, నిస్వార్థపరులుగా మార్చివేసాడు. వారి ద్వారా వేలాది, లక్షలాది ప్రజలలో విశ్వమానవ కళ్యాణకారకమైన యీ మహామానవతా ధర్మాన్ని వ్యాప్తి చేశాడు. మార్పు ప్రజలనుండే రప్పించి, వారిలో జ్ఞాన బీజాలను, సమైక్యతా భావాలను ప్రవేశపెట్టాడు. అంతకుముందే వారిలో వున్న మంచి భావాలను మరింత పదునుపెట్టి మెరుగుపరిచాడు. చెడుభావాలను నిరసపరిచివేశాడు.

యింతటి సంఘటిత శక్తిగా రూపుదిద్దుకుంటున్న ధర్మాన్ని రాజులైనా యెలా వ్యతిరేకించగలరు? వ్యతిరేకించడం, శత్రుత్వం పట్టి నాశనం చేయడం కన్నా మంచిగా, సౌభ్రాతృత్వంగా, జ్ఞానయుతంగా, యిరువురికీ మేలూ, జ్ఞానం కలిగించే రీతిలో జీవించాలన్న అతడి ధర్మాన్ని యే విధంగా యే కారణం చూపి పరిమార్చగలరు?

గౌతమబుద్ధుడు తన ధర్మవ్యాప్తి కోసం రాజులను ఆశ్రయించాడనీ, వారికి పనికి వచ్చే బోధలు చేశాడనీ కొందరు విమర్శిస్తారు.

తన ధర్మవ్యాప్తి కోసం అతడు యెవరినీ ఆశ్రయించలేదు. యెటువంటి కులభేదాలు, భేద భావాలు లేకుండా అతడందరికీ సమంగా ధర్మాన్ని పంచాడు. శిష్యుల్ని చేసుకున్నాడు. బౌద్ధ జీవితంలో యెక్కువ తక్కువలు లేవు. పాక్షిక సత్యాలు లేవు. ప్రలోభాలు లేవు. ధర్మవ్యాప్తి కోసం రాజులను ఆశ్రయించే అవసరమేఅతడికి లేదు. బౌద్ధ భిక్షువులకి ఖర్చులేమీ వుండవు. అతడి చేతిలో పైసా కూడా వుండదు. ధనాన్ని అతడు స్వీకరించడు. చిరిగిపోయిన వస్త్రాలు, దానం చేసిన వస్త్రాలు

ధరిస్తాడు. తిండికి బెంగలేదు-అడుక్కుని తింటాడు-తలదాచుకోను పడకశయ్యలవసరం లేదు-యిళ్ళూవాకిళ్ళ అవసరం లేదు చెట్టుకింద పడుకుంటాడు. ప్రయాణించడానికి వాహనాలు, రథాలు అవసరం లేదు. యెక్కడికెళ్ళినా కాలినడకనే ప్రయాణం. యింక రాజాశ్రయాల అవసరం యేముంది? యేముంటుంది? ప్రజాశ్రయాలే దొరికినప్పుడు రాజాశ్రయాలెందుకు?

అందువల్ల అతడు రాజాశ్రయాలు సంపాదించాడు అన్నమాటలో యథార్థం లేదు. అతడి ధర్మంలో వున్నది విశ్వమానవసంక్షేమమే. రాజుల ధాజరికానికీ, వారి అధికారదుర్వ్యాపాలకీ పనికివచ్చేదేదీ అతడి ధర్మంలో లేదు. యింకాచెప్పాలంటే అప్పటిదాకా రాజులననుసరిస్తూ వస్తున్న విశ్వాసాలకూ, ధర్మాలకూ, న్యాయ ధర్మాలకూ బౌద్ధం పూర్తిగా వ్యతిరేకమైంది. సార్వజనీనమైంది.

అందువల్ల అతడు రాజాశ్రయాలు సంపాదించాడనడం కంటే తమ బతుకులు బాగు చేసుకునేటందుకు రాజులే దిగివచ్చి అతడ్ని ఆశ్రయించారనడం మేలు. అయినా అతడు యే రాజు దగ్గరో వుండిపోతేయేమో, జీవితకాలమంతా పర్యటనలు చేస్తూనే వున్నాడు. ధనవంతులు, రాజులు అతనిపట్ల గౌరవంతో వర్షాకాలంలో విడిదిచేయడానికీ, విద్య బోధించడానికీ పాఠశాలలు, వసతులుగల టసలూ కట్టించారు. చాలా కాలానికిగానీ గౌతమబుద్ధుడు వీటిని కూడా అంగీకరించలేదు. అసలు భిక్షువుకి వుండవలసిన మూడు వస్త్రాలు తప్పించి యెటువంటి అదనపు వస్త్రాన్ని అతడు తనకి కూడా అంగీకరించలేదు. రాత్రిపూట అతడు భోజనమే చెయ్యడు. బౌద్ధ భిక్షువులందరూ అంతే. యెన్ని కఠినమైన నియమాలంటే అన్ని కఠినమైన నియమాలు. దీనికి కారణం తన భిక్షువులందరూ తనలాగానే ఆశల్ని, కోరికల్ని జయించాలి. వారందరికీ కూడా నిర్వాణప్రాప్తి కలగాలి. వారు అందరూ విశ్వమానవులై, జనకళ్యాణానికి పాటుపడాలి.

యిక అతడు ఆనాటి పలాయనభావాలను యే విధంగా పలాయనం చిత్తగించేటట్టు చేశాడో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. యిప్పటికీ ఆ భావసంచయాలు అంతశక్తివంతంగానూ నిలబడుతున్నాయంటే నమ్మబుద్ధికాదు. అతడి ప్రతిమాటా యథాతథంగా ఆగమసూహాలమీద ప్రచారమయేది. సాంఘిక విప్లవానికి ప్రజల్ని సన్నిద్ధం చేసేది. ఆ విధంగా ఆయన బోధనలన్నీ యించుమించు ప్రక్షిప్తాలు చేరకుండానే మనకు దక్కాయి.

## ఆత్మభావన వ్యర్థం

ఆత్మ గురించి గౌతమబుద్ధుడిలా అంటాడు.

"మాలుంక్యపుత్రా! యెవరికైనా విషపు బాణం గ్రుచ్చుకుందనుకో. అతడి ప్రక్కనున్నవారు అతడ్ని వైద్యునిదగ్గరకు తీసుకువెళ్తారు. వైద్యుడు శస్త్రచికిత్సచేసి ఆ బాణాన్ని తొలగించే ప్రయత్నంచేస్తుండే, బాణం గుచ్చుకున్నవాడు, 'వద్దు, ఆ బాణం వేసిన వ్యక్తి యెవరో నాకు తెలియాలి అతడు బ్రాహ్మణుడా? క్షత్రియుడా?, వైశ్యుడా?, శూద్రుడా? నల్లగా వుంటాడా?, తెల్లగా వుంటాడా? అతడు పట్టుకున్న విల్లంబు యెలా వుంది? దాని తాడు దేంతో తయారుచేశారు? వీటికి సమాధానాలు తెలిస్తే తప్ప నేను చికిత్స చేయించుకోను" అని మొరాయిస్తే అతడికేమైనా ప్రయోజనం వుంటుందా? ఆ ప్రశ్నలు యింకా పూర్తికాకముందే అతడు చచ్చిపోతాడు. అట్లాగే ఆత్మ వుందా? లేదా? శాశ్వతమా? కాదా యిటువంటివి తెలిసేదాకా ధర్మాన్ని ఆచరించనని యెవరైనా అనుకుంటే అతడికే లాభమూ వుండదు. ఆత్మ శాశ్వతమో కాదో తెలుసుకొనేలోగానే అతడు చచ్చిపోతాడు.

యీ ప్రపంచం శాశ్వతమా? అశాశ్వతమా? అన్న చర్చ యెంత తీవ్రంగా జరుగుతున్నా దాని వల్లన ధార్మికమైన పనులేవీ అవ్వవు. యీ జగత్తు శాశ్వతమే అని యెవరైనా గట్టిగా నమ్మారనుకో, అతడికి యేబాధలూ లేకుండా పోతాయా? యీ ప్రపంచం, యీ శరీరం, ఆత్మ యివన్నీ వున్నాయా లేవా యివన్నీ వొకటేనా లేక వేరువేరా? అని యెన్ని విధాల చర్చించుకున్నా, చర్చించుకోకపోయినా పుట్టేవాళ్ళు పుడుతూనే వుంటారు. చచ్చిపోయేవాళ్లు చచ్చిపోతూనే వుంటారు. బాధల్లోవున్నవాళ్ళు బాధలుపడుతూనే వుంటారు. అందువల్ల యీ విషయాల్లో అసీ తుసీ తేల్చుకోవడానికి నేను ప్రయత్నించను. యెందువల్లనంటే యీ వాదవివాదాల వల్ల ప్రయోజనమేమీ కలగదు. పాపాలు పోవు. శాంతి, ప్రజ్ఞ, సంబోధం, నిర్వాణం, యివేమీ సిద్ధించవు."

## దేవుడి గురించిన చర్చలో ప్రయోజనం లేదు

దేవుడి గురించి గౌతమబుద్ధుడిలా అంటాడు :

"భిక్షువులారా! యీ ప్రపంచంలో ప్రతిప్రాణీ సుఖదుఃఖాలు అనుభవిస్తూ వుంది. వీటన్నిటినీ దేవుడే సృష్టించాడు" అని చెప్పేవారిని, అలా అని నమ్మేవారిని చూసినప్పుడు 'వీరందర్నీ దేవుడే సృష్టిస్తే యెందుకని వీళ్ళిట్లా వొకరినొకరు కొట్టుకుంటున్నారు? తిట్టుకుంటున్నారు? చంపుకుంటున్నారు? హత్యలు, దొంగతనాలు, అబద్ధాలు, కుట్రలు.. యివన్నీ యెట్లా వచ్చాయి? అన్న ప్రశ్నలు వస్తాయి. వొక్క ప్రశ్నకూ సరైన సమాధానం రాదు.' "భిక్షువులారా! వొకవేళ యీ జగత్తువంతటినీ దేవుడే సృష్టించాడు అనుకున్నా, ఆ విశ్వాసం, మంచి చేయాలన్న వుత్సాహాన్ని పుట్టించదు కదా! అటువంటి ప్రవృత్తిని పురికొల్పదు కదా! యిది చేయదగినపని, యిది చేయగూడని పని అన్న విషయాలు తెలుసుకోవడానికి సాయపడదు కదా!"

## జాతి కుల భేదాలనేవి లేవు

"ఓయి వాసిష్ఠా! వివిధరకాలైన దినుసుల్ని యిచ్చే గడ్డి మొక్కలు, చెట్లు, ఫలవృక్షాలు.. వీటిల్లో భిన్న భిన్న జాతులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అట్లానే కీటకాలు, చీమలు, పురుగులు, మొదలైన వాటిలో యెన్నో రకాల జాతులు వున్నాయి. పాముల్లో, కప్పల్లో, నీటిలో పెరిగే చేపల్లో, ఆకాశంలో యెగిరే పక్షుల్లో యెన్నో రకాల జాతులు వున్నాయి. వాటి వాటి భిన్నత్వానికి గుర్తులు ఆ ప్రాణుల్లోనే స్పష్టంగా కనిపిస్తున్నాయి. కానీ మనుష్యుల్లో అటువంటి భిన్నంగావుండే గుర్తులు కనబడవు. కన్ను, ముక్కు, కాళ్ళు, చేతులు, వెంట్రుకలు అన్నీ మనుషులందరికీ వున్నాయి. యీ అవయవాలు మనిషి మనిషికీ తలా వొకరకంగా లేవు. పశుపక్ష్యాదులలోవున్నట్లుగా భిన్నభిన్న జాతులకు భిన్న భిన్న ఆకారాలు, మనుష్య జాతిలో లేవు. మనుష్యులందరి అవయవాలు యించుమించు సమంగానే వుండడం వల్ల వారిలో జాతి భేదాలు వుండేందుకు వీలులేదు. అయితే చేసే పనుల్లో మాత్రం తేడావుండడానికి అవకాశం వుంది.

వొకానొక బ్రాహ్మణుడు పశుపాలన చేస్తూ జీవిస్తున్నాడనుకొందాం. అతడు గొల్లవాడు అవుతాడేగానీ బ్రాహ్మణుడవడు. శిల్పాలు చేస్తూ జీవించేవాడు శిల్పి. యెవరు వ్యాపారం చేసినా వారు వైశ్యులే. దౌత్యం నెరపేవాడు దూత. దొంగతనం చేసే బ్రాహ్మణుడూ దొంగే. యుద్ధాలు చేసి బతికే బ్రాహ్మణుడు యోధుడు. యజ్ఞయాగాలు చేసి బతికేవాడు యాజకుడు. రాష్ట్రపాలన చేస్తే

రాజా. వీరిలో యెవ్వరినీ జన్మను బట్టి బ్రాహ్మణుడనడానికి వీలులేదు. కర్మను బట్టి బ్రాహ్మణుడు అవుతాడు గానీ, జన్మతో యెవడూ బ్రాహ్మణుడు కాడు. అబ్రాహ్మణుడూ కాడు. యెవడైనా కర్మతోనే బ్రాహ్మణుడవుతాడు. బ్రాహ్మణుడవటానికిగానీ, అబ్రాహ్మణుడవటానికి గానీ అతడు చేసే కర్మే కారణం. కర్మ చేతనే రైతు రైతవుతాడు. శిల్పి, దొంగ, సిపాయి, వీళ్ళందరూ అంతే. రాజా కూడా అంతే. సర్వజగత్తు అంతా కర్మమయమే. చక్రాల ఆధారంతో రథం నడిచినట్లే ప్రాణులన్నీ తాము చేసే పనులవల్లనే ఆ విధంగా జీవిస్తున్నాయి.

## మనుషులందరూ సమానమే

"ఓయీ! ఆశ్వలాయనా! బ్రాహ్మణ స్త్రీ కూడా ఋతుమతి అవుతూంది. గర్భిణీ అవుతోంది. పిల్లలకు పాలిస్తోంది. యిదంతా జరుగుతున్నదా? లేదా? యితర వర్ణాలవారిలోనూ పిల్లలు పుట్టే పద్ధతి యిదే. యిట్లా వుండగా బ్రాహ్మణుడు బ్రహ్మ దేవుని ముఖం నుండి పుట్టారనడం ఆశ్చర్యం కాదా? ప్రకృతి విరుద్ధం కాదా? అది వారి విశ్వాసం అయితే ఆ విశ్వాసాన్ని అలా వుండనివ్వకోవచ్చు కానీ అది తర్కానికి సరిపోవాలి. మనదేశపు సరిహద్దుల్లో యవన, కాంభోజ మొదలైన దేశాలున్నాయి కదా. వారిలో ఆర్యులు, దాసులు అని రెండు జాతులే వున్నాయి. అప్పుడప్పుడు ఆర్యుడు దాసుడవుతూ వుంటాడు. దాసుడు ఆర్యుడవుతూ వుంటాడు. యెక్కడైనా ఇట్లావుండగా, బ్రాహ్మణులు బ్రహ్మ ముఖం నుండి పుట్టారు, సర్వ వర్ణాల వారి యందూ వీరే శ్రేష్ఠులు అని అనడం యెలా పొసగుతుంది?

క్షత్రియుడుగానీ, వైశ్యుడుగానీ, శూద్రుడుగానీ-ఖూనీలు, దొంగతనాలు, కుట్రలు, అతివాగుడు, కలహాలు, ద్వేషం, యితరుల సొమ్ము కాజేయడం, యిట్లాంటి బుద్ధులు కలిగి వుంటే తప్పక నరకానికి పోతాడు కదా, వొకవేళ వొక బ్రాహ్మణుడికే యీ బుద్ధులున్నాయనుకో- అతడు నరకానికి వెళ్ళడు అని అనగలవా? మరో బ్రాహ్మణుడు యిట్లాంటి బుద్ధులేమీ లేకుండా మంచిగా వున్నాడనుకుందాము, అతడు తనమరణానంతరం తప్పకుండా స్వర్గానికి వెళ్తాడు కదా! అలాగే యితర వర్ణస్తులెవరైనా యిలాంటి బుద్ధులు లేకుండా వుంటే వాళ్ళుకూడా స్వర్గానికి వెళ్తారా లేదా? లేదు లేదు బ్రాహ్మణుడికొక్కడికే ద్వేషం, శతృత్వాలు లేకుండా మైత్రీ భావనతో వుండే శక్తి వుంది- యితరులకు అట్లాంటి శక్తులు లేవు, వారు అశక్తులు అనడానికేమైనా ప్రత్యక్ష ప్రమాణముందా? అలాగాకపోతే బ్రాహ్మణుడే శ్రేష్ఠుడు అని తలపడంలో అర్థమేముంది?

ఆశ్వలాయనా! వొక రాజుగారు వొక యజ్ఞం చేయతలపెట్టి హోమంకోసం వందమందిని పిలిచాడు. వారిలో నాలుగు జాతులవారూ వున్నారు. మొదటి మూడు జాతుల వారిని పిలిచి మీరు సాల, చందన మొదలైన వృక్షాల కొమ్మల బెరడుల నుండి నిప్పు పుట్టించండి అని చెప్పాడు. తక్కిన శూద్రుల్నీ చండాలుర్నీ పిలిచి, కుక్కలు, పందులు మొదలైనవి నీరుత్రాగే తొట్టి మీద, ఆముదం చెట్టుకొమ్మలు, బెరడులలో నిప్పు పుట్టించమన్నాడు. వాళ్ళట్లానే చేశారు.

బ్రాహ్మణులూ నిప్పును తయారు చేశారు. శూద్రులూ నిప్పుని తయారు చేశారు. ఆశ్వలాయనా! యిప్పుడు చెప్పు. బ్రాహ్మణులు మొదలైన వుత్తమ జాతులవారు తయారు చేసిన నిప్పుకంటే, శూద్రులు తయారు చేసిన నిప్పులో తేజమ్ము యేమైనా తక్కువగావుందా? బ్రాహ్మణులు తయారుచేసిన అగ్నితో యేయేపనులు చేయవచ్చో అన్నిపనులూ శూద్రులు తయారుచేసిన అగ్నితో కూడా చేయవచ్చుకదా! యేదైనా నిప్పేకదా!

ఒకానొక క్షత్రియుడు బ్రాహ్మణ కన్యను పెళ్ళి చేసుకున్నాడు. వారికో అబ్బాయి పుట్టాడు. ఆ పిల్లవాడు తల్లిదండ్రులవలె మనుష్యుడుగా వుండడా? అలాగే బ్రాహ్మణుడు ఒక క్షత్రియ కన్యను పెళ్ళిచేసుకుంటాడు. వారిక్కూడా ఒక కొడుకు పుడతాడు. వాడు మూడోరకంగా వుంటాడా?

ఆశ్వలాయనా! యిద్దరు బ్రాహ్మణులున్నారు. వారిలో ఒకడు చక్కగా వేదాధ్యయనం చేశాడు. రెండోవాడు మరింత సుశిక్షితుడు.. యీ యిద్దరిలో శ్రాద్ధాలు పెట్టడానికిగానీ, యజ్ఞాలు చేయడానికిగానీ ప్రథమామంత్రణం యెవరికి వుంటుంది? సుశిక్షితుడైన వానికే కదా! యిద్దరు బ్రాహ్మణులున్నారు. వారిలో ఒకడు విద్వాంసుడు..కానీ దురాచారి. రెండోవాడు విద్వాంసుడు కాదు కానీ బుద్ధిమంతుడు. వీరిద్దరిలో ప్రథమా మంత్రణం యెవరికి వుంటుంది? బుద్ధిమంతుడికే కదా!

యీ విధంగా చూస్తే జాతి గొప్పది అన్నది లేదు. యెవరైనా చేసే పనుల బట్టి యేర్పడుతారు. యెవ్వరైనా యిక్కడకు చేరుకోవలసిందే. యెందుకంటే యిది సత్యం."

## తమకేమి కావాలో దేనిని అనుసరించాలో, యేది నిర్ణయించుకోవాలో యెంచుకునే అధికారం సామాన్య ప్రజలకే

"బ్రాహ్మణా! విప్రుడు నిర్దేశించిందే యితర జాతులు అనుసరించాలి అని అనడంలో న్యాయం వుందా? యే వర్ణం వారు యెలా బతకాలి అని నిర్దేశించే అధికారం బ్రాహ్మణులకి యెవరిచ్చారు? ఒకడికి మాంసం తినడం యిష్టం లేదట. వాడు పేదవాడు కూడాను. వాడి బతుకేదో వాడు బతుకుతున్నాడు. వాడి ప్రక్కింటివాడు తనకి వున్న మాంసంలో పేదవాడ్ని భాగం పుచ్చుకుని కొనుక్కోమంటాడుట. ఆ పేదవాడు బాబూ నీ మాంసం నాకు వద్దన్నా ఆ ప్రక్కింటివాడు వినడట. అలా వుంది బ్రాహ్మణుడి పద్ధతి కూడా. లోకులపైతన నిర్ణయాలు వేసి రుద్దడానికి యితడెవ్వడు?

యే జాతి అయితే యేమిటి? యెవరిని సేవిస్తే కళ్యాణ ప్రదమో, శుభమో అటువంటి వాడ్నే సేవించాలి. యే వర్ణంలో వున్న పెద్దల్ని అడిగినా యిదే మాట చెప్తారు. అగ్రవర్ణంలో పుట్టడం అంటే నా దృష్టిలో గొప్పదీ కాదు. చెడ్డదీ కాదు. అది కేవలం పుట్టడం మాత్రమే. అగ్రవర్ణంలో పుట్టినవాడు ఖూనీలు చేసేవాడైతే వాడి కులం మంచిదేనా? శూద్రకులాల్లో పుట్టినా యెటువంటి పాపాలూ చేయకుండా మెలిగితే వాడికులం చెడ్డదేనా? యెవడిని సేవించడంవల్ల శ్రద్ధ, త్యాగం, ప్రజ్ఞలు అభివృద్ధి అవుతాయో అటువంటివాడ్ని సేవించడం మంచిది. యిది నా తలపు. కులాలనేవి కేవలం సంజ్ఞలు మాత్రమే. వీరిలో హెచ్చుతగ్గులనేవి లేవు.

కట్టెలలో పుట్టిన అగ్నిని కాష్ఠాగ్ని అంటారు. శకలికల్లో పుట్టిన అగ్నిని శకలికాగ్ని అంటారు. తృణాల్లో పుట్టిన అగ్ని తృణాగ్ని, గోమయంలో పుట్టిన అగ్ని గోమయాగ్ని. యీ నాలుగు అగ్నుల్లో యేదైనా తేడా వున్నదా? లేదు కదా! క్షత్రియాదిజాతులు కూడా అంతే. యీ నల్గురిలో ప్రతీమనిషికీ పాపాలు పోగొట్టుకోవడానికి వీలుందికదా! బ్రాహ్మణుడొక్కడే మైత్రీభావంతో వుంటాడు, యితరులకి అటువంటి శక్తి లేదు, బ్రాహ్మణుడు మాత్రమే నదికెళ్ళి స్నానం చేసి తన శరీరాన్ని పరిశుద్ధం చేసుకోగలడు, యితరులకి అటువంటి శక్తి లేదని నీ తలపా?

యే జాతి వారైనా స్నానం చేసి తమ దేహాన్ని శుభ్రం చేసుకున్నట్టే యెవ్వరైనా సరే నా వుపదేశాల్ని పాటించి, న్యాయ ధర్మాన్ని వుపాసించగలరు."

అతడి మాటలు రాజుకి బాగా నచ్చాయి. సమర్థులైన రైతులకి కావలసిన సాయాలు చేశాడు. వ్యాపారాన్ని బాగా అభివృద్ధి చేశాడు. పని చేయగలిగిన వారికి వుద్యోగాలిచ్చి నెల జీతాలు ఏర్పాటు చేశాడు. యీ వుపాయంతో మహావిజితుని దేశం సమృద్ధి అయింది. దారిదోపిడీలు, దొంగతనాలు తగ్గిపోయాయి. ప్రజలందరూ సుఖంగా వుండడం వల్ల ఆలస్యం లేకుండా పన్నులు వసూళ్ళయ్యాయి. భాండాగారం నిండింది.

మహావిజితుడు పురోహితుడితో అన్నాడు. 'హే బ్రాహ్మణా! నీవు వుపదేశించిన వుపాయంతో రాజ్యంలో దుఃఖాలు నశించాయి. భాండా గారం బాగా నిండింది. రాజ్యంలో ప్రజలందరూ హాయిగా, నిర్భయంగా జీవిస్తున్నారు. యిప్పుడు చేద్దామా ఆ మహాయజ్ఞం? ఆ యజ్ఞం యెలా చేయాలో చెప్తావా?'

"మహారాజా! నువ్వు యజ్ఞం చేయాలనుకుంటే ప్రజలు అందుకు అనుమతించాలి. కనుక వారందర్నీ వొకచోట చేర్చి వారి అనుమతి తీసుకో"మన్నాడు పురోహితుడు.

రాజు అట్లాగే చేశాడు. యజ్ఞం చేయడానికి ప్రజలందరూ అంగీకరించారు. పురోహితుడు యజ్ఞం చేయడానికి తయారవుతూ రాజుతో "రాజా! యజ్ఞానికి చాలా డబ్బు ఖర్చవుతుంది. డబ్బు ఖర్చయిపోతోందే అన్న బాధ నీకు కలుగకూడదు. యజ్ఞం అయిపోయాక డబ్బంతా అయిపోయిందా అయ్యో అన్న బాధ కూడా నీకు కలగకూడదు. యీ యజ్ఞమే విచిత్రమైన యజ్ఞం. దీనిలో అనేకమంది సాధువులు చేరుతారు. నీవు ఆ సత్పురుషుల్ని గౌరవించాలి. నీకు బాగా సంతోషం కూడా కలుగుతుంది" అన్నాడు.

మహావిజితుని యజ్ఞంలో యే మూగప్రాణినీ వధించలేదు. చెట్లు నరికి జంతువుల్ని కట్టే యూపస్తంభాల్ని తయారు చేయలేదు. ధర్భాసనాలు లేవు. యెవరిచేతా బలవంతంగా పనులు చేయించలేదు. యిష్టం వున్నవారు పని చేశారు. లేనివారు వూరుకున్నారు. నెయ్యి, నూనె, లవణం, తేనె, చెరుకురసాలతో యజ్ఞం పూర్తి చేశారు.

యజ్ఞం అయిపోగానే దేశంలోని శ్రీమంతులందరూ మహావిజితుణ్ణి అభినందించడానికి వచ్చారు. మహావిజితుడు వారిని బాగా ఆదరించాడు. శ్రీమంతులు యెంతో విలువైన బహుమానాలు తెచ్చారు. కానీ రాజు ఆ బహుమానాలు పుచ్చుకోకుండా, "గృహస్థులారా! నాకు బహుమానాలేమీ వద్దు. ధార్మికంగా పన్నుల రూపంలో వసూలు చేసిన డబ్బే ధనాగారంలో బోలెంత వుంది." అన్నాడు.

దానితో వారు ఆ డబ్బుతో ధర్మశాలలు కట్టించారు. పేదవాళ్ళకు దానాలు చేశారు. ప్రజలందరికీ వుపయోగపడే శాశ్వతమైన పనులెన్నో చేశారు.

గౌతమబుద్ధుడు చెప్పిన యీ యజ్ఞ కథ విన్న కూటదంతుడు మొదలైన విప్రులు అది చాలా గొప్ప యజ్ఞం అని కొనియాడారు. వారందరూ బుద్ధుని శిష్యులయ్యారు. యజ్ఞం చేయడానికి సేకరించిన జాతికి నూరేసి చొప్పున తెచ్చిన జంతువుల్ని విడిచిపెట్టారు. అవి హాయిగా స్వేచ్ఛగా గడ్డిమేస్తూ గెంతులు వేయసాగాయి. అది చూడగానే వారందరికీ యెంతో మంచిపని చేశామన్న ఆనందం కల్గింది.తన సమసమాజాపేక్షను హేతుబద్ధంగా చూపిస్తాడు గౌతమబుద్ధుడీ బోధనలో. రెండువేల అయిదు వందల సంవత్సరాల నాటి మాటయిది. వేలాది మూగజీవాలు అతడి తత్వ బోధ వల్ల వూపిరిపోసుకున్నాయి.

## సత్కార్యం చేయడమే యజ్ఞం

"బ్రాహ్మణా! యజ్ఞం చేయడానికి అగ్నిరగిల్చి, యూపస్తంభాలు కట్టి జంతువుల్ని వధించేవాడు దుఃఖాన్ని కల్గించే కాయశస్త్రం, వాక్శస్త్రం, చిత్తశస్త్రం అనే బాణాల్ని వొర నుంచి పెరికి వేస్తున్నాడు. యెలా అంటే, యజ్ఞారంభమొనర్చుకొని, మనస్సులో యున్న గోవుల్ని, యున్న దున్నల్ని, యున్న యెద్దుల్ని వరకాలి అని అనుకుంటాడు. దానితో మొదటగా చిత్తశస్త్రాన్ని పెరికినట్టే. యీ ప్రాణులను మీరు వధించండి అని సేవకులకు చెప్తాడు. దానితో వాక్శస్త్రాన్ని పెరికినట్టే. యిక ఆ తరువాత వారితో కలిసి తానుకూడ నరకడం ప్రారంభిస్తాడు. దీనితో కాయశస్త్రాన్ని పెరికినట్టే.

బ్రాహ్మణా! యీ మూడగ్నుల్ని వదలాలి. కానీ యెప్పుడూ వాటిని సేవింపగూడదు. ఆయగ్నులేవి? కామాగ్ని, ద్వేషాగ్ని, మోహాగ్ని. కామాతురుడైన మనుష్యుడు మనోవాక్కాయములతో పెడ్డపని చేసి తీరతాడు. వాడికి దుర్గతి తప్పదు. అల్లాగే మోహం, ద్వేషాలు కూడా. అవి వున్నవాళ్ళకి దుర్గతి పెరటిచెట్టులాగానే వుంటుంది. అందుకనే యీ మూడు అగ్నులూ ప్రమాదకరమైనవి. వీటిల్ని సేవించకూడదు.

పుర్గతశరీరా! యీ మూడగ్నుల్ని సేవించాలి. గౌరవించాలి. వారిని నిరంతరం పూజించాలి. పరిచర్యలు చేయాలి. ఆయగ్నులేవి? ఆహవనీయ, గార్హపత్య, దాక్షిణాగ్నులు. తల్లిదండ్రులే యాహవనీయాగ్నులు. వారిని ఆసక్తితో పూజించాలి. భార్య, పిల్లలు, సేవకులు- మొదలైనవారు గార్హపత్యాగ్నులు. వారిని ఆదరంతో చూడాలి. శ్రమణబ్రాహ్మణులే దాక్షిణాగ్నులు. వారిని సత్కరించి పూజించాలి. ఓ బ్రాహ్మణా! యీ అగ్నులు నిరంతరమూ వెలుగుతూనే వుండాలి. యివి యెప్పుడూ ఆరిపోకూడదు. వీటిల్ని వుపేక్షించకూడదు."

## దారిద్ర్యాన్ని నాశనం చేయడమే నిజమైన యజ్ఞం

"కూటదంతా! ఒక కథ చెప్తాను. పూర్వం మహావిజితుడనే ఒక రాజుండేవాడు. అతడు ప్రసిద్ధుడు. ధనాగారంలో చాలా డబ్బు వుంది. యెట్లా ఖర్చుపెట్టాలా అనుకున్నాడు. ఒక మహాయజ్ఞం చేస్తే బాగుంటుందన్న ఆలోచన వచ్చిందతడికి. ఆ మాటే పురోహితుడితో అన్నాడు. యేయజ్ఞం చేస్తే బాగుంటుందో, యే యజ్ఞం మంచిదో చెప్పమన్నాడు.

పురోహితుడు చాలా మంచివాడు. చాలా ఆలోచించాడు. "రాజా! మన రాజ్యంలో శాంతి లేదు. పల్లెటూళ్ళల్లో పట్టణాల్లో అల్లర్లు సాగుతున్నాయి. దోపిడీలు జరుగుతున్నాయి. యీ పరిస్థితిలో యజ్ఞాలు చేయడంగానీ, అందు నిమిత్తం పన్నులు వసూలు చేయడంగానీ చేస్తే మన కర్తవ్యం మరిచిపోయినట్టే. దుష్టుల్ని పట్టుకుని గుర్రాల చేత తొక్కించి, శిరచ్ఛేదాలు చేసి అణచి వేయగలమనుకుంటే పొరపాటే. యిట్లాంటి పనుల్తో ప్రజల దుఃఖం పూర్తిగాపోదు. యీ శిక్షలతో కొన్ని ప్రశాంతత చిక్కినట్లనిపించినా, కొన్నాళ్ళకి మళ్ళామామూలే. ప్రజలు సుఖసంతోషాలతో, శాంతిగా వుండాలంటే ఒకటే వుపాయం. రాజ్యంలో పొలాలు దున్నడానికి రైతులకి అన్ని సదుపాయాలూ చేయండి. వ్యాపారులకి పెట్టుబడి తక్కువైతే ధనాగారం నుండి ధనం యిచ్చి ప్రోత్సహించండి. పనిచేయగల్గినవారికి తగిన జీతాలిచ్చి వుద్యోగాలివ్వండి. యిట్లా చేస్తే రాజ్యంలోని ప్రజలు తమతమ పనుల్లో సమగ్రమంతులవుతారు. వారిలో దుఃఖం కలగడానికి అవకాశం వుండదు. పన్నులన్నీ ఆలస్యం లేకుండా వసూలవుతాయి. భాండాగారం నిండుతుంది. ప్రజలు నిర్భయంగా గుండెలమీద చేతులు వేసుకుని నిద్రపోతారు. రాజ్యంలో ఆనందం తాండవిస్తుంది "అని చెప్పాడు.

ఈ విధంగా కులజాతి భేదాల గురించి, దేవుడు, ఆత్మల గురించి అతడి హేతుబద్ధమైన తర్క, విమర్శ ఆనాటి సమాజంలో తీవ్రమైన కలకలం రేపింది. దానికి తోడు మనుషులందరూ సమానమే, ఏదైనా నిర్ణయించుకునే అధికారం ప్రజలకే వుందని అతడు చెప్పిన భావాలు అణగారిపోయిన ప్రజల్లో కొత్త ఆశలు మొలకెత్తించాయి. అప్పటిదాకా అగ్రవర్ణస్థుల చేత హీనంగా చూడబడిన కులాల వారందరికీ బౌద్ధ ధర్మ దీక్షను స్వేచ్ఛగా ధైర్యంగా పొందే అవకాశం కలగడంతో వారి ఆనందానికి అంతులేదు. అంతకంతకూ వారు ఈ బౌద్ధ ధర్మంలో భాగస్థులయ్యారు. తమ శక్తి యుక్తులు చాటుకున్నారు. బుద్ధునికి ప్రియాతిప్రియమైన శిష్యులయ్యారు. ఆయన తదనంతరం కూడా ఆయన ధర్మం వ్యాప్తి చేయడంలో, నిర్మాణం చేయడంలో అగ్రగాములయ్యారు. ఈ విధంగా బౌద్ధ ధర్మం అణగారిన వర్గాలలో గొప్ప నైతిక స్ఫూర్తిని అందించింది. ఇప్పటికీ కూడా అది ఆ విధమైన విప్లవతనీ, సందేశాన్నీ కలిగి వుంది.

గౌతమబుద్ధుడి ధర్మబోధ ఎంతో జ్ఞానయుతంగా సాగేది. ఎంతో ప్రేమగా, కరుణగా మాట్లాడేవాడు. ఉపన్యసించేవాడు. అతని ప్రతిసంభాషణ ఎంతో అనునయంగా, సహానుభూతితో వుండేది. అతడి ప్రతి కదలిక అందరికీ ఎంతో ఆనందం, భక్తి శ్రద్ధలను కల్గించేది. దుర్మార్గులు, దుష్టులు సైతం అతడి దగ్గరికి వచ్చేసరికి అప్రతిభులై పోయేవారు. ఆకర్షితులైపోయేవారు. అతడి మాట తీరే కాకుండా, అతడు చెప్పిన బోధనలన్నింట్లోనూ ప్రయోజనం, విశ్వప్రేమ వుండేవి. సాంఘిక జీవితాన్ని అంతగా ప్రభావితం చేసిన తాత్వికులెవరూ మనకి కనిపించరు. బోధించడాన్ని గురించి ఆయనిలా అంటాడు:

## బోధించడం జ్ఞాని కర్తవ్యం

"జ్ఞానం సంపాదించడంతో సరిపోదు. ఆ జ్ఞానాన్ని పదిమందికీ పంచాలి. బోధించాలి. అప్పుడే అతడు జ్ఞాని అని పిలిపించుకుంటాడు. పదిమందికీ బోధించని జ్ఞానం వ్యర్థం ". ఈ విధంగా జ్ఞానబోధను జ్ఞాని కర్తవ్యంగా బోధించడంవలన సమాజానికి ఎంతో మేలు కలిగింది. స్వార్థ భావాలు, ద్వేషభావాలు, సంకుచితభావాలు జ్ఞానులలో అసలు వుండకూడదనీ, వారు వుదారంగా, త్యాగబుద్ధితో జీవితాన్ని గడపాలనీ బోధించి, ఎంతోమంది జ్ఞానులను ప్రజలందరికీ వుపయోగపడేలా సక్రమమార్గంలో తమని తాము మరల్చుకునేటట్లు చేశాడు. ఈ విషయంపై లోహితుడితో ఇలా అంటాడు.

"లోహిత్యా! ఒక శ్రమణుడు గానీ, బ్రాహ్మణుడుగానీ ఒకానొక వున్నతమానసిక స్థితికి చేరి, జ్ఞానాన్ని సంపాదించాము కదా- ఎందుకూ అందరికీ చెప్పుకోవడం, ఇలా బోధించడం అంటే ఒక బంధాన్ని వదిలించుకొని ఇంకొక బంధాన్ని తగిలించుకోవడమే కదా అని అనుకుంటే అది చాలా పొరపాటు. అతడావిధంగా ప్రవర్తించడంద్వారా తక్కినవారు జ్ఞానం పొందే అవకాశానికి తానే అవరోధమవుతున్నాడన్నమాట. వారు దీక్షపొందే ఫలాన్ని, జన్మరాహిత్య ఫలాన్ని, అర్హత్వం పొందే ఫలాన్ని వారు పొందకుండా అడ్డపడుతున్నాడన్నమాట. జ్ఞానియై వుండీ కూడా వారి క్షేమం పట్టని అతడి మనసు శత్రుత్వంతో నిండిపోతుంది. మనస్సు శత్రుత్వంతో నిండిపోయాక అతడికి పనలేని సిద్ధాంతం. పనలేని జ్ఞానం. ఇటువంటి అపసవ్య సిద్ధాంతాలూ, జ్ఞానాలూ వున్న మనిషికి వచ్చే రెండు జన్మల్లోనూ ఒక దానిలో ప్రాయశ్చిత్తమో, జంతు జన్మో కలుగుతుందని ప్రకటిస్తున్నాను లోహిత్యా – అతడు జంతువుతో సమానం".

ప్రతీ వొక్కరూ విద్యను అభ్యసించడానికి అవకాశం యివ్వాలి. శక్తిసామర్థ్యాలున్న ప్రతివారికీ బోధించడానికి అవకాశం కల్పించాలి. అతడు విద్యను బోధిస్తే, యెలాంటి మినహాయింపులూ లేకుండా, యెటువంటి స్వార్థభావాలూ లేకుండా, యెవరినీ త్రోసి రాజనకుండా విద్యను అందరికీ బోధించాలి. బౌద్ధులందరూ విద్యకు యింతటి ప్రశస్తిని కల్పించడంలో వారి ముఖ్యోద్దేశం జ్ఞానం వొక్కటే కాదు దుఃఖ నిర్మూలన కూడా. దుఃఖాలన్నింటికీ మూలకారణం అవిద్య-అజ్ఞానం అని చెప్పిన బుద్ధభగవానుని బోధ, సమాజం లో వుపాధ్యాయునికి అగ్రపీఠం వేసింది. ఆ విధంగా గురువులకర్తవ్యాలనేబోధించడం ద్వారా ఆయన గురువులకే గురువయ్యాడు. సమాజంలో జ్ఞానం యొక్క ఆవశ్యకతను అత్యంత దృఢంగా చెప్పాడు. తానే అందుకు ఆదర్శమూర్తిగా భాసిల్లాడు.

అందుకే ఆయనను "విద్యాచరణ సంపన్ను"డని కొనియాడేవారు. కాని, కడుపునింపుకోవడమే కష్టంగా వున్న నిరుపేదలకు, విద్య నేర్పడానికి అనర్హులుగా తిరస్కరింపబడిన వారికి విద్యయెలా దక్కుతుంది? యీ క్రిందిది దానికి ఆయన సమాధానం అని చెప్పుకోవచ్చు.

## జ్ఞానానికి సౌకర్యమివ్వడం సమాజధర్మం

వొకసారి అతడు మగధ దేశంలో పర్యటిస్తూ అలవి అనే కుగ్రామం చేరాడు. ఆ మారుమూల గ్రామస్థులెంతో ఆనందపడ్డారు. సంభ్రమంలో మునిగిపోయారు. మహా మహా చక్రవర్తులే గౌతమబుద్ధుడి ముందు చేతులు కట్టుకుని నిలబడతారని వారికి తెలుసు. అలాంటిది అంతగొప్పవాడు వాళ్ళ వూరికే దయచేయడంతో వారి ఆనందానికి హద్దులు లేవు.

ఆనాడు సాయంకాలం బుద్ధ భగవానుని ప్రవచనం మొదలయ్యే సమయానికి వొక రైతు బిడ్డ ఆదరాబాదరాగా వచ్చి కూర్చున్నాడు. అతడు బాగా అలసిపోయివున్నాడు. యెంతో ఆకలి దహిస్తున్నా, బుద్ధ భగవానుని వుపదేశం వినడానికి పరుగెత్తుకుంటూ వచ్చి కూర్చున్నాడు. అతడు ప్రొద్దుటినుండీ యేమీ తినలేదు. తప్పిపోయిన యెద్దుని వెతకటానికి వెళ్ళి, యెట్టాగైతేనేం దాన్ని పట్టుకుని వూళ్ళోకి రాగానే గౌతమబుద్ధుని రాక సంగతితెలిసి ముఖంకూడా కడుక్కోకుండా, గబగబా యింటికి చేరి యెద్దుని కట్టేసి సమావేశ స్థలానికి పరుగు పరుగున చేరాడు.

గౌతమబుద్ధుడు డస్సి వున్న ఆ రైతుబిడ్డని చూచాడు. ఆ రైతు బిడ్డలో జ్ఞానం పట్ల యెంతో మమకారం, వుత్సాహం కనబడ్డాయతడికి. అతడికి ధర్మ దీక్షనిస్తే త్వరలోనే అతడు అర్హతుడు కాగలడనిపించిందతడికి. వెంటనే గ్రామ పెద్దని పిలిపించి, ఆరైతు బిడ్డకి మొదట కడుపునిండా అన్నం పెట్టించి తీసుకు రమ్మనమనీ వారు వచ్చేవరకూ తాను ప్రవచనం మొదలుపెట్టననీ చెప్పాడు

ఆగ్రామపెద్ద గౌతమబుద్ధుని ఆదేశాన్ని గొప్ప అనుగ్రహంగా తీసుకొని, ఆ రైతుబిడ్డని అప్పటికప్పుడు యింటికి తీసుకువెళ్ళి కడుపునిండా భోజనం పెట్టించి, సమావేశ స్థలానికి తీసుకు వచ్చాడు.

గౌతమబుద్ధుని ప్రవచనాలను ఆగ్రామ ప్రజలు యెంతో శ్రద్ధగా విన్నారు. ఆ రైతు బిడ్డ మరింత శ్రద్ధగా విన్నాడు. బుద్ధుడు వూహించినట్లుగానే కొద్ది కాలంలోనే బౌద్ధ భిక్షువయ్యాడు.

అతడికి అలా శ్రద్ధగా ఆహారం పెట్టించడానికి కారణం అడిగిన మిగిలిన శిష్యులకు గౌతమ బుద్ధుడు, 'ఆకలి బాధ చాలా దారుణమయింది. ఆకలి బాధలో వున్న వాడికి వినోదప్రసంగం అయితే కొన్ని మరపించగలదు. కానీ మనం చెప్పేది వినోద ప్రసంగం కాదుకదా! జ్ఞానబోధ. ఆకలి అనేది మనిషికి మొండి రోగం లాంటిది. అన్నమనే ఔషధాన్ని అతడు తప్పని సరిగా

తీసుకోవాల్సిందే. జ్ఞానాన్ని పొందడానికి ఆకలి అడ్డురాకూడదు" అని చెప్పాడు.

ఈ విధంగా అతడు ఆకలి తీర్చుకోవడాన్ని జ్ఞానాన్ని పొందడంకన్నా మొదటిదిగా, ముఖ్యమైనదిగా భావించాడు. మరి ఎంతోమంది పేదవారు వున్నారు. వారందరూ జ్ఞాన సంపన్నులు కావాలంటే వారికి ఆకలిదప్పుల బాధలు వుండకూడదు. ఎంత కొద్దిగా అయినా సరే వారి ఆకలిదప్పులను పోగొట్టే మార్గమేది?

బహుశ ఈ సంఘటన, ఇటువంటి సంఘటనల వలనే విద్యాగురిపేందుకు నిరాడంబరమైన ఆశ్రమాలు ఆరామాలు వసతి గృహాలు కట్టించడానికి గౌతమబుద్ధుడు అనుమతించాడు. అటువంటి ఆశ్రమాలు విద్యాలయాలై అతిత్వరలోనే ప్రజలు - జ్ఞాన బోధ పొందడంలో, కొందరు అర్హతులు కావడంలో మంచి సత్ఫలితాలనిచ్చాయి. దానితో ఇలా ఆరామాలు విద్యాలయాలు కట్టించడాన్ని ఎంతో అభినందించాడు. ప్రోత్సహించాడు.

## సంపదను సమతకు పంచడమే పుణ్యకార్యం

శ్రావస్తి నగరంలో విశాఖ గొప్ప ధనవంతురాలు. బౌద్ధభిక్షువులందరికీ ఆమె కొండంత అండ. ఆమె జ్ఞానతృష్ణ, వినయవివేకాలు, దానశీలత కలిగిన గొప్ప ఇల్లాలు. ఆమె అంటే గౌతమబుద్ధునికి ఎంతో గౌరవం. ఆమెకు స్వార్థమన్నది తెలియదు. గౌతమ బుద్ధునికి శిష్యురాలవుతూ ఆమె గౌతమ బుద్ధుని నుంచి ఎనిమిది వరాలు కోరుకుంది. తాను బ్రతికి వున్నంతకాలం భిక్షువులకు వర్షఋతువులో వస్త్రదానం, శ్రావస్తికి వచ్చే భిక్షువులకు అన్నదానం, శ్రావస్తి నుండి వెళ్ళిపోతున్న భిక్షువులకు అన్నదానం, అస్వస్థులైన భిక్షువులకు పథ్యాహారదానం, అస్వస్థ భిక్షువుల సేవలు చేసేవారికి అన్న దానం, అస్వస్థ భిక్షువులకు ఔషధ దానం, అన్నంగంజి దానం, భిక్షుణీలకు స్నాన వస్త్రాలదానం చేయడానికి అనుమతినివ్వడమే ఆ వరాలు.

ఆమె వుదారతకు గౌతమబుద్ధుడెంతో విచలితుడయ్యాడు. ఆనందించాడు. ఆ పనులు చేయడానికామెను అనుమతించాడు. అంతేకాదు ఆమె సూచించినట్లుగా భిక్షుణీనియమాలను కొన్నింటిని వినయపిటకాధ్యయనంలో కూడా చేర్చాడు.

ఒకనాడామె బుద్ధభగవానుని ప్రవచనాలను వినడానికి జేతవనవిహారానికి వెళ్ళింది. ఆరోజున ఆమె మొదటిసారిగా ఆమె పెండ్లికానుకగా తండ్రి బహుకరించిన విలువైన వస్త్రాన్ని ధరించి వెళ్ళింది. విహారంలోని బుద్ధ భగవానుని సన్నిధికి ఇలా ఆడంబరంగా వెళ్ళడం బాగుండదని తలచి మార్గమధ్యంలోనే ఆమె తన మనస్సు మార్చుకుంది. అప్పటికప్పుడు మామూలు చీర తెప్పించుకుని కట్టుకుని, విప్పిన ఆ విలువైన చీరని చుట్టచుట్టి పరిచారిక చేతికి ఇచ్చింది.

బుద్ధుని ప్రవచనాలు విన్న తరువాత తిరిగి ఇంటికి బయలు దేరే సమయంలో ఆ చీరను పరిచారిక విహారంలోనే మరిచి పోయింది. దారి మధ్యలో ఆ సంగతి జ్ఞాపకం వచ్చి చెప్పగానే, ఆ వస్త్రాన్ని ఎవరూ తాకకుండా వుంటే తీసుకురా... ఆశ్రమంలో ఎవరు ముట్టుకున్నా అది ఆశ్రమం పాలే అవుతుంది. అని చెప్పి పంపించింది.

ఆ పరిచారిక విహారానికి చేరేసరికే ఆనందుడు ఆ వస్త్రాన్ని తీసి గౌతమబుద్ధుడికి చూపగానే ఆయన ఇది విశాఖదైవుంటుంది, జాగ్రత్త పరచి మళ్ళీ ఆమెకు అంద చేయమన్నాడు.

కానీ విశాఖ ఆ విలువైన వస్త్రాన్ని తిరిగి తీసుకోవడానికి నిరాకరించింది. ఇది బౌద్ధ సంఘం

సొత్తు. నాదికాదు. కనుక దీన్ని అమ్మి ఆ వచ్చిన ధనంతో సంఘానికి యేమి చేయాలో చెప్తే ఆపని చేస్తాను' అని ఆమె బుద్ధ భగవానునికి విన్నవించింది.

బుద్ధ భగవానుడు ఆలోచించి శ్రావస్తికి తూర్పుగా వొక ఆరామాన్ని కట్టించమన్నాడు. ఆమె యెంతో సంతోషించింది. కానీ ఆ విలువైన వస్త్రాన్ని కొనడానికెవరూ ముందుకురాలేదు. అంతటి విలువైన వస్త్రం అది. చివరకి ఆమె తానే ఆ వస్త్రాన్ని కొనుక్కుని, ఆ డబ్బుతో చక్కని విశాలమైన ఆరామాన్ని బౌద్ధ సంఘానికి కట్టించియిచ్చింది. యీ ఆరామనిర్మాణం వలన తనకి కలిగిన పుణ్యం యేమైనా వుంటే అందులో సగం పరిచారికకే చెందుతుందని, ఆమె మరువవలనే కదా యిది జరిగిందని యెంతో వినమ్రంగా చెప్పిందామె. గౌతమబుద్ధుడు ఆరు వర్షాకాలాలు ఆ ఆరామంలో గడిపాడు.

విశాఖగురించి వొకసారి ప్రస్తావనకు వచ్చినప్పుడు గౌతమబుద్ధుడు యెంతో సాదరంగా, "నేర్పరి అయిన మాలాకారుడు, పుష్పాల రాశినుండి చక్కని పూలదండల నెన్నింటినో చేయునట్లుగా మానవుడైన వాడు తనకు ప్రాప్తించిన సంపద ద్వారా విశాఖలాగా యెన్నో పుణ్య సుమమాలలను తయారు చేయవచ్చునని' చెప్పాడు.

ప్రాప్తించిన ధనాన్ని యిలా జ్ఞానాభివృద్ధికి, మంచి పనులకు వెచ్చించడాన్ని అతడెంతో కొనియాడేవాడు. ధనం, సిరిసంపదలు లోకానికి మేలు చేయడానికి లభించిన అపూర్వ అవకాశాలుగా భావించమన్నాడాయన.

విదర్భ దేశంనుండి వచ్చిన ప్రుచ్ఛకశీలుడు, 'అన్ని దానాల్లో గొప్ప దానం యేది? అన్ని రుచులలో యే రుచి గొప్పది? అన్ని సంతోషాలలో యే సంతోషం గొప్పది? అని అడిగితే, గౌతమబుద్ధుడు, 'అన్ని దానాలలో ధర్మజ్ఞాన దానం గొప్పది, అన్ని రుచులలో ధర్మ రుచి గొప్పది, అన్ని సంతోషా లలో ధర్మ సంతోషం గొప్పది - యెందుకంటే ధర్మం దుఃఖాన్ని నిర్మూలించి, మనిషిని అర్హతుడ్ని చేస్తుంది.' అని చెప్పాడు.

ఆ విధంగా జ్ఞానానికి, జ్ఞాన దానానికి అతడు కల్పించిన అమూల్యత, అప్పుడూ, తదనంతరం కూడా కొన్ని వందలయేండ్లపాటు జ్ఞానసముపార్జన, సమతానాగరికత అభివృద్ధి కావడానికి దోహదపడింది. అప్పటికీ యిప్పటికీ యెప్పటికీ కూడా జ్ఞానదానం గొప్పదే. అది ఆ దానశీలుర్ని అమరుల్ని చేస్తుంది. ఆరామాలు, విద్యాలయాలు కట్టించడమే కాదు ప్రజలకు జ్ఞానాన్ని అందివ్వడానికి చేసే యెంతటి చిన్న పనిని అయినా అతడు యెంతో అభినందించేవాడు. ఆదరించేవాడు.

## మంచిపని యెంత చిన్నదైనా గొప్పదే

అజ్ఞాత బ్రాహ్మణుడొకడు, తన గ్రామం చివరవుండే చెరువు దగ్గరకి చేరి, భిక్షను భుజించి వెళ్ళే బౌద్ధ భిక్షువులకు నీడగా వుండటానికి అక్కడ వొక చిన్న రావి చెట్టుని నాటి, పశువులు తినకుండా చుట్టూ ముళ్ళకంచెకట్టి ఆ చెట్టుకి రక్షణ చేశాడు. అది రెండు సంవత్సరాల్లోనే బలంగా పెరిగి బౌద్ధభిక్షువులకి నీడ యిచ్చింది. ఆ అజ్ఞాత బ్రాహ్మణుడు యెంతో సంతోషపడి పోయాడు. ఆ రావి చెట్టుక్రింద కూర్చోవడానికి నాలుగైదు పెద్ద పెద్ద బండరాళ్ళను చక్కగా పేర్చాడు. బౌద్ధ భిక్షువులా రాళ్ళపైన కూర్చుంటుంటే చాలా సంతోషపడిపోతూవుండేవాడు. యిలావుండగా వొకసారి వర్షం వచ్చింది. అయ్యో ఆ మహాత్యాగులు, జ్ఞానులు వర్షంలో తడిసి పోతున్నారే యెట్లా

అనుకుంటూ ఆ మర్నాడే కాసిని డబ్బులు కూడేసుకుని ఆ రావి చెట్టు ప్రక్కనే చిన్న పాక కట్టించాడు. వర్షం వచ్చినప్పుడు ఆ చిన్న పాకలో వారు తలదాచుకుంటుంటే అతడు చాలా సంతోష పడిపోయాడు. చివరికి అతడు కట్టుదిట్టమైన విహారమే నిర్మిస్తే మంచిదని, తన మిత్రులతో చెప్పి, వారుకూడా కలిసిరాగా, అనతికాలంలోనే అక్కడ ఒక ఆరామాన్ని కట్టించి, బౌద్ధ సంఘానికి అంకితం చేశాడు. ఆ సందర్భంగా అక్కడికి వచ్చిన గౌతమబుద్ధుడు అతడు మొదటనుంచీ చేసిన పనుల్ని తెలుసుకుని ఎంతో సంతోషించాడు. ఆ రోజు అక్కడ జరిగిన సభలో అజ్ఞాత బ్రాహ్మణుడ్ని బుద్ధ భగవానుడు ఎంతో మెచ్చుకున్నాడు. దాన గుణం అన్నది మనస్సుని పవిత్రం చేస్తుంది. స్వార్థాన్ని వీడనాడేటట్లు చేస్తుంది. శాశ్వతమైన పేరుతెస్తుంది. మొదట గడ్డిపోచతో మొదలు పెట్టినాసరే దానగుణం అన్నది అతడ్ని చివరకు శిరస్సునైనా దానం చేయగల అత్యున్నత స్థాయికి తీసుకు వెళుతుంది. వెండి, బంగారు లోహాలనుండి స్వర్ణకారుడు నేర్పుతో మలినాల్ని తీసే విధంగా బుద్ధిమంతుడు చక్కని పద్ధతుల్ని అవలంభించి మనోమాలిన్యాలను వదిలించుకుని యిలా అజ్ఞాత బ్రాహ్మణుడిలా పరిశుద్ధుడవుతాడు. మంచికోసం చేసేపని ఎంత చిన్నపని అయినా ఎంతో విలువైంది - అది మరెన్నో మంచి పనులకు దారి తీస్తుంది' అని శ్లాఘించాడు.

ఈ విధంగా జ్ఞానవ్యాప్తికి అతడు బౌద్ధ సంఘాల్ని ప్రోత్సహించి పటిష్టంగా నిర్మించిన ప్రచారంచేసిన ఫలాలనే యిప్పుడు మనం అనుభవిస్తున్నాం. జ్ఞానబోధకు విద్యాలయాలు, కళాశాలలు తమ పేరున కట్టించడానికి చరిత్రలో గౌతమబుద్ధుడే ఆద్యుడు.

అందుకే అతడు జ్ఞానిగా, మహోపాధ్యాయుడుగా మనందరికీ పూజనీయుడు. మనిషి జ్ఞానాన్ని పెంచడానికి ఆయననూ, ఆయన బోధించిన బౌద్ధాన్ని మనం ఆదర్శంగా తీసుకోవాలి. విద్యని వ్యాపారంగా చేసి వేస్తున్న యీ దుష్టవ్యవస్థలో బౌద్ధం యొక్క అవశ్యకత తలచుకుంటే యిది జరిగే పనేనా? అని గుండె బరువెక్కుతుంది. చదువుకున్న ప్రతి వొక్కడూ తనకు తానుగా ఉపాధ్యాయుడై జ్ఞానబోధలో ఆదర్శంగా నిలవాలి. అప్పుడే మనం గౌతమబుద్ధునికి నిజమైన వారసులం అని అనిపించుకోగలుగుతాము. బౌద్ధం ఆనాడు సాధించిన సాంఘిక విప్లవాన్ని కొనసాగించ గలుగుతాము.

గౌతమబుద్ధుడు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ నడిపిన సాంఘిక విప్లవమంతా జ్ఞానబోధే. జ్ఞానబోధే సాంఘిక విప్లవమైందన్నాడు. సంఘంలో యెప్పటికైనా అంతే. నూతన భావాల వెల్లువలే సామాజిక విప్లవానికి కారణాలవుతాయి.యిది చరిత్ర చెప్పిన సత్యం.

జ్ఞానం సంపాదించే క్రమంలో వొక్కొక్కసారి కోరికలు, పాతవాసనలు అడ్డువస్తూ వుంటాయి.

అలాంటి అడ్డుకట్లను దాటే వివేక చింతన కూడా బుద్ధుని బోధనలలో వివరంగా వుంది

## ఎవరికివారు ఆత్మశిక్షణ గరుపుకోవాలి

నంగలకుడనే నిరుపేదరైతు, చెమటోడ్చి పొలం దున్నుకుంటూ, ఆ పొలంగట్టునే వెళుతున్న బౌద్ధ భిక్షువుని చూసి, "మహాశయా! అదృష్టమంటే మీదండి పొలందున్నాలా, గొడ్డు చాకిరీ చెయ్యాలా హాయిగా బ్రతికేస్తున్నారు - అదృష్టం కాదూ?" అని పైకేఅనేస్తే, ఆ బౌద్ధభిక్షువు అతడి మాటలకు కొంచెంకూడా బాధపడకుండా, అతని వంక, ప్రేమగా చూసి, అతడి దుస్థితికి చలించి, తనలాగే బౌద్ధ భిక్షువుని కమ్మనమని, యిప్పుడే తనతో వచ్చెయ్యమని చెప్పాడు. ఆ మాటలు విన్న

వంగలకుడు ఆశ్చర్యపోయి, పేదవ జీవితం వదిలిపోతే మరీ మంచిది, 'గొప్ప గొప్ప వాళ్ళకే, పెద్ద చదువుల వాళ్ళకే యిలా బౌద్ధ భిక్షువలయే అవకాశం', అని యిన్నాళ్ళూ తాను అనుకున్నాడు. యివాళ 'తనలాంటి వాళ్ళకు కూడా అవకాశం వుంటుందంటే యిందుకు వదులు కోవాలి ఆ సుఖం, అనుకుంటూ ఆ బౌద్ధ భిక్షువు వెనకే అప్పటికప్పుడే బయలు దేరిపోయాడు.

ఆశ్రమానికి దగ్గరలో వున్న వొక చెరువు దగ్గర వంగలకుణ్ని వదిలి, ఆబౌద్ధ భిక్షువు అతడితో 'ఆ బట్టలు విప్పి ఆ చెరువులో స్నానం చేస్తూ వుండు. ఆ బట్టలు మళ్ళీ కట్టుకోవద్దు. కొత్తవి తెస్తాను' అని చెప్పి ఆశ్రమం వైపుకి వెళ్ళాడు. వంగలకుడు బట్టలు విప్పి 'మళ్ళీ యెందుకైనా మంచిది తన బట్టలు తనకి వుంటాయి'. అని అనుకొని దగ్గర్లోగల వొక చెట్టుతొర్రలో ఆ బట్టలు దాచి స్నానం చేసి బౌద్ధభిక్షువు కొత్త బట్టలతో రాగానే వాటికి వచ్చి అవి ధరించి అక్కడే బౌద్ధ ధర్మ దీక్ష తీసుకున్నాడు.

అచిరకాలంలోనే అతడు మానసికంగా ధార్మికంగా యెంతో అభివృద్ధి అయ్యాడు. బౌద్ధ సంఘంలోని చదువులు, సత్సాంగత్యం అన్నీ అతడికెంతో మేలు చేశాయి. కానీ అప్పుడప్పుడూ అతడికి పాత జీవితం జ్ఞాపకం వస్తూ మనస్సు మళ్ళీ పాత జీవితం వైపుకు లాగేది. అలాంటప్పుడు ఆ కొలను దగ్గర చెట్టు దగ్గరకు వెళ్ళి, ఆ మాసిన బట్టలు బయటికి తీసి యోచించుకునేవాడు. కొంతసేపటికి ఆ జీవితం కంటే యీ బౌద్ధ భిక్షువు జీవితమే మేలైనదన్న నిర్ణయానికి వచ్చేవాడు. తనకు తాను అలా సమాధాన పరచుకొని వచ్చేవాడు. చాలాసార్లు అలా చేశాక, అతడు చివరికి అక్కడికి వెళ్ళడమే పూర్తిగా మానుకున్నాడు.

అందుకు అతణ్ని గౌతమబుద్ధుడెంతో అభినందించాడు. "వంగలకుడు ఆత్మసంబోధన చేసుకుంటూ తన్ను తాను క్రమంగా చక్కదిద్దుకుంటూ, తనసితాను ప్రేరణపరచుకుంటూ, పరీక్షించుకుంటూ, పరిశీలన చేసుకుంటూ, చివరికి అర్హతుడయ్యాడు. అలాగే యెవరైనా సరే జ్ఞానమార్గంలో వెళుతున్నప్పుడు పాతవాసనలు, అడ్డంకులు యెదురైనా వాటిని ఆత్మశక్తిగాతో యెదుర్కోవా లి. విజయం సాధించాలి ", అని చెప్పాడు.

ధర్మ మార్గం యెంత పవిత్రమైనదంటే పాపాలు చేసిన వాడైనా సరే పుణ్యాలుచేస్తూ పాపాల్ని తగ్గించుకుంటూ, ధర్మ మార్గాన నడిచేటట్లయితే అతడొక నాటికి యీ లోకానికి నిర్వాణ మార్గం చూపే జ్యోతి అవుతాడు. కారుమబ్బులనుండి బైటికి వచ్చిన పూర్ణ చంద్రుడిలా ప్రకాశిస్తాడు.

బౌద్ధ వాఙ్మయంలో అంగుళిమాలుడికథ యిందుకు నిదర్శనంగా నిలిచి పోతుంది. జ్ఞానాన్ని అందివ్వడంలో కులమత జాతి భేదాలు మాత్రమే కాదు, యెటువంటి దుర్మార్గుడికైనా అంగీకరించే యెదల దానిని అందివ్వ వచ్చు - అతణ్ని పునీతుణ్ని చేయడం ద్వారా యెంతమందినో ధర్మ మార్గాన నడిచేందుకు ప్రేరేపితుల్ని చేయవచ్చునని బుద్ధ భగవానుడు మహాపాపి, కర్కోటకుడు అయిన అంగుళిమాలుడికి ధర్మదీక్షనివ్వడం ద్వారా నిరూపించాడు.

## పాపిష్టి గురువుల కర్మఫలమే అంగుళిమాలుడు

జ్ఞానబోధచేసే గురువులు, వుపాధ్యాయులు, బౌద్ధభిక్షువులు యెటువంటి స్వార్థమూ లేకుండా సత్యబోధ చేయాలనీ, వారిలో వున్నత లక్షణాలుండాలనీ, శిష్యులకు వారు మార్గదర్శిగా వుండాలనీ, అట్లా లేకపోతే వారు తమ దుష్ట మనస్సుతో విద్యార్థుల జీవితాలను నాశనం చేసి

పోరేస్తారనీ, ప్రజాపీడకులుగా మార్చి వేస్తారనీ చెప్పడానికి అంగుళిమాలుడి కథను చెప్పుకోవచ్చు. అంతేకాదు గౌతమబుద్ధుని లాగా అటువంటి వారిని ధర్మ మార్గాన నడిపించే లాగా ఉపాధ్యాయులు తమ జీవితాన్ని ధర్మమార్గాన నడుపుకోవాలని చెప్పడానికి కూడా అంగుళిమాలుడి కథను ఉదాహరణగా చెప్పుకోవచ్చు. అంగుళిమాలుడి కథ దుష్ట ఉపాధ్యాయులకు చెంప పెట్టులాంటిది. మంచి ఉపాధ్యాయులకు వివాలువంటిదని చెప్పుకోవచ్చు.

అంగుళిమాలుడు పూర్వాశ్రమంలో ఒక కల్మాషటం లేని విద్యార్థి. అతడిపేరు అహింసకుడు. వినయం, సేవాతత్పరతలతో అతడు గురువుకి గురుపత్నికి యెంతో ఆదరణపాత్రుడయ్యాడు. యెంతో శ్రద్ధాభక్తులతో విద్య నేర్చుకున్నాడు. అతడిని చూచి అతడి సహవిద్యార్థులు చాలా యీర్ష్య పడ్డారు. దానితో అహింసకుడిపట్ల గురువుగారి ప్రేమ తగ్గించెయ్యాలని కుట్ర పన్ని, గురువులో, అతనిపై, గురుపత్నిపై అనుమాన బీజాలు నాటుకునేటట్లు అనుమాన పరిస్థితులు సృష్టించారు.

గురువు యే మాత్రం హేతుబద్ధంగా ఆలోచించలేకపోయాడు. సంయమనం పాటించ లేక పోయాడు. కార్యాకారణాలు యోచించడమే మానుకున్నాడు. అనుమానమనే పిశాచి తనను పట్టి పీడిస్తోందనే ఆలోచనకూడా చెయ్యకుండా, దానికి లొంగిపోయి వివేకాన్ని కోల్పోయాడు. అహింసకుడంటే అతడి నరనరానా ద్వేషం పేరుకు పోయింది. వంచన చేసి అయినా అహింసకుడ్ని వదిలించుకోవాలని తలచాడు.

విద్యముగిసి అహింసకుడు యింటికి వెళ్ళబోతున్న తరుణంలో గొప్ప ప్రేమనటిస్తూ అహింసకుడ్ని చేరపిలిచాడు. తన దగ్గర పరమోత్తమమైన తారక విద్యవొకటి వుందనీ, వెయ్యిమందిని చంపిన వాళ్ళకే అది నేర్పమని తన గురువు తనకు చెప్పాడనీ. యీ విద్యను నేర్పడానికి అహింసకుడ్నే యెంచుకున్నాననీ నమ్మ బలికాడు. అమాయకుడైన అహింసకుడు గురువుగారి మాటలను నమ్మేశాడు. గురువు చెప్పినట్లు వేయిమందిని చంపి, వేయి బొటన వేళ్ళను చూపి, ఆ తారక విద్యను నేర్చుకుంటానని ప్రమాణం చేసి అడవులలోకి వెళ్ళిపోయాడు.

గురువుగారి ఆదేశాల్ని తుచ తప్పక పాటించాలని అతడు భావించాడు. వేయిమందిని చంపాలి. వేయి బొటన వేళ్ళను సంపాదించాలి. రేయింబవళ్ళు యిదేవూహ అతడికి.

మనిషిని చంపాలంటే అతడికి వణుకు పుట్టేది. భయం వేసేది. మనస్సు అంగీకరించేది కాదు. అయినా సరే గుండె దిటవు పరుచుకుని మనుష్యులను చంపే సంహారక్రియను ప్రారంభించాడు. క్రమేపీ మనుషుల్ని నిర్దయంగా చంపివేయడం అతడికి బాగా అభ్యాసమై పోయింది. మనిషిని చంపడమంటే పుల్ల విరిచినంత సులువతడికిప్పుడు. మనిషిని చంపడం, అతడి బొటనవేలు నరికి మెడలోని దండలో గుచ్చుకుని వేసుకోవడం,యిదే పని అతడికి. రోజుకొక్కళ్ళనైనా చంపకపోతే అతడికి తోచేదికాదు. చంపిన వాళ్ళ వేళ్ళనరికి మెడలో వేసుకొంటూ వుండడంవల్ల అంగుళిమాలుడిగా ప్రసిద్ధి చెందిన మహారాజా ప్రసేన జిత్తుడికే గుబులు పుట్టించాడు. అతడ్ని పట్టుకోవడం అసాధ్యమయ్యేది. యే చెట్టు చాటునుంచి వచ్చి చంపుతాడో, యే పుట్టలోంచి, యే గుబురు పొదల్లోంచి, యే పొదలోంచి వచ్చి యెవరిని మీదబడి చంపుతాడో తెలియదు. ప్రజలు భీతిల్లిపోయేవారు. ఆ పాపాత్ముడ్ని తలుచుకుని వణికి పోయేవారు.

గౌతమబుద్ధుడికి యీ అంగుళిమాలుడి గురించి తెలిసింది. నేను..నాది, అన్న దానినే చంపుకున్న వాడు గౌతమబుద్ధుడు. మహా మహా దుర్గమారణ్యాలు సైతం అతడికి కొట్టినపిండి. యింక అతడికేం భయం వుంటుంది?

అంగుళిమాలుడు వుండి వుంటాడని వూహించిన అటవీ ప్రదేశంగుండా గౌతమబుద్ధుడు నడుస్తూ వెళ్ళిపోసాగాడు. కట్టుబట్టలు తప్ప అతడి చేతుల్లో యెటువంటి ఆయుధాలూ లేవు. భయం అన్నది అసలే లేదు. సరిగా అదే రోజున అంగుళిమాలుడి తల్లి కూడా కుమారునికి యిటువంటి క్రూరహత్యలు మానమని చెప్పడానికి, యెవరు చెప్పినా వినకుండా బయలుదేరింది.

బుద్ధభగవానుడు అంగుళిమాలుడు వుండే అటవీ ప్రదేశంలోకి వెళ్ళిపోతూ వుండడం చూసి పశులకాపరులు, బాటసారులు, రైతులు యేమి జరుగుతుందో అని భయపడిపోయారు. ఆ దారిన వెళ్ళ వద్దని గౌతమబుద్ధునికి చెప్పే ధైర్యమెవరికీ లేదు.

## దుష్టుల్ని పునీతం చేసేది బుద్ధుని బోధనలే

మొదటగా ఆ రోజున అంగుళిమాలుడికి అతని తల్లే యెదురైంది. దూరంగా వున్న తల్లిని గుర్తించలేక కత్తితో ఆమె మీదకు దుమికాడు అంగుళిమాలుడు. చూస్తే ఆమె తల్లి. ప్రేమగా పిలుస్తోంది. కడకు తన తల్లినే చంపుకుంటున్న దుస్థితి వచ్చినందుకు, తన గురువు గురు దక్షిణ పేర తనకు అటువంటి దారుణమైన, కఠినమైన శిక్ష విధించినందుకు జీవితంలో మొదటిసారిగా అతడికి కళ్ళనీళ్ళు తిరిగాయి. హత్యలు చేసీచేసీ అతడు చాలా విసిగిపోయి వున్నాడు. సరి అయిన ఆహారం లేదు. నిద్ర లేదు. స్నానపానాదులు లేవు. అతడి జీవితమంతా హత్యలతో పాపపంకిలమైపోయింది. అతడికి యీ జీవితమంటేనే విరక్తి పుట్టసాగింది. కానీ అతడికి వెంటనే గురుదక్షిణ జ్ఞాపకం వచ్చేది. యిప్పుడతడు తల్లిని చంపలేక యేం చెయ్యాలో తెలియక సతమతమవుతున్న పరిస్థితులలో గౌతమబుద్ధుడు తల్లి వచ్చినదారినేవెనుకగా వస్తూ యెదురయ్యాడు. అంగుళిమాలుణ్ని పట్టించుకోకుండా నిర్భయంగా ముందుకు వెళ్ళిపోసాగాడు గౌతమబుద్ధుడు. అంతకాలమూ తనంటే భయపడి చచ్చే మనుష్యుల్నే చూసిన అంగుళిమాలుడు, తనంటే లెక్కలేనట్టు వెళ్ళిపోతున్న గౌతమబుద్ధుణ్ణి చూసి కోపంతో బుసలుకొట్టాడు.

వెళ్తున్న గౌతమబుద్ధుణ్ని కొంతసేపు వెంబడించాడు. అంతలోనే అహంకారంతో, 'నేను వెనకవెళ్ళడమేమిటి యిది నా రాజ్యం, యిటునైపువెళ్ళేవారందరూ నామాట వినాలి,' అనుకుంటూ వెళ్తున్న గౌతమబుద్ధుణ్ని వెనుకనుంచి 'ఆగు' అని గట్టిగా అరిచాడు. ఆ మాటకు గౌతమబుద్ధుడు ఆగి వెనుకకు చూశాడు.

కత్తి చేతిలో పట్టుకుని వడివడిగా గౌతమబుద్ధుడి వైపు పరుగెత్తాడు అంగుళిమాలుడు. అతనింకా తన దగ్గరకు చేరకుండానే, గౌతమబుద్ధుడు చిరుదరహాసంతో

"అంగుళిమాలా! నీ మాటవిని నేను ఆగిపోయాను. మరి నా మాట విని నువ్వాగిపోతావా?" అన్నాడు సౌహార్ద్రంగా.

ఆ తీయని పలుకులకు, సౌభ్రాతృత్వానికి, ప్రేమకు అంగుళిమాలుడు విచలితుడై పోయాడు. అయినా గుండె నిబ్బరపరుచుకుని ఆగిపోయి.

"యేంటి ఆగిపోవడం? యెందుకాగిపోవాలి?"

"నా దారిలో నేనాగిపోయాను. చెడు దారిలో నువ్వాగిపోవాలి"

"అటువంటి ప్రసక్తే లేదు. యిది నాకు వృత్తిలా అభ్యాసమై పోయింది. యింకా యెన్నో బొటనవేళ్ళు వరకే నా మెడలో వేసుకోవాలి. మా గురువుగారికి గురుదక్షిణ యివ్వాలి. నా ప్రమాణం పూర్తయ్యేవరకూ నాకు మరో దారి లేదు".

గౌతమబుద్ధుడు చిరునవ్వు నవ్వాడు.

"అంగుళిమాలా! నీకు వేరే మార్గం లేదనుకోకు. నువ్వు వూహించనంత మంచి మార్గం వుంది. యిప్పటిలా నీవల్ల ఆ మార్గంలో యెవరికీ దుఃఖం వుండదు. అందరూ నిన్ను ప్రేమిస్తారు. గౌరవిస్తారు. అధర్మమార్గంలోకి నువ్వు రావాలి. చూడు.. నువ్విలా దుష్టుడిగా వుండడం వల్ల నీకెప్పుడైనా సుఖంగా వుందా? భయంలేకుండా, బాధ లేకుండా బతకగలుగుతున్నావా? నీకు స్వేచ్ఛ అన్నది వుందా? నిన్ను చూసి క్రూర జంతువులు సైతం భయపడిపోతున్నాయి.. నువ్వంటే పాటి ప్రజల్లో యెంతటి ద్వేషమంటే వారు,' యెప్పుడు నువ్వు చస్తావా పండగ చేసుకుందాం', అని ఆలోచిస్తున్నారు యిట్లా క్రూరహత్యలు చేస్తూ, భయపడుతూ, భయపెడుతూ బతికే కన్నా మనుషుల్ని ప్రేమిస్తూ వారి చేత ప్రేమింపబడే బతుకుని నీకు చూపిస్తాను. నా మార్గంలోకి వస్తావా? నమ్మకంగా చెప్తున్నాను. ప్రజలు సైతం నిన్ను క్షమిస్తారు" అన్నాడు.

బుద్ధుడి మాటలు విని అంగుళిమాలుడు తలదించుకున్నాడు. అతడి కనుకొలకుల్లో నీళ్ళు నిలిచాయి. అతడి బండరాతి గుండె బుద్ధుని మాటలకు నెమ్మదిగా కరగసాగింది. అయినా మనసులో యేదో శంక.. అది జరిగే పనేనా?

బుద్ధుడు అతన్ని సమీపించి, అతడి చుబుకం యెత్తి అతడి వంక ప్రేమగా చూశాడు. అంగుళిమాలుడి తల్లి కళ్ళనీళ్ళు పెట్టుకోసాగింది.

ఆ లాలనకు అంగుళిమాలుడి కళ్ళమ్మటనీళ్ళు జలజలా రాలాయి. గౌతమబుద్ధుడు ఆప్యాయతతో, కరుణతో చేసిన బోధనలకు, తన అపనమ్మకాన్ని పోగొట్టుకొని తరువాత మరికొంత సేపటికి అంగుళిమాలుడు తనమెడలోని అంగుళిమాలని తీసి దూరంగా విసిరేశాడు. యిన్నాళ్ళు నరహత్యలు చేసిన కత్తుల్నీ, యితర సామానుల్నీ దూరంగా పడేశాడు. దొంగిలించిన వాటిల్లో సర్వసామాన్యమైన దుస్తులు ధరించి గౌతమబుద్ధుని వెంట నడిచాడు.

జ్ఞానదీక్ష తీసుకున్న తరువాత అంగుళిమాలుడు మరింతగా గుర్తుపట్టలేనంతగా మారిపోయాడు. యీ మార్పుకు ప్రసేనజిత్తుడెంతో ఆశ్చర్యపోయాడు సంతోషించాడు. గౌతమబుద్ధునికి ప్రణామాలు చేశాడు. అంగుళిమాలుడ్ని అభినందించాడు.

భిక్షరూపంలో భిక్షకు వచ్చిన అంగుళిమాలుడ్ని చూసి, అతడే అంగుళిమాలుడు అని తెలుసుకుని, పూర్వం అతని చేత చంపబడిన వారి పిల్లలు, బంధువులు అతన్ని రాళ్ళతో కొట్టి తరిమివేసేవారు.

'భిక్షూ! సహనంగా వుండు. సహనంలో గొప్ప శక్తి వుంది. నీలో వున్న కఠినత్వం అంతా తొలగిపోతుంది. జనుల అవమానాలు కొంతకాలం భరించు.. వారిలో కూడా తప్పక మార్పొస్తుంది' అని బుద్ధుడతనికి బోధించాడు.

"ప్రాణాలు పోయినా సరే యెవరినీ పల్లెత్తుమాట అనను. చేతులెత్తను. పారిపోను. యెదిరించను. సహిస్తాను. నా కర్మల ఫలాన్ని ఓరిమితో అనుభవించి పవిత్రుడ్నవుతాను. మీ అనుగ్రహం లభించింది నాకదే చాలు" అన్నాడు అంగుళిమాలుడు.

అంగుళిమాలుడు యెంత సహనంగా వున్నా ప్రజలు అతన్ని నెత్తురుధారలుకట్టేలా కొడుతూ వుండేవారు. హీన పరుస్తూ వుండేవారు. రాళ్ళు విసురుతూ వుండేవారు. అయినా అతడు నోరెత్తకుండా మౌనంగా ఆ బాధలు భరించేవాడు. యిలా కొంతకాలం గడిచింది. అంగుళిమాలుడ్ని

చూసి ప్రజలలో నెమ్మదిగా మార్పు వచ్చింది. అతన్ని ఆదరించసాగారు. కొట్టేవారు కొట్టి కొట్టి అలసిపోయారు. ఇతడు ఎదురు తిరగకపోవడం చూసి చచ్చిన పాముని మళ్ళా చంపడం ఎందుకులే అని చివరికి వాళ్ళే వదిలేశారు.

కానీ అంగుళీమాలుడివల్ల ఆప్తుడ్ని పోగొట్టుకున్న ఒక వ్యక్తి ఒక రోజున కసితో పెద్ద బండరాయి తెచ్చి ఎత్తిపెంచి అంగుళీమాలుడి నెత్తిమీద కొట్టాడు. ఆ దెబ్బకు అంగుళీమాలుడు వెంట నే గిలాగిలా తన్నుకుని చచ్చిపోయాడు.

ఆ దృశ్యం చూసి అందరికీ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. గత జీవితాన్ని మరిచి, ధర్మ జీవితాన్ని సహనంతో గడుపుకుంటూ వస్తున్న అంగుళీమాలుడ్ని చూస్తుంటే వారికి నెమ్మదిగా దయ కలిగేది. అలాంటిది అతన్నిలా ఒకడు క్రూరంగా చంపెయ్యడం, అతడు గిలాగిలా తన్నుకుని చనిపోవడం చూసి ఎంతో బాధపడ్డారు. చంపిన వ్యక్తి కూడా ఎందుకో తెలియని వేదనతో కుమిలిపోయి వలవలా ఏడ్చాడు. అంగుళీమాలుడి అంత్యక్రియలకి వేలాది జనం తరలివచ్చి కన్నీరు పెట్టారు. అతడొకనాడు ఘోరహంతకుడే. కానీ అతడు భిక్షువై శాంతి సహనాలతో త్యాగ జీవిగా బతకడంతో ప్రజలతడి మరణాన్ని తట్టుకోలేక పోయారు. చాలా మంది వెక్కివెక్కి ఏడ్చారు.

నేరస్థులు కేవలం పశ్చాత్తాపపడడమే కాకుండా, ధర్మమార్గంలో జీవితం గడపాలని అప్పుడే వారి జీవితానికి అర్థం, పరమార్థం వుంటాయని అంగుళీమాలుడి జీవితం మనకు చెప్తుంది. ధర్మమార్గంలో నడవడం ద్వారా ఆ మార్గంలో కొనసాగడం ద్వారా, ఆ మార్గంలోనే ప్రాణాలుసైతం పోగొట్టుకోవడం ద్వారా అంగుళీమాలుడు నిర్వాణం పొందాడు. చరితార్థుడయ్యాడు. జ్ఞానమార్గం, బౌద్ధమార్గం అంత గొప్పది. చీకటి జీవితాలను సైతం వెలుగులమయం చేస్తుంది.

జ్ఞానుల, మేధావుల జీవితం మరింత విలువైనది. మహత్తరమైనది. జనుల జీవన శైలుల్ని మార్చివేస్తుంది. కానీ అటువంటి జ్ఞానుల, మేధావుల దృష్టి అంతా పదిమంది బాగుకోసమే వుండాలి. వారిలో స్వార్థం, కపటం, పైశాచికత్వం. విపరీత ప్రవర్తన యివి వుంటే వారి వల్ల నష్టం. సాంఘిక జీవితం కలుషితమై పోతుంది.

అందువల్ల జ్ఞానం ఒక్కటే, ప్రజ్ఞ ఒక్కటే సరిపోదు అని గౌతమబుద్ధుడు బోధించాడు. అతడిలా అంటాడు:

## ప్రజ్ఞ, శీలం, కరుణ, మైత్రి

"విద్య గొప్పది. కానీ విద్య ఒక్కటే సరిపోదు. ప్రజ్ఞ వుండాలి. ప్రజ్ఞ అంటే విద్య యొక్క ఆచరణా రూపం, ఫలిత రూపం. ప్రజ్ఞ వల్ల మనిషి కార్యశీలుడవుతాడు. విద్య వలన జ్ఞానం తెలుస్తే ప్రజ్ఞ వల్ల దానిని ఎలా ఆచరించాలో తెలుస్తుంది.

అయితే ప్రజ్ఞమాత్రమే సరిపోదు. విద్యావంతుడు ప్రజ్ఞావంతుడు కావచ్చు ప్రజ్ఞావంతుడైనంత మాత్రాన సరిపోదు. ఎందుకంటే ప్రజ్ఞ కత్తిలాంటిది. కత్తి దేనినైనా నరుకుతుంది. దాని వలన మంచి జరగవచ్చు-చెడ్డ కూడా జరగవచ్చు. కానీ మనం మానవ సమాజంలో వున్నాం. బతుకు-బతికించు ధోరణిలో మనం బతకాల్సి వుంది. మనమీలోకానికి కలిసి మెలిసి బతకడానికి వచ్చాము. మన విద్యా ప్రజ్ఞలు అందుకు దోహదం చేయాలి.

నేర్చుకున్న విద్య, ప్రజ్ఞ సత్ఫలితాన్ని సాధించాలంటే అతడికి శీలం వుండాలి. శీలం వలన యేది మంచో, యేది చెడో తెలుస్తుంది. తనకు వున్న ప్రజ్ఞని యే విధంగా నడుపుకోవాలో శీలం

చెపుతుంది. శీలం వల్ల ప్రజ్ఞావంతుడు పదిమందికోసం బతకాలన్న, యెవరికీ తన ప్రజ్ఞ వలన నష్టం కలగకూడదన్న కట్టుబాట్లు విధించుకుంటాడు. ప్రజ్ఞ వినాశనానికి దారితీయకుండా చూసుకుంటాడు. యీ విధంగా ప్రజ్ఞకి శీలం తోడై వుండాలి.

యిలా విద్య, ప్రజ్ఞ, శీలం మాత్రమే సరిపోవు. దానికి కరుణ కూడా తోడై వుండాలి. కరుణ వల్ల ప్రజ్ఞా, శీలాలు పునీతమవుతాయి. స్వయం నిబంధనలు విధించుకుంటాయి. సాటివారిపట్ల మన బాధ్యతను యెల్లప్పుడూ గుర్తు చేస్తుంది కరుణ.

యిలా విద్య, ప్రజ్ఞ, శీలం, కరుణలు మాత్రమే సరిపోవు. అతడికి మైత్రి అన్న భావం కూడా వుండాలి. మైత్రి అంటే యీ విశాల విశ్వంలో తమతోపాటు బతికే విభిన్న జీవరాసులపై ప్రేమ. కరుణ అన్నది మన చుట్టూ వున్న మానవులపైన చూపేది. మైత్రి వల్ల ఆ వున్నతభావం విశ్వమంతటికీ వ్యాపిస్తుంది. యిప్పుడతడు తన ప్రజ్ఞకు శీలాన్ని, కరుణను, మైత్రిని కూడా తోడు తెచ్చుకుంటాడు. తన ప్రజ్ఞ మానవులకే గాక విశ్వమంతటికీ, ప్రకృతి అంతటికీ, జీవులన్నింటికీ వర్తించేలా చేసుకుంటా. మానవులకోసం వుపయోగించే ప్రజ్ఞ వల్ల ప్రకృతి జీవరాసులు పర్యావరణం దెబ్బతినకుండా చూసుకుంటాడు. యీ విధంగా మైత్రీ భావం, జ్ఞానికి ప్రజ్ఞ, శీలం, కరుణలతో పాటు వుండవలసిన గొప్ప వున్నతమైన భావం. అటువంటి జ్ఞానులే లోకానికి నిజమైన మేలు చేయగలరు.

యితరులు, జ్ఞానం లేనివారు, అహంకారులు యిటువంటి మేధావులను, జ్ఞానులను చులకన చేయవచ్చు. తక్కువగా చూడవచ్చు. కించపరిచే మాటలు మాట్లాడవచ్చు. కలుషితమైన పనులు చేసే కొందరు విద్యార్థికులు చేసే పనుల వల్లనే జ్ఞానులకు, మేధావులకు యిటువంటి అవమానాలు జరుగుతూ వుంటాయి. -

కానీ ప్రజ్ఞ, శీలం, కరుణ మైత్రి భావాలు కలిగిన గురువు, వుపాధ్యాయుడు అటువంటి నిందలకు, అవమానాలకు విలువ యివ్వడు. పదిమందికీ పనికి వచ్చే, దుఃఖాన్ని నిర్మూలించే విద్యాబోధన చేయడమే అతని కర్తవ్యంగా జీవితధ్యేయంగా వుంటుంది. క్రూరహత్యలు చేసిన అంగుళిమాలుడంతటివాణ్ణే జనులు క్షమించారు. జీవితాలు బాగు చేసేవారిని యెందుకు ప్రేమించి గౌరవించరు?

వొకసారి గౌతమబుద్ధుడు మగధ రాజ్యంలో పర్యటన చేస్తున్నప్పుడు యేకనల అన్న వూరిలో మధ్యాహ్నం వేళ, రైతులు యింటి నుండి తెచ్చుకున్న భోజనాలు చేసేవేళ వొకరైతు దగ్గరకు వెళ్ళి భిక్ష అడిగాడు. ఆ రైతు గౌతమబుద్ధుణ్ణి చూసి పరిహసించాడు.

"యేమయ్యా! నువ్వేమన్నా కష్టపడుతున్నావా? నేను అన్నం తినే ముందు కష్టం చేస్తాను. కష్టించి పని చేస్తాను కాబట్టి నాకీ అన్నం తినే హక్కు వుంది. నేను యీ పొలంలో పడి దున్నుతాను. విత్తుతాను. పొలాన్ని రక్షణ చేస్తాను. మరి నువ్వేం చేస్తావు? తిండి తినేందుకు నీకున్న అర్హతయేమిటి?"

గౌతమబుద్ధుడు అతడి మాటలకు నొచ్చుకోకుండా, వినమ్రంగా, యిలా చెప్పాడు.

"అయ్యా! నేను కూడా తినేముందు కృషి చేస్తాను. దున్నుతాను, నాటుతాను" అన్నాడు.

అతడి మాటలు విని ఆ రైతు పకపకా నవ్వి 'అలాగా! మరేవీ నాగలి, కాడీ, యెద్దులూ యేవీ నీ దగ్గర?" వెటకారం చేశాడు.

బుద్ధుడు చిరునవ్వు నవ్వాడు.

"మహాశయా! శ్రద్ధ అనే నాగలికి, కృషి అనే యెద్దులు కట్టి, మనస్ఫూర్తి అనే నాగలి కర్రతో మరగాం, దుఃఖం లేని పొలాన్నిదున్ని, ఆత్మవిశ్వాసమనే బీజం నాటి, తపస్సనే నీరు పోసి, మాటచేతలను అదుపులో పెట్టుకుని, జాగృతితో కలుపు తీసి, మహానందమనే పంటను పండిస్తాను. అందరికీ పంచుతాను. నాలాగా దున్నేవాడు అన్ని చెడుల నుంచీ విముక్తుడవుతాడు. పదిమందికి మేలు చేసే ఆలోచనలే నేను పండించే పంట" అని చెప్పాడు వినయంగా, నిశ్చయంగా.

రైతు అతని మాటలకు నిశ్చేష్టుడయ్యాడు. వినయ గౌరవాలు తెచ్చుకుని, గౌతమబుద్ధుడికి ప్రేమతో భిక్ష పెట్టాడు. క్షమించమని కోరుకున్నాడు.

అహంకరించకుండా, గాయపడకుండా, వినయంగా, కరుణా జ్ఞానాన్ని బోధించడమే ఒక జ్ఞానికి, మేధావికి, వుపాధ్యాయునికి, బోధికి, భిక్షువుకు వుండవలసిన గుణం. అటువంటి జ్ఞానమే చైతన్యం. ఆ జ్ఞానమే సాంఘిక, ధార్మిక విప్లవం.

జీవితాలను పరిశుద్ధమైన, సక్రమమైన మార్గంలో నడిపి, తన దుఃఖాన్ని, యితరుల దుఃఖాన్ని నాశనం చేసేటట్టుగా జ్ఞానుల్ని మలచడం కోసమే గౌతమబుద్ధుడు జీవితంలో చివరిక్షణం వరకూ కష్టపడ్డాడు. అతని కష్టం ఫలించింది. వేల సంవత్సరాలుగా జ్ఞానుల్లో అతని బోధనలు, మూర్తిమంత్వం ఒక మహాప్రవాహంలా సాగిపోతూనే వున్నాయి. దిశదిశలా, దేశదేశాలా జ్ఞాన జ్యోతులు వెలిగిస్తూనే వున్నాయి. జ్ఞానానికి ఆయన వుపదేశించింది సక్రమమైన ఆచరణ మాత్రమే. జ్ఞానస్థితిని పొందడానికీ, సుఖపడటానికి దగ్గరదోవలుగానీ, అడ్డదోవలుగానీ ఆయన చెప్పలేదు సరికదా ఆయన అటువంటి అడ్డదోవల్ని తీవ్రంగా ఖండించాడు. అద్భుతప్రభావాలతో అవి సత్ఫలితాలనిస్తాయని యెవరైనా నమ్మితే- ఆ నమ్మకం నిజమైనప్పటికీ కూడా అది సత్ఫలితం యివ్వదన్నాడు.

## జ్ఞానానికి అడ్డుతోవలు లేవు

కేవద్ధుడనే తాంత్రికుడు బుద్ధ భగవానుడిని సందర్శించి,' నలందా విహారంలో బౌద్ధ భిక్షువులతో పాటు ఒక తాంత్రికుణ్ణి కూడా నియమిస్తే ప్రజలు యింకా సుఖపడతారు .'అని అంటే, ఆయన అతడి సలహాని ఖండిస్తూ-

"కేవద్ధా! నీటి మీద నడవడం, గాలిలో యెగరడం అడ్డుగోడల్లోంచి అవతలివైపుకు వెళ్ళిపోవడం యితరుల మనసుల్ని చదవడం, యింకా యింకా అనేక అద్భుతాలు, మానవాతీతశక్తులు సామాన్య ప్రజలకు అసాధ్యం. యిటువంటి అద్భుతాలు చెయ్యడం అంటే అది బౌద్ధ భిక్షువులకు అవమానకరం. అధమ మైన అసహ్యం, చీదరపుట్టించే పనులివి. యీ పనులు యెట్టి పరిస్థితులలో నూ దుఃఖాల్ని నాశనం చేసుకునే జ్ఞానాన్ని అందివ్వవు. కేవద్ధా-మానవాతీతమైన శక్తి, అద్భుత శక్తి యేదైనా చేయూర్పించి వుందంటే అది మనుష్యుల్లో మార్పు తీసుకురావడమే. యెవరైనా మనిషి కామక్రోధ, ధన లోభ, మద మోహమాత్సర్యాలలో మునిగిపోయి వుంటే వాటి నుండి అతడు విముక్తి అయ్యే మార్గాన్ని బోధించు. యెవరైనా ద్వేషానికి, కోపానికి బానిసైపోతే-వాటినతడు అణచివేసి, వాటిని

అధిగమించడానికి నీశక్తియుక్తులన్నింటినీ ఖర్చుపెట్టు. యెవరైనా అవిద్యావంతుడు. ప్రపంచాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేనివాడు, అప్రజ్ఞావంతుడు యెదురైతే అటువంటివాడు జ్ఞాని అయ్యేవిధంగా, యీ ప్రపంచం దుఃఖం, అనిత్యంఅనాత్మ అని తెలుసుకునే విధంగా నీ శక్తియుక్తులన్నింటినీ ధారపోయి. కేవట్టా! అద్భుతాలంటే యివే" అన్నాడు.

అంతేకాదు పిండోలభరద్వాజుడనే వాడు బౌద్ధభిక్షువు అయివుండీ కూడా, వొక ధనికుడి మెప్పు పొందడానికి, అందనంత యెత్తులో వుంచిన తన భిక్షపాత్రను అతిసులువుగా తన చేతుల్లోకి తెప్పించుకుని, ఆ భిక్షాపాత్రకు మహిమలున్నాయని చెప్పబోతుంటే, గౌతమబుద్ధుడు, బౌద్ధుల భిక్షాపాత్రంలో యెటువంటి మహిమలూ వుండవు అని చెబుతూ రుజువుగా అక్కడికక్కడే ఆ భిక్షాపాత్రను ఆ పిండోల భరద్వాజుడిచేతనే ముక్క చెక్కలుగా విరగగొట్టించాడు. యిటువంటి మహిమా ప్రదర్శనల పట్ల తన తీవ్ర అసమ్మతిని. నిర్ద్వంద్వంగా ప్రకటించాడు.

తన శిష్యుడుకాకముందు, యెంతో తెలివైనవాడు. మంచివాడూ అయివుండి కూడా పిప్పాలి కొండగుహలో మహాకాశ్యపుడు." యెవరి మనసు యెలా వుంది? యెవరు యెప్పుడు మరణిస్తారు? యెవరు యెక్కడ పుడతారు?" మొదలైన అతీంద్రియ జ్ఞానాలు సంపాదించాలనే ఆశయంతో ధ్యాన సాధనలో నిమగ్నమైతే, గౌతమబుద్ధుడు నేరుగా అతడి దగ్గరికి వెళ్ళి మందలించాడు. "కాశ్యపా! ముందు ప్రజ్ఞను సంపాదించు, ప్రజ్ఞను సంపాదించకుండా సిద్ధులను సంపాదించావంటే పెడదారిపట్టిన వాడవవుతావు. రాగం, ద్వేషం, మోహం అనే క్లేశాలను తొలగించుకొని సంసారం నుండి మొదట ముక్తుడివికా. సిద్ధులను పొంది లోకానికి చేసే మేలు కన్నా వేయి రెట్లు మేలు ముక్త పురుషుడిగా లోకానికి చేయగలుగుతావు."

వివేకచింతన ద్వారా సాధకుడు మొదట అజాగ్రత్తను తొలగించుకోవాలి.అప్పుడే ప్రజ్ఞాప్రాసాదాన్ని యెక్కి, నిర్వాణ సుఖాన్ని పొందగలుగుతాడు. వీటి ముందుకు స్థిరమై నానా అవస్థలు పడుతూ, హాహాకారాలు చేస్తున్న మనుషుల్ని చూసి, భద్రమైన వున్నతస్థానం చేరినవాడు. "యిటు– యిటు.. యిక్కడికి యెక్కి రండి" అని దయతో అరచి చెప్పినట్లుగా ముక్తపురుషుడుకూడా నిర్వాణమనే భద్రమైనచోటున నిలబడి సంసార దుఃఖతప్తులను చూసి చాలా జాలి చెంది– "యిటురండి యిటు రండి" అని మహాకరుణతో పిలుస్తుంటాడు" అని బోధించాడు.

ఆ విధంగా జ్ఞాని యొక్క కర్తవ్యం, యెటువంటి భేదాలూ, భేదాలూ చూపకుండా మహా కరుణతో జ్ఞానబోధన చేయడమే అని బోధించి గౌతమబుద్ధుడు ప్రపంచబోధనాచరిత్రలోనే చరితార్థుడయ్యాడు– సర్వకాలాలకు మార్గదర్శి అయ్యాడు.

---

అధ్యాయం - V

# గౌతమబుద్ధుని బోధనలలో విశ్వజనీనమైన ప్రకృతి ప్రేమ

గౌతమబుద్ధుడు గొప్ప ప్రకృతి ప్రేమికుడు. ప్రకృతిలోని ప్రతి అణువులో, పక్షుల్లో, జంతువుల్లో, చెట్లల్లో, ఆకుల్లో, పువ్వుల్లో, యేరుల్లో, సరోవరాల్లో, మట్టిలో, యెండలో, వానల్లో, మేఘాల్లో, యిసుకరేణువుల్లో సైతం వుండే విభిన్నతనూ, సౌందర్యాన్నీ, అదే సమయంలో యేకత్వాన్నీ కూడా అతడు గమనిస్తూ యెంతో పరవశుడయ్యేవాడు. అతడు ప్రకృతిని పరిశీలించిన తీరు చాలా గొప్పది. ప్రకృతికి అతడు గొప్ప స్నేహితుడయ్యాడు.

జీవరాశులన్నీ గాలి, నీరు, అగ్ని, మట్టి తగుపాళ్ళల్లో కలియడంవల్ల పుడుతున్నాయనీ, అభివృద్ధి అవుతున్నాయనీ, కొంత కాలానికి నశించిపోతున్నాయనీ, అన్నీ నశించిపోయేవేననీ, నాశనం అయి మిగిలిన పదార్థాలలో కలిసి కొత్త జీవులుగా మళ్ళీ పుడుతున్నాయనీ తెలుసుకున్నాడు. యీ భూమిమీద పుట్టిన ప్రాణులన్నింటిలోనూ అంతర్లీనంగా బతుకు-బతికించు అన్న తాత్వికత వుందని గ్రహించాడు. మనుష్యులకంటే వున్నతమైన హృదయంకల జీవరాసుల్ని అతడెంతో ప్రేమించాడు. వాటిని వేటాడటం తప్పని, అన్యాయమని వుద్బోధించాడు. తన సిద్ధాంతంలో, బోధనలలో మనిషికి యెంత వున్నతమైన స్థానాన్ని యిచ్చాడో అంతటి వున్నతస్థానాన్ని ప్రకృతికీ, చెట్లకీ, మూగజీవులకీ కూడా యిచ్చాడు.

తాను అరణ్యాలలో వున్న ఆరేళ్ళూ తాను ప్రవచించినట్లుగా ప్రకృతిలో తనకు తెలిసిన ప్రతిప్రాణిలోనూ తాదాత్మ్యం చెందాడు. ఆయా ప్రాణుల సజీవమైన భావాలను, పొంకాలను పరిశీలించేవాడు. తానే ఆ ప్రాణిని అనుకునే వాడు. వాటి భాష, సైగలు ఆయనకు యెంతో చక్కగా అర్థమయ్యేవి. అవిసైతం ఆయన కన్నుల్లో లిప్తపాటులో జరిగే మార్పుల్ని పసికట్టేవి. కేవలం సహవాసం వల్ల మాత్రమే అబ్బే గుణం యిది. పశుపక్ష్యాదులతో, పెంపుడు జంతువులతో సాన్నిహిత్యం కలవారికి యిది అనుభవైకవేద్యమే.

యే ప్రాణి కూడా అతన్ని సందేహించేది కాదు. పైగా స్నేహం చూపేది. మూగజీవాలకు కూడా భాషవున్నదనీ అవి తమలో తామే కాదు అడవిలోని యితర జీవాలతో కూడా మాట్లాడగలవనీ, నష్టాలు కలగకుండా జాగ్రత్తగా వుండమని హెచ్చరికలు చేయగలవనీ, సాటిజీవులకోసం తమ ప్రాణాలనే త్యాగం చేయగలవనీ కూడా అతడు తెలుసుకున్నాడు. అతన్ని పారవెయ్యకుండే యేనుగూ, మరొక కోతి యెప్పుడూ అంటిపెట్టుకునే వుండేవనీ, సేవలు చేస్తూ వుండేవనీ యెప్పుడేం కావలసి వస్తుందో అవి కనిపెట్టుకుని వుండేవనీ కొన్ని జాతకకథలద్వారా తెలుస్తున్నది. ప్రతి జంతువునూ, పక్షినీ కూడా ప్రత్యేకంగా గమనిస్తూ వుండేవాడు. వాటి అలవాట్లు, వున్నత ప్రవర్తన అతనికెంతో సంతోషం కల్గించేవి. ఇద్దమృగాల వంటరిసంచారం అతడికి బాగా నచ్చేది

జాతకకథలలోని ప్రకృతికి సంబంధమైన కథలన్నీ మూగప్రాణులతో బుద్ధుడు మమేకమైన విధానాన్నే తెలియచేస్తాయి. మూగజీవాలను మనుష్యులు తమతో పాటు బతుక్కుతున్న తమలాంటి జీవులేననీ, వాటికీ భాష," స్నేహమూ, త్యాగమూ మొదలైన అన్ని వున్నత గుణాలూ

మనుష్యులకేమాత్రమూ తీసిపోని రీతిలోనే వున్నాయనీ గుర్తించి, వాటిని గౌరవించి, కాపాడుకునేందుకు ఆ కథలు యెంతో వుపయోగపడుతాయి.

బుద్ధుడు జ్ఞానమూర్తి అవడానికి అడవి అతనికి అమ్మ అయింది. అడవి జంతువులు అతనికి అప్మదమ్ములయాయి. చెట్లు, కొండలూ, వరన్నులూ అతనికి నేస్తాలయినాయి. బంధువులైనాయి. యిదంతా.. యీ ప్రకృతి అంతా, యీ జ్ఞానం అంతా సత్యం అని తెలుస్తున్న కొద్దీ అతని హృదయమెంతో ఆనందంతో నిండిపోయేది.

కడకు, మహావనంలో గృహిణి సుజాత పెట్టిన పరమాన్నం తిన్న తరువాత అతడి మనస్సులో మారుమూలల వున్న అతిసూక్ష్మవిరోధభావాలకూ అతడికీ యెంతో సంఘర్షణ జరుగుతుంది. వాటిని తుదకంటా నాశనం చేయాలని అతడు పట్టుదలగా ఆయా అనుమాన ప్రశ్నలకు ధీటైన సమాధానాలు యిస్తూ వొక్కొక్క వైరుధ్యభావాన్నీ నిర్మూలించి వేయసాగాడు. వొక ప్రశ్న అతడ్ని సూటిగా అడుగుతుంది. "సరే- యేం చెప్పడానికైనా, యేం చెయ్యడానికైనా అసలు నువ్వెవరవు?"

అతడు తాను, 'ఫలానా' అని అంటే. అది స్వార్థమే అయిపోతుంది. వెంటనే మరొక ప్రశ్న మొదలవుతుంది. నేను ఫలానివారి బిడ్డను అంటే తల్లీ, తండ్రీ.. ఫలానా రాజా కొడుకుని అంటే రాజ్యం, తండ్రీ.. యిలా తెగని గొలుసు. యిన్ని గొలుసులతో యిమిడిపోయిన అతడు ప్రజలకు యేమి చెప్తాడు? యిప్పుడు నువ్వెవరివంటే అతడేంచెప్పాలి ?

గౌతమ బుద్ధుడు తనలోనే వుదయించిన ఆ ప్రశ్నకు వొకే వొక్క చండమారుతంలాంటి ప్రళయగర్జనలాంటి సమాధానం చెప్పాడు. అది, "నేను సత్యాన్ని".

యీ జవాబుకు తిరుగులేదు. మరోప్రశ్నవేసే అవకాశమే లేదు. యెన్నిసార్లు చెప్పినా యథార్థమైన సత్యం అదే. అతడు సత్యం. అతడు వుండటం సత్యం. అతడి జ్ఞానం సత్యం. యింక ఆ ప్రశ్నకు మరోప్రశ్నవేసే అవకాశమే లేకపోయింది. అయినా ఆ ప్రశ్న తనకున్న శక్తియుక్తులనన్నీ కూడపెట్టుకుని, మరింతశక్తివంతంగా బుద్ధుడ్ని వోడించడమే పనిగా పెట్టుకున్నట్టు మరొక ప్రశ్న వేసింది. 'నువ్వు సత్యానివే అయితే అందుకు సాక్ష్యం యేమిటి"?

దాని వుద్దేశంలో సాక్ష్యం లేకపోతే సత్యం సత్యం కాదన్నమాట గౌతమబుద్ధుడు తాను సత్యం' అని చెప్పినందుకు తగిన సాక్ష్యాన్ని తేలేడని ఆ ప్రశ్న వూహ. ఆ ప్రశ్నకు, అద్భుతమైన ప్రజ్ఞతో, తాదాత్మ్యత తో, గంభీరతతో, ధృడత్వంతో ఆ ప్రశ్న చావు దెబ్బతినేలా తన చూపుడువేలును భూమిమీద పెట్టి చూపించి, "నేను సత్యం అనేందుకు యీ నేల తల్లే సాక్ష్యం" అన్నాడు.

యీ సమాధానానికింక తిరుగులేకపోయింది. ఆ ప్రశ్న అతడి ముందరే పటాపంచలై పోయింది . నాశనమైపోయింది. అసలు భూదేవి అన్నదేవతే వుంటే ఆమె ప్రాణమై, రూపమై నేరుగా వచ్చి ఆశీర్వదించగల గొప్ప సంఘటన అది. యీ సంఘటనకు తేరుకోలేనవరూ. నేలతల్లిపై అతడి ప్రేమా, భక్తి విశ్వాసమూ అంత గొప్పవి. బుద్ధునిశిష్యులు యిటువంటి సంఘటనలను అద్భుతంగా గానం చేసేవారు. బుద్ధుని చరితలో మరచిపోలేని ఘటన యిది.

క్రమేపీ ఆ గానాల్లో ఆ కథల్లో మహాత్మ్యాలు చోటుచేసుకున్నాయి. అతిశయోక్తులు చోటు చేసుకున్నాయి. ఆరాధనలో భాగంగా చేర్చిన ఆ మహాత్మ్యాలు వొకోసారి అటువంటి మహాత్మ్యాలు వుంటే మాత్రం తప్పేమిటి? అన్నంత ఆనందాన్ని కల్గిస్తాయి. కాని యిప్పుడు దేనినైనా ఆనందం

కోసం, విలాసం కోసం మనం మహత్తుగా భావిస్తే క్రమేపీ అందులోని సత్యం, మరుగునపడిపోయి పుత్తమహత్తు మాత్రమే మిగిలిపోతుంది. సుదూర భవిష్యత్తులో ఆ సంఘటనలలోని వాస్తవాలు గ్రహించడానికి ఆ మహత్తులు పెనులక్షంకులై మొత్తం ఆ సంఘటనే అభివృద్ధికీ చైతన్యానికీ దోహదం కాకుండా పోతుంది.

గౌతమబుద్ధుని జీవితం, బోధనల విషయంలో కూడా మహత్తులకూ, అతిశయోక్తులకూ గురిఅయినవి అనేకం వున్నాయి. వాటన్నిటిలోంచీ స్వచ్ఛంగా, ప్రత్యేకతగా స్వచ్ఛగా కనిపించేవి అతడి బోధనలూ ప్రకృతి ప్రేమ. యిందుకంటే అవీ సత్యం. వాటికి చావులేదు. అమరమైనవవి. తరతరాలకూ జ్ఞానాన్ని ప్రసాదించే జ్ఞానజ్యోతులవి. దివ్యత్వమవి.

గౌతమబుద్ధుడు మహాపరినిర్వాణం చెందిన తరువాత అతని శిష్యులలో ప్రియశిష్యుడు ఆనందుడు, బుద్ధుడు బ్రతికి వుండగా చెప్పిన కథలను 3 నెలల అనంతరం జరిగిన బౌద్ధసంగీతి సభలోగానం చేశాడు. అవియెన్ని తెలియదు. క్రమేపీ ఆయనందరియేళ్ళ తరువాత వేలాది, లక్షలాది మంది వాటిని గానం చేస్తూ కొంతమంది వాళ్ళవాళ్ళ సొంత పుణ్యాల్ని కలపడం చేత, అవన్నీ లిఖితం అయ్యేనాటికి మొత్తం 547 కథలయ్యాయి. వీటిల్లో ప్రకృతి గురించీ ప్రకృతి జీవుల గురించీ చెప్పిన కథలు నిజంగా గౌతమబుద్ధుడు చెప్పినవే అయివుంటాయనిపిస్తుంది. అవి నిజమే కావచ్చు కూడా. కొంతంత వున్న మానవ కల్పనను ప్రక్కన పెడితే అవి యెంతో సహజంగా వున్నాయి. ఆయన బోధనలలో కూడా ప్రకృతి పూలతో దారంలాగా అల్లుకుపోయింది. తరతరాలుగా కవులకూ, కళాకారులకూ, శిల్పకారులకూ, చిత్రకారులకూ, పుష్పాలంకారకులకూ, వృక్షసేవకులకూ ఆయన ప్రకృతి సహిత బోధలూ, కథలూ యెంతో స్ఫూర్తి నిచ్చాయి. ఆయా కళల్లో సాటిలేని అభ్యున్నతిని సాధించేందుకు తోడ్పడ్డాయి. యింకా తోడ్పడుతూనే వున్నాయి.

## గౌతమబుద్ధుని వృక్షప్రేమ

గౌతమ బుద్ధుడికి చెట్లంటే చిన్నప్పటి నుంచీ చాలా యిష్టం. అతడు పుట్టడమే ఒక వనంలో అశ్వత్థ వృక్షం క్రింద పుట్టాడు. బుద్ధుని జీవితంలోని అయిదు ప్రధాన ఘట్టాలు, పుట్టుక, దివ్యామధూతి, మహాసంబోధి, ధర్మచక్ర ప్రవర్తన, మహాపరినిర్వాణం – అన్నీ చెట్లకింద జరిగినవే. తల్లి లేని జీవితమతడిది. బాల్యంలోనే చెట్ల నీడన కూర్చుని, చెట్లకేసి, గాలికి వూగులాడే వాటి కొమ్మలకేసి, విరిసిన పువ్వులకేసి, రాలిపడే పువ్వులకేసి, పూలపైన వాలే తేనెటీగలకేసి చూస్తుంటే అతడికెంత సంతోషం కలిగేదో! తల్లి వొడిలోనే వున్నంత ఆనందం కలిగేదతడికి.

అతడు చిన్నప్పుడు తండ్రితో వ్యవసాయ వుత్సవంలో పాల్గొనడానికి వెళ్ళినప్పుడు కూడా ఒక చెట్టు క్రిందనే (నేరేడు చెట్టుక్రింద) కూర్చున్నాడు. రాజభవనాల్లో వుండే వాటికన్నా భిన్నమైన చెట్లనూ, పువ్వుల్నీ అతడప్పుడే చూశాడు. ప్రకృతిలో యింకేమి వింతలున్నవో? అవన్నీ తెలుసుకోవాలన్న తన కోరిక యెప్పటికితీరేను ?యినే తలపులు. రాజభవనానికి తిరిగి వెళ్ళడానికి పాపం ఆనాడతడి చిన్నిమనసు యెంతకలతపడిందో!

పెద్దవాడైనాక యజ్ఞాల సంగతి తెలిసి, ఆ యజ్ఞాలలో నోరులేని మూగజీవుల్ని బలియివ్వడమే కాకుండా, వొక్కొక్క పశువుకూ వొక్కొక్క చెట్టు చొప్పున నరికి, ఆ చెట్లతో చేసిన యూపస్తంభానికి ఆ పశువుని కడతారు అనేసరికి అతడెంతగానో బాధపడ్డాడు. మానవునిమంచి యెటువంటి

సాయాన్నికోరని, పైపెచ్చు తమ ఫలాల ద్వారా మనిషికే తిరిగి సాయం చేసే చెట్లని విలువనా నరకడాన్ని అతడు తీవ్రంగా వ్యతిరేకించాడు. చెట్లని నరకడాన్ని అనేకచోట్ల తీవ్రంగా ఖండించాడు. మలినాలు తుడుచుకునే కాగితం తయారుచేయడం కోసం, లక్షలాది హెక్టార్ల వెదురు యితర అరణ్యాల్ని నిర్దాక్షిణ్యంగా నరికివేస్తూ, వన్య ప్రాణులకి, ప్రకృతి రక్షణకే ముప్పుతెస్తున్న నేటి అంధకార ఆధునిక ప్రపంచ దుష్పోకడలు చూస్తే రెండు వేల సంవత్సరాల క్రితమే చెట్లని కూడా మూగజీవాలుగా పరిగణిస్తూ వాటిని రక్షించాలని ఆరాటపడిన, నిర్విరామంగా చాటిన గౌతమబుద్ధుని మానవతాహృదయాన్ని ఆర్ద్రతను లెక్కకట్టగలగడం యెవరికైనా సాధ్యమేనా ? అనిపిస్తుంది. చేయగలిగినదల్లా మానవాళి యిప్పటి వరకూ యింతటి ప్రకృతి నాశనం చేసినందుకు పశ్చాత్తాపపడి, ఆ ప్రకృతి, వృక్ష రక్షణ పట్ల ప్రతీ ఒక్కరూ శ్రద్ధపెట్టగలగడమే.అదే ఆ మహనీయునికి మనం అందించగలిగిన నిజమైన నివాళి.

అతడేవూరు పర్యటించినా ఊరిచివర చెట్లు విస్తారంగా వుండే ప్రాంతంలోనే విడిది చేసేవాడు. ఆ విధంగా ఆమ్రవనం, మామిడివనం, వేణుకలవనం, మృగదావనం, కర్దకవనం, జేత వనం, న్యగ్రోధ వనం, (అనగా మర్రి. పై నుండి క్రిందికి పెరిగేది అని అర్థం), మహావనం, వేణీ వనం, యింకా ప్రసిద్ధికెక్కాయి. ఆయా ప్రాంతాల్లో ఆయా ఋతువుల్లో తిరుగాడే కోయిలలు, జెముడు కాకులు, గ్రద్దలు, పావురాలు, చకోరాలు, యేట్రింతలు, వందలాది కొంగజాతులు, గుడ్లగూబలు, గువ్వలు యివన్నీ బౌద్ధభిక్షువులకు కనువిందుచేసేవి. ప్రేమ, సమైక్యత అనే వున్నతమైన ప్రేరణలు కల్గించేవి. ప్రకృతి పాఠాలు నేర్చుకునేందుకు బౌద్ధ భిక్షువులకు ఆదిగురువులయ్యేవి. మానవతను పునర్నిర్మించే వారి బోధనలలో, తమ వున్నత సౌజన్య గుణాలతో మనోరమ్య భావనలు నింపేవి. బౌద్ధంలో పక్షుల గురించి కథలూ, పాటలూ యెన్నెన్నో.

అతన్ని గౌరవించేరాజులు, మహారాజులు అతడు నివాసముండేందుకు, బుద్ధుడు కోరుకున్న విధంగానే వనాలలో, సహజంగా వుండేలాగున ఆశ్రమాలు నిర్మించేవారు. గౌతమబుద్ధుడు స్వయంగా మొక్కలు నాటినట్లుగా యే గ్రంథంలోనూ లేదు. అయితే బౌద్ధ భిక్షువులు విశ్రాంతి తీసుకోవడం కోసం, పాదచారులు విశ్రాంతి తీసుకోవడం కోసం చెట్లు నాటించడానికి ప్రోత్సాహం యిచ్చినట్లుగా ఆధారాలు వున్నాయి. అదిలావున్నా చెట్లు కొట్టించడాన్ని మాత్రం ఆయన తీవ్రంగా వ్యతిరేకించాడు. కాబట్టి వున్న చెట్లన్నిటికీ ప్రాణ భద్రత కల్పించాడనడంలో సందేహంలేదు. అసలు వున్న చెట్లనే కనుక బతికించుకుంటే కొత్త మొక్కలు ప్రత్యేకంగా వేయవలసిన అవసరం యేమి వుంటుంది?

చెట్లని రక్షించడం అనేదాన్ని ఒక సంస్కృతిగా గౌతమబుద్ధుడు అభివృద్ధి చేశాడని చెప్పవచ్చు. వేలాదిమంది తన శిష్యుల్ని చెట్ల క్రిందనే విశ్రాంతి తీసుకోమని, యే గృహస్థులిండ్లలోనూ బసచెయ్యవద్దని చెప్పాడు. బౌద్ధ భిక్షువులకి చెట్లే నివాసగృహాలయ్యాయప్పటి నుంచీ.

గౌతమబుద్ధుని శిష్యుడొకడు తనకొక ఆశ్రమాన్ని నిర్మించుకునేందుకు అడ్డువచ్చిందని ఒకచెట్టు నరకపోగాడట. తనని నరకవద్దని ఆ చెట్టు ఆత్మ ప్రాధేయపడిందట. అయినా అతడు వినలేదట. చెట్టు తన పిల్లలు అయిన కొమ్మలతో, ఆకులతో అతనిని ప్రాధేయపడిందట. చేతులెత్తి మ్రొక్కిందట. అయినా సరే ఆ శిష్యుడు అదేమీ పట్టించుకోకుండా ఆ కొమ్మల్ని నరికేస్తుంటే ఆ చెట్టు ఆత్మ అది తట్టుకోలేక బుద్ధుడికి ఫిర్యాదు చేసిందట. బుద్ధుడు వెంటనే వచ్చి ఆ చెట్టుని నరకడాన్ని ఆపు చేయించాడట. జాతక కథలలో ఒక కథ యిది.

వాస్తవంగా దీనిని వూహిస్తే ఆ చెట్టుని నరకవద్దని యితర శిష్యులు అతనికి చెప్తున్నా వినిపించుకోకపోతే, వారు యీ విషయాన్ని బుద్ధుడికి ఫిర్యాదు చేసి వుంటారు. బుద్ధుడు తానే నేరుగా వచ్చి ఆ చెట్టుని నరకడాన్ని ఆపు చేయించివుంటాడు.

యీకథ వల్ల గౌతమబుద్ధుడికి చెట్ల రక్షణ పట్ల యెంతో శ్రద్ధ వుందని తెలుస్తోంది. ఆతడు చెట్లగురించి, "యేమాత్రం స్వలాభాపేక్ష లేకుండా, అనంతమైన దయా దాక్షిణ్యాలతో మానవాళికి తమ అస్తిత్వాన్నే అంకితం చేసి, చివరకు తమను నరికేవారికి కూడా నీడనిచ్చి ఆశ్రయమిచ్చే అరణ్యాలు ప్రకృతి విచిత్ర స్వరూపాలు" అన్నాడు.

అలా బుద్ధుని జీవితంలో చెట్లు విడదీయలేని అంశాలుగా వున్నాయని చెప్పవచ్చు. బుద్ధుని దర్శించడానికి వచ్చేవారు ఆయనకు ప్రేమతో పువ్వులు, పండ్లు మొదలైనవి పట్టుకొచ్చి యిస్తూ వుండేవారు. బౌద్ధ సంఘ సభ్యులు వాటిని ఆహారంగా భుజించేవారు. బుద్ధుడు పర్యటనలకు వెళ్ళినప్పుడు ఆ సంగతి తెలియక పూలు, పళ్ళు తెచ్చినవారు నిరాశపడేవారు. ఆ పండ్లు, పువ్వులు యివ్వలేక, తమ వద్ద వుంచుకోలేక సతమతమయ్యేవారు. వారు తెచ్చినవి నేరుగా బుద్ధ భగవానుడు స్వీకరిస్తేనే వారికదొక తృప్తి.

ఆనందుడు యీ విషయాన్ని గౌతమబుద్ధుడికి నివేదించాడు. సందర్శకులకోసం బుద్ధుని పరోక్షంలో, ఆయన స్మృతికి చిహ్నంగా యేదైనా నెలకొల్పితే బాగుంటుందని కోరాడు. పదేపదే అలా కోరిన మీదట బుద్ధుడు, తాను రావి చెట్టు క్రింద వున్నప్పుడే జ్ఞాన చైతన్యాన్ని పొందానని, ఆ విధంగా రావిచెట్టు అంటే తనకు చాలా గౌరవమని, జ్ఞానానికి చిహ్నమైన రావిచెట్టునే తన స్మృతి చిహ్నంగా చేస్తే తాను చాలా సంతోషపడతానని చెప్పాడు.

దానితో ఆనందుడు, బుద్ధుడు మహాజ్ఞాని అయిన ఆ మహావనంలోని రావి చెట్టు విత్తనాలు సేకరించి, వాటిని మొక్కలుగా చేసి, ఒక మొక్కని జేతవనంలో బుద్ధుని గంధకుటీరం ముందు నాటించాడు. బౌద్ధ సాహిత్యంలో చెట్ల గురించి, లతల గురించి యెన్నో ప్రస్తావనలు వున్నాయి. రాజాయతన, రావి, మర్రి, మద్ది, నేరేడు, సంపెంగ, సాల, పిప్పల, అశ్వత్థ మొదలైన యెన్నో వృక్షాలు బుద్ధుడికి నీడనిచ్చాయి. ఆతడిని కన్నబిడ్డలా సాదుకున్నాయి. చెట్లు నాటడం, వాటిని రక్షించడం ఆ విధంగా రెండువేలఅయిదువందలసంవత్సరాలక్రితమే బుద్ధుడి నేపథ్యంలో సాగింది. తదనంతరం రాజ్యాలనేలిన రాజులు, వారిలో ముఖ్యంగా అశోకుడు రహదారుల ప్రక్క, చెరువుల చుట్టూ సామ్రాజ్యవ్యాప్తంగా లక్షలాది చెట్లు నాటించడానికి ప్రేరణ, బుద్ధుడూ, బౌద్ధమతమే. ప్రకృతి, మూగజీవాల గురించి యింత శ్రద్ధ తీసుకున్న మతం యిది ఒక్కటే.

అందుకే ప్రతివొక్కరూ చెట్లు నాటాలి. అదెంతో తృప్తినిస్తుంది. చెట్లక్రింద, కొమ్మలపైన యెన్నో జంతువులు, పక్షులు విశ్రాంతి తీసుకుంటాయి. యెంతోమంది వాటి నీడలో సేద తీరుతారు. జంతుజాలానికంతటికీ తల్లిలాంటి చెట్లని రక్షించుకోవడం ద్వారా, అభివృద్ధి చేయడంద్వారా, అటు పర్యావరణాన్ని, యిటు జీవితాన్ని తృప్తి మయం చేసుకవచ్చు. మంచిగా సహజంగా, అందంగావున్నపర్యావరణం మనుష్యులఆలోచనలు సౌమ్యంగా, సహజంగా వుండేటట్లుగా ప్రభావితం చేస్తుంది. బుద్ధుని బోధనలు చదివినవారు, తమ జీవితకాలంలో కనీసం వందచెట్లనైనా పెంచుతామన్న, రక్షించుతామన్న నిర్ణయం తీసుకుంటే యెంతబావుండును? వారిని యీ ప్రకృతే ఆశీర్వదిస్తుంది. తనకు నిజమైన బిడ్డ అని భూమాత యెంతో సంతోషిస్తుంది.

ఆయన, ప్రకృతిని ఉపమానాలుగా తన బోధనల్లో దేహంలో ప్రాణంగా కలిపేశాడు. ప్రకృతిని ఇంతగా తన బోధనలలో కలుపుకున్న తాత్వికులెవరూ మనకి కనిపించరు.

ఇంత ఆశ్చర్యమంటే చెట్లూ, ఇంటిపైకప్పులూ, ఊడిపోయిన కొయ్యదుంగలూ, నీటిపై తేలియాడే మరుగుచెట్టు, ఎండమావులు, తేనెటీగలు, పుష్పాలు, గుర్రాలు, పాలు-పెరుగు, భూమిలోని నిధినిక్షేపాలు, శిలువలు, హంసలు, రాతి స్తంభాలు, గుహలు, ద్వీపకల్పాలు, అరణ్యాలు, పర్వతాలు, లోయలు, ఊట చెరువులు, పగిలిన గంటలు, వాననీరు, పశుల కాపరులు, నీటికాలువలు, ఖాళీ సొరకాయలొట్టలు, మేఘాల నుండి బయటపడే చంద్రుడు, పాలవృక్షాలు, మాలువా లతలు, వల నుండి తప్పించుకునే పక్షులు, జంబూనది నీరు, ఆవు దూడలు, హిమవత్పర్వత మంచు, కూపాదర్శలు, సింధురాష్ట్రపు గుర్రాలు, శిక్షణపొందిన ఏనుగులు, చెత్తకుప్పలమీద తిరుగాడే పందులు, బిరాపీలతలు, బీరానాలతలు, కోతులు, తామరాకులపై దొర్లే నీటి బిందువులు, కుందేళ్ళు, పట్టు పురుగులు, సాలెగూళ్ళు, కలుపు మొక్కలు, వాడిన పుష్పాలు... ఇలా ఎన్నో... ఎన్నెన్నో ప్రకృతి విశేషాలను తన బోధనలలో పూవులలో తావిలా, బంగారు ఆభరణాలలో తాపిన రంగురంగుల రత్నాలలాగా అమర్చి ఆ సూక్తులను సాహిత్యరత్నాలుగా కూర్చి తన భావుకతను, కవితాహృదయాన్ని కూడా మనకు అందించాడు. అతని భాష అత్యంత సహజసుందరమైన భాష. ఆ భాషలో డాంబికం వుండదు, పాండిత్యప్రదర్శనవుండదు. గ్రామీణులు మాట్లాడుకునే భాషనే. అతిసహజంగా, సాధారణంగా మాట్లాడుకునే భాషనే, చుట్టూవున్న ప్రకృతి వస్తువుల వర్ణనలు చేర్చి బోధనలుగా మార్చేవాడు ఇందుకు ఆ ప్రాంతపు భాష అయిన పాళీ భాషనే గౌతమబుద్ధుడు వుపయోగించాడు.

ప్రకృతి వనరులను నాశనం చేసి, దానిపై ఆధిపత్యంవహించి పొందే అభివృద్ధిని గౌతమబుద్ధుడు తిరస్కరించాడు. ప్రకృతివనరుల అభివృద్ధి, క్షేమం చూస్తూనే సమాజం అభివృద్ధి అవాలని అతడు కాంక్షించాడు. మనిషి ప్రజ్ఞకన్నా, శీలంకన్నా, కరుణకన్నా, జీవజాతుల యెడ మైత్రే గొప్పదని చాటాడు. లోకసారి, "మనిషి బలవంతుడా బలహీనుడా?" అన్న ప్రశ్నకతడు మూగజీవాలకంటే అతడు బలవంతుడు, ప్రకృతి శక్తిముందు బలహీనుడు, అని జవాబు ఇచ్చాడు.

## మూగజీవాలపై గౌతమబుద్ధుని ప్రేమ

మూగజీవాలపై బుద్ధుని ప్రేమ అజరామరమైనది. మూగ జీవాల నన్నింటినీ మనిషి యొక్క సహోదరులుగా భావించాడతడు. జ్ఞానం కలిగిన మనిషి వాటిని సంరక్షించాలని చెప్పాడు. వాటిని కొట్టడం, హింసించడం, బంధించడం, చంపడం అత్యంతహేయమైన పాపకృత్యాలని చెప్పాడు. వాటిని చంపడం మనిషిని చంపడంతో సమానమే అన్నాడు.

బాల్యంనుండీ అవంటే మక్కువచూపాడు. అవంటే ప్రాణంపెట్టేవాడు. వాటికేదైన బాధకలుగుతే తనకేకలిగినట్లు బాధపడేవాడు. వాటికి సేవలు చేసేవాడు. వాటిని ప్రాణాధికంగా ప్రేమించేవాడు. అసలు బుద్ధుని పుట్టుకే మూగజీవాల కోసమా అన్నవిధంగా వుంటుంది. అతడు మనిషికి బోధించిన ధర్మం అహింస. అహింస అంటే ఏ జీవినీ హింసించకుండా వుండడం. అతని జీవితం అంతా కారుణ్యంతోనే నిండి వుంది. అప్పుడు మనిషిని చూసి మనిషి ఎలా వుండకూడదో అతడు గ్రహిస్తే, మూగజీవాలను చూసి మనిషి ఎలా వుండాలో తెలుసుకున్నాడా అనిపిస్తుంది.

ప్రకృతిలో అతిభయంకరమైన క్రూరమృగాలను సైతం అతడు ప్రేమించాడు. వాటిని గౌరవించాడు. వాటికి, 'స్వేచ్ఛగా బతికేవుండే హక్కు వుంద'న్నాడు. జీవితకాలమంతా అతడు మూగజీవాల వాక్కుగా, వాటి తరఫున మనిషిగా జీవించాడు. రాజులు మృగయావినోదం పేరిట అరణ్యాలకువెళ్ళి క్రూరజంతువునైనాసరే చంపడాన్ని అతడు తీవ్రంగా నిరసించాడు. యజ్ఞయాగాదుల పేర పశువులను బలి చేయడాన్ని ఆపుచేసేదాకా అతడు నిద్రపోలేదు. 'ఒక ప్రక్కన మూగజీవాలను హింసించుతూ, చంపుతూ మనిషి తాను మాత్రం సుఖశాంతులతో బ్రతకాలని కోరుకోవడం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోరుకోవడం అమానుషం, అనాగరికం', అన్నాడు

ప్రాణంతీస్తానంటే మనిషికి యెంత భయం వేస్తుందో, జీవులకు కూడా అదేవిధంగా భయంవేస్తుందని, వాటిని మనుషులతోపాటు సమానంగా చూడాలని', అన్నాడు. బతుకు-బతికించు అన్న పద్ధతిలోనే మనిషికి సుఖం వుందన్నాడు.

'వాటితో తాదాత్మ్యత పొందండి వాటిని చంపాలన్న ఆలోచనే పోతుంది', అని చెప్పాడు.

'పున్నక మానవపుచ్ఛ' అన్న సంకలనంలో గౌతమబుద్ధుడు జంతుబలిని తీవ్రంగా నిరసించినట్టే గాకుండా, అట్లాచేసేవారు కోరికల వూబినుండి బయటపడలేరు - వారు కూడా అటువంటి జన్మ యెత్తుతారు' అని చెప్పినట్టు వుంది. మనిషి కోరికల్ని వదిలిపెడుతూ పోతుంటే జ్ఞానం తెలుసుకుని, నిజమైన మనిషిలాగా రూపొందుతాడని అతడి భావం.

బౌద్ధ భిక్షువులకు నిర్దేశించిన 145 నైతిక నిబంధనలలో జీవజంతు రక్షణకు సంబంధించిన చాలా ముఖ్య నిబంధనలున్నాయి. వాటి ప్రకారం బౌద్ధ భిక్షువులు

1. ఉద్దేశపూరితంగా అతడే జీవిని హింసించకూడదు, చంపకూడదు.
2. పట్టు పురుగులను చంపగా వచ్చిన పట్టు వస్త్రాలను ధరించకూడదు.
3. గొర్రె చర్మంతో చేసిన రగ్గులను వాడకూడదు.
4. నేల తవ్వకూడదు. (నేలలోని జీవులు చనిపోయే అవకాశం వుంది కాబట్టి)
5. పర్యావరణాన్ని పాడు చెయ్యకూడదు
6. అతడు జబ్బు పడివుంటే తప్ప నెయ్యి, పాలు, వెన్న, నూనె, తేనె, పెరుగు, చేపలు, మాంసం యెవరినీ భిక్ష అడుగకూడదు.
7. తీవ్రమైన చలిలో వుంటే తప్ప మంట రాజెయ్యకూడదు (మంటల్లో పడి జీవులు చనిపోయే అవకాశం వుంది)
8. జీవులువున్న నీటిని అతను వాడకూడదు
9. యెముకలు, కొమ్ము, దంతాలతో చేసిన సూదిని సైతం అతడు వాడకూడదు.

యీ నిబంధనల ముఖ్యోద్దేశమేమిటంటే ప్రత్యక్షంగా గానీ పరోక్షంగా గానీ జీవహింసకు బౌద్ధభిక్షువులెవరూ తోడ్పడకూడదనే. అంతేకాదు పూలను కానీ, కస్తూరిలాంటి జంతువుల్ని వేటాడి సుగంధాన్ని యిచ్చే చెట్లుని నరకడం వల్లగానీ సువాసన ద్రవ్యాలు చేసే పరిస్థితి వస్తుందని బౌద్ధ భిక్షువులు సువాసనా ద్రవ్యాలు వినియోగించడాన్ని ఆయన పూర్తిగా నిషేధించాడు.

అరణ్యాలలో తపస్సు చేస్తున్నప్పుడు అతన్ని ఖడ్గమృగం చాలా ఆకర్షించింది. అన్ని జంతువులతో పాటు దానిని కూడా చాలా వుత్సుకతతో పరిశీలించాడు. దాని జీవితవిధానం అతడికెంతో నచ్చింది. ఒక మునిలా, సత్యశోధన చేస్తున్నట్టుగా కనిపించిందతడికి. యెన్నో చక్కటి

లక్షణాలు దానికి. దేనికీ చలించదది. ఒంటరిగా ప్రయాణం చేస్తుంది. వినమ్రంగా జ్ఞానోదయ చేస్తున్నట్లుగా వుంటుంది. భీతి అన్నది దానికి వుండదు.

చైతన్య మూర్తి అయినాక ఆతడు శిష్యులకి ఖడ్గమృగాన్ని వుదహరిస్తూ యెన్నో విషయాలు బోధించాడు. అవన్నీ ఆ తరువాత సుత్తనిపాతంలో వురగ్గవగ్గలో 'ఖగ్గవిశాణ సుత్త'గా రూపుదిద్దుకున్నాయి. వాటిలో కొన్ని మచ్చుకి తీసుకుంటే :

"బాట లేకున్నను ముందుకు నడువవోయి - భయమువలదు, చింతవలదు, ఖడ్గమృగముపోలె ఒంటరిగా విహరింపుమోయి సింహముపోలె శబ్దసవ్వడులకు వెరవక వలలో చిక్కుబడని గాలివోలె, నీటిలో తడవని తామరాకుపోలె ఖడ్గమృగముపోలె ఒంటరిగా విహరింపుమోయి.

చలి, వేడి, వడదెబ్బ, వాన, ఆకలి, దాహం, యీగలు, దోమలు... యివేమీ పట్టించుకోకుండా - అదుగో ఆ ఖడ్గమృగంవలె ఒంటరిగా విహరించుమోయి సంచరించుమోయి ముందుకి సాగిపోవోయి యెన్నో విశ్వాసాలు, తత్వాలు వున్నాయి. నువ్వు పవిత్రుడవయేరీతిలో, జ్ఞాని అయే రీతిలో, నీకు నువ్వుగా యే గురువూ లేకుండానే - అదిగో ఆ ఖడ్గమృగంవలె ఒంటరిగా సంచరించుమోయి విహరించుమోయి ముందుకి సాగిపోవోయి

యితరులతో కూడినప్పుడు మనస్పర్ధలు రావచ్చు, కోపతాపాలు రావచ్చు - యిది మనసులో వుంచుకుని - అదుగో ఆ ఖడ్గమృగంవలె ఒంటరిగా విహరించుమోయి, సంచరించుమోయి - ముందుకి సాగిపోవోయి

మంచి మిత్రుడెవరూ దొరకలేదా? అయినా సరే ఆ ఖడ్గమృగంవలె ఒంటరిగా ప్రశాంతంగా సంచరించుమోయి. విహరించుమోయి. ముందుకి సాగిపోవోయి.

దారిలో నీకు మంచి స్నేహితుడు లభ్యమైనాడా! నిర్భయత్వాన్ని గురించి, జ్ఞానం గురించి చర్చించుకొని ఆతడికి సాదరంగా వీడ్కోలు యిచ్చి- తిరిగి అదుగో ఆ ఖడ్గమృగం వలె ఒంటరిగా విహరించుమోయి సంచరించుమోయి ముందుకు సాగిపోవోయి.

చెట్టు ఆకులు రాలుస్తున్నట్టుగా రాగబంధాలను విడనాడి-అదుగో ఆ ఖడ్గమృగం వలె ఒంటరిగా విహరించుమోయి సంచరించుమోయి ముందుకు సాగిపోవోయి.

కుటుంబ జీవితంలో కొంత ఆనందం, ప్రేమ వున్నాయి. కానీ యివి చెదిరిపోవచ్చు. అందువల్ల జ్ఞానివై అదుగో ఆ ఖడ్గమృగం వలె ఒంటరిగా విహరించుమోయి సంచరించుమోయి ముందుకు సాగిపోవోయి.

వలకొరికేసిన చేపవలె, మండిన తరువాత మునుపటి స్థితికిరాని అగ్నివలె అదుగో ఆ ఖడ్గమృగం వలె ఒంటరిగా విహరించుమోయి సంచరించుమోయి ముందుకు సాగిపోవోయి.

తిండికోసం ఆరాటపడకుండా, స్వచ్ఛమైన విశాలమైన మనస్సుతో, ద్వేషంలేకుండా అదుగో ఆ ఖడ్గమృగం వలె ఒంటరిగా విహరించుమోయి సంచరించుమోయి ముందుకు సాగిపోవోయి.

భార్యా బిడ్డలు, బంధువులు మొదలైన కొమ్మలున్న చెట్టులాకాకుండా యే కొమ్మలూ లేని తాడి చెట్టులా- అదుగో ఆ ఖడ్గమృగంవలె ఒంటరిగా విహరించుమోయి సంచరించుమోయి ముందుకు సాగిపోవోయి.

దుఃఖాలను తొలగించుకుని, కరుణ, సమానత్వం, ప్రేమ, మొదలైన వున్నత గుణాలు పాటిస్తున్న బౌద్ధ భిక్షువులా-అదుగో ఆ ఖడ్గమృగం వలె ఒంటరిగా విహరించుమోయి సంచరించుమోయి ముందుకు సాగిపోవోయి."

యిలా దాదాపు 75 చరణాలతో వున్న యీ ఖడ్గసగ్గ చదివిన వారిలో సత్యశోధన చేయాలన్న స్ఫూర్తిని యెంతో లోతుగా కల్గిస్తుంది. జ్ఞాన సాధనకై ప్రకృతి జీవులను వుదాహరణగా తీసుకోవడం అంటే, వాటి వున్నత గుణాల్ని గురించి, చెప్పి మనుష్యులను కూడా వాటి తీరులను అనుసరించమనడమే. యీ విధంగా మనుష్యులకే గురువులుగా వాటిని పోలిక తెచ్చి జీవాళి పట్ల మనిషి బాధ్యత కలిగి వుండాలన్న భావాన్ని అవి మనకు గురువులన్న భావాన్ని చెప్పక చెప్పాడాయన.

పశువుకుండే జ్ఞానం తెలుసుకుంటే తప్ప పశువు గొప్పతనం మనకు తెలియదు. మామూలుగా కంటికి కనిపించేది-పశువుకి ఆకలివెయ్యడం, తినడం, నిద్రపోవడం, తిరగడం, మచ్చిక అయిన పశువు అయితే మనుషుల్ని అవసరం వచ్చినప్పుడు అర్థం చేసుకోవడం-యింతమాత్రంగానే కనిపిస్తుంది. యిందులో గొప్పతనం యేమీ కనిపించదు. యెందుకంటే మనుష్యులు చేసే పనులు కూడా యించుమించు యిట్లాంటివే కదా!

ఆచరిస్తే తప్ప యే వొక జ్ఞానాన్ని అయినా యెలా పొందలేమో, మూగజీవాలను ప్రేమిస్తే, ఆదరిస్తే తప్ప వాటిలోని గొప్పతనం మనకి తెలియదు. పిల్లలు బుడి బుడి నడకలతో మన చెంతకు వచ్చి, ముద్దు ముద్దు మాటలు మాట్లాడితే యెంత సంతోషంగా వుంటుంది? మూగ జీవాలు కూడా అంతే. యెంతో సంతోషం కలిగిస్తాయి. ఆశ్చర్యం కలిగిస్తాయి. కరుణా కాంతులు వెదజల్లుతాయి. స్వచ్ఛమైన మానవతా సరస్సులలో మనల్ని విహారింపచేస్తాయి. మనలో దాగిపోయిన, అణిగిపోయిన అమృతధారలను వొక్కుమ్మడిగా పొంగిస్తాయి.

జ్ఞానం విషయంలో జంతువు మనిషికేమీ తీసిపోదు.

దురదృష్టవశాత్తు ప్రకృతి వాటిని మూగజీవులుగా సృష్టించింది. అటువంటివాటిమీద మనకు కరుణ లేకపోవడం యెంత దారుణం?

వాటి శరీరాలు వేరు-మన శరీరాలు వేరు. వాటి జీవన విధానం వేరు-మన జీవన విధానం వేరు. అయినా సరే శరీరాలలో, జీవన విధానాలలో వాటికీ మనకూ యెంతో సామీప్యత కనిపిస్తుంది. మనకు తెలియకుండానే వాటితో మనం మాట్లాడతాం. యిది తరచుగా జరుగుతూ వుంటుంది. ఆశ్చర్యం-అవి కూడా మన మాటల్ని అర్థం చేసుకున్నట్లుగానే మెసలుతాయి. వాటిపై మనం చూపించిన పిసరంత ప్రేమ కొండంతై మనకు చేరుతుంది. వాటిపట్ల కరుణ, ప్రేమ, చూపినపుడు వాటికీ మనకీ మధ్యన మూగతనం అన్నది ప్రశ్నే కాకపోగా, యిరువురి మధ్యా మానవతా జ్ఞానప్రవాహాలు యెటువంటి ఆనకట్టలూ లేకుండా ప్రవహిస్తాయి. మూగజీవాలను గుర్తించి, గౌరవించి, కరుణ చూపాలే కానీ, మనకి వాటి గొప్ప జ్ఞానాలు తెలియడంతో పాటు మనుషుల్లో వుండే లేకి బుద్ధులు కూడా నశిస్తాయనడంలో ఆశ్చర్యం లేదు.

జీవులను రక్షించడం, వాటికి సేవ చేయడం, వాటిని సంరక్షించడం, వాటికోసం ప్రాణాలివ్వడానికైనా సిద్ధపడడం-యివన్నీ అతని జీవితంలో యెన్నెన్నో జరిగాయి. జీవులకోసం పాటుపడడమనేది ఆయన బోధించిన ధర్మంలో ప్రముఖమైన భాగం. బౌద్ధుడవడానికి ముందుగా పాటించవలసిన ప్రమాణం చేయవలసిన పంచశీలలో మొట్టమొదటి ప్రమాణం అహింస అని పాఠకులు గుర్తించగలరు. ఆ విధంగా ప్రాణిరక్షణే మొట్టమొదటి నిబంధనగా పెట్టి బౌద్ధ ధర్మాన్ని నెలకొల్పాడంటే, జీవహింసని అతడెంతగా వ్యతిరేకించాడో అర్థం అవుతుంది. ధర్మపదంలో, 'జంతువుల్ని పట్టుకోవడం, బంధించడం, వేటాడడం, చంపడం- వీరత్వంమెన్నటికీ కాదు- అది

పిరికితనం అమానుషం బలహీనులపై జరిపే నికృష్టమైన అత్యాచారం', అని ఖండించాడాయన.

ఒక జీవికోసం ప్రాణాలుసైతం అర్పించడానికి సిద్ధంగా వుండాలని బోధించాడాయన. ఆవిధంగానే ప్రాణాల్ని బలిపెట్టిన బౌద్ధ భిక్షువులకథలెన్నో మనకు బౌద్ధసాహిత్యంలో కనిపిస్తాయి. వాస్తవంగా జరిగిన కథలనే తరువాత తరువాత కథలుగా చిత్రించడం జరిగింది. అహింసావ్రతుడు అన్న ధర్మపదంలోని కథ చదువుతుంటే కంటనీరు తెప్పిస్తుంది.

## ప్రాణిరక్షణ కన్నా మించిన ధర్మం లేదు

అహింసావ్రతుడనే బౌద్ధ భిక్షువు శ్రావస్తిలో భిక్షకోసం తిరుగుతూ వుంటే రత్నాలు సానబెట్టే నికుముడనేడనే వృత్తిపనివాడు అతడిని యింట్లోకి తీసుకువచ్చి కూర్చుండబెట్టేంతలో రాజసేవకులు వచ్చి రక్త వర్ణ కాంతులతో మెరుస్తున్న ఒక రత్నాన్ని తెచ్చి దానికి సానపట్టమని రాజుగారు పంపారు అని చెప్పి యిచ్చి వెళ్ళారు. నికుముడు సరేనని దానినక్కడే బల్లమీద పెట్టి బౌద్ధ భిక్షువు వచ్చిన సంగతి చెప్పడానికి భార్యకి వంటగదిలోనికి వెళ్ళి వచ్చేలోగా అతడు మురిపెంగా పెంచుకుంటున్న కొంగొకటి వచ్చి ఆ రత్నాన్ని మాంసం ముక్క అనుకుని మింగేస్తుంది. నికుముడువచ్చిచూసే సరికి రత్నం కనిపించదు. ఏమైందని బౌద్ధ భిక్షువునడిగితే అతడేమని చెప్పాలి? కొంగమింగిందంటే ఆ రత్నం కోసం ఆ కొంగని చంపేస్తారు. తనవల్ల మూగజీవిప్రాణం పోతుంది. ఆ జీవిని కాపాడాలనే వుద్దేశంతో ఆ బౌద్ధ భిక్షువు మౌనంగా వుండిపోతాడు. నికుముడు అతడి మీద అనుమానపడి అతన్ని చావగొట్టేస్తాడు. అతడు మౌనంగా వుంటున్న కొద్దీ రెచ్చిపోయి చెక్కలతో మరీ కొడతాడు. బౌద్ధ భిక్షువు వంటి నుండి, తల నుండి రక్త ధారలు కడుతూ వుంటాయి. అయినా అతడు చెప్పడు. చెప్తే ఆ పిచ్చారి కొంగ ప్రాణం పోతుంది. అందుకని తన ప్రాణం పోయినా ఫరవాలేదు. అదీ అతడి త్యాగం. నికుముడు అతన్ని కొట్టీ కొట్టీ, అతను స్పృహ తప్పుతున్నా కొడ్తూనే, ఆ కర్ర విరిగిపోతే మరోకర్ర తేవడానికి ఆ కర్రను విసిరేస్తాడు. ఆ విసురుకు ఆ కర్ర ఆ కొంగమీద పడి, ఆ దెబ్బకు ఆ కొంగ విలవిలా తన్నుకుని చచ్చిపోతుంది.

ఆ కొంగ చచ్చిపోయిందని తెలుసుకున్న తరువాత మాత్రమే ఆ రత్నాన్ని ఆ కొంగ మింగిందని బౌద్ధ భిక్షువు నికుముడితో చెప్తాడు. అతడి దెబ్బలకు తాళలేక ఆరోజే ఆ బౌద్ధ భిక్షువు చనిపోతాడు. బుద్ధభగవానుడే అతడి త్యాగాన్ని యెంతో కొనియాడుతాడు. అతన్ని యితర శిష్యులకు మార్గదర్శిగా, అర్హతుడిగా చూపిస్తాడు. జీవుల్ని రక్షించడం కన్నా వున్నతమైన ధర్మం యింకొకటి లేదని చెప్తాడు. వూహాకందని త్యాగం అది.

అతడు యే బోధ చేసినా కేవలం మనుషులకే, అని చెప్పలేదు. అతడు మనుషుల్నీ, మూగజీవాల్నీ కూడా సరిసమానంగానే చూశాడు. యితరులకు బాధకల్గించకూడదు అన్నాడంటే మనుషులకే బాధకల్గించకూడదు, మూగజీవాలకు బాధకల్గించవచ్చు అన్న అర్థం రాదు. మొదట అది మూగజీవాలకే వర్తిస్తుందని చెప్పాలి. యితరులు అంటే అతని వుద్దేశం మిగతా జీవులూ, మనుషులూ అన్నీ అన్న అర్థమే. యితరులు అంటే కేవలం మనుషులే అని అతడే సందర్భంలోనూ చెప్పలేదు. అది ఆయన ధర్మానికే విరుద్ధం.

అరణ్యజీవితంలో అతడు పరిశీలించిన, అనుభవించిన సంఘటనలను ఆ తరువాత ప్రజలకు కథలు కథలుగా చెప్పాడు. 'మనం వాటిని బాధపెడితే, చంపితే అదే బాధను మనం కూడా

తిరిగి అనుభవించవలసివస్తుందని చెప్పాడు. ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ మూగజీవాల హత్యలో పాలుపంచుకోకూడదన్నాడు.

వాటిని మనతోపాటు సమానంగా చూసేటట్టు గౌరవించేటట్టు వాటిల్ని రక్షించడంలోని పరమార్థాన్ని గ్రహించేటట్లు చేయడానికే గౌతమబుద్ధుడు పూర్వజన్మ, పునర్జన్మల సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడని చెప్పవచ్చు. భౌతికమైన కారణాల ప్రకారంగా చూస్తే ఆత్మ అన్నది లేదన్న అతని సిద్ధాంతం ప్రకారంగా చూస్తే, జీవి మరణించాక మిగిలిపోయే పదార్థాలు మరొక జీవి పుట్టడానికి కారణాలవుతూ యున్నది నిజమే. ప్రకృతిలో జరుగుతున్నదిదే. జీవపరిణామం యిలా సాగుతున్నదే. అయితే యీ వూహ వల్ల మనిషిమనస్సులో కారుణ్యభావం మొలకెత్తేందుకూ, మొక్కలమయ్యేందుకూ అవకాశం వుంది. యీ జన్మలన్నీ దుఃఖభూయిష్ఠమైనవనీ, చెడ్డపనులు చేయడం ద్వారా ఆ వూబిలోనే పడిపోయి తిరిగిరాని అగాధంలో పడిపోయి మునిగితేలుతూ వుంటారనీ, తమ చెడ్డ కార్యాల్తో, తమ చెడ్డ చేతుల్లో అంతరించిపోయిన జీవుల్లాగా వారూ బాధలు పడతారనీ చెప్పాడు. యీ దుస్థితినే అతడు పునర్జన్మ అన్నాడు. వొకడు మనిషిగా పుట్టి జంతువులా బతుకుతున్నాడూ అంటే అది నిక్కచ్చి పునర్జన్మే.

పూర్వజన్మలూ, పునర్జన్మలూ వున్నా లేకపోయినా అవి వున్నాయన్న భావంవల్ల యే జీవి అయినా కనిపిస్తే- వొక జన్మలో అది మనవాడనో, బంధువో అయివుంటుందన్న భావమో, "పాపం- అది యే పాపం చేసుకుని యీ మూగజన్మ యెత్తిందో అలాగ యేడుపనీ, చేతనైతే దానికి కాస్త ఆహారమూ, నీళ్ళూ, నీడా యిద్దాము-లేకపోతే అలానదిలేద్దాము-అంతేగాని దానిని కొట్టీ, తిట్టీ అదిలించీ, హింసించీ, చంపడం యెందుకూ? ఆ పాపం యెందుకూ మూటగట్టుకోవడం? మన బ్రతుకు మనం బ్రతుకుదాం-దాని బ్రతుకు అది బ్రతుకుతుంది. అదేదో హీనమైన జంతువులా మనం మాత్రం దానిని యెందుకూ చూడడం? మనిషి బతుకుమాత్రం పెద్ద విలువైనదా యేమిటి? మనిషి బతుకులో యేం విలువలున్నాయని మురిసిపోవాలి? చెప్పాలంటే ఆ జీవే మనిషికంటే గొప్పది- కల్లాకపటం తెలియనిది-నోరులేనిది. దానికున్న మంచి గుణాలముందు మనిషి గుణాలు యే మూల? మనం దానిని పట్టుకునో, హింసించో, చంపో, తినో ఆ పాపం మనమెందుకూ మూటగట్టుకోవడం? తిరిగి అలాంటి జన్మే మనం యెత్తవలసివస్తే? ఆ బాధలూ కష్టాలూ మనమెందుకూ పడడం? దానికైనా సాయం చేస్తే మంచిది. ఆ పుణ్యం వూరికే పోకుండా కష్టకాలాల్లో మనల్ని కాపాడుతుంది. మనకలాంటి బాధలు పడే జన్మ... నోరులేని జన్మ రాకుండా అయినా వుంటుంది- అయినా పూర్వజన్మ, పూర్వజన్మ యిలా మాత్రం అనుకోవడం యెందుకూ? దానిని కాస్త చేరదీస్తే మనకి యిప్పుడు మాత్రం తృప్తిగా వుండదూ? అది ఆనందంగా వుంటూ మనతో స్నేహం చేస్తూ వుంటే బాగుండదూ? చెప్పాలంటే మనిషికంటే చాలా మేలైనవి జంతువులు. మనం చేసిన సాయాన్ని యెప్పటికీ మరిచిపోవు. మనతో యెంతో ప్రేమగా మెసలుతాయి. అవి మనకు చేరువలో వున్నాయంటే, మనం పిలవగానే వస్తున్నాయంటే యెంత గర్వంగా వుంటుంది!! అయినా అవి మనం చేసిన సేవను గుర్తుపెట్టుకుంటాయో పెట్టుకోవో- అదంతా మనకనవసరం.. దానికి ఆకలేసి, దాహమేసి మన దరిదాపులకు వచ్చింది. ఆ సాయమేదో చేస్తే చాలు మనకి అదే తృప్తి.. యిటువంటి భావాలు వస్తాయి.

నిజానికి పూర్వజన్మ, పునర్జన్మ, స్వర్గం యిలాటివి వున్నాయని, వ్యావహారికంగా తప్పితే

బుద్ధుడెక్కడా స్పష్టంగా చెప్పలేదు. నిర్వాణం సుఖం పరమసుఖం. స్వర్గతుల్యం అన్నాడు. అది మనిషి బతికి వుండగా సాధించేదే. గొప్ప మనసు కలవారిని దేవతలు అన్నాడు. వారు భూమి మీద వుండేవారే. పూర్వజన్మ-పునర్జన్మ.. యివి కూడా మానసికంగా మంచి ఆలోచనలు.. యివి మనిషిని జాగరూకుణ్ని చేస్తాయి. వీటికి యెంతో కొంత భౌతిక ఆధారం వున్నది. కానీ దేవుడు, ఆత్మలకు మాత్రం యేటువంటి ఆధారమూ లేదు. ఆ భావాల వల్ల ప్రయోజనం యేమీ లేకపోవడమే కాకుండా హానికూడా. అందువల్ల ఆ భావాలను నిర్ద్వంద్వంగా ఖండించాడు. గౌతమబుద్ధుడు యేమి చేసినా చెప్పినా యీ మనుష్యుల, జీవ ప్రపంచపు అభివృద్ధి సుఖసౌఖ్యాల గురించే. ప్రకృతి జీవులకు సంబంధించిన, యెంతో చక్కనైన కొన్ని జాతకకథలు మానవతాభివృద్ధిలో యెంతో స్ఫూర్తినిస్తాయి.

### మహాకపి జాతకకథ

## అందరికోసం బతకడమే స్వర్గం

ఆ అడవిలో వేలాది కోతులున్నాయి. అవన్నీ యెంతో సఖ్యతతో, ప్రేమాభిమానాలతో జీవిస్తుండేవి. వాటన్నిటికీ వొక రాజు వుండేది. తన జాతికి యెవరివల్లా యేటువంటి అపకారమూ రాకుండా అది యెంతో జాగ్రత్తగా కాపుకాసుకునేది. ఆ మహారణ్యం మధ్యలోంచి గంగానది ప్రవహిస్తూ వుండేది. ఆ గంగానది వొడ్డునే గొప్ప మామిడి చెట్టు వొకటి వుండేది. దాని కాయలు యెంతో తియ్యగా వుండేవి. ఆ పళ్ళంటే ఆ కోతులకు చాలా యిష్టం. వంతుల ప్రకారం వచ్చి ఆ మామిడి పళ్ళని కమ్మగా తింటూ వుండేవి. వాటి తియ్యదనానికి అవి యెంతో ఆశ్చర్యపడుతూ వుండేవి. యీ మామిడి పళ్ళు యింత తియ్యగా వుంటాయని యెవరికీ తెలియకుండా వుండాలని అవి నిర్ణయించుకున్నాయి. ఆ పళ్ళు గంగానదిలో పడితే అవి ఆ ప్రవాహంలో కొట్టుకుపోయి.. అలా యెవరైనా ఆ పండు తింటే.. నెమ్మదిగా నెమ్మదిగా యీ చెట్టు సంగతి అందరికీ తెలిసిపోతుందని అవి భయపడి.. ఆ చెట్టుకాయలు గంగానదిలో పడకుండా అతి జాగ్రత్తగా తెంపుకుని తినేవి.

యిలా వుండగా యేలా పడిపోయిందో వొక మామిడిపండు కొమ్మమీంచి గంగానదిలో పడిపోయింది. అది అలా అలా కొట్టుకుపోయి వొక జాలరివాడికి దొరకడం, అతడాపండు అందం చూసి దానిని రాజుగారికి పంపడం. రాజుగారు ఆ పండుతిని.. అద్భుతం.. అనుకుంటూ.. ఆ చెట్టు యెక్కడుందో ఆరా తియ్యడం.. గూఢచారులను నియమించడం.. యెలాగో ఆ చెట్టు అక్కడ వుందన్న సంగతీ, ఆ చెట్టుని దాదాపు 80 వేల కోతులు కాపు కాస్తున్నాయనీ తెలుసుకుని. ఆ మామిడి పళ్ళు యెలాగైనా తినాలని రాజు సైన్యంతో సహా రావడం జరుగుతుంది.

ఆ మామిడి చెట్టు సమస్య ఆ కోతుల పాలిట చావు బతుకుల సమస్య అయిపోయింది. రాజుగారి సైన్యాన్నుంచి తప్పించుకోవడానికి పాపం ఆ కోతులకు వేరే దారి లేదు. చుట్టూ సైనికులు. వొక ప్రక్కన గంగానది. ఆ సైన్యం చేతుల్లో చనిపోవడమా.. లేక యీ గంగానదిలో పడి చనిపోవడమా తప్ప వేరేగతిలేదు పాపం ఆ కోతులకు. ఆ కోతులన్నీ భయంతో వణికిపోతున్నాయి. చిన్న కోతులూ, ముసలి కోతులూ, గర్భంతో వున్న కోతులూ యెన్నెన్నో వున్నాయి. వాటినెలా యీ దారుణ సైన్యాల నుంచి రక్షించడం?

కోతిరాజుకి చప్పున వొక ఆలోచన తట్టింది. అది వెంటనే గంగానది వొడ్డున వున్న వొక పొడవైన వెదురు కొమ్మ చివరికి యెక్కి, యీ చివరినుంచి ఆ చివరకు గెంతేవరకి ఆ వెదురు

కొమ్మ విల్లంబులా అయింది. గంగానది చివర మరొక చెట్టు వుంది. ఆచెట్టుకి యీ వెదురు కొమ్మను కడితే వొక వంతెనలా అవుతుంది కదా.. ఆ వంతెనని పట్టుకుని వేలాడుతూ కోతులన్నీ ప్రాణాలు రక్షించుకోవచ్చు అని అది తలిచింది.

కానీ ఆ వెదురుకొమ్మ ఆచెట్టుకొమ్మకి కలిపి కట్టేటంత పొడవుగా లేదు. సరిగా ఆ కోతి పొడవు అంత తక్కువగా వుంది. యేం చెయ్యాలి? వాటి రాజుగా వాటిని రక్షించడం తన విద్యుక్తధర్మంగా తలిచింది. అంతే.. ఆ వెదురు కొమ్మని వొక ప్రక్క చేతులతో పట్టుకుని, కాళ్ళతో అవతలి చెట్టుని గట్టిగా ముడివేసినట్టు పట్టుకుంది. కోతుల్నన్నీ యిలా చేసిన వంతెన ద్వారా ప్రాణాల్ని కాపాడుకోమని కేకపెట్టింది.

వెంటనే ఆ కోతులు ఆ వంతెనని పట్టుకుని వ్రేల్లాడుతూ గంగానది ఆ చివరకి వచ్చి చేరిపోతున్నాయి. వాటి బరువుకు ఆ కోతిరాజుకు ప్రాణం తోడుకు పోతూంది. కాళ్ళు, చేతులు వూడి వచ్చేస్తాయేమో అన్నంత బాధ. గొంతు పగిలిపోతూంది. శ్వాస ఆడడం లేదు. అయినా సరే ప్రాణాలు వుగ్గబట్టుకుని అది తన కోతుల్ని రక్షించసాగింది.

యీ దృశ్యం చూసిన రాజుకి యెంతో ఆశ్చర్యం వేసింది. ప్రాణాలుసైతం వొడ్డి ఆ కోతి చేస్తున్న త్యాగానికెంతో చలించిపోయాడు. ఆ దృశ్యం అతన్ని కదిలించి వేసింది. వెంటనే సైన్యాన్ని వెనుకకు తిప్పుమని ఆదేశించాడు. ఆ విధంగా ఆ కోతులన్నీ రక్షణ పొందాయి.

యీ కథలో అడవిలోగల కోతుల్ని యెదిరించడానికి వొక రాజు సైన్యాన్ని తీసుకు వచ్చాడన్నది అతిశయోక్తిగా వుంటుంది. అయినా కోతులకు సంబంధించి మాత్రం యిటువంటి ఘటన జరగలేదనలేము. యే జీవి అయినా ప్రమాదంలో పడితే తోటి జీవులూ, కొన్ని యితర జీవులూ కూడా దానిని రక్షించడానికి ప్రయత్నిస్తాయి. యెంతో తెలివిగా ప్రయత్నిస్తాయి. ఆత్మరక్షణ, స్వజాతిరక్షణ అనేవి వాటి మనుగడకు అత్యంత అవసరం. ఆత్మరక్షణకోసం కొన్ని జీవులు సంకేతాలు యిస్తే, కొన్ని జీవులు శత్రువుని కలిసికట్టుగా యెదుర్కొంటాయి. కత్తెరపిట్ట తన చుట్టుప్రక్కల వున్న పిట్టల రక్షణకోసం. అవి గ్రద్దల బారిన పడకుండా పహరా కాస్తుంది. కుక్క తాను నివసిస్తున్న ప్రాంతాన్ని పోలీసులా రక్షిస్తుంది. పిల్ల యేనుగుని యెవరైనా యెత్తుకు వెళితే యేనుగులు మందలు మందలుగావచ్చి యెదుర్కొంటాయి. చెప్పాలంటే యెన్నో దృష్టాంతాలు వున్నాయి. తోటి మనిషి కోసం నేటి మనిషి యేమీ చెయ్యడం లేదన్న సంగతి ప్రతిరోజూ చూస్తునే వుంటారు. మూగజీవాల నుంచి మనిషి తెలుసుకోవలసింది యెంతో వుందన్న సంగతినే యీ జాతక కథ మనకి చెప్తుంది. మనుషుల్ని కలిసికట్టుగా వుండమని, అందరికోసం బతకమని, అందుకోసం జీవితాన్ని త్యాగప్రాయంగా భావించమని యీ కథ వుద్బోధిస్తుంది.

## రెండవ మహాకపి జాతక కథ

## కృతఘ్నత మహాపాపం

వొక బ్రాహ్మణుడు తన పోయిన యెద్దుని వెతకడానికి అడవిలోకి వెళ్ళి దారి తప్పిపోతాడు. అడవిలోంచి బయటికి రావాలని యెంత ప్రయత్నించినా అతడు తాను యే దిక్కున వున్నాడో, యే దిక్కుకు వెళ్ళాలో తెలుసుకోలేకపోతాడు. ఆకలితో, దాహంతో అలమటిస్తూ వొక చెట్టుక్రింద స్పృహ

తప్పి పడిపోతే అతన్ని ఆ అడవిలోని కోతి రక్షిస్తుంది. యెక్కడెక్కడినుంచో కాయలు పళ్ళు తెస్తుంది. దూరంగావున్న యేటినుంచి నీరు తెచ్చి దాహం తీరుస్తుంది. అడవి బయటకు వెళ్ళడానికి తాను తోడుగా వున్నానని అతడికి అభయమిస్తుంది. చీకటికావడాన వుదయమే తీసుకువెళ్తానని.. పడుకోవడానికి అతడికి చోటు చూపి, తానూ పడుకుంటుంది. అతడు యే త్రోవ మీదుగా వెళ్తే యింటికి చేరుకోవచ్చో కూడా చెప్పింది.

తెలతెలవారుతూనే ఆ బ్రాహ్మణుడు నిద్రలేచి, రాత్రి కోతి యే త్రోవపడితే యింటికి వెళ్ళవచ్చని ఆ దారిన వెళ్ళిపోతూ, దారిలో తింటానికైనా వుంటుందని పెద్ద బండరాయి తెచ్చి ఆ కోతి నెత్తి మీద విసిరి వేయబోతాడు. చటుక్కున మెలకువ వచ్చిన కోతి ఆ దుష్టుడి క్రూరత్వాన్ని చూసి అసహ్యించుకుని.. యీ అడవిలో యింకనువ్వు వొక్క క్షణం కూడా వుండటానికి వీల్లేదు అని అతడ్ని అడవి నుంచి భద్రతగా వెంటవుండి మరీ పంపేస్తుంది.

యీ కథలో ఆ వ్యక్తి వొక బ్రాహ్మణుడు అని రాయడం జరిగింది. అతడు బ్రాహ్మణుడవవచ్చు.. కాకపోనూ కాకపోవచ్చు. కానీ యే అడవి వల్లన అయితే మనం రక్షణ పొందుతున్నామో ఆ అడవిని గానీ, అడవి జంతువుల్నిగానీ చంపడం కన్నా క్రూరమైన కృతఘ్నత యింకొకటిలేదని యీ కథ నిరూపిస్తుంది.

శరభ జాతక కథ

## ఆపదలో వున్న శత్రువునైనా రక్షించాలి

ఆ రాజుకి అడవి మృగాలను వేటాడటంఅంటే అదొక వినోదిత కార్యం. అతడు రాజుకావడం వల్ల అది తప్పు అని చెప్పే వాళ్ళు యెవరూలేరు దేశాన్ని యేలే రాజే మూగ జీవాలను హింసిస్తుంటే రాజ్యంలో వున్న ప్రజలకు కూడా అదెటువంటి తప్పు కాదనే అనిపిస్తుంది. వారు కూడా అందుకు తయారవుతారు మరింక వన్య ప్రాణులకు రక్షణ యేది?

యీసారి రాజుగారికి అడవిలో వొక చక్కని హరిణం కనపడింది. దానిమీద పచ్చని బంగారు చుక్కలు. అమాయకమైన కళ్ళు. గడ్డి కొసల్ని మాత్రమే, లేలేత చిగుళ్ళను మాత్రమే తినగల మన్నితత్వం. ప్రకృతికే మనోహరం అవదగ్గ ఆ హరిణాన్ని చంపాలని యెట్లా అనిపించిందో.. దాని వెనక పడ్డాడు. మాటువేసి బాణాలు వేశాడు. హరిణం చప్పున తప్పించుకుంది. రాజు దాని వెంటపడ్డాడు. అది దొరకలేదు. దాని వెనక పరుగెత్తుతూ రాజు దట్టీల్నని పెద్ద నురుగు నీటిగుంటలో పడిపోయాడు. మునిగిపోతున్నాడు. నిస్సహాయుడై పోయాడు.

తనను యిప్పటి వరకూ చంపడానికి వెంటపడిన వ్యక్తి యిప్పుడు తానే చావు బతుకుల్లో వుండటం ఆ లేడిపిల్ల గమనించింది. తన శత్రువు కనుక చచ్చే పరిస్థితి వస్తే మానవుడింతో సంతోషపడతాడు. కేరింతలు కొడతాడు. విందులు చేసుకుంటాడు. కానీ ఆ హరిణం అలా సంతోషించలేదు. ఆ రాజుని యెలా రక్షించాలా అని ఆవేదన పడింది. ఆందోళన చెందింది. దానికి వొక మంచి ఆలోచన తట్టింది. వెంటనే అది అడవిలోపలికి వెళ్ళి చెట్లని చుట్టుకుని పెరిగిన లతల్ని పూడలాగింది. అందులో బలమైన తీగల్ని రాజువైపుకు వదిలి.. రెండవ చివరతీగలను దగ్గరలోనే వున్న చెట్టుకు రెండుమూడుచుట్లు చుట్టింది. ఆ అడవి తీగల సహాయంతో రాజు ఆ వూబిగుంట నుండి బయటపడ్డాడు.

అతడి యెదురుగా అంతకు మునుపే అతడు అతి క్రూరంగా చంపబోయిన అమాయకమైన హరిణం. నీకింకా యే సాయం చేయాలి? చేయగలను? అన్నట్లు చూస్తోంది. దానిలో యే ద్వేషమూ లేదు. దాని కళ్ళ నిండా ప్రేమ.. కరుణ.

రాజా సిగ్గుతో కుంచించుకుపోయాడు. తానొక రాజునన్న అహంకారాన్ని వదిలి నేలమీదపడి ఆ చిన్ని హరిణానికి దండం పెట్టాడు. రాజ్యానికి చేరిన వెంటనే అడవిజంతువుల వేటను నిషేధించాడు. స్వయంగా ప్రచారం చేశాడు.

యెంతో నీతి వంతమైన యీ కథ నిజంగా జరిగినట్టు అనిపించదు. యిట్లా జరుగవచ్చేమో అని మాత్రమే అనిపిస్తుంది. అయినా ఆ కథ.. ఆ వాతావరణం.. ఆ ప్రేమాభిమానాలు.. ఆ మానవీయభావాలు శత్రుత్వాన్ని మరిచిన క్షణాలు.. యివన్నీ కళ్ళకు కట్టినట్టుగా అయి గుండెల నిండా మానవతా కరుణలు నిండిపోయి, అమృతధారలుగా పైకి యెగుస్తాయి.

### మాతృపోషక జాతకం

## ప్రకృతితో మనిషి పుచ్చుకునేటట్టు వుండాలి

చిన్ని యేనుగు వొకటి అడవిలో స్వేచ్ఛగా, హాయిగా తిరుగుతూ వుంటుంది.. దానికి తల్లి అంటే చాలా ప్రేమ. కానీ ఆ తల్లి యేనుగు గుడ్డిది. చిన్ని యేనుగు అరణ్యమంతా తిరిగి.తిని.. మంచి మంచి పళ్ళకొమ్మలు విరిచి తల్లికి తీసుకు వెళ్ళిపెట్టేది. తల్లి యేనుగు యీ చిన్ని యేనుగుకు యెన్నో మంచి కథలు చెప్పేది. 'యే జీవి అయినా ఆపాయంలో వుంటే మనం వాటిని రక్షించాలి.. అది మన ధర్మం', అని చెప్పేది.

వొకనాడు అడవిమనిషి వొకడు కొండచరియమీంచి జారి నదిలోపడిపోయాడు. వెంటనే యీ చిన్ని యేనుగు నదిలోకి దూకి అతన్ని తొండంతో రక్షించి భద్రంగా వొడ్డున పడుకోపెట్టి సపర్యలు చేసి పంపించింది.

ఆ అడవి మనిషి.. యీ సంగతి యెంతో గొప్పగా తన గూడెంలో చెప్పగా.. ఆ మాట అట్లా అట్లా వెళ్ళి రాజుగారి చెవిలో పడింది. వెంటనే ఆ రాజుగారు.. అంతమంచి యేనుగు మన అంతఃపురంలో వుంటే మరీ బావుంటుందని చెప్పి.. ఆ కోయమనిషి ద్వారానే ఆ చిన్న యేనుగు జాడ కనిపెట్టి.. సైనికులచే దానిని గొలుసులతో బంధించి రాజ్యానికి తీసుకువెళ్ళిపోయాడు. యీ సంగతి తెలియని ఆ తల్లి గుడ్డి యేనుగు తన బిడ్డ కోసం యెంతో యేడుస్తూ వుంటుంది.

యిక్కడ రాణివాసంలో ఆ చిన్ని యేనుగు యెంత మంచి ఆహారం పెట్టినా తినదు. తన గుడ్డి తల్లి కోసం యేకధారగా యేడుస్తోంది. రాజపరివారం అంతా దాని దుఃఖం మాన్పించడానికి యెన్నో పరిచర్యలు చేశారు. యెంతో మంచి ఆహారం దానిముందు పెట్టారు. అయినా అది వాటి వాసన కూడా చూడకుండా అదే పనిగా యేడుస్తూ, దిగులుతో కృశించిపోతూంది.

రాజుకి తెలిసిందీ సంగతి. సాధారణంగా యేనుగులు మనుషులకు బాగానే మచ్చిక అవుతాయి. యీ చిన్ని యేనుగు యెందుకింత యేడుస్తోందో అతడికి తెలవలేదు. దాని యేడుపు చూస్తే అతడికీ యెంతో జాలి వేసింది. సంగతి యేమిటో తెలుసుకుందామని ఆ కోయ అతన్ని పిలిపిస్తే అతడు దీని తల్లి గుడ్డిదనీ అందుకే యేడుస్తోందనీ చెప్పాడు.

దానిని వేటాడే ముందర.. యీ చిన్ని యేనుగు తన గుడ్డి తల్లికి యెంతో సేవచేస్తుందనీ

ఆ తల్లి ఏనుగుకు యీ చిన్న ఏనుగే ఆధారమని చెప్పినందుకు రాజా అతన్ని గట్టిగా మందలించడమే కాకుండా ఆ రోజునే ఆ చిన్ని ఏనుగును అతి జాగ్రత్తగా అడివిలోకి తనే స్వయంగా విడిచిపెట్టాడు.

ఆ చిన్ని ఏనుగు సంతోషంగా, తన తల్లిని చేరుకుంది.

యీ కథ అరణ్యాల పట్ల మారుతూవస్తున్న రాజుల దృక్పథాన్ని తెలియజేస్తుంది. అరణ్యాలలోవుండే జీవులపట్ల అన్యాయంగా దుర్మార్గంగా ప్రవర్తించకూడదు. ఏదైనా యిచ్చిపుచ్చుకునే ధోరణిలో వుండాలన్న పద్ధతి కనిపిస్తుంది. తల్లీ బిడ్డల్ని విడదీస్తే మనుష్యులు ఎంత బాధపడతారో మూగజీవాలు కూడా అంత బాధపడతాయి. కాబట్టి మనుష్యులు వాటికి అటువంటి బాధ కల్గించకూడదు అని యీ కథ చెప్తుంది. జీవితంలో స్వర్గం అంటే మానవత్వంతో జీవించడమే అన్న తృప్తి వంతమైన భావన కల్గిస్తుందీకథ.

## మత్స్య జాతకం

## పదిమందికోసం బతకడమే అమరత్వం

కోసల రాజ్యంలోని శ్రావస్తి నగరం పొలిమేరల వొక మంచినీటి చెరువు వుంది. మనుషులెవరూ పెద్దగా అటురారు. దాంతో ఆ చెరువులో చేపలు, కప్పలు,నత్తలు, ఆలుచిప్పలు, పీతలు, తాబేళ్ళు బాగా పెరిగాయి. అదొక అద్భుత జీవప్రపంచంలా వుండేది. రేయింబవలు ఆ చెరువు అంతా హడావుడే. పగలు కొంగలు, బాతులు వచ్చేవి. రాత్రిళ్ళు చుట్టుప్రక్కల వున్న అడివి జంతువులు ఆ నీళ్ళు తాగడానికి వచ్చేవి.

యిలా వుండగా ఎండలకి ఆ చెరువు ఎండిపోసాగింది. దాంతో చేపలు, తాబేళ్ళు బురదలోపల దాక్కోసాగాయి. చెరువులోని నీరంతా పల్లంగావున్న వైపుకు పారిపోతూంది. యీ నీళ్ళు కూడా అయిపోతే యీ చెరువులో జీవులు బతకడం చాలా కష్టం. పైగా కాకులు, గ్రద్దలు వచ్చి ఆజీవుల్ని కళ్ళగించి తింటాయి.

యిదంతా చూసిన ఆ చెరువులోని పెద్ద చేప. అంతకాలం అది ఆ చెరువుకి రాజులా వ్యవహరించింది. ఎలా తనతోటి జీవాలను రక్షించడం అని చాలా మథనపడింది. నీళ్ళు ప్రవహించే వైపుకు వెళ్ళి నీళ్ళు పారిపోకుండా బురదనే గట్టుగా తయారు చేయసాగింది. యిలా చేయడంతో నీళ్ళు వెళ్ళడం కాస్త తగ్గింది. అయినా యింకా నీళ్ళు వెళ్తూనే వున్నాయి. అక్కడ ఎంత బురద వేసినా నీళ్ళ తాకిడికి బురద కరిగిపోయి నీళ్ళు బయటికి వెళ్ళిపోతూనే వున్నాయి. యింక అది ఏం చేయాలో తెలియక చివరికి తానే ఆ మార్గంలో గట్టిగా యిరుక్కుని కూర్చుంది. దాంతో వెళ్ళే నీళ్ళు వెళ్ళడం మానేసాయి. నీళ్ళు బయటికి పోకపోవడంతో నీళ్ళు నిలిచి, ఆ చెరువులో వున్న జీవులన్నీ బతికి బయటపడ్డాయి. ఆ రాజచేప మాత్రం ఆ యిరుకునుండు నుంచి బయటకు రాలేక, వూపిరాడక అక్కడే అలా చచ్చిపోయింది. తాను చచ్చిపోయినా, తన తోటి జీవులు క్షేమంగా ఉండాలన్న దాని కోరిక మాత్రం యీడేరింది. ఆ రాజా చేసిన త్యాగాన్ని గౌతమబుద్ధుడు కథగా చెప్పాడు. తరువాత తరువాత అది యిలా మత్స్య జాతక కథ అయింది. యీ కథలో పదిమందికోసం వొక్కడు బతకాలని, పదిమందికోసం ప్రాణత్యాగం చెయ్యవలసివచ్చినా జంకకూడదని గౌతమబుద్ధుడు వుద్బోధించాడు. అన్ని కాలాలలోనూ, అన్ని సమాజాలలోనూ, అన్ని జీవాలకూ పనికి వచ్చే త్యాగపూరితమైన సహజమైన కథ యిది. యిలా జరిగిన సంఘటనను పరిశీలించాకే

గౌతమబుద్ధుడు యీ సంఘటనను శిష్యులకు చెప్పి వుంటాడు. ఆయన ఆ నీటిమడుగుని యెంత శ్రద్ధగా పరిశీలించాడో!! అతని బోధనలు యింతమంచి అన్నీ ప్రకృతి నుంచి తీసుకున్న సంఘటనలను ప్రస్తావిస్తూనే వుంటాయి. అట్లాంటి మానవీయమైన కథలలో మణిపూసలా ప్రకాశించే కథ యిది.

### మహిష జాతకం

## పెద్దపనులు యెల్లకాలమూ చెల్లుబాటు కావు

వొక అడవి గేదె ఆ అడవిలో స్వేచ్ఛగా, సంతోషంగా బతుకుతూ వుండేది. తన తిండేమిటో తన విశ్రాంతేమిటో తన బతుకేమిటో తనది.. యే జీవికీ హాని చేసేది కాదు.. అడవి అంతా తిరుగుతూ, కొండలు లోయల్లో గడ్డిమేస్తూ ప్రశాంతంగా జీవితం గడిపేది.

అది వొక రోజు యెండకి అలిసి వొక పచ్చని చెట్టుక్రింద విశ్రాంతి తీసుకుంటూ, తిన్నదేదో మౌనంగా నెమరు వేసుకుంటూంది. దానిని ఆ దరిదాపుల్లోనే వుండే వొక కోతి చూసింది. వికృత లక్షణాలు గల కోతి అది. అదొచ్చి యీ గేదె వీపు మీద కూర్చుంది. కూర్చుంది కాకుండా తోకమెలి పెట్టింది. గేదె వీపుమీద గెంతులు వేసింది. కళ్ళల్లో వేళ్ళు గుచ్చుతూంది. దాని కొమ్ములు పట్టుకుని వూపుతూ వేళ్ళాడుతుంది. రోజూ యిదే పని దానికి.

రాను రాను యీ కోతి చేసే అల్లరి, పీడనా అంతా ఆ గేదె భరించలేకపోతూంది. అయినా సరే శాంతంగా, సహనంగా యీ కోతి చేష్టల్ని భరించసాగింది. కోతి తన వికృత చేష్టలు ఆపలేదు.. యిక ఆ గేదె దాని దుష్కృత్యాలు భరించలేక అక్కడి నుంచి వెళ్ళిపోయింది. పాపం దానికి ఆ చెట్టుక్రిందే యెక్కువసేపు వుండాలని, విశ్రాంతి తీసుకోవాలని వుంది. కానీ ఆ కోతి వికృత చేష్టలు భరించలేకపోతూంది. ఆ కోతిలేని సమయంలో వచ్చి అది ఆ చెట్టుక్రిందే విశ్రాంతి తీసుకునేది. యీ సంగతి యెక్కడ వుండి గమనించేదో ఆ కోతి అమాంతం వచ్చేసి పీడించడం మళ్ళీ మొదలు పెట్టేది. యిలా చాలాసార్లు అయ్యాక ఆ గేదె యింక బాగా నిరాశపడి ఆ చెట్టువైపుకు రావడం మానేసింది.

యిలా వుండగా యింకొక అడవిగేదె ఆ అడవీ కొండలూ అలా అలా తిరుగుతూ వొక రోజున ఆ చెట్టుక్రిందే విశ్రాంతి తీసుకోసాగింది. దానికి యీ అల్లరి కోతి సంగతి తెలియదు. యీ చెట్టుక్రింద చాలా చల్లగా వుందే అనుకుంటూ పాతగేదెలాగే సంతోషంగా విశ్రాంతి తీసుకుంటూంది. పాత గేదె వెళ్ళిపోయినప్పటినుంచీ ఆ అల్లరి కోతికి యేమీ తోచట్లేదు. చాన్నాళ్ళకు మళ్ళా ఆ చెట్టుక్రింద మళ్ళీ గేదెను చూడగానే, ఆపాత గేదే యీ గేదె అని తలచి, పీడించడానికి వుత్సాహంగా గెంతుకుంటూ వచ్చి యీ అడవిగేదెపైన కూర్చుంది. అడవిగేదె– "యేం? యెవరు నువ్వు? బుద్ధి లేదా?" అన్నట్టుగా వళ్ళు విదిల్చింది. కానీ పీడించడమే అలవాటుగా వున్న యీ అల్లరికోతి అదేమీ పట్టించుకోకుండా గేదెతోక మెలిపెట్టి తిరిగి గేదె మీది నుంచి దాని కొమ్ముల మీదికెక్కి, కొమ్ముల్ని పట్టుకుని వూపుతూ వేళ్ళాడ సాగింది.

ఆ అడవి గేదె యీ కోతి చేసే అల్లరి చేష్టలకి విపరీతంగా మండిపడిపోయింది. తలని విసురుగా విసిరి కోతి క్రిందపడగానే దానిని కొమ్ములతో పొక్కపోటు పొడిచింది. దెబ్బకి గుండెల్లో కొమ్ములు దిగబడి అల్లరికోతి కేర్‌కేర్ మంటూ చచ్చూరుకుంది.

'పెద్ద పనులు యెల్లకాలమూ చెల్లుబాటుకావు. అవి మృత్యువునే మీదికి తెస్తాయి' అని చెప్తుంది మహిషజాతక కథ. యితరులను గౌరవించాలని, యితరుల స్వేచ్ఛకు భంగం

కలిగించకూడదని యీ కథ వుద్బోధిస్తుంది. గేదె జాతుల కుండే సహజమైన సహనం అవసరమైనప్పుడు చూపే శౌర్యం, కోతులకు వుండే అల్లరి లక్షణాలు యెరిగిన వారెవరికైనా యీ సంఘటన నిజంగా జరిగే వుంటుందనిపించక తప్పదు. పిల్లలలో అల్లరి మాన్పించడానికి యీ కథ చక్కగా వుపయోగపడుతుంది. భవిష్యత్తులో వాళ్ళు అమ్మాయిలను యేడిపించకుండా వొక లాఠీకర్రలా యీ కథ వుపయోగపడుతుంది. మనం పెట్టే బాధల్ని వొకరు సహిస్తున్నారూ అంటే అది మనం బాగుఅయ్యేందుకు వారు యిస్తున్న అవకాశంగా తీసుకొని చక్కదిద్దుకోకపోతే చివరాఖరికి యెటువంటి శిక్ష పడగలదో యీ కథ చెప్పక చెబుతుంది.

## నిగ్రోధమిగ జాతక కథ

## త్యాగం దుష్టుల్ని సైతం మారుస్తుంది

ఆ అరణ్యంలో అయిదారు వందల లేళ్ళు వుండేవి. స్వేచ్ఛగా, స్వతంత్రంగా బ్రతికేవి. ఆ లేళ్ళకు రావిలేడి రాజుగా వుండేది. అది బంగారురంగుతో, మెరిసే కళ్ళతో యెంతో అందంగా వుండేది. ఆ అడవిలోనే మరొక లేళ్ల మందకు శాఖాలేడి అనే మరో లేడి రాజుగా వుండేది. అదీ కూడా మన రావిలేడి లాగానే చాలా అందంగా బంగారురంగుతో మిలమిల లాడుతూ వుండేది.

ఆ రాజ్యాన్ని పాలించే రాజుకు వన్యమృగాల్ని వేటాడటం, వాటిని చంపి తినడం వేడుకగా వుండేది. ఆయనగారు ప్రతిరోజూ అడవికి సైన్యంతో రావడం, యే లేడినో చంపి తీసుకుపోయి వండించి తినడం చేస్తుండేవాడు. యిలా రోజూ ఆయన స్వయంగా వేటాడి చంపిన జంతు మాంసాన్నే తింటూ వుండటం చేత, ప్రతిరోజూ అడవికి వెళ్ళవలసి వచ్చి రాజుగా చెయ్యవలసిన చాలా పనులు వాయిదా పడుతూ వుండేవి. అందువలన చాలా నష్టం జరిగేది.

అందువల్ల మంత్రులందరూ వొక చోట చేరి యేం చెయ్యాలో నిర్ణయించుకుని, ఆ సంగతే రాజుగారికి చెప్పారు. వారు చెప్పిన దాని ప్రకారం అడవిలో వుండే లేళ్ళ మందను పట్టుకుని రాజుగారి కోటలోని తోటలో బంధిస్తారు. రాజుగారు ప్రతిరోజూ ఆ తోటలోకి వెళ్ళి యేదో వొక లేడిని తానే స్వయంగా వేటాడి చంపుతారు. ఆ చంపిన దానినే ఆ రోజు వంటకి వుపయోగిస్తారు.

రాజు యిదంతా బాగానే వుందన్నాడు. అంతే ఆ సైన్యం అంతా వొక్క పెట్టున అడవికి కదిలి అడవిలో వుండే లేళ్ళనన్నింటినీ బంధించి రాజభవనానికి తీసుకువచ్చి రాజుగారి తోటలో వదిలారు. ఆ తోట చుట్టూరా యెత్తైన ప్రహారీ కోటగోడ వుంది. అందువల్ల యే జంతువూ ఆ తోటలోంచి తప్పించుకు పోలేదు.

ఆ రోజు నుంచీ ప్రతిరోజూ రాజు ఆ అమాయకమైన లేళ్ళను ఆ తోటలోనే వేటాడేవాడు. అతన్ని చూడగానే లేళ్ళన్నీ భయంతో కకావికలై పోయేవి. తప్పించుకు పోలేని యే లేడికో రాజుగారి బాణం దెబ్బతగిలి అది గిలగిలా తన్నుకుని చచ్చిపోయేది.

అలా బంధించి తెచ్చిన లేళ్ళలో ముందు చెప్పిన రావి జింక, శాఖా జింక కూడా వున్నాయి. వొక రోజున బంగారు రంగుతో మెరిసిపోతున్న ఆ రెండు జింకల్ని చూసి రాజు యెందుకో చాలా ముచ్చటపడ్డాడు. తాను యెప్పుడైనా రావడం ఆలస్యమై, వంటకు యే లేడినైనా చంపాల్సివస్తే పొరపాటున కూడా యీ లేళ్ళను కొట్టవద్దు అని హుకుం జారీ చేశాడు.

రాజుగారు లేళ్ళను వేటాడటానికి వచ్చినప్పుడల్లా లేళ్ళన్నీ భయంతో పరుగెత్తుతూ

ఒకదానిమీద ఒకటి పడిపోయేవి. చెట్లనో, గోడల్నో గుద్దుకునేవి. వాటికెన్నో దెబ్బలు తగులుతూ వుండేవి. కాళ్ళు చేతులు విరుగుతూ వుండేవి.అలవిమాలిన బాధ పడుతూండేవి.

యిదంతా చూసి యెందుకనుకున్నాడో యేమో రాజు వాటన్నింటికీ సంఖ్యలు వేసి.. చీట్లు రాసి.. యే రోజు తాను యే చీటి తీస్తే ఆ చీటిలోని సంఖ్య యేదైతే వుందో, అదే సంఖ్యకల జింకను చంపివండమని ఆజ్ఞ జారీ చేశాడు. తనకు యిష్టమైన లేళ్ళుకావడంవల్ల రావి శాఖా జింకలకు మాత్రం సంఖ్య యివ్వలేదతడు. ఆ విధంగా చేయడం వల్ల జింకలన్నీ కాస్త వూపిరి పీల్చుకున్నాయి. అయినా వాటి బాధ చూసి రావిజింక, శాఖా జింక యెంతో బాధపడేవి.

ఒక రోజున రాజుగారు తీసిన చీటీప్రకారం ఆ రోజు బలయ్యే జింక ఒక ఆడజింక. అది నిండుగర్భిణీతో వుంది. యీ సంగతి తెలిసి ఆ జింకలన్నీ భోరుభోరున యేడవడం మొదలు పెట్టాయి. తమ దురదృష్టానికెంతో కుంగిపోయాయి. సరిగ్గా ఆ ఆడలేడిని చంపబోయే సమయానికి రావిజింక అక్కడికి వెళ్ళి ఆ ఆడజింకకు బదులుగా తనను నరకమని ఆ వధించే రాతి మీద తన తల పెట్టింది. సాధారణంగా యీ వధ్యశిలని చూసి పారిపోయే జింకల్నే చూసేవారు వాళ్ళు. కానీ యీ బంగారు జింక తనకు తానుగా యిలా తలపెట్టడం చూసి వారు ఆశ్చర్య పోయారు. దానిని తరిమేసినా తిరిగి వచ్చి ఆ వధ్యశిల మీద దీనంగా తన తల పెట్టేసేది. కాస్త ఆలోచించిన మీదట యీ వేళ నరకబోయే జింక ఆడజింక కావడం వల్ల అందునా గర్భంతో వుండడం మూలానా దానిని చంపడం యీ బంగారుజింకకి యిష్టం లేకపోవడం వల్ల యిలా చేస్తోందని తెలుసుకున్నారు.

యేదో జింక యే జింక అయితేనేం అని వారు దానినే చంపెయ్యడానికి వారికి రాజుగారి ఆజ్ఞ జ్ఞాపకం వచ్చింది. రాజుగారి ఆజ్ఞ ప్రకారం యీ బంగారు జింకలు రెండింటినీ చంపకూడదాయె. పోనీ ఆ ఆడలేడినే చంపుదామంటే యీ బంగారు జింక అడ్డుపడుతూంది. ముందర తననే చంపమన్నట్లు కత్తి కింద తలపెడుతూంది. యెందుకొచ్చిన తంటా అని వాళ్ళు యేకంగా రాజుగారికి కబురు పంపించారు.

రాజుగారు వచ్చి ఆ బంగారు జింక చేస్తున్న త్యాగం చూసే సరికి, అతనికి యెంతో ఆశ్చర్యమూ, సిగ్గూ కలిగాయి. యేమిటో, తన తిండికోసం యిలా అమాయక ప్రాణుల్ని చంపడం, అతనికే బాధగా అనిపించింది. కనీసం ఆ అమాయక ప్రాణులికున్న త్యాగం కూడా తనలో లేకపోయినందుకు యెంతో సిగ్గుపడ్డాడు.

అంతే, ఆ బంగారు లేళ్ళకూ, మిగతా అన్ని లేళ్ళకూ ఆ క్షణమే విముక్తి ప్రసాదించాడు. వాటన్నిటినీ తిరిగి అడవిలో వదిలి పెట్టించాడు. తానిక మాంసాహారం తినడం మానివేశాడు. ఆవిధంగా రావిజింక చేసిన త్యాగం రాజుని వున్నత మానవుడ్నిగా చేయగా, మిగిలిన జింకలన్నింటికీ ప్రాణం దక్కింది.

తోటి ప్రాణుల కోసం జీవితాన్నే బలిచేయగలిగిన త్యాగం యెంత గొప్పదో ప్రేమ యెటువంటి సత్ఫలితాలు సాధించగలదో యీ కథ వివరిస్తుంది. మాంసాహారం మానివేయడం వల్ల యెన్ని జీవాలకు ప్రాణందక్కుతుందో కూడా యీ కథ వివరిస్తుంది. అటువంటి సద్బుద్ధికి మనుషుల్ని ప్రేరేపిస్తుంది. మనిషి గుండె ద్రవించుకుపోతుంది. నిండైన మనసుతో ప్రణతోటట్లు చేస్తుంది. మనుషుల్ని మనిషులుగా మారుస్తుంది.

## హస్తి జాతకం

# త్యాగానికి హద్దులు లేవు

ఆ అడవిలో అయిదువందలమంది బాటసారులు ఆకలి దప్పికలతో ప్రయాణిస్తూ, ఇంక కొద్ది దూరం కూడా అడుగులు వెయ్యలేక, తమకు కలిగిన విపత్తును తలుచుకుని దీనంగా ఏడవసాగారు.

ఆ ఏడుపులు విన్న ఒక ఏనుగు వారి దరిదాపులకు రాగానే ఆ జనం అంతా భయపడిపోయారు. కానీ అది తమకు ప్రమాదం చెయ్యే ఏనుగులా కనిపించకపోవడంతో వారు తిరిగి ఏడ్వసాగారు. ఏనుగు వాళ్ళని అడుగుతుంది, ఎవరు మీరు.. ఎందుకిలా ఏడుస్తున్నారు? అని. ప్రక్క రాజ్యంలోని రాజు ఈ తెగ ప్రజలపై కక్ష గట్టి వాళ్ళ ఆస్తిపాస్తులన్నీ ఊడలాక్కుని రాజ్యంలోంచి వెళ్ళగొట్టేశాడట. వాళ్ళు అలా కాందిశీకుల్లా పిడికెడు గింజకోసం వస్తూ.. వస్తూ.. చనిపోయిన వాళ్ళు చనిపోగా మిగిలారట.. ఈ ఆకలిదప్పులతో ఇక్కడే చనిపోవడం తప్ప మాకింక వేరే దిక్కులేదు.. అని ఏడ్వసాగారు.

వారి కథ విన్న ఏనుగు ఎంతో బాధపడింది. వారందరికీ సరిపడిన ఆహారం ఈ అడవిలో దొరకదు. మరేమి చెయ్యాలి? ఆహారం తినకపోతే వీరందరూ ఇక్కడే చనిపోవడం ఖాయం. ఇట్లాంటి దీనపరిస్థితులలో మనుషులు చనిపోవడం ఆ ఏనుగుకి ఎంతో బాధ కల్గించింది. వాళ్ళనెలాగైనా బతికించాలని నిర్ణయించుకుంది. అందుకు అది చేసిన త్యాగం కంటతడి పెట్టిస్తుంది.

అది వారితో అంది, 'సోదరులారా! మీరేం బాధపడకండి.. ఇక్కడికి దగ్గరలోనే ఒక సరస్సు వుంది.. మీరందరూ అక్కడకు చేరి ఆ సరస్సులో నీళ్ళు తాగి కాస్త సేదదీరండి. మీకు కావలసిన ఆహారం మీకు తప్పక సమకూడుతుంది..', అని చెప్పి వారికి ఆ సరస్సు వున్న మార్గం చూపించింది. వారు కృతజ్ఞతతో ఆ సరస్సు వైపుకు వెళ్ళగానే తాను మరొక మార్గం ద్వారా ఆ సరస్సు అంచున వున్న కొండమీదికి చేరుకుని, ఆ కొండమీంచి ఆ సరస్సు ఒడ్డుకు అమాంతం దూకి ఆత్మాహుతి చేసుకుంది.

ఆ కాందిశీకులు ఆ సరస్సు దగ్గరకి చేరగానే ఆ సరస్సులో నీళ్ళేకాకుండా, తాము తినడానికి ఒక ఏనుగు కూడా చచ్చిపడి వుండటం గమనించి ఎంతో సంతోషించిపోయారు. వారు ఆ ఏనుగు దగ్గరకి చేరగానే ఇంతకు మునుపు తాము చూసిన, తమకు ఈ సరస్సును దారి చూపించిన ఆ ఏనుగే ఈ ఏనుగు అని తెలుసుకుని, అది చేసిన త్యాగాన్ని తలుచుకుని వెక్కి వెక్కి ఏడ్చారు. విధిలేని పరిస్థితులలో వారు దాని మాంసాన్ని తిని ప్రాణాలు దక్కించుకున్నారు.

ఈ కథ గుండెల్ని కుదిపేస్తుంది. ఆ ఏనుగు చేసిన త్యాగం కళ్ళకు కట్టినట్టుగా తోచి గుండెంతా నీరైపోతుంది. బుద్ధుని బోధనలలో త్యాగం ఎంత ప్రముఖంగా చోటుచేసుకుందో, అదీ కూడా ఒక వన్యజీవి చేసిన త్యాగమై, మనుష్యులలోని మానవత్వాన్ని ఎలా తట్టి లేపగలదో ఈ కథవివరిస్తుంది. ఈ కథ నిజం కాదు అని అనుకోవడానికి వీల్లేదు. ఏనుగులకున్న జ్ఞానం, ప్రేమ, త్యాగం, మనుష్యుల కంటే ఎక్కువ. ఏనుగులు మాత్రమే కావు సమస్త ప్రాణి కోటీ వున్నత గుణాలలో మనిషికి కొంచెం కూడా తీసిపోవు. అంతేగాకుండా అవి మనిషి అంటే ఎంతో ప్రేమిస్తాయి. తమను రక్షించేందుకు వచ్చిన మిత్రుడుగా భావిస్తాయి. ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ

ఎంతో సేవ చేస్తాయి. వెన్నుపోట్లెరుగని స్నేహహస్తమందిస్తాయి.

అటువంటి మూగ జీవాలను మనిషి రాక్షసుడిలా పట్టుకుని వధించి తింటాడంటే, వాటిని బంధించి, హింసించుతాడంటే, తమ బాగుకొరకు మందులూ, సౌందర్య సాధనాలూ చేయడానికి వాటిపై అతిక్రూరమైన ప్రయోగాలు చేస్తాడంటే, అవి ఆ రసాయనిక, విద్యుత్ ప్రయోగాలకు తట్టుకోలేక గిలగిలా తన్నుకుంటూ ప్రాణాలు విడుస్తాయంటే... గుండె పట్టేసినట్లవుతుంది.

మనిషితత్వంలో మౌలికమైనప్పుడే ఏ మార్పు అయినా వస్తుంది. అతనితత్వం హింసతో కూడినదై వుంటే, విజ్ఞానం ఎంత మంచి చెప్పినా ఏం ప్రయోజనం కలుగుతుంది?

ఒక మనిషి యిసుమంతయినా ఖర్చులేకుండా, తనకు కలిగిన దానిలో ప్రాముఖ్యం లేనంత మొత్తంలో అనేక పక్షులకూ, జంతువులకూ, చెట్లకూ నీడ కల్పించవచ్చు. తిండి పెట్టవచ్చు. నీళ్ళు వసతి కల్పించవచ్చు. జీవులపై కొద్దిపాటి కరుణతో అపారమైన మనోల్లాసాన్ని పొందవచ్చు. ఒక మనిషి దయాంతరంగుడుగా వున్నప్పుడు, అతడు సర్వ జీవ శ్రేయోభిలాషి కాగలిగినప్పుడు యిటువంటి దివ్యానందాన్ని సంపూర్తిగా అనుభవించగలడు. అతన్ని అటువంటి దివ్యత్వానికి తీసుకెళ్ళేది బౌద్ధము. ఆ తత్వంలో పాక్షికత్వం వుండదు. ప్రేమదారి ప్రేమదే, హింసదారి హింసదే అని చెప్పదు. ప్రేమకు సాక్ష్యం అహింస. అహింసే జీవిత తత్వంగా వుండాలి. సర్వజీవులూ సమానమైనవే. ఒక జీవిని చంపుతుతింటూ వేరొక జీవిని ప్రేమించడంలో అర్థం లేదు. సర్వమానవ సమానత్వాన్ని కోరడం వున్నత మానవ లక్షణం. సర్వ జీవ సమానత్వాన్ని సంక్షేమాన్ని కోరుకోవడమే బౌద్ధంలో అందుకు మొదటి నిబంధన. అది అతడి కర్తవ్యం.

## అహింస బుద్ధపథగాముల కర్తవ్యం

భిక్షు సంఘంలో కొత్తగా చేరిన శ్రమణకుడికి యెంతదూరంలో వున్న వస్తువునైనా గురి చూసికొట్టగల శక్తివుండేది. అతని స్నేహితులు చెట్టుకొమ్మలపై వున్న మామిడిపండ్లను, వెలగపండ్లను శ్రమణకుడు చేత రాళ్ళతో కొట్టించి ఆ పళ్ళను తింటూ యెంతో వినోదించేవారు.

రాను రాను శ్రమణకుడికి తన గురిచూపు పట్ల అహంకారం బాగా పెరిగిపోయింది. తాను గురి చూసి కొట్టిన విజయానుభవాలను గర్వంగా చెపుతూ వుండేవాడు.

ఒకరోజున వారందరూ నదిఒడ్డున వాహ్యాళి చేస్తుంటే కొంగలగుంపు ఆకాశంలో వెళ్ళిపోతుంది. శ్రమణకుడు వుండబట్టలేక తాను తన గురిచూసి కొట్టగల శక్తితో ఆ ఆకాశంలో వెళ్తున్న కొంగని కూడా కొట్టగలనంటూనే ఒక రాయితీసి ఒక కొంగని గురి చూసి కొట్టాడు. ఆరాయి తగిలీ తగలగానే ఆ కొంగ నేల రాలిపోయి గిలగిల కొట్టుకొంటూ చనిపోయింది.

యీ సంగతి తెలుసుకున్న గౌతమబుద్ధుడు ఆ శ్రమణకుణ్ణి పిలిచి- 'నాయనా ఆ కొంగను యెందుకు చంపావు? అది నీకేం అపకారం చేసింది? మైత్రి, కరుణ, ప్రేమ, అహింస మొదలైన సద్గుణాలను అలవరుచుకోవడానికి కదా నువ్వు యిక్కడికిచేరింది? మరి నువ్వు చేసిందేమిటి? మనం గృహస్థులకు కూడా అహింసను ప్రధానంగా బోధిస్తున్నాము కదా- శ్రమణుడివయ్యుండీ నువ్వు హింస చేయడం ధర్మమా? నీ మనసు మంచిదే అయినా నీ చపలత కారణంగా తప్పిదం జరిగిపోయింది. యిక్కనైనా నీ చేతులనూ, కాళ్ళనూ, నాలుకనూ అదుపులో పెట్టుకో-ధ్యానం చెయ్యి. బాబూ నీ గురిని కొంగమీద పెట్టవద్దు- నిర్వాణం మీద పెట్టు- అని ప్రేమగా మందలించాడు.

యిదీ ఆయన బోధన. అహింసపై బౌద్ధంలో జరిగిన చర్చలు యిన్నీ అన్నీ కావు.

శ్రావస్తిలోని జేతవన విహారంలో ఒక సమయంలో బుద్ధ భగవానుడు విడిది చేసి వుండగా, ఆయనకు నమస్కరించడానికి సుదూరంలోని ఒక విహారం నుండి చక్షుపాలుడు అనే బౌద్ధ భిక్షువు ఇక్కడికి వచ్చాడు. ఆ రాత్రి ఆయన ధ్యానమగ్నచిత్తుడై తన కుటీరం ముందర అటూ యిటూ పచార్లు చేస్తూ వుంటే అతని కాళ్ళ కిందపడి కొన్ని కీటకాలు చనిపోయాయి. మరునాడు వుదయమే వాటిని చూసిన మిగతా భిక్షువులు జీవహింస చేసినందుకు చక్షుపాలుణ్ణి దూషించుకుని. ఈ సంగతి బుద్ధ భగవానుడికి ఫిర్యాదు చేశారు. బుద్ధభగవానుడు వారితో, "భిక్షువులారా? ఆ కీటకాలు అతడి కాలి క్రింద పడడం మీరెవరైనా చూశారా" అని అడిగాడు. వారు 'చూడలేద'. చెప్పారు. మీరిలా చూడలేదో, అతడూ అలాగే చూడలేదు. అంతేకాదు అతడు అర్హతుడు. ముక్త పురుషుడు. కనుక అతడికి వాటిని చంపాలనే వుద్దేశం కలిగే అవకాశం లేదు- కనుక అతడు నిర్దోషి" అని చెప్పారు.

ఈ విధంగా తెలియక చేసిన హింసను, వుద్దేశపూర్వకంగా చేయని హింసను బుద్ధభగవానుడు ఎంతో దయగా మన్నించాడు. ఆ విధంగా అహింస అన్నది జీవన గమనానికి అడ్డుపడకుండా, జీవన వాస్తవికతో బోధించాడు. అహింసని సాధ్యమయ్యే కార్యాచరణగా చేశాడు.

ప్రకృతి గురించీ, దాని రక్షణపై మనిషి బాధ్యత గురించీ ఆయన చెప్పిన బోధన. విశ్వప్రార్థనగా సుత్తనిపాతంలో ఆ తరువాత గ్రంధస్థమైంది. అది బౌద్ధులకూ బుద్ధ పథగాములకూ, నిత్యజీవితంలో కొండగుర్తుగా వుండి వారిని అహింసకులుగా, అహింసలోని తృప్తిని, పరమార్థాన్ని తనివితీరా అస్వాదించేలా చేస్తుంది. ప్రకృతిపట్ల, ప్రకృతి జీవుల పట్ల మానవుడు అనుసరించవలసిన విధానం అదే. లోకకళ్యాణానికై వేయవలసిన మొదటి అడుగు అదే.

## విశ్వప్రార్థన

సమస్తజీవులూ... ఈ విశాల విశ్వములోని సమస్త జీవులూ క్షేమముగా, సుఖశాంతి సంతోషాలతో
జీవించుగాక, వర్ధిల్లుగాక దీవించబడుగాక...
చిన్నవైనా, పెద్దవైనా బలమున్నవైనా, బలములేనివైనా దగ్గరగా వుండేవైనా, దూరంగా వుండేవైనా
కనిపించేవైనా, కనిపించనివైనా పుట్టినవైనా, పుట్టబోయేవైనా
సమస్త జీవులూ... ఈ విశాల విశ్వములోని సమస్త జీవులూ క్షేమముగా, సుఖశాంతి
సంతోషాలతో జీవించుగాక, వర్ధిల్లుగాక దీవించబడుగాక...
యెవరూ యెవరినీ యెక్కడా కూడా మోసగించకుండా, నిందించకుండా హేయపరచకుండా,
హాని తలపెట్టకుండా విరోధించుకోకుండా
జీవించుగాక, వర్ధిల్లుగాక దీవించబడుగాక...
తల్లి తన యేకైక బిడ్డని యెంత గాఢంగా ప్రేమిస్తుందో తన ప్రాణాలొడ్డి
యెలా కాపాడుకుంటుందో అలాగే మనిషి కూడా కన్నతల్లిలా సర్వజీవరాశినంతటినీ
ప్రేమించుగాక, లాలించుగాక కాపాడుచుండుగాక...
నిలుచున్నా నడుస్తున్నా కూర్చున్నా పడుకున్నా తప్పొప్పులు లేని, యెల్లలే లేని
యెత్తుల్లో లోతుల్లో దిగంతాలు నిండిన ఆ విశ్వప్రేమ విశ్వకరుణ విశ్వ మైత్రి
మన గుండెల్లో నిండుగాక మనిషి తన సర్వశక్తుల్నీ ఆ విశ్వప్రేమకై కేంద్రీకరించుగాక!!

# బుద్ధుని గురించీ, బౌద్ధమతం గురించీ కొన్ని అపోహలు-నిజాలు

ఈ ప్రపంచంలో సమభావం, సమన్యాయం కోరుకునేవారందరూ, అత్యంత ప్రాచీన కాలంలోనే యిప్పటికాలానికి సరిపోయేటట్లుగా విశ్వజనీనమైనట్టువంటి ఆచరణపూర్వకంగా బోధించి రుజువు చేసిన బౌద్ధంగురించి ప్రత్యేకమైన శ్రద్ధ చూపాలి. అట్టడుగునపడి కనిపించని మణులన్నీ వెలికి తీయాలి. అప్పుడే వర్తమానంలో నడుస్తున్న మానవతా దీప్తి ఉద్యమాలకు అవసరమైన ప్రగాఢమైన, దమ్ము, స్ఫూర్తి దొరుకుతాయి. ప్రజాస్వామ్యం, స్త్రీ పురుష సమానత్వం, సమసమాజం, వ్యక్తి స్వేచ్ఛ, సమానగౌరవం. యివన్నీ ఈనాడు పోరాటాల వల్ల లభ్యమవుతాయి అని, అవి అందని ఆదర్శాలుగా భావిస్తూ చేసే పోరాటాలలో కన్నా, ఆ భావాలు మనలో వున్నాయి. మనం వాటన్నిటిని పొంది వున్నాము. యిప్పటికీ ఆ ప్రభావం మనపై 'యిలా' వుంది. ఆ ఆదర్శాలను మనం పూర్తిగా పొందేందుకు యివి 'లభ్య మవుతున్నాయి అనుకుని చేసే సమరశీల పోరాటాలలో యింతో స్థైర్యంతో ఆత్మ విశ్వాసం కనబడతాయి. బౌద్ధం అటువంటి స్థైర్యాన్ని అందిస్తుంది. యెందుకంటే అది మనకి మొదటి నుంచీ వుంది.

ఈ అటువంటి బౌద్ధం యొక్క అవసరాన్ని అందరూ గుర్తించిననాడే, ప్రపంచమంతటా నేడు జరుగుతున్న సంఘర్షణలు, పీడనలు అణచివేతలు నశించి, శాంతి సమభావాలు, స్నేహ వాత్సల్యాలు విశ్వజనుల గుండెల్లో పుష్పిస్తాయి.

అందుకోసం, చిన్న వయసు నుండీ వృద్ధుల వరకూ కూడా సులువుగా అర్థం చేసుకోగల, వారిని సంతోషపరచేవిధంగా గౌతమబుద్ధుని జీవితం, ఆయన బోధనలు-వాటిని సరిగా చేరాలి. బౌద్ధం అనే తాత్విక జ్ఞానం వారిలో మరిన్ని మానవతా పుష్పాలు పూయించాలి. వేయి ప్రశ్నలు పుట్టించాలి. వేయిన్నొక్క సమాధానాలు రాబట్టించాలి. అనేకానేక చర్చలలో, పరిశీలన, పరిశోధనలలో బౌద్ధం యొక్క విశ్వజనీన స్వరూపం మరింత శుద్ధిగా ఆవిష్కరింపబడి అందరినీ చేరాలి.

సాధారణంగా బుద్ధుని గురించీ, బౌద్ధం గురించీ కొన్ని అపోహలు సమాజంలో వున్నాయి.

అవి వాస్తవానికి యెదురుగా నిలబడగలిగేంత దారుఢ్యమైనవి కావు. సరైన చింతన చేస్తున్న కొద్దీ బౌద్ధమే తిరిగి ఆవిష్కరింపబడుతుంది. అటువంటి హేతువాదపరిశీలనా, వాదోపవాదాల సాధనకి మొదటగా యిచ్చింది కూడా బౌద్ధతత్త్వమే. అది బాహిరంగంగానే కాకుండా అంతరంగికంగా కూడా విమర్శలు చేసుకుని సత్యాన్ని ఆవిష్కరింపచేస్తుంది. అపోహలు గురించి వివరంగా ఆలోచిస్తే

## 1. బుద్ధుడు-ఉపనిషత్తులు

బుద్ధుడు చెప్పినవన్నీ ఉపనిషత్తుల్లో వున్నాయని అంటుంటారు. కాని అది నిజం కాదు. వేదాలనుగానీ, ఉపనిషత్తులను గానీ, బ్రాహ్మణులను గానీ బుద్ధుడు నిందించాడు, తిరస్కరించాడు అన్నదానిలో కూడా అసలు నిజం లేదు. వున్నాయనడమే గానీ యెవరూ బుద్ధుడు చెప్పిన చతురార్య సత్యాలు, అష్టాంగమార్గాలు, ప్రతీత్య సముత్పాదం ఈ ఉపనిషత్తుల్లో యెక్కడ వున్నాయో చెప్పిన వాళ్ళు, చూపించిన వాళ్ళు లేరు. అయినాసరే ఆ మాట వస్తూ వుండటం ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. ఆధారం లేని మాట యిలా చెల్లుబాటులో వుండటం నిజంగా ఆశ్చర్యమే.

బుద్ధుడు మిగతా తత్వాలను యెప్పుడూ యెక్కడా ద్వేషించలేదు తక్కువ చేసి చూడలేదు. విధానాలలో, ఆలోచనలలో భేదాలు వచ్చినప్పుడు తన పద్ధతి యేమిటో వొప్పించక, తానొప్పక, సాధ్యమైనంతవరకూ తనను వ్యతిరేకించిన వారిచేతనే సత్యపరిష్కారం చేయించేవాడు. తత్వాల్ని భేద విభేదాల్ని, విరోధాల్ని, భేదాన్ని కల్గించే మాటలకు ఆయన పూరా వ్యతిరేకి. యేదైనా తను గురించి చెప్పవలసి వచ్చినప్పుడు చాలా సరళంగా, జ్ఞాన పూరితంగా, ..."అవును, యిది యిలా వుంది. యిది యిలా మాలో వుంది.. మాలో యిటువంటి పద్ధతి లేదు.." యిలా యెంతో సక్యత్తగా, గౌరవాదరంగా, వినయ సహనా - లతో చెప్పే పద్ధతినే ఆయన పాటించి బోధించాడు. కరుకైన భాష ఆయన జీవితంలోనే లేదు.

యిక, వుపనిషత్తుల విషయానికి వస్తే, బుద్ధుడు జీవించియుండిన కాలానికి పండితుల లెక్క ప్రకారం అప్పటికి వున్నవి వుపనిషత్తులలో అతి ముఖ్యమైన యీశ, కేన, కఠోపనిషత్తులు మాత్రమే. యిది అందరూ అంగీకరించిన సత్యమే. తరువాతి, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యక.. యిలా దాదాపు మొత్తం రెండువందల పై చిలుకు వుపనిషత్తులన్నీ బుద్ధుని తరువాత వచ్చినవే. వుపనిషత్తులలో కూడా, బౌద్ధ భావాలు కొన్ని వుండవచ్చు. బౌద్ధంలో అది వుపనిషత్ భావాలు కూడా వుంటే వుండవచ్చు. అంతమాత్రాన యేదీ మరొకదానికి అనుకృతం కానేరదు, సత్యం ఆ విధంగా వ్య క్తీకరింపబడకూడదు. అటువంటి అపరిపూర్ణ వ్యక్తీకరణలలో సత్యం ఆవిష్కరింపబడదు.

వుపనిషత్తులది ప్రధానంగా ఆత్మాన్వేషణ. ఆత్మాన్వేషణ భౌతిక జగత్తులో సాధ్యం అయ్యే పనికాదు కాబట్టి వారు దానికోసం మనస్సునే ప్రధానం చేసుకున్నారు. భౌతికజగత్తు కన్నా సంక్లిష్టమైన సూత్రీకరణలు చేశారు. వాటిలోని రూఢత్వాన్ని, నిగూఢత్వాన్ని సాధారణ మేధ అందుకోలేకపోయినా వాటి నిరుపమాన భావారమ్యతలు యుగాలు గడిచిపోయినా యిప్పటికీ ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కల్గిస్తాయి.

అయితే వుపనిషత్తులు ప్రబోధించే ఆత్మాన్వేషణ యెవరికి వారు చేయాల్సిందే. ఆ ఆత్మ 'యిదీ' అని స్పష్టంగా చెప్పడం, నిరూపించడం చాలా కష్టం. అటువంటి ఆత్మసాక్షాత్కారం వల్ల సంఘానికి వొన గూడే ఉచ్ఛితమైన ప్రత్యక్ష ప్రయోజనం 'యిదీ' అని నిరూపించడం కూడా కష్టమే. అయితే ఆత్మాన్వేషణ చేయవద్దని బుద్ధుడెక్కడా చెప్పలేదు. అది వొక పట్టాన తెగే విషయం కాదన్నాడు. అంతే.

ఆత్మాన్వేషణకొరకు కోరికలను నశింపచేసుకొని, భోగాల్ని వదిలి కఠోర నియమాలతో సన్యాసాశ్రమాన్ని స్వీకరించమంటాయి వుపనిషత్తులు.

బతుకుకోసం వేరొక జీవికి హాని కలుగకుండా, బతుకు-బతికించు అన్న ధోరణిలో జీవితాన్ని చరితార్థం చేసుకోమని చెప్తుంది బౌద్ధం.

సత్యం కోసం జీవితాన్ని అర్పించిన గౌతమబుద్ధుడికి అబద్ధం చెప్పవలసిన అవసరం లేదు. వుపనిషత్తులలో సారాన్ని చెప్పి వుంటే బుద్ధుడు ఆ వుపనిషత్తులనే ప్రజలకు నిరభ్యంతరంగా బోధించి వుండేవాడు.

## 2. బౌద్ధం-సోమరితనం

కొందరు హేతువాదులు సైతం బౌద్ధమతం, సన్యాసుల మతం అనీ, బిక్షులు పెంచుకుని నిర్వ్యాపారంగా, సోమరిపోతులుగా బతికేటందుకు బౌద్ధులు యేర్పరచుకున్న మతం అనీ అన్నారు.

చెప్పాలంటే బౌద్ధం నాశనం కావాలన్న వారితో సమానంగా బౌద్ధాన్ని యీసడించారు. యిది చాలా దారుణం. అన్యాయం.

విశ్వ మానవ కళ్యాణానికై ప్రతివ్యక్తికీ నిర్మాణయుతమైన కార్యక్రమాల్ని గౌతమబుద్ధుడు నిర్దేశించాడు. బతికున్నంతకాలం విశ్రాంతి అన్నది లేకుండా ప్రజల్లో వేలాది మైళ్ళు తిరిగాడు. ఆయనెక్కడా రెండెడ్లబండికూడా యెక్కలేదు. సోమరితనాన్ని యెంత తీవ్రంగా గర్హించాడంటే, పని లేకుండా, 'సోమరుల్లా వుండేవాళ్ళు పెంటమీద తిరుగాడే పందులని, యెల్లప్పుడూ వారు మృత్యువుకే పోతూంటారని', అన్నాడు. నిత్యం జాగరూకతతో వుండమన్నాడు. అజాగ్రత్తగా యెట్టిపరిస్థితులలోనూ వుండవద్దన్నాడు. మంచిపనులు చేయడంలో త్వరపడమన్నాడు. ఆయనచెప్పిన యేమాటా సోమరితనానికి సూదిమొన అంత చోటు కూడాయివ్వదు.

యిక భిక్షువులకి ఆయన నిర్దేశించిన నిబంధనలు చూస్తే, సుఖంగా వుండేవాళ్ళు తారెత్తాల్సిందే. కట్టుకోవడానికి మూడేగుడ్డలు. కప్పుకోవడానికి వొకటే రగ్గు. సామాను అంటే భిక్షాపాత్ర వొక్కటే. వూరికి దూరంగా చెట్టుక్రింద బ్రతకాలి. వొకపూటే తిండి తినాలి. వినోదాలు, విలాసాలు వుండవు. అతడి చేతుల్లో డబ్బులు వుండకూడదు. వున్నా యే వస్తువూ తనకంటూ కొనుక్కోకూడదు. గృహస్థుల యిండ్లకు వెళ్ళినా మెత్తని పరుపుల మీద కూర్చుండకూడదు, పడుకోకూడదు. మద్య, మాంసాలు మొదటే నిషిద్ధం. కటిక నేల మీద అయినా సరే కూర్చునే నిద్ర పొమ్మన్నాడు. యెక్కడ వుందిందులో సోమరితనం?

అతడు బాగా వృద్ధుడైపోయాడు. అప్పటికి 78. 79 సంవత్సరాలు వుంటాయి. వొకరోజు మధ్యాహ్నం భిక్ష తిన్న తరువాత తన భిక్షాపాత్రను గౌతమబుద్ధుడు యెప్పటిలానే కడుక్కుంటున్నాడు. అంత వయసులో కూడా ఆయన అలా తిన్న గిన్నెను కూడా స్వయంగా కడుక్కుంటూ వుంటుంటే ఆయన ప్రియ సేవక శిష్యుడు ఆనందుడు చూడలేక, కాస్త అసహనంగా, మరికాస్త నిష్ఠూరంగా, 'అయ్యా! ఆ పాత్ర యిటు యివ్వండి, నేను కడుగుతాను... యీ వయసులో మీరు కాస్త విశ్రాంతి తీసుకుంటూ వున్నట్లయితే చాలా సంతోషపడతాము' అన్నాడు.

గౌతమబుద్ధుడు దానికి చిరునవ్వు నవ్వుతూ, 'నాయనా! ఆనందా! యీ వయసులో సైతం నేను అన్నం తింటున్నానుకదయ్యా! అన్నం తింటున్నంతకాలం, అన్నం తిన్న గిన్నె కడుక్కోగల శక్తి వుందన్నమాటేగా? ' యెవరి పనులు వారే చేసుకోవాలి. యెవరి కాళ్ళపైన వాళ్ళే నిలబడాలి' అని కదా నేను మొదటినుండీ చెబుతున్నదీ? అన్నాడు భిక్షాపాత్ర కడుగుతూనే.

జీవితంలో క్షణకాలమైనా అతడు సోమరితనానికి అవకాశమివ్వలేదు. నిరాడంబరతలో కూడా అత్యంత నిరాడంబరతని, త్యాగాన్ని బోధించి, ఆచరించి చూపిన బుద్ధుణ్ణి, అదే చెప్పిన ఆయన ధర్మాన్ని సోమరిపోతుల మతం అని నిందించడంలో న్యాయం లేదు. అర్థం లేదు.

బలహీనుల కొరకు, స్వార్థం కొరకు గౌతమబుద్ధుడే నియమాలను కాస్త సడలించగా, ఆ దారిన తరువాత తరువాత సోమరిపోతులు కుట్ర పూరితంగా చేరి వుండవచ్చు.

చెట్టుకి చీడపడితే, చెట్టుకి చీడపట్టింది అంటాము కానీ, చెట్టే చీడపురుగుల చెట్టు అని యెవరైనా అంటామా? ప్రమిదలో నీరుపోసి వత్తి వెలగడం లేదు అని నిందించడంలో న్యాయం వుండదు. అది యెవరూ నమ్మలేని విషయం కూడా కదా!

## 3. బౌద్ధం-స్త్రీలు

కొడుకు పుడతాడని యెదురు చూస్తున్న తనకి ఆడబిడ్డ పుట్టిందని వాపోయిన ప్రసేన జిత్తుడితో గౌతమబుద్ధుడు. 'ప్రసేన జిత్తా! ఆడబిడ్డ పుట్టిందన్న చింత యింతమాత్రమూ మంచిది కాదు. ఆమె పుట్టుక యెన్నో విధాల మగబిడ్డ జననం కంటే పున్నెమైందని నిరూపించుకోవచ్చు. యీ ఆడబిడ్డ మంచి పెంపకంలో, జ్ఞానంలో, నీతిలో పెరిగి పెద్దదవుతుంది. ఆమెకు పుట్టిన పిల్లలు మరెన్నో సత్కార్యాలు చేసి, మరింత శోభతో రాజ్యపాలన చేయవచ్చు' అని అంటాడు.

భార్యను పడమర దిక్కుగా భావించి పూజించమన్నాడాయన. జ్ఞానం పొందడానికి స్త్రీకి పూర్తి స్వేచ్ఛ వుందన్నాడు.

బౌద్ధంలో స్త్రీపట్ల యెటువంటి వివక్షతా లేదు. అతిగా పొగడమూ లేదు, తెగడమూ లేదు. పెళ్ళిపోట్లకు లేవు. ఆమెపట్ల అంటరానితనం పాటించలేదు. తనకోసం తాను బతకవచ్చు యెవరికీ బానిసగానో, దాసిగానో బతకవలసిన అవసరం ఆమెకి లేదు. జీవచ్ఛవంలా బతకవలసిన దుస్థితి ఆమెకి లేదు. ఏ కులానికి సంబంధించిన స్త్రీ అయినా ఆమె యెటువంటి దుస్థితిలో వున్నా సరే బౌద్ధం వారిని ఆహ్వానించి సంఘంలో తల్లిలా చూస్తుంది. ఉన్నతమైన గౌరవాన్నిస్తుంది. విద్యాబుద్ధులను, వృత్తివిద్యలను, వైద్య వృత్తిని ఆమెకు నేర్పింది. విద్యా బుద్ధులు కలిగిన దయ కలిగిన కన్నతల్లిలా బౌద్ధం స్త్రీలను కాపాడుతుంది. వారిలోని శక్తియుక్తులను, ప్రతిభావ్యుత్పత్తులను వెలికి తెచ్చి ఆత్మ గౌరవంతో సమాజాభ్యున్నతికి తోడ్పడేవిధంగా వారు బతికేట్లు చేసింది.

బుద్ధుడు మొదటి నుంచీ స్త్రీలంటే ప్రత్యేకమైన అభిమానం, దయ చూపాడు. కన్నతల్లి అంటే ఆయనకెంతో ఆదరభావం. తల్లిపట్ల కుమారుడు, భార్యపట్ల భర్త వుండవలసిన తీరుని యెంతో వున్నతంగా, హృద్యంగా అన్నికాలాలకూ వర్తించేలా చెప్పాడు.

సమాజంలోని చెడుకి కేంద్ర బిందువైన పురుషుడు మారితే, సమాజం తప్పక మార్పు చెందుతుందని ఆయన భావించాడు. అందుకే స్త్రీలకు మొదట్లో బౌద్ధ ధర్మం అందించడానికి ఆయన అంత వుత్సాహం చూపించలేదు. అయినా ధర్మదీక్షలో, త్యాగనిరతిలో, నైతికవిలువల పరిరక్షణలో తాము పురుషులకేమాత్రం తీసిపోమని స్త్రీలు తమంతటాముగా రుజువు చేసుకుని, బుద్ధుణ్ణే ఆశ్చర్యచకితుణ్ణి చేశారు. బుద్ధుణ్ణి అంగీకరించేటట్లు చేశారు. చరిత్రలో యిది స్త్రీల తొలి విజయం. సమాజంలో మార్పు రావడానికి ముఖ్యంగా పురుషదృక్పథంలోనే మార్పు రావాలని ఆయన వూహించింది నేటికీ కట్టెదుట వాస్తవంగా వుండటమే బౌద్ధం యొక్క అవసరాన్ని, దాని ప్రత్యేకతను తెలుపుతుంది. చెప్పాలంటే బౌద్ధం స్త్రీలది. స్త్రీల కోసం. స్త్రీల సౌభాగ్య సంతోషాల కోసం పుట్టిన ధర్మం బౌద్ధ ధర్మం. అందుకు తోడ్పడమే ప్రతి పురుషుడి ధర్మం.అప్పుడే అతడికి సుఖం సౌఖ్యం జ్ఞానం కూడా.

## 4. బౌద్ధం-కర్మవాదం, పూర్వ పునర్జన్మ స్వర్గ నరకాలు

బౌద్ధ ధర్మ గ్రంథాలలో కర్మ సిద్ధాంతం, స్వర్గ నరకాలు, పూర్వజన్మ, పునర్జన్మ, పాప పుణ్యాల ప్రసక్తి చాలా చోట్ల వస్తుంది. అయితే వాటిని బౌద్ధమతంలో వినియోగించిన తీరు మంచికి వుపయోగపడేటట్లుగా వుంటుంది.

యిది మంచి-యిది చెడు అని చెప్పేటప్పుడు, సాధారణంగా లౌకిక వ్యవహారంలో

యిటువంటివిధాల ఆవశ్యకత కనిపిస్తుంది. ఖచ్చితంగా యిది 'మంచి' అనిగానీ, యిది 'చెడు' అనిగానీ చెప్పలేని పరిస్థితి కూడా వుంటూ వుంటుంది. మంచిపనులు చేసిన వాళ్ళు బాధలు పడుతూ వుండడం చూపించి, మంచి పనులు చేయువద్దు అని చెప్పడమూ తప్పే. చెడ్డ పనులు చేస్తున్నవాళ్ళు సుఖపడుతూ వుండడం చూపించి చెడ్డపనులు చెయ్యమని చెప్పడం, లేదా భరోసా యివ్వడమూ తప్పే. యిటువంటి పరిస్థితిలో మనిషి దేనిని, యెవరిని నమ్మాలి? సత్యాన్ని యెలా ఆవిష్కరించుకోవాలి? చట్టబద్ధంగా కూడా తప్పుడు పనులు చేసేందుకు అవకాశం వుంది. ఆ పనుల పాపం యెవరికి చుట్టుకుంటుంది?

ఆలోచింతే మనుష్యులలో సామాన్యులూ వుంటారు, మేధావులూ వుంటారు. యెలా చెప్పాలి వారికి?

గౌతమబుద్ధుడు యీ సందేహ నివృత్తికి, తన ధర్మంతోపాటు అటు వ్యావహారికంగానూ, యిటు తాత్వికంగానూ కూడా ఉపయోగపడగల స్వర్గనరకాలు, పూర్వజన్మ-పునర్జన్మలను కూడా తీసుకున్నాడు. వీటిని వుపయోగించడంలో తెలివి ప్రధానంగానే తీసుకున్నాడు. బోధించాడు కానీ, అలౌకిక నిబంధనగా, పలాయనవాదంగా, చెడుని ప్రోత్సహించేలా ఆయన తీసుకోలేదు, బోధించలేదు. యిది చాలా స్పష్టంగా కనబడుతుంది.

1. స్వర్గ-నరకాలు :

గౌతమబుద్ధుని దృష్టిలో స్వర్గం అంటే కళ్యాణమూర్తులైన దేవతల నిలయం. వారు నిత్యులు కారు. మనుష్యులలో వున్నవారే దేవతలు. దేన్ని యితరుల కొరకు నిస్వార్థంగా త్యాగం చేయగలవాళ్ళు అటువంటి వాళ్ళు అమరులుగా మనతోనే వుంటారు. అటువంటి వారి పేరునీ, త్యాగాన్నీ మనం స్మరణ చెయ్యాలి. అటువంటి స్వర్గాన్ని భూమి మీద మనమే స్థాపించుకోవాలన్న స్ఫూర్తిని కూడా మనకు అందిస్తుంది. ఆ విధంగా గౌతమబుద్ధుని స్వర్గ భావన నిజంగా స్వర్గమే.

నరకం : బౌద్ధంలో నరకాన్ని మూడు రకాలుగా విభజించారు. ఒకటి అదోక అధోగతి. రెండవది మృగప్రాయులుగా జన్మించడం. మూడవది మానవజన్మ. ఆ మానవజన్మని చరితార్థం చేసుకొని నిర్వాణం అనే స్వర్గాన్ని సాధిస్తే అతడికింక జన్మవుండదు బాధలూవుండవు.

గౌతమబుద్ధుడు, యీ నరకాలనుండి తప్పించుకోవడానికి యెటువంటి ప్రాయశ్చిత్తాలూ చెప్పలేదు. ఆయన యిలా అంటాడు. 'ఒకడు చెడ్డపని చేస్తే దాని ఫలితాన్ని యిహంలోనూ పరంలోనూ కూడా అనుభవించుతాడు'. అని. యెవరైనా సరే తనకు చెందిన నరకాన్ని తప్పనిసరిగా అనుభవించి తీరాలన్నాడు.

చెడ్డపనికి యిక రెండవ ప్రతిఫలం మృగప్రాయ జన్మ యెత్తడం. ప్రాణులయిన మృగాలు అనంతంగా వుంటాయి. అన్ని గౌతమబుద్ధునకు తెలుసున్న జన్మలలోనూ శ్రేష్ఠమైన జన్మ మనిషిజన్మ అని ఆయన చెప్పాడు. యీ జన్మని వున్నతంగా తీర్చిదిద్దుకోకపోతే, సార్థకం చేసుకోకపోతే అతడు మృగజన్మకి పోతాడు. నరకమనే అధోగతికి పోతాడు. అంటే దురాచారులు వీరంతా మృగ ప్రాయులుగా జన్మ యెత్తుతారు.

యిలా చెప్పడంలో మనిషి మంచితనాన్ని పెంచుకోవడం కోసమే. అంతేకాని భయానికిగానీ, మూఢత్వానికిగానీ, పలాయనానికిగానీ యెటువంటి ముప్పు రాకుండా చూడడానికే.

అందుకే ఆయన మానవాళి యిహంలోనూ, పరంలోనూ కూడా నరకం యెదుర్కోకుండా, పంచశీల, యేకాదశసూత్రాలు బోధించాడు. వాటి ప్రకారం యే ప్రాణుల్నీ హింసించకూడదు.

చంపకూడదు యితరుల వస్తువుల్ని దొంగిలించకూడదు. వ్యభిచరించ కూడదు. అబద్ధాలు, పరుషమైన మాటలు మాట్లాడకూడదు. తాగుడు, జూదాలు ఆడకూడదు. వీటివల్ల యెదురయ్యే దుష్ప్రభావాలు కూడా చెప్పాడాయన.

జాగ్రత్తగా ఆలోచిస్తే నేటికీ కూడా మానవాళి పడుతున్న నరక బాధలకి పైన చెప్పిన పంచశీలకు వ్యతిరేకంగా మనుష్యులు నడుచుకోవడమే అని తెలియగలదు.

బుద్ధధర్మదీక్షాపరులైనంత మాత్రాన వారు అంతకు పూర్వం చేసిన తప్పులు ఒప్పులైపోతాయని, పాపాలు పోతాయని ఆయనెక్కడా చెప్పలేదు. ఒక గీత ప్రక్కన మరొక పెద్ద గీత గీస్తే మొదటిది చిన్నగీత అయిపోయినట్టు, బౌద్ధాన్ని అవలంభించటం వల్ల చేసే మంచి పనుల ముందు, అంతకు మునుపు చేసిన చెడ్డ పనులూ, సూక్ష్మాలుగా అయిపోతాయన్న భావం అతడిది.

ఆ విధంగా బుద్ధుని నరక భావన వ్యావహారికంగా ఉపయోగించినప్పటికీ మనుషుల్ని జాగరూకులుగా వుండేటట్టు చేస్తుంది. యిహంలోను పరంలోనూ కూడా ఎదురయ్యే బాధలు గుర్తు తెచ్చుకుని చెడ్డపనులు, పాప పనులు చేయకుండా మనిషి ఒళ్ళు దగ్గర పెట్టుకుని బతికేటట్టు చేస్తుంది.

2. పూర్వజన్మ-పునర్జన్మలు :

యెవరైనా ధనవంతులుగా, ఐశ్వర్యవంతులుగా జీవిస్తూ వుంటే దానికి కారణం పూర్వజన్మలో వారు చేసుకున్న సుకృతంగా కాకుండా యీ జన్మలో మంచి పనులు చేయడానికి తమకు లభించిన అదృష్టంగా భావించమని చెప్తాడు గౌతమబుద్ధుడు.

మనిషికి తిరిగి జన్మంటూ యేదీ లేకపోయేస్థితి నిర్వాణం వలన మాత్రమే లభిస్తుంది. మనిషి మళ్ళీ పునర్జన్మ అంటూ యెత్తితే మళ్ళా అదీ నరకమే కదా!

అందువల్ల బుద్ధుడు, పూర్వజన్మ, పునర్జన్మ అన్న మాటలు ఉపయోగించింది. కేవలం వ్యావహారికంగా మాత్రమే. తోటి మనిషిని, మూగజీవాలనీ చూసి వారిని బాధపెట్టకుండా యే జన్మలో చేసుకున్న పాపమో యీ జన్మ యెత్తాము వీటిన్నీ బాధపెట్టి మళ్ళీ మనం కూడా యెందుకూ ఆ దుఃఖ జన్మ యెత్తడం అని జాగరూకతతో, కరుణతో వుండటానికి గౌతమబుద్ధుని యీ భావాలు వుపయోగపడతాయి. ఆయన చెప్పింది కూడా అదే.

వ్యావహారికంగా అయినా బుద్ధుని పునర్జన్మ సిద్ధాంతం వర్తమానంలో మనిషిని జాగరూకుణ్ని చేస్తుంది. నీతిగా, ఆహ్లాదపూరితంగా బతికే బతుకులోని విలువని, తీయదనాన్ని ప్రత్యక్షంగా పొందేటట్టు చేస్తుంది. చక్షుపాలుడి కళ్ళుపోవడం వెనుక వున్న కథని యెంతో చక్కగా చెప్తాడు బుద్ధుడు. తన బాధకి కారణం యీ జన్మలోనే కాదు, గత జన్మలో కూడా వుందని పూసగుచ్చిన వాడు ఆ బాధని తేలికగా భరించడమే కాకుండా, యిక అటువంటి పాపం లేదా తప్పు మరల జరగకుండా పదిమందికి చెప్తాడు. జాగురుపరుస్తాడు.

చక్షుపాలుడు పూర్వజన్మలో ఒక వైద్యుడు. ఒకామె తనకు కళ్ళుబాగు చేస్తే తాను తన పిల్లలతో సహా అతనికి దాస్యం చేస్తానని అంటుంది. అతడు వైద్యం చేయగా ఆమెకు కళ్ళు వస్తాయి. కానీ ఆమె పిల్లల్ని అతని దాసులుగా చేయడం యిష్టంలేక తన కళ్ళు బాగుకాలేదు అని అంటుంది. ఆ మాటకి వైద్యుడు ఆమెపై కక్షగట్టి వేరేమందు యిచ్చి ఆమె దృష్టిని పూర్తిగా పోగొడతాడు. యీ దారుణమైన పాపం వల్ల అకృత్యం వల్ల యీ జన్మలో గుడ్డివాడుగా పుడతాడు. యీ పూర్వజన్మ కథ ద్వారా మనం చేసిన వుపకారానికి ఫలితం ఆశించకూడదనీ, యెంతటి కృతఘ్నులకైనా సేవ

చేయాలి తప్పిస్తే పగతీర్చుకోకూడదనీ తెలుస్తుంది. యీ విధంగా మంచికి మేలు చేసే యీ పూర్వజన్మ, పునర్జన్మ సిద్ధాంతాన్ని గౌతమబుద్ధుడు కాదనలేదు.

తనెంత మాత్రమూ కారణం కాని కష్టాన్ని పూర్వజన్మలో చేసుకున్న పాపానికి శిక్షగా భావించి దాని గురించి పదేపదే యోచన చేయకుండా జీవితాన్ని మిగిలున్నంతలోనే ధర్మబద్ధంగా నడుపుకోవాలంటాడు బుద్ధుడు. ఒక దుష్టుడు ఒక అన్యాయం చేసినప్పుడు అతన్ని ద్వేషించడం వల్ల, పగతీర్చుకోవడం వల్ల, హింసించడం వల్ల మార్పు తెచ్చే ప్రయత్నం చేయకూడదనీ,అటువంటి ప్రయత్నాల వల్ల పూర్తి మంచి సిద్ధించదనీ దుష్టుడి మనస్సులోనే మార్పు రావాలనీ బుద్ధుడి వుద్దేశం. ఆ విధంగా మారిన దుష్టుడు యిక చెడ్డపనులు అన్నవి చేయకుండా వుండటమే కాకుండా ఆదర్శంగా బతుకుతూ జీవితాన్ని చరితార్థం చేసుకుంటాడు. చుట్టూ మంచితనం పెరగాలన్న భావాలు ముప్పిరిగొంటున్నప్పుడే కాకుండా, మామూలుగా కూడా ప్రతీవొక్కడూ యెంత దుష్టుడైనా పైకి తాను మంచివాడుగా, వు``బాసినే, అలా అందరిచేతా పిలవబడటానికే యిష్టపడతాడు. యీ విధంగా మంచి అనేది మానవ స్వభావం. అటువంటి స్వభావాన్ని మనిషి నుంచి యెవరూ విడదీయలేరు. చుట్టూ వున్న సంఘం ఆ స్వభావం యొక్క కార్యాచరణని కోరుకుంటే తప్పనిసరిగా యెంతటి దుష్టుడైనా ఆ మంచి భావాల వెల్లువకు కొంతయినా వశే తలవొగ్గక తప్పరు. ఆ విధంగా క్రమేణా పూర్తిగా వచ్చే పరివర్తనని గౌతమబుద్ధుడు కోరుకుంటాడు. అటువంటి పరివర్తన వచ్చేందుకు వీలైన అన్ని భావాలూ అభివృద్ధి కావాలి. పూర్వజన్మ, పునర్జన్మలనేవి కూడా అందుకు వ్యావహారికంగా వుపయోగపడతాయి అని గౌతమబుద్ధుడు భావించి వుండవచ్చు. యిది మనిషిని మంచికి మలచే ఒక మంచిప్రలోభ. ఒక మంచి వూహ. అంతే.

కర్మవాదం :

కర్మ అన్న పదంలోనే పని అన్న అర్థం వుంది. గౌతమబుద్ధుడు, మంచి పనులు చేస్తే మంచి ఫలితం వుంటుంది- చెడ్డపనులు చేస్తే చెడ్డఫలితం వుంటుంది అని అన్నాడు. అది యీ భూమి మీద జరిగేదే. అంతేకాని ఆయన కర్మని దేవుడెవరో రాసిన రాతగానో, విధి గీసిన గీతగానో, అనుభవించక తప్పదనో అని యెక్కడా చెప్పలేదు.

బుద్ధుడు చెప్పిన కర్మవాదం భౌతికమైనది. యెంత మంచి చేస్తే అంత తృప్తి. యెంత చెడ్డ చేస్తే అంత దుఃఖం. యిదంతా మనకు ప్రత్యక్షంగా వుండేదే. బుద్ధుడు చెప్పిన యీ కర్మ అనే మాట యిలా మంచికోసం మంచిగా మాత్రమే వుపయోగపడుతుంది. వర్తమానంలో దీనికి భిన్నంగా వున్న అర్థం బౌద్ధానికి సంబంధించింది కాదు.

దేవుడు, ఆత్మ :

స్వర్గ నరకాలను, పూర్వజన్మ-పునర్జన్మలను ప్రస్తావించిన గౌతమబుద్ధుడు, దేవుడు, ఆత్మ యీ రెండు విషయాలూ వచ్చినప్పుడు పూర్తిగా నిరాకరించాడు. యీ ఆత్మ, దేవుడు అనే భావాలు మంచి చేయాలన్న వుత్సాహం పుట్టించవనీ, యిది చేయదగినపని అనీ, యిది చేయకూడని పని అనీ తెలుసుకోవడానికి సాయపడవనీ, యీ భావాల వల్ల శాంతి ప్రజ్ఞ, సంబోధం, నిర్వాణం యివేమీ సిద్ధించవనీ నిర్ద్వంద్వంగా చెప్పాడు.

పైన స్వర్గ నరకాలు, పూర్వ-పునర్జన్మలను ఆయన ప్రస్తావించడం వెనుక యెంతో కొంత ప్రపంచానికి మేలు చూసే విధానం వుందనీ, కనుకే ఆయన ఆ భావాలను సమ్మతించాడనీ, దేవుడు,

విధిరాత, ఆత్మ భావాల వల్ల యెటువంటి ప్రయోజనమూ మానవాళికి లేనందువల్లే వాటిని ఆయన నిర్ద్వంద్వంగా తృణీకరించాడని అనుకోవచ్చు. అది వ్యావహారికమైనా, ఋజువుకాని భావమైనా, ప్రపంచ క్షేమానికి పనికి వచ్చేదైతే వుపయోగించుకోవచ్చు నన్న భావన కనిపిస్తుంది. యెలా యెటు చూసినా ఆయన కోరుకున్నది దుఃఖ విముక్తులనే. విశ్వమానవాళి క్షేమమే. అదీ- గౌతమబుద్ధుడు జీవితం. మహోన్నతం సర్వామోదయోగ్యం.

## 5. బౌద్ధం-అతిశయోక్తులు-మూఢవిశ్వాసాలు

లోకానికి వాస్తవతత్వాన్ని, హేతువాదాన్ని, కార్యాకారణసంబంధాన్ని నిరూపించే ప్రతీత్య సముత్పాదాన్ని కనుగొన్న బుద్ధుని గురించి రాసిన గ్రంథాలలో చాలా అతిశయోక్తులు-మూఢవిశ్వాసాలు వుండడం ఆశ్చర్యం కల్గిస్తుంది.

అయితే యెవరు యెంత ప్రయత్నించినా, పొగడినా, తెగడినా, ఆయన ఆర్యసత్యాలలో, అష్టాంగమార్గాలలో, ప్రతీత్యసముత్పాదంలో యెటువంటి మూఢవిశ్వాసాలనుగాని, తప్పుడు తోవలు పట్టించే మాటలు గాని కూర్చలేకపోయారు. చెప్పాలంటే అవి లెక్కల్లాంటివి. స్వయం ప్రకాశమైన రత్నాలు. అర్థం చేసుకుని పాటించగలుగుతే మానవాళి సుఖసౌఖ్యాలలో జీవించడానికి అవి చాలు.

బుద్ధుడుచనిపోయింది క్రీస్తు పూర్వం 483 బి.సి.లో. అప్పటికి చిత్రలేఖనమూ, కొన్ని గుర్తులూ తప్పితే లిపి అన్నది లేదు. అయితే ఆయన బోధనల్ని యెప్పటికప్పుడు బీజాక్షరాల్లా పొల్లుపోకుండా శిష్యులు కంఠస్థం చేసి, వివిధ ప్రాంతాలలోని అగ్ర భిక్షువులకు చేరవేసేవారు. వారు వాటిని శిష్యులకు బోధించేవారు. యిదంతా యెప్పటికప్పుడు జరుగుతూనే వుండేది. యీ మాట బుద్ధుడు చెప్పినదేనా? అని అనుమానం వచ్చిన సందర్భాల్లో శిష్యులు బుద్ధుడినే నేరుగా అడిగి, అనుమాననివృత్తి చేసుకున్న సంఘటనలు కూడా వుండేవి.

ఆ విధంగా ఆయన బోధనలు- పిటకాలు అవి మనకి వున్నవి వున్నట్టు లభ్యమయ్యాయి. యిక కట్టుకథలూ, మూఢవిశ్వాసాలూ, అతిశయోక్తులూ యెక్కడన్నుంచి పుట్టించాయి?

అవన్నీ బుద్ధుణ్ని దైవసమానుడిగా, అతిలోకమానవుడిగా నిరూపించడానికి తరవంతరం కూర్చిన కథలు.

బౌద్ధమతం చైనా, బ్రహ్మలో, వివిధ దేశాలలో సైతం వ్యాప్తి- ఆయా దేశాల సంప్రదాయాలకు, వాతావరణానికీ సంస్కృతికీ అనుగుణంగా ప్రత్యేకశాఖలుగా అభివృద్ధి చెందింది. హీనయాన, మహాయాన, మహాసాంఘిక, సర్వాస్తి, లోకోత్తరీయ, సమ్మతీయ, స్థావిరిక, జేత, వ్యవహారిక, చైత్య మొదలైన శాఖలన్నీ ఆవిర్భవించినప్పటికీ పిటకాలలో రాయబడిన బుద్ధుని బోధనలు అన్నీ యథార్థమైనవన్న లేదా ప్రామాణికమైనవన్న భావన అన్ని శాఖల వారికీ వుంది.

చరిత్రకారులు, పురావస్తు పరిశోధకులు లుంబినీలో బుద్ధుడు పుట్టివుండడం, అత్యంత ప్రాచీనకాలంలోనే అనూచానంగా మౌఖికంగా వేదాలవలెనే మనుష్యవాక్కులో హృదయాలలో యథాతథంగా ప్రవహించి, అదేవిధంగా గ్రంథస్థం చేయబడిన పాళీగ్రంథాలలో వుదహరించిన ప్రదేశాలు, పర్వతాలు, నదులు, గుహలు, మిట్టలు, ఆతరువాత చైత్యాలు అన్నీ తవ్వకాలలో బయటపడి, ఆధునిక పరీక్షలద్వారా నిర్ధారించబడడం- యివేవీ కూడా అనుమానమే ధ్యేయంగా పెట్టుకున్న వారిని సంతృప్తి పెట్టలేవు.

కేవలం కొన్ని మూఢవిశ్వాసాలు, కట్టుకథలు చూసి బౌద్ధాన్నే నిరాకరించడమంటే, ధూళి పట్టిందని బంగారు కలశాన్ని విసిరివెయ్యడమే. కాకి వాలిందని ధాన్యంపురిని పాడుపెట్టడమే. పాములు తిరుగుతున్నాయని పండిన పంటని కోసుకోవడం మానివెయ్యడమే కాగలదు.

అయితే యింతటి మానవతా కాంతులతో నిండిన మహనీయ గౌతమబుద్ధుని జీవితకథని, యెటువంటి నిక్షేపకాంశాలూ లేకుండా ఆయన ప్రవచించిన తత్వప్రాతిపదికగానే తిరిగి సత్ప్రమాణంగా నిర్మించగలమా? ప్రాతిపదిక అంటే యే ప్రాతిపదికతో వుండాలి? ఆర్యసత్యాల అష్టాంగమార్గాల ప్రాతిపదికగా వుండాలా? అనిత్యం, అనాత్మం, దుఃఖం, నిర్వాణం అనే నాలుగు ముద్రల ప్రాతిపదికగా వుండాలా?

ఆయన బోధించిన యే తాత్విక విభాగాన్ని ప్రాతిపదికలో నిర్మించినా అలా ఆయన జీవితాన్ని తిరిగి నిర్మించగలిగితే ప్రపంచానికదొక చక్కని కానుక అవగలదు. రాగలకాలం ఆ లోటు తప్పక తీరుస్తుంది.

## 6. బుద్ధుడు-అహింస

బుద్ధుడు మొదటినుంచీ ప్రకృతి-మూగజీవాలపై యెంతో ప్రేమ చూపాడు. ప్రతిజీవికీ స్వేచ్ఛగా, బతికి వున్నంతకాలమూ బతికి వుండే హక్కు వుందన్నాడు. ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ యెటువంటి ప్రాణివధలోనూ పాల్గొనకూడదన్నది బౌద్ధ భిక్షువులకు మొట్టమొదటి విధిగా వుండాలని చెప్పాడు.

మాంసాహారం తప్ప యెటువంటి ఆహారమూ దొరకని ప్రత్యేకమైన స్థితులలోనూ, గృహస్థులు మాంసాహారాన్నే భిక్షగా వేసినప్పుడూ యేం చేయాలి అన్నదానికి, సహజమైన పరిస్థితులలో చచ్చిపోయిన జంతువు మాంసం తినవచ్చునని, 'గృహస్థులు బౌద్ధభిక్షువులకోసం అని ప్రత్యేకంగా జీవుల్ని చంపి చేసిన పదార్థం కాకుండా, తాము యింటిలో అప్పటికి మామూలుగా వండుకున్న మాంసాహారం భిక్ష పెట్టినట్లయితే తినవచ్చు' అని చెప్పాడు.

యీ ప్రత్యేక పరిస్థితులు వదిలి, మిగతా అంతా ఆయన శాకాహారమే ప్రబోధించాడు. అటవికులవద్దకు వెళ్ళి వారి చేత వేటాడటం మాన్పించాడు. జీవుల పట్ల అవ్యాజమైన ప్రేమ చూపించమని కోరాడు. ఆయనిలా చెప్పాడు. 'యెవరైనా సరే మూగజీవాల యెడ కరుణతో వ్యవహరిస్తే వారికి పదకొండురకాల సౌఖ్యాలు కలుగుతాయి. అవి 1. సుఖంగా నిద్రపోతారు. 2. సంతోషంగా నిద్రలేస్తారు. 3. వారికి చెడ్డ కలలు, బాధకల్గించే కలలు రావు. 4. వారు మూగజీవాలకు ప్రియమైన వారవుతారు. 5. దేవతలు వారిని దీవిస్తారు, రక్షిస్తారు. 6. నిప్పు, విషం, కత్తులు, యుద్ధచక్రాలు వారి దరి చేరవు. 7. దేనిమీదనైనా వేగంగా దృష్టి కేంద్రీకరించగలుగుతారు. 8. వారి ముఖం ప్రసన్నంగా, కాంతివంతంగా తయారవుతుంది. 9. చనిపోయేటప్పుడు ఆందోళనకు గురికాకుండా చనిపోతారు. 10. వారు ఘనమైన స్థితిని అందుకొంటారు. 11. బ్రహ్మలోకంలో తిరిగి వుద్భవిస్తారు.

దేవదత్తుడితో ఆయనిట్లా అన్నాడు, "దేవదత్తా నీవన్నట్లు ధర్మాన్ని ఆ విధంగా, కఠినంగా అమలు చేసేటట్లయితే అది సంతోషమే. కానీ యెల్లవారికీ అది శిరోధార్యం చేయవలసిన అవసరం లేదు. పిల్లలు, ముసలివాళ్ళు, సుకుమార శరీరులు అంత కఠినంగా ధర్మాన్ని ఆచరించలేరు. ధర్మం

అవలంబించేవారు తమతమ దేశాల్లో ఏ ఆహారం తింటూ వుంటారో అటువంటి ఆహారమే తినవచ్చు. అయితే వారు మితంగా మాత్రమే తినాలి. గృహస్థుడిచ్చిన బట్టలు వేసుకుని సిద్ధుడు కావచ్చు. గుడ్డ పేలికలు కట్టుకుని సిద్ధుడు కావచ్చు. మాంసం తిని వున్నా అతడు సాధువై వుండవచ్చు. అందరికీ వొకేవిధమైన కఠినధర్మం శాసించడం వలన నిర్వాణమార్గాన్వేషకులు చాలా కష్టపడతారు' అని చెప్పాడు. ఇది ఆయన అందించిన వుచితస్వేచ్ఛ. అయితే ఆస్వేచ్ఛను వుపయోగించుకోకుండా స్వయనిబంధన విధించుకోవడం అంటే అది మనస్సుని కరుణ అనే కల్పవృక్షంగా మార్చుకోవడమే.

ఇక అంతిమ దినాల్లో ఆయన చుండుడనే కమ్మరివాని ఇంటి దగ్గర సూకరమద్దవం అని పిలవబడే పంది మాంసంతో చేసిన కూరతిన్నాడనీ, తినలేదనీ, అది పందిమాంసం కాదనీ, పుట్టగొడుగుల కూర అనీ- ఇటువంటి చర్చలు సారవిహీనమైనవి.

మాంసాహారాన్ని ఆయన వొక 'సమస్య'గా భావించకుండా శాకాహారాన్ని మాత్రం ఆయన వొక ఆచరణీయ ఆదర్శంగా బోధించాడు.

'మాంసాహారం తీసుకోకుండా వుండడం' అనే ఆదర్శం, అందుకోలేనంత అసాధ్యమైన ఆదర్శమేమీ కాదు. మనస్సుని కరుణ, మైత్రి భావాలతో నింపుకుంటున్న కొద్దీ సమ్యక్ సమాధిలోని కాయ, వేదన, చిత్త, ధర్మధ్యానాలు చేస్తున్నకొద్దీ మాంసాహారంపట్ల లోలత్వం నశించిపోతుంది. సర్వజీవసమత, సహానుభూతి మనస్సులో నెలకొంటాయి. వారిని కరుణామూర్తులుగా, ఆదర్శవంతులుగా తీర్చిదిద్దుతాయి.

'తమలానే ఇతర జీవాలు కూడా' అన్నభావన మనస్సులో నెలకొన్నప్పుడు మాంసాహారం తినాలన్న ఆలోచనే రాదెవరికైనా. అటువంటి మైత్రీభావాన్నే ఆయన బోధించాడు. అదే ధర్మానులంబకునికీ, ప్రపంచానికీ మేలైనది, న్యాయమైనది.

## 7. బౌద్ధం-వినోదవిలాసాలు-సాహిత్య కళారంగాలు

బుద్ధుడు వినోద విలాసాల్ని, 'ప్రపంచం అగ్నిగుండంలో ప్రజ్వరిల్లుతుంటే యీ విందులూ, విలాసాలూ, వినోదాలూ యేమిటి?' అంటూ తీవ్రంగా ఆక్షేపించి మనుష్యులు సుఖభోగాలను వదిలి ఇతరుల (ప్రజల, మూగజీవాల) క్షేమం కొరకు నిర్మాణాత్మకంగా కృషి చేయాలని మరీ మరీ చెప్పాడు. అందుకోసం ప్రాణాలను త్యాగం చేయవలసి వచ్చినా వెనుకాడకపోవడమే సిసలైన మానవ ధర్మమని చెప్పాడు. తోటి మానవుడు కష్టాల్లో వుంటే విందులూ వినోదాలలో పాల్గొనే వాళ్ళు సాధారణంగా కాస్త కూస్తో ధనవంతులై వుంటారు. వాటిలో పడి కాలాన్ని వృధాపుచ్చుతూ, ధనానికీ, ఆరోగ్యానికీ, భద్రతకీ హాని తెచ్చుకునే కంటే తమ కాలాన్ని, ధనాన్ని, శక్తి యుక్తులనూ పదిమంది క్షేమం కోసం వినియోగించవచ్చు కదా! అలా చేసినప్పుడే మానవ జన్మను చరితార్థకం చేసుకోగలుగుతారు. తోటివాడు బాధలుపడుతూవుంటే వాడికి సాయమందించకుండా, వినోదాలలో పాల్గొనడమంటే అది యెంతహీనత్వం?

దీని అర్థం అతడు ప్రజలకు మంచినందించే కళారంగాలను విస్మరించాడని యెంతమాత్రమూ కాదు. తన ప్రయాణాలలో, అడవులలో, అడవి ప్రక్కన గ్రామాలలో అతడు పర్యటించినప్పుడల్లా అతడిని యెక్కువ ఆకర్షించింది పశువుల కాపరులు. వారినెంతో ప్రేమగా పరిశీలిస్తూ వుండేవాడు. వారి అలవాట్లు, పశువుల్ని కాపుకాసే తీరు, వారి ఆటపాటలు

వారిలోల్లాయివాదాలు. ఎన్నో పరిశీలించాడు. తన బోధనలలో వారిని చాలాసార్లు రమణీయంగా పేర్కొన్నాడు. అటువంటివారు పాడే గానవదగీతాలను అతడెక్కడా తృణీకరించలేదు. స్వయంగా తానే ఒక వేశ్యపాడిన పాటవిని అప్రతిభుడై, ఎన్నో ఆలోచనలు చేసుకున్నాడు. అది తన జీవిత గమ్యానికి, తాను బోధించవలసిన ధర్మానికీ సూక్ష్మంగా సరిపోయేపాట అని చెప్పాడు.

ప్రజలను పామరిపోతులుగా, విషయలోలురిగా, సుఖభోగాల పట్ల దాసులుగా చేస్తున్న ఆనాటి కళారంగాలను బుద్ధుడు తీవ్రంగా అసహ్యించుకున్నాడు. మంచినీ చెడునీ ప్రతిరంగంలోనూ గుర్తించి చెడ్డని తృణీకరించాడు. కళల్లో ప్రజల ఆనందోత్సాహాలు, ప్రేమాభిమానాలు, ధర్మ పరిరక్షణకై వారి త్యాగాలు చూపడం జరిగితే అతడెంతో సంతోషించి వుండేవాడు. అంతేగానీ అటువంటి వాటిని కూడా వ్యతిరేకించేవాడని అనుకోవడానికి ఆస్కారం లేదు. ఒకవేళ అతను సమస్త కళారంగాలపై విధినిషేధాలను విధించి వుంటే, తదనంతరకాలంలో బౌద్ధమతం వల్లనే అతి వైభవాన్ని పొందిన చిత్రలేఖనం, శిల్పం, గానం, సాహిత్యం మొదలైన కళలు బౌద్ధయుగంలో అసలు ఆవిర్భవించే వుండేవే కావు. బుద్ధునికాలంలోనే, బుద్ధుని సన్నిధిలోనే ఆయన నైతిక బోధలు, కథలు, గాథలుగా వ్యాఖ్యీకరించినట్లుగా, నాటకీకరించినట్లుగా వూహించే ఆధారాలు వున్నాయి. మన ఆంధ్రుడే ఆయనను అనేకమార్లు అర్థించి చివరికి అతి పలుచని తెరవెనుకనుంచి బుద్ధ భగవానుడి చిత్రాన్ని చిత్రీకరించినట్లుగా కూడా తెలుస్తున్నది. బౌద్ధంపై పరిశోధనలు అభివృద్ధి అవుతున్నకొద్దీ యివన్నీ రూఢీ పడతాయి. యిది తప్పక జరుగుతుంది.

బుద్ధుడు వ్యతిరేకించిన అర్థంలో మనచుట్టూ విషపుసాలెగూళ్ళలా చుట్టుకుపోతున్న యిప్పటి సంస్కృతి సాహిత్య, సినిమా రంగాలను ప్రక్షాళన చేయవలసిన అవసరం బుద్ధపథగామి చేయవలసిన తప్పనిసరి కార్యక్రమం అని చెప్పవచ్చు. యిటువంటి మంచిపనులు యెవరుచేస్తున్నా దానికి తోడ్పడటం అతడు తన బాధ్యతగా గుర్తించాలి.

## 8. బౌద్ధం-శాంతి-కరుణ

'బౌద్ధం చెప్పిన శాంతి-కరుణా సిద్ధాంతాలు చివరికి మనుమల్ని దాసీనులుగా చేసివేస్తాయి' అంటూ వుంటారు.

గౌతమబుద్ధుడు యిటువంటి పరిస్థితులలోనూ, చివరకు ప్రాణాపాయ పరిస్థితులలో సైతం యెవరినీ తిట్టవద్దు, కొట్టవద్దు, చంపవద్దు అని చెప్పాడే గానీ, అటువంటి పరిస్థితి రాకుండా చూసుకోవద్దనీ, అటువంటి పరిస్థితివస్తే తప్పించుకోవద్దు అనిగానీ యెక్కడా చెప్పలేదు. అందువల్లనే బౌద్ధధర్మం విలసిల్లిన దేశాలలో ఆత్మరక్షణా విద్యలు అభివృద్ధి చెందాయి.

రాజ్యరక్షణకు సైన్యవ్యవస్థ వుండకూడదని గౌతమబుద్ధుడెక్కడా చెప్పలేదు. కొందరు సైనికులు యుద్ధం చెయ్యకుండా భిక్షుసంఘాలలో కలిసిపోయినప్పుడు ప్రసేనజిత్తుడు యీ అంశాన్ని లేవనెత్తుతాడు. దానితో సైనికులుగా వుండగావారికి బౌద్ధ ధర్మదీక్ష యివ్వకూడదని గౌతమబుద్ధుడు ప్రకటించాడు. దేశరక్షణ గురించిన జాగ్రత్తయెక్కడ వుండిందలో? తత్వాన్ని పాటించడంలోని లోపాలను తత్వానికి ఆపాదించడం సరైందికాదు.

తప్పులని కూడా ప్రేమగా చూడాలి అన్నప్పుడు, నేరస్థులకి శిక్షలు వెయ్యడమూ తప్పేకదా అన్న ప్రశ్నకి ఆయన ఒకసందర్భంలో, 'శిక్షార్హునికి శిక్షపడాలి. యెవరిచెడువల్ల వారు శిక్షింపబడుతారు.

అందుకు కారణం వారి దుశ్చర్యలే కానీ న్యాయమూర్తి కాదు. శిక్ష విధించేటప్పుడు న్యాయమూర్తి హృదయంలో ద్వేషభావం వుండకూడదు' అని చెప్పాడు. సమస్య యిద్దరి వ్యక్తుల మధ్యనే అయినప్పుడు, వైర్య మరింక వ్యాప్తం కాదనుకున్నప్పుడు, క్షమామార్గం, ధర్మమార్గం కన్నా వుత్తమ మార్గం లేదు. అందుకనే ఆయన 'యిద్దరు శత్రువులకైన సంఘటన తనకెంతో సంతోషం కల్గిస్తుందని' యిన్నిసార్లు చెప్పాడు.

బుద్ధుడు జ్ఞాన సముపార్జన తరువాత తిరిగి కపిలవస్తునగరాన్ని చేరిన వెంటనే శాక్యుల్నీ, కోలీయుల్నీ వారికి అంగీకారమైన ప్రదేశాలలో సమావేశం యేర్పాటు చేశాడు. యిన్నో సలహాలు, చర్చలు, సంప్రదింపులు తరువాత వారిరువురిమధ్యా మిత్రపూరిత సంబంధాల్ని చేయించి యిరుదేశాల వాళ్ళనీ మంచి మిత్రులుగా చేసివేశాడు. 'శత్రువు లేకపోవడం తనకెంతో సంతోషం కల్గిస్తుందని' సంఘీభావం అన్నది రెండు దేశాల మధ్య తప్పనిసరిగా వుండవలసిన ధర్మం' అని చెప్పాడు. అటువంటి సంఘీభావమే దేశాల మధ్య యుద్ధాలు రాకుండా చేస్తుందని వుద్బోధించాడు. యీ విధంగా యెటువంటి యుద్ధపూరిత వాతావరణంలో అయినా బౌద్ధధర్మావలంబికులు శాంతికోసం అవిరళంగా కృషి చేయాలి. యుద్ధాలను, శత్రుత్వాలను రూపుమాపాలి. శత్రుత్వాల వల్ల సమస్యలు మరింత జటిలం అవ్వడమే కాకుండా, మామూలు సందర్భాలలో సులువుగా పరిష్కరించుకోగలిగిన సమస్యలు కూడా పరిష్కారం కాక, మరికొన్ని పెరిగి, ప్రత్యక్ష నరకాన్నే సృష్టిస్తాయి.

తిస్సుడనే బౌద్ధభిక్షువు కుష్ఠువ్యాధితో బాధపడుతుండే, అతని దరిచేరడానికి కూడా అసహ్యపడిన కొంతమంది శిష్యులతో ఆయన 'నా మార్గం శాంతికరమైంది. ద్వేషం వల్ల ద్వేషం పోదు. ప్రేమవల్లనే పోతుంది. కరుణప్రేమలతో యెంతటి యేహ్యభావాన్ని అయినా అధిగమించవచ్చు. యిదే నా విశ్వకరుణా సిద్ధాంతం. యెవరైతే నన్ను ప్రేమిస్తున్నామనుకుంటున్నారో, వారు అందరినీ ప్రేమించాలి. విశ్వజీవరాశినంతటినీ ప్రేమించాలి. స్వార్థాన్ని జయించండి. విశ్వవిజేతలవుతారు. యీ ప్రపంచంలో ప్రతీవొక్కరూ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను కోరుకుంటారు. వాటికోసం చేతనైనంత సాయం చెయ్యాలేగానీ యెవరికీ అడ్డురాకూడదు', అంటూ తిస్సుడికి యెంతో ప్రేమగా సేవ చేశాడు. వేడినీళ్ళతో స్వయంగా అతడి పుండ్లను కడిగేవాడు. శరీరాన్ని శుభ్రంగాతుడిచి పట్టీలు కప్పేవాడు.

యీ సంఘటన బుద్ధుని శిష్యులలో యెంతో పశ్చాత్తాపాన్ని కల్గించింది. సేవ చేయడంలోని పరమార్థాన్ని వారు గ్రహించి, యే వ్యక్తికైనా అసహ్యపడడం దారుణమైందనీ, అమానుషమైనదనీ తెలుసుకున్నారు. సేవ అనేది తమ ధర్మంగా చేసుకున్నారు.

శాంతితో, కరుణతో గౌతమబుద్ధుడెన్నో విజయాలు సాధించిచూపించాడు. ఆయన కరుణ వలన, కాలనాగులు సైతం ఆయన ప్రక్క నుంచి మామూలుగా వెళ్ళిపోయేవి. భయోత్పాతం సృష్టించే యేనుగులు ఆయన ముందు మోకరిల్లేవి. యివేమీ ఆశ్చర్యకరమైనవి కావనీ, తనలో వున్న కరుణ వల్లనే మహా అరణ్యాలలో సైతం తాను విశ్రాంతిగా ఆరేళ్ళు సంచరించగలిగాననీ చెప్పాడాయన. కరుణతోవుంటే శత్రుజాతులైన జంతువులుకూడా కలిసిమెలిసి జీవించడం, తోడ్పడుతూవుండటం మనము చూస్తూనేవున్నదే.

ఆయన మార్గం శత్రువులని యేకం చేస్తుంది. వారిలో ప్రేమాభిమానాలను పాదుకొల్పుతుంది. స్వార్థత్యాగాన్ని అలవరచుతుంది. మనుష్యులను సాంత్వన పరుస్తుంది. మనుష్యులను వొక్కటిగా

చేస్తుంది. స్వార్థ త్యాగం ద్వారా ధనవంతుడ్ని, ధర్మబద్ధమైన జీవితం ద్వారా కృపణుడ్ని వాక్సాతి మీద నిలుపుతుంది. సంయమనం, ఇతరుల పట్ల కరుణ, గౌరవం వుంటే శత్రుత్వానికి అవకాశమే వుండదు. అన్ని సందర్భాలలోనూ ఇది రుజువవుతున్న సత్యమే.

## 9. బౌద్ధం-బ్రాహ్మణులు

మేధావులుగా బ్రాహ్మణులను గౌతమబుద్ధుడు ఎంతో గౌరవించాడు. ఆయన ముఖ్య శిష్యులలో బ్రాహ్మణులు ఎక్కువమందే వున్నారు.

అయితే ఆయన బ్రాహ్మణులు బ్రహ్మముఖం నుండి పుట్టారని, ఇతరులు హీనమైన వారని చెప్పే బ్రాహ్మణవాదతత్వాన్ని, కులతత్వాన్ని ఆయన వ్యతిరేకించాడు. మనుషులందరూ సమానమే అని, గుణాలబట్టే మనిషి గుర్తింపబడతాడని ఆయన చెప్పాడు.

సాటి మానవులను విద్యకు అనర్హుల్ని చేయడాన్ని ఆయన అంగీకరించలేదు. సాటివారిని తక్కువగా చూడటం, వారి కష్టార్జితాన్ని దొంగిలించడం, వారిని కష్టాలపాలు చేయడం-వీటిని ఆయన తీవ్రంగా వ్యతిరేకించాడు. దాంతో ఇటువంటిపనులు చేస్తున్నవారికి బౌద్ధంపై ఎంతో కోపం, దుఃఖం వచ్చాయి. వారిలో బ్రాహ్మణులు కూడా వుండడం సంభవించింది.

బౌద్ధానికి సంబంధించి ఆయన ఎక్కడా కులాన్ని ఉదహరించలేదు. నదులన్నీ సాగరంలో కలిసిపోయాక, తమ నదులపేర్లు పోగొట్టుకుని సాగరంగా మాత్రమే ఎలా పిలవబడతాయో, బౌద్ధంలోకి వచ్చిన తరువాత అందరూ బౌద్ధులే-వారు స్వేచ్ఛగా తమకు ఇష్టమైన వృత్తులు చేసుకోవచ్చునని బోధించాడు.

అయితే ఆయన బ్రాహ్మణులకు సంబంధించి, బ్రాహ్మణులలో ఆయన మహోన్నతులనే చూడాలని కోరుకున్నాడు. ఆయన దృష్టిలో బ్రాహ్మణుడంటే గొప్ప వ్యక్తి. వివిధ సందర్భాలలో ఆయనిలా అన్నాడు.

“ఎవనికి ఈవలి ఒడ్డుగాని, ఆవలిఒడ్డుగాని లేవో, ఎవడు స్వతంత్రుడో, ఎవడు ధ్యాననిష్ఠాగరిష్ఠుడో, ఎవడు పరిశుద్ధుడో, శాంతమనస్కుడో, ఎవడు చేయదగునదినే చేయుచుండునో, ఎవడు మోహరహితుడో, ఎవడు వుత్కృష్టమైన గమ్యాన్ని చేరునో, ఎవడు క్రోధ రహితుడో, వ్రతనిష్ఠుడో, శీలవంతుడో, కామరహితుడో, స్వయం శిక్షకుడో, ఎవడు అన్యము నందే దుఃఖాంతమును గ్రహించి వుంటాడో, ఎవడు తన భారమునంతటినీ దింపివేసి స్వతంత్రుడయ్యాడో, ఎవడి జ్ఞానదృష్టి గంభీరమైనదో, ఎవడు వివేకియో, ఎవడు మార్గామార్గములనెరిగెనో, ఎవడి కోర్కెలు స్వల్పమో, ఎవడు ఏ ప్రాణికి హాని కల్గించకుండా వుంటాడో, ఎవడు చంపులుగానీ, చంపుటకుగానీ కారకుడు కాకుండా వుంటాడో, ఎవడు వైరులైన వారి యందు సహనము తోడను, క్రూరుని యందు శాంతము తోడను, లోభియందు వుదారత తోడను వుంటాడో, ఎవని నుండి కామము, క్రోధము, ద్వేషము, డంబము మరియు అశ్రద్ధ-సూది మొన నుండి జారిన ఆవగింజవలె పడిపోతుందో, ఎవడు శాంతముతో వుపయుక్తమైన సత్యాన్నే పలుకుతాడో, ఎవడు తన వాక్కులతో ఇతరులకు హాని కల్గించడో, ఎవడు కొద్దిదైనను, పెద్దదైనను, శుభమైనను, అశుభమైనను తనకు ఇవ్వబడని వస్తువును స్వీకరించకుండా వుంటాడో, ఎవడు మోహరహితుడు, దుఃఖ రహితుడో మరియు పరిశుద్ధుడో, ఎవడు చంద్రుని వలె నిర్మలుడు, శుద్ధుడు, దోషరహితుడు మరియు ఎవనికి క్షణ భంగురాలైన భోగములపైన ఇచ్ఛలేదో, అట్టివాడిని బ్రాహ్మణుడని నేనందును.

బ్రాహ్మణుడు యిలా వుండాలని ఆయన కోరుకున్నాడు అంతే. యిందులో ద్వేషం వుందని యెలా అనుకోగలిగారెవరైనా? పుత్రుడు బుద్ధిమంతుడవాలని తల్లిదండ్రులు కోరుకుంటారు తమ వూరి స్కూలుకి మంచి వుపాధ్యాయుడు లభించాలని వూరి పెద్దలు కోరుకుంటారు. యిట్లా కోరుకోవడంలో అన్యాయమేమీ లేదుకదా.

## 10. కోరికలు-దుఃఖం

గౌతమ బుద్ధుడు కోరికలే దుఃఖానికి కారణమన్నాడనీ, ..., భార్యాబిడ్డలు తిండీ, గుడ్డా, గూడు అన్నీ వదిలిపెట్టి సన్యాసిలా బతకమన్నాడనీ చాలామంది అనుకుంటూ వుంటారు. యిది వాస్తవం కాదు. ఆవిధంగా వుండమన్నది బౌద్ధభిక్షువులను మాత్రమే. వారు బోధకులు కావలసివున్నందునే వారు నిష్కాములుగా వుండాల్సి వుంది. మరలా సన్యాసి జీవితానికీ, బౌద్ధ భిక్షువు జీవితానికీ చాలా తేడా వుంది. సన్యాసి స్వయాత్మకుపకారి-బౌద్ధభిక్షువు పరోపకారి-ధర్మోపదేశి.

ఆయన అన్నది, 'మితిమీరిన కోరికలు' దుఃఖాన్ని కల్గిస్తాయి అని. కోరికలే దుఃఖానికి కారణమని చెప్పలేదు. "అవిద్య-అజ్ఞానాలు దుఃఖానికి కారణమనీ, వాటివలనే కోరికలు వుత్పత్తి అవుతున్నాయనీ చెప్పారు. యిది తెలుసుకోకుండా కోరికలే దుఃఖానికి కారణమన్నట్లుగా అనుకుంటూ వుంటారు. ఆయన చెప్పినట్లు అవిద్య-అజ్ఞానాలే దుఃఖానికి కారణాలు. యెందుకంటే అవి కోరికల్ని పుట్టిస్తాయి. కోరికలన్నీ దుఃఖాన్ని పుట్టిస్తాయా? అనుకుంటే యే కోరికనీ యిది సంతృప్తి కలిగించే కోరిక అనిగానీ, యిది దుఃఖాన్ని కల్గించే కోరిక అనిగానీ చెప్పలేము. చెప్పాలంటే వొకోసారి సంతృప్తి కలిగించే కోరికే అశాంతి కల్గించవచ్చు. దుఃఖాన్ని కల్గించే కోరికే సంతోషాన్ని కల్గించవచ్చు. రెండు కోరికలూ వొకదానికొకటి ముడివేసుకుని వుండవచ్చు. యేది సంతోషం కలిగిస్తుందో కూడా తెలుసుకోలేకపోవచ్చు.

దుఃఖాన్ని, పరితాపాన్ని కల్గించే కోరికల్ని తొలగించుకోమని చెప్పారు గౌతమబుద్ధుడు. పిల్లలు నదీ తీర ప్రాంతాలలో ఆడుకుంటూ యిసుక గూళ్ళు కట్టుకుంటూ వుంటారు. యెంతో శ్రద్ధగా యిళ్ళుకడతారు. అంతస్తులు కడతారు. వాటిని పువ్వులతో ఆకులతో అలంకరిస్తారు. కానీ యేమవుంది. అంతలోనే వాటిని మధ్యలోనే, యిళ్ళకువెళ్ళేముందు చెల్లాచెదురు చేసేస్తారు. ఆ యిళ్ళను చెల్లాచెదురు చేస్తున్నప్పుడు వారు బాధపడతారా? ఆవిధంగానే కోరికల్ని బాధపడకుండా ఆనందంగా వదిలించేసుకోవాలి,' అంటారు గౌతమబుద్ధుడు. అతడి గొప్ప పరిశీలనకు మచ్చుతునక యిది. యీ విధంగా అపరిమితమైన, వెంటాడే, దుఃఖాన్ని పరితాపాన్ని మిగిల్చే కోరికల్ని మనుష్యులు వదలగొట్టుకోవాలి. అప్పుడే వారు సుఖపడతారు. సుఖాన్ని పంచిపెట్టగలుగుతారు.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కోరుకునే వాళ్ళు తమని బంధించే కోరికల్ని స్వేచ్ఛగానే వదిలించుకుంటారు. యితరులు కూడా స్వేచ్ఛగా వుండాలని కోరుకుంటారు.

మంచి కోరికల వల్ల తపించిపోవడం వుండదు. అవి దుఃఖం కలిగించవు. భయం కలిగించవు, కోపం, అసహనం, నిరాశ, నిస్పృహలు, మాంద్యం, ఆక్రోశం, వుద్రేకం, ఆత్రుత, అవమానం యిలాటివి కలిగించవు. విపరీతాలు సృష్టించవు. మనిషిని బంధించవు. అతడు అహంకారపూరితుడయ్యేటట్టు చేయవు. మంచి కోరికల్ని 'తన్హా' అంటారు. చెడ్డకోరికలు పై వాటిని

కల్గిస్తాయి. అహంకారాన్ని సృష్టిస్తాయి. మనిషిని అతలాకుతలం చేస్తాయి. అతన్ని దుఃఖంలో పడవేస్తాయి.

ఏ పరిస్థితి ఎదురైతే ఆ పరిస్థితిని మొదట అంగీకరించాలని చెప్తాడు గౌతమబుద్ధుడు. ఏ కోరిక అయితే బలంగా వుంటుందో అంతబలంగానూ అది అశాంతినిస్తుందంటాడు.

కోరికల్ని నాశనం చేసుకోవాలనుకోవడం కూడా ఒక కోరికే. కోరికలు కలిగి వుండాలనుకోవడం కూడా కోరికే. కోరికల్ని తగ్గించుకోవాలనుకోవడం కూడా కోరికే. కోరికల్ని మనం 'కోరికలు' అన్న దృష్టితో కాకుండా, 'జ్ఞానానికి, పవిత్ర జీవితానికి అవి అడ్డుపడకుండా చూసుకోవాలి. కోరికల వల్ల మనంగానీ, ఇతర జీవులుగానీ, ఎవరూగానీ బాధపడకూడదు. మన కోరికల వల్ల ఎవరికీ నొప్పి కలగకూడదు. పశ్చాత్తాపపడవలసిన పనుల్ని అసలే చెయ్యకూడదు.

గౌతమబుద్ధుడు సిరిసంపదలు వృద్ధి చేసుకోవడానికి వ్యతిరేకి కాదు. వాటివల్ల వచ్చే దుఃఖానికి, అజ్ఞానానికి వ్యతిరేకి. అందువల్ల అతడు ఏ వృత్తి చేసినా అది ఇతరులెవరికీ, తనకీ కూడా హానీ, దుఃఖమూ కలగకుండా చేయాలి. ఆయనిలా అన్నాడు.

"అత్యాశ, లోభం, దుష్టబుద్ధి, సోమరితనం, సైకం, పరధ్యానం, తొందర, సందేహం- ఇవి మొదలైన అంటిన మాలిన్యాలు. ఈ మాలిన్యాలు అంటని గృహస్థు గొప్ప జ్ఞానాన్ని స్పష్టమైన దర్శనాన్ని, సమ్యక్ జ్ఞానాన్ని పొందుతాడు.

అలా సంపదను న్యాయంగా, చట్టబద్ధంగా సంపాదించడం, గొప్ప శ్రమచేసి సంపాదన చెయ్యడం, భుజబలంతో సమకూర్చడం, చెమటచిందించి సంపాదించడం ఒక వరం. అటువంటి గృహస్థు తాను సుఖపడతాడు. సంతోషపడతాడు. తనను తాను ఆనందంతో నింపుకుంటాడు. తల్లిదండ్రులను, భార్యా బిడ్డలను, సేవకులను, శ్రామికులను, స్నేహితులను, సహచరులను సుఖసంతోషాలతో నింపుతాడు".

ఆయనింకా ఇలా అన్నాడు:

"మిత్రా అష్టాంగమార్గాన్ని అనుసరించు. జీవితంలో ప్రసన్నత లభిస్తుంది. సంపద పట్ల మనసు ఆసక్తమై వుందా? అయితే సంపదను త్యాగం చేయి. ఆసక్తమై లేదా? అప్పుడు సంపదను సక్రమంగా వినియోగించు. తోటివారికి వుపయోగించు ఇలా జీవితంలో అప్రమత్తంగా వుండు. జీవితం, ధనం, అధికారం ఇవేవీ మనిషిని బంధించవు. వాటిపట్ల ఆసక్తే మనిషిని బంధిస్తుంది బాధిస్తుంది. కాంక్ష ఆసక్తే బంధం. నిష్క్రియులై ప్రపంచానికి దూరం కావడంలో ప్రయోజనం లేదు. ఇష్టం లేకుండా ప్రపంచాన్ని త్యాగం చేయమని తథాగతుడెవరికీ చెప్పడు. ఆత్మ భ్రమ నుండి తొలగు. హృదయాన్ని శుద్ధి చేసుకో. విలాసాసక్తిని విడనాడు. న్యాయంగా జీవించు. నీటిలో తామరపువ్వు ఎలా వుంటుందో తెలుసుకదా! నీరు దానిని స్పృశించినా అది నీటిని అంటిపెట్టుకోదు. అలాగే నువ్వు కూడా సంపదల మధ్య అనాసక్తుడవై జీవించడం నేర్చుకో".

ఈ విధంగా కోరికలే దుఃఖానికి కారణమని అనుకున్నదాంట్లో ఏమంతయినా యథార్థం లేదు. అవిద్య, అజ్ఞానాల వల్ల ఏర్పడిన మితిమీరిన కోరికలే దుఃఖానికి కారణం. అందువల్ల మనిషి మొదట జ్ఞానవంతుడవాలి. అందుకు అడ్డు వచ్చే కోరికల్ని నిగ్రహం చేసుకుంటే, జ్ఞానం లభించిన తరువాత, మితిమీరిన కోరికలన్నీ తొలగించుకుని సుఖజీవనం చేయగలుగుతాడు.

# 11. భారతదేశంలో బౌద్ధం అంతరించిందా?

చాలామంది పరిశోధకులు, విమర్శకులు, సాహితీ వేత్తలు బౌద్ధం గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు బౌద్ధం ఈ దేశం నుండి నిష్క్రమించింది-అంతరించింది-వెళ్ళగొట్టబడింది- అని అంటూ వుండడం జరుగుతోంది. ఇందులో వాస్తవం లేదు.

బౌద్ధం ఈ దేశం నుండి నిష్క్రమించలేదు. ఎన్ని కష్టాలు ఎదురైనా బౌద్ధం ఇంకా ఈ దేశంలో వుంది. కొనసాగుతోంది. దాదాపు 11 వందల సంవత్సరాల పాటు ఈ దేశంలో అవిచ్ఛిన్నంగాసాగిన బౌద్ధం-కాలక్రమేణా బలహీనమై పోవడానికి ఆయా ప్రాంత కాల చారిత్రక, మత, రాజకీయ పరిస్థితులెన్నో వున్నాయి. అవి వెలికి తీసి నిందించుకొని స్పర్థలు రేకెత్తుకోవడం కంటే బౌద్ధం చెప్పినట్టు వినయ శీలాలతో, మంచిగా, సహనంగా అభివృద్ధి చెందడమే న్యాయంగా వుంటుంది. అది ధృఢంగా కూడా వుంటుంది. భారతదేశంలో సుమారు అయిదుకోట్లమంది బౌద్ధులు వున్నారు. బౌద్ధ ఆరాధన వుంది-బౌద్ధ ధర్మ పఠన వుంది- బౌద్ధ జీవన విధానం వుంది. బౌద్ధ ధర్మానికి సంబంధించిన అన్ని చారిత్రక చిహ్నాలూ దర్శించడానికియింకనుమిందు ప్రతి రాష్ట్రంలోనూ దేశ విదేశీయులకు అందుబాటులో ఉన్నాయి. బౌద్ధ ధర్మానికి సంబంధించిన అనేక గ్రంథాలు, పత్రికలు వెలువడుతున్నాయి. బౌద్ధమతంలో చేరుతున్న వారి సంఖ్య ప్రతి సంవత్సరం గుణాత్మకంగా పెరుగుతూ వస్తోంది.

పేదవాలలో, రాజకీయాలలో బౌద్ధం పట్ల ఆసక్తి పెరుగుతోంది. ఆలోచన, పరిశోధన పెరుగుతోంది. భారతదేశంలో బౌద్ధం అంతరించినదన్నమాట యథార్థం కాదని చెప్పడానికి ఇంకెన్నో ఆధారాలో వున్నాయి. కొందరు భారతదేశంలో బౌద్ధం మతంగా అంతరించినా, ధర్మంగా భారత జీవన విధానంలో లీనమైపోయిందని అంటారు. బౌద్ధం మతంగా కూడా అంతరించలేదు. అయిదుకోట్లమంది బౌద్ధులు ఈ దేశంలో నివసిస్తూ వుండడమే దానికి నిదర్శనం. బౌద్ధం ధర్మంగా భారతీయుల జీవన విధానాల్లో లీనమైపోయిందన్నమాట నిజమే. మంచి భావాలు, మంచి సమాజం కావాలన్న, నిర్మించుకోవాలన్న తపన మనకు కన్పిస్తున్నదంటే దాని వెనుక బౌద్ధంయొక్క అంతర్లీనత యెంతగానో వుందని చెప్పవచ్చు. మనుషులను యెక్కువతక్కువలుగా, వుత్తములుగా, నీచులుగా చూసే భావాలుగల సమాజంలో స్వేచ్ఛ సమానత్వం,సమతాభావాలను ఆశించలేరు. ప్రపంచతత్వాలలో, ధర్మాలలో, మతాలలో, బౌద్ధానికి మాత్రమే అటువంటి ప్రత్యేకత వుంది. ప్రపంచంలోనే తొలిసారిగా అటువంటి వున్నతభావాలను ప్రచారంచేసినమతబౌద్ధమైతే దానికివేదికమనభారతదేశమే అయ్యింది. భారతీయులముగా మనకు అది గర్వకారణం.

అటువంటి బౌద్ధం అభివృద్ధి చెందడానికి తగిన పరిస్థితులెన్నో మన భారతదేశంలో అన్ని ప్రాంతాలలోను వున్నాయి. కొరవడింది ప్రచారం మాత్రమే.

చిమ్మ చీకటిలో మిణుకు మిణుకుమనే చిన్న దీపం భారత దేశంలో బౌద్ధం. దీనికి చమురు పోసి మరిన్ని దీపాలు వెలిగించడమే బౌద్ధులు చేయవలసి వుంది. బౌద్ధం నుడివిన ధర్మాలు ఎక్కడ ఎవరిలో కనిపించినా వారెవరెవ్వరైనా వారిని అభినందించాలి-ప్రోత్సహించాలి. మంచికోసం ఎవరు కృషిచేసినా అదెంత చిన్నదైనా మనందానికి తోడ్పడాలి.

బౌద్ధం అంతరించలేదు. అంతరించదు. మంచిగా జీవించడం ద్వారా వ్యక్తిలోనూ, మంచి పనులు చేయడం ద్వారా సమాజంలోనూ దాని స్థానం దాని కెల్లప్పుడూ వుంటుంది.

# 12. బౌద్ధం నేటి సామాజిక అవసరం

'గతించిపోయిన బౌద్ధాన్ని మరల తీసుకురావడం అసాధ్యం' అని చెప్పేవాళ్ళు చాలా ముఖ్యమైన విషయం ఒకటి మరచిపోతున్నారు, అదేమంటే బౌద్ధం గతించలేదు. అది బతికే వుంది. కొనసాగుతూనే వుంది.

అయితే బౌద్ధం పూర్వపు స్థితిలో లేనందుకు కారణం-ఒక విధంగా మనమే. మనకు బౌద్ధం అనే వెలుగుదారి చూపించిన డా॥బాబాసాహెబ్ అంబేడ్కర్ సందేశాన్ని మనమే నిర్లక్ష్యం చేస్తున్నాం.

బౌద్ధం అభివృద్ధి అవడానికి రాజకీయ, సామాజిక, చారిత్రక పరిస్థితులన్నీ యెంతో అనుకూలంగావున్నాయి. భారత సామాజిక వ్యవస్థలో మనమంతా ఒక్కటి అన్న భావాన్ని కల్గించేది యేదైనా మతభావజాలమే. భారతీయులు తమదంటూవున్న ఒక మతాన్ని, ధర్మాన్ని నమ్మినంత వేగంగా యెంతో చదువుకుంటే తప్ప యితర రాజకీయ సిద్ధాంతాలను నమ్మలేరు. తాము నిర్మించదలుచుకుంది సమతారాజ్యమే అయినప్పుడు మనకంటూ మనకు మహానుభావులు తత్వశాస్త్రాలు వుండగా వాటిని త్యజిస్తూ విదేశీ సిద్ధాంతాలు యెంత గొప్పవైనా వాటిని వీటిని కనీసం అనుసంధానించడమైనా చేయకుండా పూర్తిగా దేశీయాన్ని నిర్లక్ష్యంచేసే, వివక్షతచూపే పరిస్థితి వుంటున్నదంటే అది వారు నిర్మించదలుచుకున్న సమసమాజంపట్ల వారికే న్యాయమైన కేంద్రీకరణ లేదన్న అర్థమే వస్తుంది. ఆత్మ విమర్శ చేసుకుంటే తప్ప యీ వాస్తవాన్ని అర్థంచేసుకోవడం కష్టం. బౌద్ధంతో కూడిన దళిత బహుజన రాజకీయ వుద్యమాలు అభివృద్ధి అయ్యేకొద్దీ యీ మంచి మార్పుకూడా తప్పక సంభవిస్తుంది. అందువల్ల యీ ప్రగతి మతాన్ని ప్రగతి కోరుకునే వారందరూ అభివృద్ధి చేయల్సి వుంది. కులం అనే అడ్డుగోడల్ని నాశనంచేసే ధర్మం వ్యక్తిస్వేచ్ఛను బలపర్చే ధర్మం సామాజిక బాధ్యతను నిర్వర్తించే ధర్మం అదొక్కటే. అందుకే బౌద్ధమతం నేటి సామాజిక అవసరం అయ్యింది. అందుకే అభివృద్ధి చెందుతూంది. దళిత బహుజన రాజకీయాలకు బౌద్ధమతం గొప్ప నైతిక బలాన్ని అందిస్తుంది.

ఒక వ్యక్తి బౌద్ధుడయితే అతడు మనుషులతో సహా అన్ని జీవులపట్ల సమతాభావంతో వుంటాడు. యెవరినీ యే జీవినీ హింసించడు. బాధపెట్టడు, దొంగతనం చేయడు, న్యాయసంపాదన మాత్రమే చేస్తాడు. వ్యభిచరించడు, స్త్రీలను గౌరవిస్తాడు, మంచిమాటలే మాట్లాడతాడు, అబద్ధాలు పరుషవాక్యాలు మాట్లాడడు. మాటలతో యెవరినీ బాధపెట్టడు, దురలవాట్లకు దూరంగా వుంటాడు, అన్నిరకాల కాయదుశ్చరితాలకు, మనో దుశ్చరితాలకు దూరంగా వుంటానని ఒట్టుపెట్టుకుంటాడు. యిటువంటి సమతా సమాజాన్ని కోరుకుంటాడు. యిందుకోసం కృషిచేస్తాడు. మనుష్యులను సమైక్యపరుస్తాడు.

ఒక కుటుంబం బౌద్ధులయితే వారు సమసమాజ నిర్మాణాన్ని కోరుకుంటారు. స్త్రీ పురుష సమానత్వాన్ని కోరుకుంటారు. అందుకు కృషి చేస్తారు. సమైక్యతకు కృషి చేస్తారు.

ఒక గ్రామం బౌద్ధులయితే వారు సమసమాజాన్ని కోరుకుంటారు స్త్రీ పురుష సమానత్వాన్ని కోరుకుంటారు. అందుకు కృషి చేస్తారు. సమైక్యమవుతారు.

సమసమాజ నిర్మాణం యీ యుగ ధర్మం. ఆ ధర్మాన్ని సామాజికంగా నిర్వర్తించగలిగింది బౌద్ధ ధర్మమొక్కటే.

సమసమాజంలో వివక్షతలుండవు. అందరూ సమానమే. అందరికీ అన్ని అవకాశాలు వుంటాయి. ద్వేషాలూ శతృత్వాలూ వుండవు. సరిగ్గా బౌద్ధ ధర్మం కోరుకునేది కూడా యిదే. కనుకనే అది నేటి సామాజిక అవసరం ప్రతి ఒక్కరికీ ప్రేమతో చేరువయే ఆనందవనం.

# మహాత్యాగి గౌతమబుద్ధుని మహాపరినిర్వాణం
# ఆగిపోని అనంతప్రవాహం

జేతవనంలో గంధ కుటీరం.

గత నాలుగు రోజులుగా అత్యంత ప్రశాంతంగా ఉంది.

బుద్ధ భగవానులు, రోజువారీ కార్యక్రమాలు, భిక్షకు వెళ్ళడం, బోధనలు ఇవ్వడం మొదలైన కార్యక్రమాల తరువాత ఎక్కువగా ధ్యానంలోనే వుంటున్నారు. శారిపుత్రులవారు వచ్చి వెళ్ళినప్పటి నుండి జేతవనం అంతా ఏదో తెలియని నిశ్శబ్దవాతావరణం అలుముకుంది.

శారిపుత్రులవారు గౌతమబుద్ధుని ప్రియమైనశిష్యులు. మరొక ప్రియమైన శిష్యుడు మౌద్గల్యాయనులు. వీరిద్దరినీ ఆయన ధర్మసేనాపతులుగా నియమించారు. తన తరువాత తనంతటివారని ఆయనకు వారంటే ఎంతో అభిమానం. అలాంటిది శారిపుత్రులవారు నాలుగు రోజులక్రితం శిష్యసమేతంగా, 'తనకు అంత్యక్షణాలని, మగధలోని తన స్వంతయింట్లో చనిపోవాలని కోరుకుంటున్నాననీ, తుది దర్శనం కోసం వచ్చాననీ, తెలియక ఏమైనా తప్పులు చేసి వుంటే క్షమించమనీ' చెప్పడానికి వచ్చారు.

గౌతమబుద్ధుడు ఎన్నో వియోగాలను ధర్మం కోసం అవలీలగా తట్టుకున్నారు. ధర్మరక్షితుడైన, తన ప్రియాతిప్రియమైన శిష్యుడు శారిపుత్రుడే చనిపోతున్నారు. మరణాన్ని ఆపగల శక్తి ఎవరికీ లేదు కదా!

గుండెదిటవుపరుచుకుని శారిపుత్రుడ్ని ఎంతో ప్రేమతో ఆశీర్వదించారు. అతనిలో క్షమించవలసిన లోపాలేమీ లేవని చెప్పారు. ఇన్ని సంవత్సరాలుగా బౌద్ధం వికసించిన దానిలో శారిపుత్ర, మౌద్గల్యాయనుల కృషి ఇంతాఅంతా కాదు. పాతికేళ్ళక్రితం, 'తనకు సేవలు చేసే శిష్యుడొకడు కావాలి,' అన్నందుకు మొదట శారిపుత్రులవారే ముందుకు వచ్చారు. కానీ తథాగతులు ఒప్పుకోలేదు. నాఅంతటి వాడివి, నువ్వెక్కడికి వెళ్ళినా, నేను చేసేటంత పనులన్నీ నెరవేర్చగలవు- ప్రపంచానికి శారిపుత్రా నీ అవసరం ఎంతో వుంది.' అంటూ అతని అభ్యర్థనను తిరస్కరించారు. ఇపుడెంతో ఆదరంగా తన శిష్యుల్ని వెంటపంపుతూ వీడుకోలు ఇచ్చారు. 'ఆయన మన బౌద్ధ భిక్షువులందరికీ పెద్దన్న, ఆయనకు తోడుగా వెళ్ళండ'ని శిష్యులకి చెప్పిపంపించారు.

ఇన్నాళ్ళుగా ప్రజల జీవితాల్లో నైతిక విలువలు నిలిపి, వారిని సమానులుగా, ఒక్కత్రాటిమీద నిలిపేందుకు, సమాజం సుఖశాంతులతో బ్రతికేటందుకు గౌతమబుద్ధుడు, వారి శిష్యులు నిర్విరామంగా ప్రయాణాలు చేస్తూ, బోధిస్తూ ఉత్తర భారతమంతా, ఇంకా చుట్టుప్రక్కల దేశాలకు సైతం మానవజాతిలోనే మహోన్నతమైన బౌద్ధ ధర్మవ్యాప్తి గావించారు. విద్యా ప్రజ్ఞలను వెదజల్లారు. దేశదేశాల పౌరుల మనస్సులను కరుణతో నింపారు. విశ్వవ్యాపితమైత్రిని వారిలో కలుగచేశారు.

అటువంటి మహనీయ ప్రియశిష్యుడు శారిపుత్రులవారిని గౌతమబుద్ధుడే కాదు, ఆశ్రమంలోని వారందరూ ఎంతో ప్రేమగా గొప్పగా తలచుకుంటూనే వున్నారు.

రానే వచ్చింది ఆ రోజు. గంధకుటీరం కాస్త ఎత్తైన ప్రదేశంలో వుండటంతో దూరం నుంచే

బౌద్ధభిక్షువులు మౌనంగా, వరుసగా. ముందువున్న బౌద్ధభిక్షువు చేతుల్లో వొక మట్టిపాత్రతో రావడం కనిపించింది. ఆ దృశ్యం చూడగానే అక్కడ అందరికీ కళ్ళు నీళ్ళు తిరిగాయి. ఆ మట్టిపాత్ర రూపు. వచ్చినవారి నేలకుదించిన ముఖాలు చూడగానే వారికి ఆ పాత్ర శారిపుత్రుల వారి చితాభస్మపు పాత్ర అని తెలిసిపోయింది. యీ సంగతి గంధ కుటీరంలోకి వెళ్ళి గౌతమబుద్ధునికి చెప్పడానికెవరికీ ధైర్యం లేకపోయింది.

అయినా ఆ బౌద్ధ భిక్షువులు కుటీరానికి చేరే సమయానికి సర్వజ్ఞుడు గౌతమబుద్ధుడు కుటీరం వెలుపలికివచ్చి ఆ చితాభస్మపుపాత్రను చేతిలోకి తీసుకున్నారు. అంతా కడునిశ్శబ్దమై పోయింది. కొంతసేపైన తరువాత గౌతమబుద్ధుని ప్రియమైన శిష్యుడు ఆనందుడు ఆ పాత్రను ఆయన చేతుల్లోంచి తన చేతుల్లోకి తీసుకుని, దానిని కుటీరం లోపలి ఆవరణలో వున్న వున్నతమైన స్థలం మీద పుష్పపత్రాల మధ్య కదలకుండా వుంచారు.

అనంతరం జరిగిన సమావేశంలో గౌతమబుద్ధుడు శారిపుత్రుని గురించీ, ఆయన పరిచయమైన నాటినుంచీ ఆయన జీవిత విధానం గురించీ యెన్నో విషయాలు మననం చేసుకుంటూ, అతని త్యాగం గురించి చెప్తూ అచట వున్న భిక్షువుల హృదయాలలో స్ఫూర్తిని కల్గించారు. శారిపుత్రుని నుంచి నేర్చుకోవలసిన విషయాలెన్నో చెప్పారు. వివరంగా,

"భిక్షువులారా! అందరిలోనూ ఆయన మహామేధావి. తనకంటూ ఆయన యేదీ యెప్పుడూ కోరలేదు. యెంతటి శక్తిమంతుడో అంతగానూ ఆయన శ్రమించేవారు. పాపకృత్యాల్ని అసహ్యించుకునేవారు. యీ ధర్మాన్ని వ్యాప్తిచేయడంలో, త్యాగమూర్తులైన బౌద్ధభిక్షువులను తయారు చేయడంలో, ధర్మరక్షణకు అండగా వుండడంలో ఆయనకి సాటి యెవరూ లేరు. మారుమూలల పల్లెటూళ్ళనుంచి కూడా సర్వ ప్రపంచం గర్వపడే బౌద్ధభిక్షువులను ప్రపంచానికి బహూకరించారు. సోదరులారా! యివే ఆయన అస్థికలు– చూడండి. యీ భూమి యెంతటి భారాన్ని భరిస్తుందో అంతటి సహనముండేదాయనలో. యెలాంటి పరిస్థితులలోనూ ఆయన ఆగ్రహాన్ని బయటికి చూపకపోవడమే కాదు, అసలాయనలోనే వుండేది కాదు. కోరికలకెప్పుడూ వశుడుకాలేదు. వాంఛల్ని అన్నింటినీ జయించాడు. తనది అంటూ ఆయనికి ప్రపంచంలో యేమీ లేదు. ఆయనలో 'నా' అన్న స్వభావమే లేదు. యీ ప్రపంచమంతా ఆయనదే.

బౌద్ధ జీవనతత్వాన్ని నిండుగా ఆకళింపుచేసుకున్న పరిపూర్ణ జీవుడాయన. అవిద్య - అజ్ఞానాలు అనేక కర్మలకు కారణాలవుతాయనీ, అవి చైతన్యాన్ని రేకెత్తిస్తాయనీ. ఆ చైతన్యం మనస్సుపైనా ప్రపంచంపైనా తన ప్రభావం వేస్తుందనీ, ఆ ప్రభావాలు తిరిగి మనస్సుపై ఆరు రకాలైన ప్రభావాలు వేస్తాయనీ- అవి తిరిగి స్పందనలుగా, భావాలుగా, కోరికలుగా, తపనగా, బంధాలుగా తయారయి మనుష్యుని కర్మ అనే వొక వలయంలో బంధించి వేస్తాయనీ-మంచి కర్మలు- ఆ బంధాన్నుంచి మనిషిని బయటపడేటట్లు చేస్తే, చెడ్డకర్మలు మనిషిని అందులోనే మునిగిపోయేటట్లు చేస్తాయనీ నేను చెప్పిన దానిని మరింత సరళంగా బోధ పరచిన అగ్రగణ్యశిష్యులలో సారిపుత్రుడొకరు. యీ దేహం అయిదు స్కంధాల చేత నిర్మింపబడింది అని రూప. వేదన. సంజ్ఞ. సంస్కార. విజ్ఞాన అని నేను చెప్పినవి లోతుగా అర్థం చేసుకుని వాటిని మరింత సుబోధకంగా ప్రపంచానికి చెప్పిన మహనీయుడాయన.

యిదిగో– యీ రజనువులు చూడండి.. ఆ పవిత్ర దేహం యేమైంది. పంచభూతములలో

కలిసిపోగా యీ మట్టి మిగిలిం... "భవ బంధాలన్నీ తెంచుకున్న ఆయనకి మరొక జన్మ అన్నదే లేదు. అంతా శూన్యంలో కలిసిపోయింది. పరినిర్వాణం చెందారాయన. మనకు మిగిలింది ఆయన మిగిల్చిన జ్ఞానసంపత్తి. ఆ జ్ఞానం ద్వారా, సత్యం ద్వారా ఆయన మనలో వెలుగుగా మిగిలే వుంటారు. యిప్పటికైనా తప్పనిదీ రోజా—

భిక్షువులారా! దైహిక మరణమన్నది అందరికీ కలిగేదే.. దానికి భయపడకూడదు. యీ విశ్వమంతా శూన్యంలో భాగం.. కడకు మిగిలేదేమీ వుండదు. ఓ భిక్షువులారా! మీరు 'నేను' అనేది కల్పిత పదార్థ భావాల్ని తొలగించుకొనండి. అశాశ్వతమైన వాటికొరకు పరితపించకండి. కర్మలు శాశ్వతాలు కావున సత్కర్మలనే చేయండి. సమస్త జీవులకు వారివారి పనుల విలువన్నది. ప్రతివారు వారు వారు చేసే పనులకు వారసులు. ప్రతి వొక్కరూ వారు చేసే పనుల నుండే వుద్భవిస్తున్నారు. వారు చేసే పనులే వారి బంధువులు. వారు చేసే పనులే వారికి ఆశ్రయం . సమస్త జీవులకు వారివారి కర్మలే. వారు చేసే పనులే వారి ఔన్నత్యానికిగానీ, అవున్నత్యానికి గానీ కారణమైవున్నాయి. సత్యం యిది. ప్రతీ రోజూ యెందరో పుడుతున్నారు. గతిస్తున్నారు. కొద్ది నెలల క్రితమే మహాప్రజాపతి గౌతమి వచ్చారు.. యశోధర వచ్చారు. వారూ నిర్వాణులైనారు. యీ సత్యాన్ని నేను కనుగొనే ముందు వారిద్దరిలో వొకరు నాకు తల్లి. మరొకరు భార్య. స్త్రీలకు బౌద్ధ ధర్మదీక్ష యివ్వవలసిన అవసరం అంతగా లేదన్న వుద్దేశంతో చాలాకాలం వరకూ వారికి బౌద్ధ ధర్మదీక్ష నివ్వడంలో వుత్సాహం చూపించలేకపోయాను. మహాప్రజాపతి గౌతమి, యశోధర, తదితరులు యిందుకెంతో బాధపడ్డారు. యే ధర్మదీక్షనూ పొందకుండానే వారు శిరోముండనం కావించుకుని, స్వయంగా ధర్మదీక్ష తీసుకుని, రాజభోగాలు, సౌఖ్యాలు వదిలి బౌద్ధ భిక్షువులతో సమానంగా జీవిస్తూ, నావుంచి ధర్మదీక్షకోసం వందలాది మైళ్ళు కాలినడకన వచ్చి చేరారు. యిదిగో యీ ఆనందుడు వారిపట్ల శ్రద్ధ వహించి.. స్త్రీలకు కూడా ధర్మదీక్షనందివ్వడంలో సాయపడ్డాడు- బ్రహ్మచర్యమన్నది పురుషులకే కాదనీ, స్త్రీలకు కూడా వుంటుందనీ, పతనం కావడానికి పురుషుడికి స్త్రీ యెంత కారణమో, స్త్రీకి పురుషుడూ అంతేకారణమనీ, శీలం విషయంలోకానీ, జ్ఞానంవిషయంలోకానీ. ఏ విషయంలోనైనా స్త్రీలు పురుషులకు యేమాత్రం తీసిపోరనే యిన్ని వాస్తవాలతో వారిద్వార సత్యం మాట్లాడాడు.. స్త్రీలకు ధర్మదీక్షనివ్వడం వారి తోటే మొదలైంది.

వారు సాధించిన మనవిజయాల్ని స్త్రీలందరూ కూడా పొందుతారు... అంతటి చరితార్థులు వారు కూడా గతించిపోయారు.. యిపుడే శారిపుత్రుడు...నేను కూడా యినవైయ్యవపడిలో వున్నాను.. యీ దేహాలన్నీ ముగిసిపోయేవే... మిగిలేది ధర్మమొక్కటే... సత్యమొక్కటే..

భిక్షువులారా.. శారిపుత్రుని జ్ఞాపకాలు గొప్పవి. సామర్థ్యం, సాహచర్యం, ప్రేమ ఆయనలో పుష్కలంగా వుండేవి. మీరందరూ ఆయనని మీ మనస్సులలో నిలుపుకోవండి.. ఆయనకి ఘనంగా నివాళులు యివ్వండి " బరువైన కంఠస్వరంతో అంటూ ఆ భస్మం నిండిన మట్టిపాత్రను తీసి తిరిగి ఆనందుడికిచ్చారు.

ఆనందుడు ఆ పాత్రను భిక్షువులు వెంటరాగా సమీపంలోని నదిలో కొంతకలిపి, కొంత శారిపుత్రునిస్మారకంగా వొక చోటనిలిపి వుంచాడు. అక్కడ వొకవృక్షాన్ని ఆయనకు స్మృతిగా నాటి.. అందరూ మౌనంగా ఆయనకు కడసారివందనం చేసి, విషణ్ణవదనాలతో ఆశ్రమానికి తిరిగి వచ్చారు. అనంతరం చాలా యేండ్లకు శారిపుత్ర మౌద్గల్యాయనుల పవిత్రధాతువులను

హాంపీలో భద్రపరచారు. ఆ చైత్యం యిప్పటికీ అక్కడ వుంది.

ఆ మరునాడే తథాగతుని మరొక ప్రియమైన శిష్యుడైన మహా మౌద్గల్యాయుని మరణవార్త ఆశ్రమానికి చేరింది. రాజగృహంలో ఆయన బుద్ధ సందేశాన్ని వినిపిస్తున్నారు. వందలాది మంది, వేలాది మంది ధ్యానసిద్ధుల్ని తయారు చేశాడాయన. ఆయన మరణం బౌద్ధ ప్రచారానికి గట్టిదెబ్బ. శారీపుత్ర, మౌద్గల్యాయనులు తన తరువాత బౌద్ధధర్మాన్ని ప్రచారం చేయడంలో అగ్రగణ్యులుగా వుంటారని గౌతమబుద్ధుడు తలచారు. శారీపుత్రులవారి పరినిర్వాణం అయి, రోజులన్నా గడవకముందే మహామౌద్గల్యాయుని మరణవార్త తెలియడం ఆశ్రమవాసులందర్నీ మూగ హృదయుల్ని చేసింది. కలచివేసింది. అందునా మహామౌద్గల్యాయనుల వారిది సహజమరణం కాదనీ, బౌద్ధ ధర్మ వ్యతిరేకులు పిరికిపందల్లా పన్నిన కుట్రలో ఆయన హత్యకు గురయ్యారన్న దారుణవార్త వారికి మరింత బాధకలుగచేసింది.

గౌతమబుద్ధుని హృదయం ఆ మరణవార్తకు బరువుగా! అశాంతిగా అయిపోయింది. ఆనందుడాయనకి సపర్యలు చేస్తూ - "భగవాన్! మేము చాలా క్రుంగి పోతున్నాం... భిక్షువులలో యీవార్త కడు విషాదాన్ని కలిగ చేస్తోంది... మిమ్మల్ని చూస్తున్నప్పుడు మాకు కూడా గుండెలు బరువెక్కుతున్నాయి... నశించిపోవడం అన్నది మీరు చెప్పిన సత్యమే కదా... మీ బోధనలూ, సందేశాలూ వినిపించడానికి పూర్తి, కాశ్యపులవారు, కొంతవరకూ నేను... శారీపుత్ర మౌద్గల్యాయనుల వారి ముఖ్య శిష్యులం యింతమందిమీ వున్నాం... మీ ప్రతి ఒక మాటనీ మేము యథాతథంగా వల్లె వేస్తూ పొల్లు పోకుండా రాబోయే తరాలకు అందించడం జరుగుతుంది. శారీపుత్రులవారూ, మహామౌద్గల్యాయనులవారూ యిందునిమిత్తం అనేకానేకవేల్ల ఆశ్రమవిద్యార్థుల్ని ఎంపికచేసి బౌద్ధధర్మాన్ని యథాతథంగా వుపదేశిస్తున్నారు. కడవరకూ మీ అమృతవాక్కుల్ని వింటూ, వాటిని వాక్యకంగా మననం చేసుకుంటూ మీ సేవలో తరిస్తున్నాం... భగవాన్... మీ నుంచి మరింత జ్ఞాన సందేశాలు లభ్యమవ్వాలి మాకు" అన్నారు.

తథాగతుడు ఆనందుని వంక ప్రేమగా చూసి... "ఆనందా! మన ప్రయాణం మరల మొదలు పెడదాము... యిది అనంత ప్రవాహమై సాగాలికదా! రాజగృహాకు వుదయమే సిద్ధంగా వుండు" అని చెప్పి ధ్యాన సమయం కావడంతో కుటీరంలోనికి వెళ్ళిపోయారు. పెద్దవాడై పోయారాయన. తనకన్నా చిన్నవారు తనకంటే ముందే వెళ్ళిపోతూవుండటం... వాస్తవమే అయినా... ఆ బాధన్ని భరించాలి కదా!

---

మరునాడు వుదయమే రాజగృహాకు ప్రయాణం ఆరంభమైంది. యెన్నో పర్వతప్రాంతాలు - నదులు - లోయలు - పట్టణాలు - పల్లెలు... అడవులు. మార్గమధ్యంలో యెన్నో మజిలీలు... విశ్రాంతికై, భిక్షకై ఆగిన ప్రతి చోటా ధర్మబోధనయీ ప్రయాణానికి అంతులేదు... ఆ కారుణ్యమూర్తి వెనుకనే అంతులేని మహా ప్రస్థానం.

రాజగృహాకు చేరుకున్నాక మహామౌద్గల్యాయనుని తలపులో అక్కడే కొంతకాలం పాటు అక్కడి భిక్షువులకు జ్ఞాన బోధన... యెన్నిసార్లు విన్నా వినాలనిపించే, మందుకురకాలనిపించే పుణ్యాహం. యీ విశ్వం అనిత్యం దుఃఖం అనాత్మం... యెన్ని సార్లు తెలుసుకున్నా సత్యం అమర ప్రవాహమే... ప్రతిసారి కొత్త కోణాలు తెలుస్తాయి. మనస్సు మరింత విశాలమవుతుంది.

యావత్కాలాన్నీ ఆయన తన సందేశాన్ని ప్రజల్లో వ్యాపింప చేయడానికి వినియోగిస్తున్నారు. బాగా పరిణతి చెందిన వారికి ఆంతరిక అభివృద్ధికోసం సూక్ష్మాంశాల మీద సూచనలిస్తున్నారు. బౌద్ధ ధర్మ సంఘ కార్యకలాపాలను సమీక్షిస్తున్నారు. విశ్లేషిస్తున్నారు. క్రమశిక్షణకు భంగం కలిగించే భిక్షువులకు శిక్షలు వేస్తూ, విశ్వాసపాత్రుల ప్రతిభని స్థిరీకరిస్తూ, దూర ప్రదేశాలనుంచి వచ్చే ప్రతినిధి వర్గాలకు సాదరంగా ఆహ్వానాలు పలుకుతూ, ప్రత్యర్థి మేధో జీవులతో శాస్త్ర చర్చలు చేస్తూ, బాధాతప్తుల్ని ఓదార్చుతూ, వారిని స్వాంతపరుస్తూ, పేదలైన మొదలుకుని మహారాజుల్ని సైతం కలుసుకుంటూ గౌతమబుద్ధుడు మౌద్గల్యాయుని పరినిర్వాణం తరువాత తిరిగి రాజగృహము బౌద్ధ ధర్మదీక్షతో నింపివేశారు. యిన్నాళ్ళుగా చేస్తున్న పని అదే... కానీ యీ సారి తీరులో కొంతమార్పు.... పనులు మరింత వేగంగా జరుగుతున్నాయి..... చూచాయగా ఆనందునితో అన్నారు.....'ఆనందా! నాకుకూడా అంత్యకాలం సమీపిస్తోంది..." అని. ఆనందుడామాటను వినడానికి కూడా తిరస్కరించాడు. దూరంగా వెళ్ళిపోయాడు. ఆనందుడంటే ఆయనకెంతో ప్రేమ. తెలిసిన వారందరికీ ఆనందుని గురించి చెప్పేవారు. ఆనందుడు గొప్ప జ్ఞాపకశక్తి కలవాడు. పాతిక సంవత్సరాల క్రిందటి కలిసిన మనుషుల మాటలను కూడా యథాతథంగా చెప్పగలడు. అసలు గౌతమబుద్ధుని బోధనలను మౌఖికంగా సాధన చేయించాలన్న ఆలోచన ఆనందునిదే. ఆ సాధనలో అపశ్రుతులు దొర్లితే వాటిని చక్కదిద్దేందుకూ, గౌతమబుద్ధుని అడిగి మరోసారి ఆ మాటలను స్థిరపరచుకునేందుకూ ఆనందుడే పెద్ద తల. గౌతమబుద్ధుని యెవరు దర్శించాలన్నా ఆనందుడు లేకపోతే సాధ్యపడదు. యెప్పుడెవరినిపంపాలో, యేసమయంఎవరికి వుచితమైందో, గౌతమబుద్ధుడెప్పుడేపనిలో వుంటారో, ఆయనకు వెసులుబాటు యెప్పుడుంటుందో అన్నీ తెలిసేది ఆనందుడొక్కడికే.

రాజగృహం నుంచి మళ్ళీ ప్రయాణం ఆరంభమైంది. యీసారి తథాగతుడు ప్రయాణాన్ని అక్కడినుంచి అంబలతికకు కొనసాగించారు. దారిమధ్యలో పచ్చటి చేలు, యెన్నో దినుసులు, కాయగూరలు, ధాన్యం.యేడాదిపొడవునా ఋతువు మార్పును బట్టి రైతులు పండిస్తూనే వుంటారు. ప్రతీ మడీ కొత్త సొగసులతో, కొత్త రంగులతో మెరుస్తూ వుంటుంది. వొకే పంట వెయ్యడం వారికి యిష్టం వుండదు. ఆ పంట పొలాల్ని చూస్తూ వొకప్పుడెప్పుడో తథాగతుడు ఆనందుని పిలిచి, 'అట్లా అందంగా పై అంగ వస్త్రాన్ని నాకు కుట్టించగలవా?' అన్నారు. ఆనందుడు నాలుగు రోజుల్లోనే ఆ అందమైన దృశ్యం అచ్చు అలాగే వుండేటట్టు చక్కని రంగుల కలయికతో అంగవస్త్రాన్ని తయారుచేసి తథాగతుడికిస్తూ- "గురువర్యా! యిటువంటివే భిక్షువులందరూ కూడా ధరించేటట్టు అనుజ్ఞ యివ్వండి." అన్నాడు.

' ఆనందా! నీ మేధ అపారం. నేను క్లుప్తంగా చెప్పింది నువ్వు విస్తారంగా అర్థం చేసుకున్నావు. నువ్వెప్పుడూ యింతే. కానీ నీ గురించి నాకొకటే సంశయం.. ధ్యానంపై మనస్సు నిలపవెందుకని? నా యెదుటే నువ్వు అర్హతుడివి కావాలి. చూడు నీకంటే ఆలస్యంగా చేరినవాళ్ళు కూడా అర్హతులవుతున్నారు.." ఆనందుడు మధ్యలోనే అడ్డుపడుతూ..

"గురువర్యా! యీ జీవితానికి మీ సేవ చాలు. యిటువంటి అదృష్టం యెవరికి వుంది?"

వారు అంబలతిక చేరుకున్నారు.

అక్కడ రాహులుడు బౌద్ధ ధర్మప్రచారం చేస్తున్నాడు. గౌతమబుద్ధుడు వూరికి చేరగానే

రాహులుడు ఎదురేగి వెళ్ళాడు. గౌరవంగా తన ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు. ఆ పూటివారందరికీ తథాగతుని చేత బోధన ఇప్పించాడు. ఆయన రాహులుడ్నీ, సభికుల్నీ సమంగా కన్నబిడ్డల్లా సంబోధిస్తూ..

"భిక్షువులారా! ప్రియపుత్రులారా!

మీలో ఎవరూ అసత్యాల్ని దరిచేరనీయకండి. అసత్యాలు చెప్పేందుకు అలవాటుపడినవాడు ఎన్ని దుష్కృత్యాలకైనా వొడిగడతాడు. మీలో ఎవరైనా సరే సరదాకోసమైనా అబద్ధాలు ఆడకుండా స్వయం శిక్షకులు కండి.

దేని గురించిఅయినా ఆలోచించేటప్పుడు ఆలోచనలోనూ, ఆచరణలోనూ దానిని మరీమరీ తరిచి పరిశీలన చేసుకోనండి. ఎవరికైనా అపకారం వున్నదనుకుంటే ఆ పనిని చెయ్యనే చెయ్యకండి. చేసే పని ద్వారా ఎల్లాంటి కీడూ వాటిల్లదనుకుంటేనే, అది ధృడపడిన తరువాతనే ఆ పని చేయండి.

ప్రేమాభిమానాలు పెంపొందించుకోనండి. మీనుండి ద్వేషభావం వైదొలగిపోతుంది.

కరుణామయత్వాన్ని పెంపొందించుకోనండి. తద్వారా నిస్పృహ వైదొలగిపోతుంది.

ఇతరుల క్షేమాన్ని అభిలషించండి-తద్వారా అయిష్టత అదృశ్యమైపోతుంది.

సమతాభావాన్ని పెంపొందించుకోనండి-వ్యతిరేకభావం వైదొలగిపోతుంది.

శారీరకంగా ఎటువంటి అవినీతికి తావీయకుండా ధ్యానసమాధి కొనసాగించండి-మీనుండి తృష్ణ తొలగిపోతుంది.

క్షణభంగురమైన ప్రకృతి స్థితిగతులను పరిశీలించండి-అలా చేసినట్లయితే గర్వం, స్వార్థాలు నశించిపోతాయి.."

భిక్షువులందరూ ఆ బోధన విని పులకితులయ్యారు. ఆనందాంబుధిలో తేలిపోయారు.

అంబలటిక నుండి వారు నలందాకు బయలు దేరారు. నలందాలో బౌద్ధ భిక్షువులందరూ కలిసి ఏర్పాటు చేసిన ఆశ్రమం వుంది. ఏటికేడాది అక్కడికి బౌద్ధ భిక్షువుల రాకపోకలు కొనసాగుతూనే వుంటాయి. బౌద్ధ ఉపాసకులైన వారి ప్రతి ఇంటి నుండీ వొక కుమారుని కొంతకాలం భిక్షు జీవితానికి పంపి, విద్య నేర్పించడం జరుగుతూంది. ఇందులో ఎటువంటి బలవంతమూ వుండదు. ఎవరైనా బౌద్ధభిక్షువులు కావచ్చు. వున్నంతకాలం బౌద్ధ భిక్షువుగా శాస్త్రీయమైన జీవితాన్ని గడుపుతూ, కొంతకాలం అయ్యాక తిరిగి స్వగృహానికి వెళ్ళిపోవచ్చు లేదా బౌద్ధ భిక్షువుగానే జీవితాన్ని కొనసాగించవచ్చు. ఈ స్వేచ్ఛ వుండడంతో బౌద్ధంలోకి జనుల ప్రవాహం మిక్కుటమైంది. బౌద్ధధర్మాలు ప్రజలకు మరింత చేరువ అయ్యాయి. శిక్షణాతరగతులకు అంతులేదు.

నిత్యజీవిత క్రమశిక్షణ గురించి తథాగతులు వారికిలా చెప్పారు.

"ప్రియమైన భిక్షువులారా! నీతిని విడువకండి. సత్క్రమ ప్రవర్తనని అలవరచుకోండి. చిన్న చిన్న తప్పుల్లోని ప్రమాదాలు గుర్తించి, పాఠాలు నేర్చుకోండి.

సోదరులారా! కంటితో వొక రూపాన్ని చూసి దాని అందాలకు ముగ్ధులు కాకండి. చూపు అదుపులో లేకపోతే కోరికలు పుడతాయి. ఈ దుస్థితి మనిషిని వరదలా ముంచి వేస్తుంది. చూపును జయించండి. ధ్యానించండి. అలాగే మిగిలిన జ్ఞానేంద్రియాలన్నింటినీకూడా జయించండి. కొద్దిగానే

చేయగలుగుతున్నామని బాధపడకండి. మనస్సును క్రమశిక్షణలో పెట్టుకుంటూ వున్నట్లయితే తప్పక అన్ని అధ్యయనాలూ అభ్యాసమవుతాయి.

సోదరులారా! భోజనంలో మితం పాటించండి. అవసరమైనంత వరకే మనస్ఫూర్తిగా తినండి. సరదాకోర్కె-దేహసౌందర్యం కోసం తినకండి. తినడం దేనికి? శరీర సమతుల్యత కోసం. శరీరం స్థిరంగా వుండటానికి. హాని నుంచి కాపాడుకోవడానికి. ధర్మజీవితంకోసం భోజనం. గ్రహించండి.

మెలకువగా వుండండి. దినంలో మీరు కూర్చుని వున్నా, నిలబడి వున్నా, నడుస్తూ వున్నా మరేమి చేస్తున్నా సరే. మిమ్మల్ని కలవరపరిచే విషయాల్ని మనస్సు నుండి తొలగించి వేయండి. రాత్రి కాలంలో హృదయాన్ని క్షాళన చేసుకుంటూ వుండండి. కుడివైపు తిరిగి పడుకోండి. ఒకకాలుపై మరొక కాలు ఆనించి పడుకోండి-శాంతమైన మనసు కలిగి వుండండి. స్వస్థులై వుండండి. రాత్రి గతించి మెలకువ కలుగుతూ వుండగా పైకి లేచి కూర్చోండి. హృదయాన్ని వ్యాకుల పరిచే విషయాలను తొలగించుకోవండి ధ్యానించండి. అటుయిటుకొంతసేపు నడవండి.

సమయస్ఫూర్తి కలిగి వుండండి. మిమ్మల్ని మీరు అదుపులో వుంచుకోవండి. పనిచేటప్పుడు. వస్త్రధారణ చేసేటప్పుడు- వరుకులు మోసుకొచ్చేటప్పుడు నిలుచున్నప్పుడు నిద్రిస్తున్నప్పుడు- మాట్లాడుతున్నప్పుడు, మౌనంగా వున్నప్పుడు- ప్రతిచేష్టలో. ప్రతి కదలికలో మిమ్మల్ని మీరు అదుపులో వుంచుకోవండి. విడిగా వుండే స్థలం చూసుకోవండి. ఒక చెట్టుక్రిందగాని, కొండ లేదా గుహ, స్మశానం, లేదా యేదైనా గడ్డిమోపు చూసుకోవండి. స్థిరంగా కూర్చోండి. ధ్యానానికి మనస్సును సంసిద్ధపరచుకోండి. విగ్రహానికి, విందు మనసుకు ధ్యాన శిక్షణ సులువైన మార్గం. నేను మార్గం మాత్రమే చూపిస్తున్నాను. నడిచి గమ్యాన్ని చేరుకోవలసింది మీరే. యివన్నీ మీకు తెలిసినవే. నేర్చినవే. అయినా మరల మరల శ్రద్ధగా పాటించండి.

శిష్యులారా! మహాకరుణ-మహామైత్రి కలిగి వుండండి. యెవరైనా మీముఖాన మిమ్మల్ని చెడతిట్లు తిట్టవచ్చు- పిడి గుద్దులు గుద్దవచ్చు- మీనెత్తిన మట్టి పొయ్యవచ్చు- రాళ్ళతో కొట్టవచ్చు లేదా కర్రల్తో కొట్టవచ్చు లేక కత్తులు దూయవచ్చు.. అయినా మీరు యెటువంటి కోరికలూ లేకుండా మిమ్మల్ని మీరు దిటవుపరచుకోవండి. నేను ఆందోళన చెందడం లేదని- యేదెబ్బలూ నన్ను బాధించడం లేదని, వారి క్షేమమే కోరుకుంటున్నానని యెప్పటిలాగానే అందరి పట్ల కరుణగా, ప్రేమగా, క్షేమం కోరుకుంటూ వున్నానని, అంతకంటే నాకెటువంటి కోరికాలేదని భావించుకోవండి. ఆవిధంగా మిమ్మల్ని మీరు సమాయత్తపరచుకోవండి. దిటవుపరచుకోవండి."

పాటలీ గ్రామం దగ్గర కూడిన భిక్షు సంఘాన్ని వుద్దేశించి ఆయన, "భిక్షు సంఘం నా నుండి యింకా యేమి ఆశిస్తోంది? నేను బాగా వృద్ధుడనైపోయాను. యింక నాలుగు నెలల కంటే యెక్కువ బతకను. చెప్పవలసినదంతా చెప్పాను. యెక్కడా ఆచార్యముష్టిని పాటించలేదు. కొంచెంచెప్పి కొంచెం చెప్పకుండా దాచి పెట్టలేదు. భిక్షు సంఘం యింకా నా మీద యెందుకు ఆధారపడాలి? ధర్మదీపాన్ని ఆసరాగా చేసుకుని తరించండి. ధర్మాన్నే జ్యోతిగా, ఆశ్రయంగా తీసుకోండి. యిక దేనిమీదా ఆధారపడకండి" అని ప్రశాంత గంభీర స్వరంలో ప్రసంగించారు.. ఆ ప్రసంగం భిక్షువులందర్నీ కదిలించి వేసింది. వారు నలందా నుండి పాటలీ గ్రామం చేరుకున్నారు. పాటలీ నుండి కోటగం, కోటగం నుండి నాదికకు చేరుకున్నారు. ప్రతీ తావులోనూ భిక్షుగణాన్ని, గృహస్థుల్ని వుద్దేశిస్తూ యెన్నో ప్రబోధాలు చేశారు.

వారిక నుండి వైశాలి చేరుకున్నారు.

వైశాలిలో బౌద్ధభిక్షువులున్నారు. కానీ అక్కడ జైనమతం విస్తారంగా వుంది. వారిలో చాలామంది బౌద్ధానికి వ్యతిరేకులుగా వున్నారు. వైశాలిలో బౌద్ధం గురించి గౌతమబుద్ధుని సన్నిధిలోనే యెన్నో గోష్ఠులు, సభలు జరిగాయి. జైన మునుల్ని ప్రత్యేకంగా ఆహ్వానించారు. చేరిన జైనమునులతోనూ, బౌద్ధ భిక్షువులతోనూ ఆయన బౌద్ధ తత్వాన్ని గురించి వివరిస్తూ-

"ప్రియమైన భిక్షువులారా! వివిధ తాత్వికులారా!

యెవరైనా సరే, వారెవరైనా సరే తమ ధర్మాన్ని, తమ మతం, 'గొప్పది' అని అంటున్నట్లయితే, అది యితర మతంపై ద్వేషమే కాగలదు. అటువంటి మనిషి మూర్ఖాలకు దారితీసే జీవితాన్నుండి బయటపడలేడు. తన మతంలో యిది మంచిది- యీ మాట మంచిది- యీ గుణం మంచిది అని అంటూండేటట్లయితే యితర మతాలలోని ఆయా సంగతులు మంచివికావని చెప్తున్నట్టే. యే మతానికైనా పెద్దపీ అని అతడనేటట్లయితే అతడికి వాటి గురించిన వాస్తవాలు తెలుసుకునే అవకాశాన్ని పోగొట్టు కుంటున్నాడన్నమాటే. అందువల్లనే బౌద్ధ భిక్షువు తాను చూసిన వాటినన్నిటినీ యధాతధంగా తీసుకోకూడదు-లోతుగా పరిశీలించాలి.

అతడే మతాన్ని విమర్శించనక్కరలేదు. పొగడనూ అక్కరలేదు. అందుకు తాను పరిపూర్ణుడనిగానీ, సమానుడవుతాడనిగానీ, అనర్హుడననిగానీ అతడు తలచకూడదు. ఆ విధంగా ద్వేషంగానీ, అభిమానంగానీ అతడు చూపకూడదు. అతడు శూన్యాన్ని అంగీకరిస్తాడు. శూన్యానికి ముందు పీట వేస్తాడు. అతను ఆవలిగట్టుకి చేరాలి. అదే అతడి తలపుగా వుంటాడు. ముక్తి పొందాలి. మూర్ఖాలనేవి అనవసరం. యిదీ అతడి తలపుగా వుండాలి.

యితరులు తనకంటే అధములనిగానీ తానితరులకంటే గొప్పవాడినని గానీ, తానితరులతో సమానమనిగానీ అనుకుంటే అది మూర్ఖాలకే దారి తీస్తుంది. యేదీ లేదు- యీ భావాలేవీ లేనప్పుడే మూర్ఖతే వుండదు. అటువంటి మాటలు అర్థంలేనివి. యెవరైతే సర్వసంగ పరిత్యాగులై జీవించగలుగుతారో-యెవరికి యెటువంటి బంధాలూ వుండవో, యెవరికి యెటువంటి కోరికలూ వుండవో వారు యిటువంటి వాదాలలోకి దిగరు. యిది అర్థం చేసుకోవడంలో వారికి భ్రమలన్నీ తొలగిపోతాయి.

కోరికలు మరిన్ని కోరికలు పుట్టిస్తాయి. భయం మరింత భయాన్ని పుట్టిస్తుంది. యెవరైతే జీవితాన్ని మరుగుమీద తెట్టుగా భావిస్తారో వారిని యే కోరికలూ పీడించవు. యేదీ వారిని భయపెట్టలేదు. 'యిది నాది' అనే భావం యెవరికి లేకుండా వుంటుందో వారిని యిటువంటి వేమీ బాధించవు. యిది నాది- యిది అతడిది అని యెవరైతే అనుకోకుండా వుంటాడో అతడిని యేదీ నిరాశపరచలేదు. కృంగదీయలేదు.

యెవరైనా వొక నూతన తత్వాన్ని అలరచుకోవాలంటే వారికి వుత్తమమైన మార్గం వొక్కటే వారు సంతోషం కోసం పాకులాడకూడదు. మనస్సును శాంతపరచుకోవాలి. నేనెవరినీ స్వేచ్ఛా జీవులుగా తయారు చెయ్యలేను. యెవరికి వారే యిందుకు సన్నద్ధమవాలి.

వో భిక్షువులారా! 'నేను' 'నాది' అనేవి కల్పిత పదార్థం. దీనిని తొలగించుకోండి. అశాశ్వతమైన వాటికోసం పరితపించకండి. కర్మలు శాశ్వతం. అందువలన సత్కర్మలనే చేయండి. సమస్త జీవులకు వారి వారి కర్మల్లో పాలువుంది.ప్రతీవారు వారి వారి యొక్క కర్మలకు వారసులు.

ప్రతీవొక్కరూ కర్మల నుండే పుద్భవిస్తున్నారు. వారి కర్మలే వారి బంధువులు. వారి కర్మలే వారికి ఆశ్రయం. సమస్త జీవులకు వారి వారి కర్మలే అల్పత్వానికి గానీ. ఔన్నత్యానికి గానీ విభజించి పంపిస్తున్నాయి.

భిక్షువులారా! ప్రశాంతత యొక్క రహస్యం యేమిటంటే మనస్సును ప్రాపంచిక బంధనాల నుండి విడిపించడమే.

సత్యాన్నే ధ్యానించండి. సత్యాన్నే ఆచరించండి. సత్యాన్ని గురించి మాత్రమే సంభాషించండి. సత్యాన్నే తలపోయండి. మీరే సత్యానికి దీపాలుకండి. సోదరులారా! ధర్మమార్గం కొరకై మిమ్మల్ని మీరు దృఢ నిశ్చయంతో కృషి సల్పండి. మీరు స్వేచ్ఛాజీవులవుతారు. దుఃఖాలయాన్నుండి విడివడతారు. యేకాగ్రతతో ధర్మమార్గాన పయనించండి. అటువంటి వారికి నేను ఆర్య సత్యాలు, అష్టాంగమార్గాలు, ప్రతీత్య సముత్పాదం, పంచశీల మొదలైనవి బోధించాను.. వీటిని ఆచరించండి.

మిమ్మల్ని మీరే ఆశ్రయించుకోవండి.. శ్రద్ధా మెలకువలతో కష్టించి కృషి సల్పండి. సత్యమే మీకు గురువు. సత్యమే శాశ్వతమైంది" .

భిక్షువులారా! యెంతవరకు మీరందరు అనేకసార్లు ఒకేచోటకి చేరుకునే అలవాటుపెట్టుకుంటారో, అంతవరకూ మీకు అభివృద్ధే కానీ హాని లేదు. యెంతవరకు మీరందరూ యేకాభిప్రాయానికి వస్తూ వుంటారో, మీలోని కలతలను విచారించుకుని, యేకమనస్సుతో వాటిని తొలగించే ప్రయత్నాలు చేసుకుంటూ వుంటారో అంతవరకు మీకు వృద్ధేగానీ హాని లేదు. మీరు, భిక్షు సంఘం యేర్పాటు చేయని నియమాన్ని చేశారు అని అనకూడదు. చేసుకున్న నియమాల్ని భంగపరచకూడదు యీ రెండు దుష్టపనులూ లేనంతవరకూ మీకు భయంలేదు. నియమాల్ని గ్రుడ్డిగా కాకుండా, వాటి హృదయం యెరిగి అనువర్తించండి. మీకు అభివృద్ధే కానీ హాని లేదు. భిక్షువులారా! యెంతవరకు మీరు భిక్షువులు, వృద్ధులు, శీలవంతులు, అగ్రేసరులు అయిన వారిని గౌరవిస్తూవుంటారో యెంతవరకు పుత్పన్నమయ్యే ఆశల వెంటపోకుండా వశీకరించుకుంటారో, యెంతవరకు యేకాంతవాసాన్ని అభిలషిస్తూ వుంటారో, యెంతవరకు మీలో బుద్ధిమంతులు చేరాలన్న, చేరిన మేధావులు సుఖంగా వుండాలన్న శుభకామనతో వుంటారో- అందుకోసం యెంతగా ప్రయత్నిస్తారో అంతవరకు భిక్షువులారా మీకు అభివృద్ధేకాని హాని లేదు.

భిక్షువులారా! మీకు మరల చెప్తున్నాను. మీలో మీరెప్పుడూ కలహించుకోవద్దు. కలహాలు మీకూ, ప్రపంచానికీ కూడా బాధలే కల్గిస్తాయి. హాని కల్గిస్తాయి. మీ కలహాలు మాన్పుకోవడానికి

1. మీరు చేసే పనులన్నీ మైత్రీమయాలుగా వుండేటట్లు చూసుకోవండి.
2. మీరు మాట్లాడే ప్రతిమాటా మిత్రత్వాన్ని కలిగించేటట్లుగానే మాట్లాడండి.
3. మీరు మనస్సులో సైతం మైత్రీభావాన్నే కల్గి వుండండి.
4. ప్రజలనుండి లభ్యమైన దానధర్మాల్ని సంఘంలోని భిక్షువులందరూ సమానంగా పంచుకోవండి.
5. ప్రవర్తనలో చిన్నదోషంకూడా లేకుండా చూసుకోవండి.
6. అందరికీ శ్రేయస్కరమైన సమ్యక్దృష్టికల్గి వుండండి. అంతేకాదు భిక్షువులారా! మీరు అత్యంత నిరాడంబరంగా జీవించండి. దుస్తులు ధరించడం అంటే కేవలం శీతోష్ణాలు, రోగాలు, దోమలు, గాలి, సర్పాలు మొదలైనవాటినుండి మిమ్మల్ని మీరు రక్షించుకోవడం కోసం మాత్రమే.

భోజనం చేయడం అంటే, భోజనం వల్ల శరీరం మదం యెక్కి క్రీడించడానికి కాదు. భోజనం కేవలం శరీర రక్షణ కొరకే.

విశ్రాంతి తీసుకోవడం అంటే పట్టుపరుపులపై నిద్రించడం కాదు. నిద్రపోవడం శీతోష్ణాల నుంచి, యీగలు మొదలైన వాటి నుంచి కాపాడుకోవడానికి? మాత్రమే.

యేదైనా అరోగ్యానికి మందు సేవించడం అంటే అది కేవలం రోగాన్ని శమింప చేసేంతవరకు మాత్రమే. దేహానికి సహజమైన ఆరోగ్యం చేకూర్చుకునేంతవరకే అంతకుమించి యెటువంటి మందులూ సేవించకూడదు."

వైశాలిలోని జైనమతస్థులందరూ ద్వేషం అనేది లేని యీధర్మం గురించి స్వయంగా తథాగతుని ద్వారానే విని.. బౌద్ధమతం పట్ల ద్వేషాన్ని చాలామటుకు విడనాడుకున్నారు. చాలామంది బౌద్ధ దీక్షను కూడా తీసుకున్నారు. యీ విధంగా బౌద్ధమంటే ద్వేషభావం లేని విధంగా వైశాలీ ప్రజలను మార్చి వొక రోజున వారందరూ వైశాలీనగరానికి వీడ్కోలు చెప్పారు.

దూరం నుంచి వెనుకకు తిరిగి వైశాలీ పట్టణాన్ని చూస్తూ తథాగతుడు ఆనందునితో, 'ఆనందా! యీ వైశాలీనగరం అంటే నాకు చాలా అభిమానం. యిక్కడి ప్రజలు సత్యాన్వేషులు. సత్యమెక్కడ వున్నా దానిని అందిపుచ్చుకుంటారు. ఆనందా! యీ వైశాలికి యెన్నోసార్లు వచ్చాను. యింక యిదే కడసారి రావడం." అన్నారు.

ఆనందుడు 'యిదే కడసారి' అన్నమాట తనకు వినబడనే వినబడనట్టు తొందర తొందరగా ముందుకి దారితీసాడు. అతన్ని చూసి తథాగతుడు ప్రేమగా నవ్వుకున్నారు. ఆయనకు తెలుసు- ఆనందుడికి యీ మాట యిష్టం వుండదనీ- ఆ వూహే అతడు భరించలేడనీ. కానీ తప్పటుందా మరణమన్నది? ఆనందుడెప్పుడు తెలుసుకుంటాడు? అతడికి ప్రపంచమంతా తానే.. 'ఆనందా! నీకు జయం కలుగుగాక.' అని తథాగతుడు ఆనందుని మనస్సులోనే ఆశీర్వదించారు. ఆనందుడు గౌతమబుద్ధుడి పినతండ్రి అయిన అమితోదనుడి కుమారుడు. జ్ఞానసంబోధి తరువాత మొదటిసారిగా కపిలవస్తుకు వెళ్ళినప్పుడు బౌద్ధ ధర్మంలో చేరి. 25 సంవత్సరాల నుంచీ బుద్ధుని సేవక శిష్యుడుగా వుంటున్నాడు. శుశ్రూషలు జేయడంలో అతన్ని మించి యెవరూ వుండరని చెప్పుకోవడంలో వింత లేదు. అతడి జ్ఞాపక శక్తి అపారం.

. పాండిత్యం, జ్ఞాపకశక్తి, మంచినడక, పట్టుదల, సేవాతత్పరత యీ అయిదింటిలో ఆనందుడు అగ్రగణ్యుడు బుద్ధుడే వొకసారి అతన్ని మెచ్చుకున్నాడు.

వైశాలినుండి భండగ్రామ్.. భండగ్రామ్ నుండి హస్తిగ్రామ్, అటునుండి భోగనగరం.. యివన్నీ దాటుకుంటూ 'పావా' వూరికి చివర మామిడితోపుకి వచ్చి బసచేశారు వారందరూ.

ఆ మామిడితోట చుందుడనే కమ్మరిది. చుందుడికి తథాగతుల వారంటే యెంతో అభిమానం. మునుపు ఆయన యిటువైపు వచ్చినప్పుడల్లా ఆయనని దర్శించుకొనేవాడు. తన కర్మాగారంలో ఆయుధాలు కత్తులు తయారుచేస్తామని చెప్పినప్పుడు తథాగతుడు ఆ మాట విని మౌనంగా వుండిపోయారు. అది గ్రహించిన చుందుడు- హింసకు దారితీసే వస్తువుల్ని తయారు చేస్తూ వుండడం వల్లనే తథాగతులు తనని ఆశీర్వదించలేకపోయారని తలిచి.. క్రమేపీ ఆ వస్తువులు తయారు చేయడం తగ్గించేశాడు. యిప్పుడు అతనికర్మాగారంలో రైతుకి పనికి వచ్చే నాగలి, కర్రు, గునపం, పార.. మొదలైన వస్తువులు మాత్రమే తయారుచేస్తున్నారు. తథాగతులు తనతోటలోనే

జన చేసినట్లు తెలుసుకున్న చుందుడు పరుగెత్తే నడకతో తథాగతుణ్ణి సందర్శించుకున్నాడు. భిక్షువులకు కావలసిన భోజన పదార్థాల్ని అనుమతి అడిగి అప్పటికప్పుడే సమకూర్చాడు. మరునాడు తన యింటికి భిక్షకు రావలసిందిగా తథాగతుణ్ణి కోరాడు. తథాగతుడు అందుకు మౌనంగా అంగీకరించాడు. చుందుడి ఆనందానికి అంతులేదు.

మరునాడు చుందుడు తథాగతుణ్ణి తానే వెంట వుండి తన గృహానికి తీసుకు వెళ్ళాడు. ఆయనకు అనేక పదార్థాలతో తృప్తిగా భోజనం పెట్టాడు. దగ్గరుండి కొసరికొసరి మరీ వడ్డించాడు. అతని ప్రేమకు గౌతమబుద్ధుడు యెంతో సంతోషించాడు.

మాటల్లో తాను ధర్మం విషయంలో యెక్కువ ఆసక్తి కనపరుస్తున్నట్టూ- ధర్మంగా నడుచుకుంటూ వున్నట్టు.. వీలైనప్పుడల్లా బౌద్ధ భిక్షువుల జ్ఞాన బోధనలు వింటున్నట్టు చుందుడు తథాగతుడికి చెప్పాడు.

ఆ సాయంకాలం జరిగిన ధర్మసభలో గౌతమబుద్ధుడు అక్కడకు చేరిన వారందరి సందేహాలకూ సమాధానాలు యిచ్చాడు. ధర్మోపదేశం చేశాడు. వారంతా యెంతో సంతోషించారు. చుందుడి ఆనందం పట్టలేని రీతిలో వుంది. పెన్నిధి దొరికినట్లుగా వుందతడికి.

భౌతికమైన యెన్ని వేదనలున్నా- మనిషి ఆధ్యాత్మిక అభివృద్ధి కోసం కృషి చేయాలని చెప్పడమే కాదు, తథాగతుడు తన నిత్య జీవితంలో ఆధ్యాత్మిక అభివృద్ధికోసం ధ్యానం చేస్తూనే వుండేవాడు. యెటువంటి ప్రమాదంగానీ, అవమానంగానీ ఆయన్ని ఆధ్యాత్మిక ప్రశాంతి నుండి తొలగించలేదు. ఆయన అందరికీ ప్రీతిపాత్రుడు. అనేకమంది మంచికోసం, అనేకమంది ఆనందంకోసం, దేవతల, మానవుల ప్రయోజనం కోసం, జీవిత సుఖాల్ని త్యజించి, విశ్వ కళ్యాణమైన ధర్మాన్ని అందించాడు. అటువంటి మహాత్యాగి, అతిసామాన్యుడైన తన యింటికి వచ్చినందుకు చుందుడెంతో సంతోషించాడు. తథాగతులు బౌద్ధభిక్షువుల సందేహాలు తీరుస్తూ-

"సోదరులారా! యితరులు నా గురించిగానీ, ధర్మం గురించి గానీ, సంఘం గురించిగానీ వ్యతిరేకంగా మాట్లాడదలచుకుంటే. యిందుమూలంగా మీ యిద్దరి మనస్సులలో ద్వేషం చెలరేగకూడదు. మీలో మీకు అయిష్టత కలగకూడదు. యీ కారణంగా మీరు మనసులో క్రోధపడితే, గాయపడితే, అది మీకు ఆత్మని జయించే మార్గంలో అడ్డంకిగా నిలుస్తుంది. యితరులెవరైనా మనకి వ్యతిరేకంగా మాట్లాడినందుకు మీరు వారిపై మండిపడి అసహ్యించుకుంటే- వారి సంభాషణ యే మేరకు సాగిందీ, యే మేరకు సాగేదీ- లేనిదీ మీకెలా తెలుస్తుంది?

యితరులు నన్ను నిందిస్తూ మాట్లాడినా, అదేవిధంగా ధర్మం గురించి, సంఘం గురించీ మాట్లాడినా, అతను మాట్లాడిన ప్రతిమాటా యెలా అసత్యమో విడదీసి చూపించి, అది యెంత తప్పో విస్తరించి యిలా మృదువుగా చెప్పాలి, "యీ కారణం వల్లగానీ, ఆ హేతువు వల్లగానీ యిది వాస్తవం గాదు. అది అలా కాదు. అలాంటిది మాలో కనిపించదు. అది మాలో లేదు.." యిలా చెప్పాలి.

అదే సందర్భంలో, సోదరులారా! యితరులు నన్ను ప్రశంసిస్తూ మాట్లాడినా, ధర్మం గురించీ, సంఘం గురించీ ప్రశంసిస్తూ మాట్లాడినా మీరు సంతోషపడిపోరాదు. ఆనందంతో వుబ్బితబ్బిబ్బి పోరాదు. మీరలా ప్రవర్తిస్తే అది కూడా ఆత్మని జయించడానికి అది మీకు ఒక అడ్డంకి అయిపోతుంది.

యితరులు, నన్నూ, ధర్మాన్నీ, సంఘాన్నీ పొగుడుతూ మాట్లాడినప్పుడు యేది వాస్తవంగా

ఏది అయినదో మీరు అంగీకరిస్తూ, యిలా చెప్పాలి.. "యీ కారణం వల్ల లేక ఆ కారణం వల్ల అది యదార్థం. అది నిజమే. అలాంటిది మాలో వుంది. అది మాలో వుంది". యీ విధంగా తెలియజెప్పాలి.

*ప్రియమైన భిక్షువులారా! చంపడం, దొంగతనం చేయడం, అబద్ధం చెప్పడం, మద్యం సేవించడం, వ్యభిచరించడం యివేమీ చేయనివాణ్ణి మనం మంచివాడు అని అంటాం. కాని అట్లా మంచివాడుగా మాత్రమే యెవరైనా వుండిపోదలచుకుంటే అది న్యాయమైనది కాదు. అతడు తాను చెడ్డపనులు చేయకుండా వుండడమేకాకుండా, యితరులనుకూడా ఆవిధంగా నడుచుకునేట్లు చేయాలి. అలా చేసేవాణ్ణే మనం చాలామంచివాడు అని అంటాం. బౌద్ధ భిక్షువులు యీ విధంగా జీవించాలి. తల్లి వొక్కగానొక్క బిడ్డను రక్షించుకోవడం కోసం, తన ప్రాణాలకు సైతం యెలా తెగిస్తుందో, అదేవిధంగా అన్ని జీవరాసుల యెడలా ప్రతీవొక్కరూ అపరిమితమైన ప్రేమనిండిన హృదయం కలిగివుండేలా కృషి చేయాలి. అతడు ప్రపంచం యెడల మంచి అభిప్రాయం కలిగి వుండేలా కృషి చేయాలి. విద్వేషాలు లేని, యెల్లలు లేని ప్రేమ అతని హృదయం నిండా నిండాలి. ఆ విధంగా జీవించడమే ప్రపంచంలో అత్యుత్తమంగా జీవించడం.. సర్వ ప్రయత్నాలూ అటువంటి ఆత్మముక్తికోసమే చేయాలి".*

పావా ప్రజలు యెంతో ప్రేమాభిమానాలతో ఆ మహాశయునికి వీడ్కోలు తెలిపారు. పావా నుండి వారు కుశీనగరానికి ప్రయాణమయ్యారు. యీసారి తథాగతుడు గౌతమబుద్ధునికి ప్రయాణం భారమయింది. ఆయనకు రక్తగ్రహణి పట్టుకుంది. బాధ తట్టుకోవడం ఆయనకు చాలా కష్టంగా వుంది. అయినా ప్రయాసపడుతూనే అలుపు తీర్చుకుంటూ ప్రయాణం సాగిస్తూ వున్నారు. కొండలు, అడవులు, చిన్న చిన్న నదులు దాటుతూనే వున్నారు. యెంతో ఓరిమితో, ధైర్యంతో ముందడుగు వేస్తున్నారు. యెనభై యేండ్ల వృద్ధాప్యంలో కూడా యెంతటి ధీరోదాత్తత?!

ఆయన ఆరోగ్యం బాగా పాడయిపోయింది. అలసిపోయారు. మహావృక్షమొకటి కనిపిస్తే దాని క్రింద విశ్రమించారు. ఆనందునితో దాహంగా వుందని చెప్పగా, ఆనందుడు నీరు అందించాడు. ఆ నీరు తాగి కాసేపు సేదదీరి సమీపంలో వున్న కుకుత్తానదికి వెళ్ళి స్నానం చేశారు. దానితో ఆయనకు మరికొంత సేదదీరింది. తిరిగి వచ్చి మరల ప్రయాణమవుతుంటే ఆనందుడు సందేహించాడు. యింకా విశ్రాంతి తీసుకుంటే బాగుండునని అతని తలపు. అయినా తథాగతుడు ముందుకే ప్రయాణమయ్యారు. మరో రెండు మూడుగంటలకే కుశీనగరం పరిసరాలలో వున్న సాల దగ్గరికి వచ్చారు. కాస్త దూరంగా గండకీనది ప్రవహిస్తోంది. అక్కడ వున్న రెండు సాల వృక్షాల మధ్య తనకు పక్క వేయవలసిందిగా తథాగతుడు ఆనందుని కోరితే, ఆనందుడావిధంగా, మెత్తగా వుండేటట్లు నేలపైన చిన్న చిన్న రాళ్ళు యేరేసి మెత్తని ఆకులు గడ్డిపరిచాడు. అతనికి చాలా ఆందోళనగా వుంది.

గౌతమబుద్ధుడు చాలా నీరసంగా వున్నారు. ఆపడకపైన మేను వాలుస్తూ "నాయనా! ఆనందా! నీకు కొద్దిరోజులుగా చెప్తూ వున్నదే మళ్ళా చెపుతూవున్నాను. ఆందోళన పడవద్దు.. నాయనా! ఆనందా! నేనీ రోజే చనిపోతున్నాను.. యీ భూమి మీద నా చివరి రోజిదే.." అన్నారు.

ఆ మాటలూ, ఆయన వున్న పరిస్థితీ చూసిన ఆనందుడి గుండె ఆగిపోయింది. తట్టుకోలేక పోయాడు. బావురుమని యేడ్చాడు. వొకరోజా, రెండురోజుల బంధం కాదు. పాతిక సంవత్సరాల నుండీ వస్తున్న బంధం.. అనుబంధం.. "భగవాన్! అలా అనవద్దు.. భగవాన్.. యిక్కడ నుంచి వెళ్ళిపోదాం.. సమీపంలోని యే పట్నానికైనా వెళ్ళిపోదాం.. మీరు చనిపోకూడదు. భగవాన్.. మీరన్నది నిజమైతే, తప్పకపోతే అది యిలా యే దిక్కూ మొక్కూ లేకుండా యీ అడవిలో జరగకూడదు

భగవాన్.. యిది నేను తట్టుకోలేను.. బౌద్ధధర్మం వసంతంలా విరబూస్తున్న రాజ్యాలెన్నో వున్నాయి. అటువంటి యే రాజ్యంలోనైనా అయితే అది మీ కీర్తికి తగినట్టుగా వుంటుంది- మీ భౌతికకాయానికి ఘనమర్యాదలు జరుగుతాయి. కానీ అలామాట అనవద్దు భగవాన్. నేను తట్టుకోలేను.." ఆనందుడు దుఃఖం ఆపుకోలేకపోతున్నాడు.

"ఆనందా! పూలరుతువు కాదిది- అయినా చూడు ఆనందా యీ రెండు సాలవృక్షాలూ పూలు పూసి ఆ పూలను నాపై రాల్చుతున్నాయి. ప్రకృతి యిస్తున్న గౌరవం నాకిది. యింతకంటే యింకే గౌరవం కావాలి? అయినా మనుష్యులకు సంబంధించి వారు నాకిచ్చే గౌరవం వొకటుంది. అది నాకు చేసే సేవ, పూజ నమస్కారాలు కాదు. అది భిక్షువుగానీ, భిక్షుణిగానీ, అనుచరుడు గానీ, గృహస్థుడుగానీ, సన్యాసిగానీ యెవరయినా సరే పెద్ద విషయాల్లోనూ, చిన్న విషయాల్లోనూ కూడా సత్యమే మాట్లాడుతూ నేను చెప్పిన ధర్మ ప్రకారం నడుచుకుంటూ ధర్మశీలాన్ని కూడా గమనిస్తూ జీవితాన్ని గడుపుతారో వారు తథాగతునకు గౌరవము గావించినవారు, సపర్యలు సల్పినవారు అవుతారు".

"ఆనందా! మృత్యుకాలం సమీపిస్తోంది. దీనికి కారణం చుందుడు అని యెవరైనా అతడిపైన నిందవేయవచ్చు. ఆ నింద అతనిపై రాకుండా చూడండి. అతడు నాపై యెనలేని ఆప్యాయత, ప్రేమాభిమానాలు చూపించాడు. నా జీవితంలో అత్యంత ప్రేమాస్పదమైన ఆతిథ్యాలు రెండున్నాయి. వొకటి ఆనాడు గృహిణి సుజాత పెట్టిన పరమాన్నం. రెండవది చుందుడు పెట్టిన భోజనం. రెండింటిలోనూ తేడా అన్నది లేదు".

తథాగతుడు క్షణక్షణానికీ మృత్యువుకి చేరువవుతున్నారు. యీ సంగతి తెలుసుకున్న కూడావున్న భిక్షువుల దుఃఖానికి అంతులేదు. ఆయన ప్రశాంతతకు భంగం కల్గించకుండా వారు దూరంగా వెళ్ళి, ఆయన వంకే చూస్తూ వున్నారు. ఆనందుడి పరిస్థితి విహ్వలంగా వుంది. యేమి చేయాలో పాలుపోవడం లేదతడికి. అటు యిటూ తిరుగుతున్నవాడు దూరంగా వెళ్ళి మొహం మీద చేతులు కప్పుకుని యేడ్వసాగాడు.

చాలా సేపయిన తరువాత తథాగతులు, 'ఆనందా!' అని పిలిచిన పిలుపు వొక బౌద్ధ భిక్షువుకి వినిపించింది. అతడు వచ్చి, ఆనందులవారు దూరంగా వెళ్ళి యేడుస్తున్నారు స్వామీ అని చెప్పి- ఆనందుడికి తథాగతుడు పిలిచిన సంగతి చెప్పాడు.

ఆనందుడు కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ, గౌతమబుద్ధుని చెంతకు వడివడిగా చేరాడు. తనని చేరిన ఆనందునితో గౌతమబుద్ధుడు- 'ఆనందా! నా గురించి యెటువంటి భ్రమా పడవద్దు. యేడవ వద్దు. మనకు ప్రియమైన, మనకు మిక్కిలి సమీపములైన పదార్థాల స్వభావమే యిటువంటిదనీ, అన్నీ నశించిపోయేవేననీ, మనకు యెడబాటు తప్పదనీ నేనెప్పుడూ నీకు చెప్తూనే వున్నాను కదా! ఆనందా! యేదీ శాశ్వతం కాదు. అటువంటి పరిస్థితి అసాధ్యం. ఆనందా! నాకు చిరకాలంగా పరమాప్తుడవయ్యావు. యింతింత అని చెప్పలేని సపర్యలు చేశావు. నాపై యెంతో దయ చూపావు. యిక నీ స్వవిషయంలో గట్టి పూనికతో వుండు. నీ మేలుకొరకు పాటు పడు. జాగ్రత్తగా వుండు. ప్రతి ప్రయత్నం పరిశుద్ధమైన మనస్సుతో చెయ్యి. యీ అవిద్య-అజ్ఞానాల నుండి అతిస్వల్పకాలంలోనే విముక్తుడవుతావు. అర్హతుడవుతావు. ఆనందా! ధర్మాన్ని విడువకు మరువకు- అదే నిన్ను రక్షిస్తుంది.

"నాయనా, ఆనందా! నన్ను ఆరాధించేవాళ్ళు గౌరవించేవాళ్ళు ఆత్మరత్నునిలాగా మెలగాలి.

రోజూ నా దర్శనానికివచ్చి పుష్పాంజలి ఘటించి, పాద నమస్కారం చేసి వెళ్ళడం నన్నారాధించినట్లు కాదు, గౌరవించినట్లుకాదు. నేను పరినిర్వాణం చెందుతానన్న విషయం తెలుసుకున్న తరువాత నుంచి, నేను బతికుండగానే అర్హతత్వాన్ని పొందేటందుకు, నన్ను సైతం చూడకుండా ధర్మసాధనలోనే చిత్తాన్ని లగ్నం చేసి అర్హతుడయ్యాడే, అటువంటి ఆత్మరత్నుడిలాగా మెలగాలి. అతడిలా ధర్మాన్ని అనుష్ఠించడమే నన్నారాధించడం అవుతుంది. గౌరవించడం అవుతుంది. అన్య విషయాలు ఎంత గొప్పవైనప్పటికీ వాటికోసం ఆత్మముక్తిని ఎవరూ నిర్లక్ష్యం చేయకూడదు. అన్ని ప్రయోజనాలు ఆత్మముక్తిలో అంతర్భాగములు కనుక ఆత్మముక్తి సాధించడానికి అన్ని ప్రయత్నాలూ చేయండి" అన్నారు. ఆనందుడికి దుఃఖం ఆగలేదు. తథాగతుని మాటలన్నీ భిక్షువులందరూ శ్రద్ధగా విన్నారు. తథాగతుడు మెల్లగా కళ్ళు మూసుకున్నారు. బౌద్ధ భిక్షువుల దగ్గర ఏదో సవ్వడి వినిపించి అటువైపు చూస్తే, ఎవరో కొత్త వ్యక్తి వచ్చినట్లుగా వుంది. వారి దగ్గరకు వెళ్ళగానే వొక వ్యక్తి ఆనందుడి దగ్గరకు వచ్చి, 'నా పేరు సుభద్రుడు. కుశీనగర నివాసుడ్ని. తథాగతులవారిని అడిగి కొన్ని ముఖ్యమైన సంశయాలు తీర్చుకుందామని వచ్చాను.' అని చెప్పాడు.

ఆనందుడందుకు అంగీకరించలేదు. తథాగతులవారు అవసాన దశలో వున్నారనీ, వారు ప్రశాంతిగా చనిపోకుండా, ఇప్పుడిలా ఆటంక పరచడం మంచిది కాదనీ చెప్పాడు.

ఈ మాటలు కొన్ని గౌతమబుద్ధుని చెవిని పడ్డాయి. ఆయన సైగ చేసి ఆనందుని రప్పించి విషయం తెలుసుకుని సుభద్రుడ్ని తన దగ్గరకు రప్పించమని చెప్పాడు.

సుభద్రుడు తథాగతుని చేరి వినయంగా వందనం చేశాడు. తథాగతుడు అతన్ని ఆశీర్వదించారు. సుభద్రుడికి తథాగతుని ఆ స్థితిలో చూసేసరికి కళ్ళనీళ్ళు తిరిగాయి. అయినా తాను అడగవలసిన ప్రశ్నని నెమ్మదిగా అడిగాడు. అతడు తథాగతుని నుంచి తెలుసుకోవాలనుకున్నదేమిటంటే, 'చాలామంది తార్కికులు, పేరెన్నిక గన్నవారు వుంటున్నారు కదా వారిలో సత్యాన్ని గ్రహించిన వారెవరున్నారు'? అని. గౌతమబుద్ధుడు 'ఫలానావారు సత్యాన్ని తెలుసుకున్నారు' అని అంటే, దానినిబట్టి వారి వారి తత్వాలు కూడా సత్యమైనవే కావచ్చా అని అడగవచ్చు. అప్పుడు సత్యాన్ని తెలుసుకునేందుకు బుద్ధమార్గమే సరి అయినదన్న సత్యం వీగిపోతుందని అతడి భావం. అదే అడిగాడు. "గురువర్యా! పూరణకాశ్యపుడు, మక్ఖలి గోశాలుడు, అజితకేశకంబళుడు, సంజయ బేల పుత్రుడు, నిగంఠ మతస్థులు వీరిలో ఎవరు సత్యాన్ని గ్రహించిన వారు?" అని.

దానికి గౌతమబుద్ధుడు నెమ్మదిగా సమాధానం ఇచ్చారు. "వారందరూగానీ, వారిలో కొందరుగానీ, లేక వొక్కరుగానీ సత్యాన్ని గ్రహించగలిగారా అని నువ్వు అడిగిన ప్రశ్నకు నేనొకటే సమాధానం చెప్తాను. నేను చెప్పిన అష్టాంగమార్గాలు సత్యాన్ని తెలుసుకునేందుకు దోహదపడతాయి. ఇవి ఏ మతంలో వున్నా వుపయోగపడతాయి. ఈ ధర్మాలు లేని ధర్మాన్ని, మతాన్ని పాటించేవారిలో నిజమైన త్యాగి వుండేందుకు అవకాశం లేదు. అందువల్ల సత్యాన్ని తెలుసుకున్న వారెవరో తెలుసుకునే ముందు వారే మతస్తులు గానీ, వారి జీవితంలో ఇటువంటి పరిపూర్ణమైన అష్టాంగ మార్గాల ఆచరణ ఎలా వుంది? జ్ఞాన దృష్టి, సమతాసంకల్పం, మైత్రీభావన, నిజమైన ప్రవర్తన, పరిశుద్ధ జీవనం, స్వార్థరహిత పరిశ్రమ, వివేక చింతన, పరమార్థసాధన వారిలో ఎంతవరకూ లోకానికి ఆదర్శంగా భాసిల్లుతున్నాయో చూడాలి. ఇవి వొక మతానికి సంబంధించినవి కావు.

విశ్వమానవులకు సంబంధించిన ధర్మాలివి.. సుభద్రా! నీ సంశయం తీరిందా?"

సుభద్రుడు ఆయనకు వినయంగా నమస్కరించాడు. తనకు బౌద్ధ ధర్మదీక్ష నివ్వవలసిందిగా ప్రార్థించాడు. అతని ప్రార్థనకు. తథాగతుడు ఆనందుని దగ్గరకు పిలిచి, 'ఆనందా! యీ సుభద్రుడికి ధర్మదీక్షనిచ్చి భిక్షుసంఘంలో చేర్చుకో.. వ్యక్తుల విశ్వాసాలలో భేదాలు వుంటూ వుంటాయి. వాటిని మనం అర్థం చేసుకోవాలి. ఆనందా యీ సుభద్రుడ్ని తీసుకువెళ్ళి ధర్మదీక్ష యివ్వు" అన్నాడు.

ఆనందుడు సుభద్రుడ్ని సమీపంలోని హిరణ్య నది దగ్గరకి తీసుకువెళ్ళాడు.

మార్గమధ్యం నుంచే సుభద్రుడికి ధర్మానికి సంబంధించిన విషయాలు చెప్పసాగాడు.

సుభద్రా! నీకెన్నో విషయాలు చెప్పాలి. కానీ వ్యవధి లేదు. అయినా స్థూలపులకంగా నీకు మరికొన్ని విషయాలు తెలియచేస్తాను.

బౌద్ధ భిక్షువయ్యాక అతడు చేయవలసిన ముఖ్య పని యేమిటంటే, ద్వేషంతో, దర్పంతో, కామంతో కలుషితమై పోయిన యీ లోకానికి ధర్మ బహుమతి నందివ్వడం. ప్రపంచంలోకెల్లా దివ్యమైన కానుక యిది. అన్నిమాధుర్యాలనూ అధిగమించ గల మాధుర్యమిది. అన్ని సంతోషాలనూ మించిన సంతోషం యీ ధర్మ సంతోషం.

కానీ యిటువంటి బోధకుడు కావాలంటే వొకసారి తెలుసుకున్నంత మాత్రాన సరిపోదు. జీవితాచరణ వుండాలి. అర్హతను పొందాలి. అటువంటి అర్హతను పొందాలంటే భిక్షువుకి భగవానుడు వుద్దేశించిన 145 విధినిషేధాలను తు.చ. తప్పక పాటించాలి. అవి విధినిషేధాలు కావు.. సత్యాన్ని ధర్మాన్ని అనుసరించి ఆకళింపు చేసుకునేందుకు అడ్డువచ్చే వాటిని అధిగమించేందుకు ఆచరించవలసిన జీవిత సూత్రాలు. వీటిని ఆచరించకపోతే జ్ఞాని అయేందుకు అవకాశాలు వచ్చినట్టే వచ్చి జారిపోతాయి. చేసిన ప్రతీ తప్పుల మరిన్ని తప్పులకు కారణమై అతడు ఆ విషవలయాలలో పడికొట్టుకుపోతూనే వుంటాడు. ఆ నిషేధాల ప్రకారం బౌద్ధ భిక్షువు యెటువంటి పరిస్థితులలోనూ

*1. యే జీవినీ చంపకూడదు 2. తనకు సంబంధించని వస్తువు తీసుకోకూడదు. 3. వ్యభిచరించకూడదు.*
*4. అబద్ధాలాడకూడదు. 5. మత్తుమందులు, సారా మద్యపానాలు తాగకూడదు.*
*6. మధ్యాహ్నం తరువాత ఆహారం తినకూడదు. 7. నృత్యగాన వినోద విలాసాలకు వెళ్ళకూడదు.*
*8. సుగంధాలు, పూలదండలు, ఆభరణాలు ధరించకూడదు. 9. మెత్తని పరుపులపై పడుకోకూడదు.*
*10. యెవరినుంచీ బంగారు, వెండిని గానీ గ్రహించకూడదు.*

యిందులో మొదటి అయిదూ గృహస్థులకు, వుపాసకులకూ నియమాలు. బౌద్ధ భిక్షువులు యీ పదినియమాలనూ తప్పనిసరిగా పాటించాలి. అంతేకాదు నిత్యజీవితంలో అనేకన్నోవిధులను, నియమాలను పాటించాలి. అతడు పరుషంగా మాట్లాడకూడదు. యే యువతినీ అతడు ప్రలోభపెట్ట కూడదు. వారితో దగ్గరగా మెసలకూడదు. యిద్దరు స్త్రీ పురుషులమధ్యమధ్య వర్తిత్వం నెరపకూడదు. బౌద్ధ భిక్షువుల ప్రశాంతతకు భంగం కలిగించకూడదు. సరదాకోసమైనా బౌద్ధ భిక్షువుల వస్తువులు దాచకూడదు. యిలా యెన్నో నియమాలు వున్నా..... అతడు సంటరిగా ప్రశాంతంగా జీవించాలి.

యెటువంటి సంఘటన నుంచి అయినా అతడు ఆధ్యాత్మిక పాఠాలు తీసుకోవాలి. బురదలో కూరుకుపోయిన యేనుగు స్వశక్తితో తనను తాను పైకి లేవదీసుకున్నట్లుగా క్లేశకూపం

నుండి తననుతాను అతడే పైకి లేవదీసుకోవాలి.

యెవరికైనా యీ ధర్మం అనుసరణీయమైందే. మునుపు అతడు పురిశిక్షలు వేసేవాడైనా, ప్రాణుల్ని చంపేవాడైనా సరే, బౌద్ధ ధర్మాలను పాటించగలిగేటట్లయితే ధర్మ దీక్ష తీసుకోవచ్చు. దీర్ఘ కాల క్రూర ప్రకృతి వల్ల కలిగిన హృదయకాఠిన్యం, అగౌరవ భావం అంతా కూడా యీ ధర్మాచరణలో త్వరలోనే మాసిపోతుంది.

అతడెప్పుడూ అజాగ్రత్తగా వుండకూడదు. తనలోని చెడుకు, తను చేస్తున్న చెడ్డ పనులకి ధర్మాన్ని అడ్డుపెట్టుకునే ప్రయత్నం చేయకూడదు. ప్రయోజనాలు పొందడం కోసమే బౌద్ధ సంఘంలో వుండకూడదు. బౌద్ధ సంఘానికి తానే వొక ప్రయోజనమవ్వాలి. దాని సహజాభివృద్ధికి తోడ్పడాలి. యే తప్పు చేసినా, యిది చాలా చిన్న తప్పు కదా అని అనుకోకూడదు. చిన్న చిన్న తప్పులే వొక్కొక్క నీటిబిందువూ చేరి చేరి కుండ నిండినట్టు పెద్ద విషభాండమవుతాయి.

సుభద్రా! యెటువంటి సందర్భంలో అయినా యితరులను బాధించడం తన్ను తాను బాధించుకోవడమే అవుతుంది. యితరులకు సహాయపడడం తనకు తాను సహాయపడడమే అవుతుంది.

'నేను' - 'నాది' అని అతడెట్టి పరిస్థితుల్లోనూ అనుకోకూడదు. విశ్వంలో యే ప్రాణికీ, యే వస్తువుకూ నాది అంటూ ప్రత్యేకంగా యేదీ లేదు. అన్నీ అనిత్యాలు. అన్నీ దుఃఖంలో నిండి వుంటాయి. యీ దుఃఖాన్ని తొలగించుకోవాలి దానికి అష్టాంగ మార్గం వుంది. నేను నాది అన్న భావాల్ని తొలగించుకుంటేనే వెలుగుమార్గం కనబడుతుంది. యెవరైనాసరే వొకరికంటే తాను యెక్కువ అనుకున్నా, యెవరితో యెందులో తీసిపోయాను అనుకున్నా, నాలో వున్న గుణాలు వారిలో యేమున్నాయి? వొకటి రెండు వుంటే సరిపోతుందా? అని అనుకున్నా, మిగతా వాళ్ళకన్నా మంచి గుణాలునాకున్నాయి అనుకున్నా, నాకున్న గొప్పగుణాలు యిన్నీ అన్నీ కావు అనుకున్నా, నేను సలానా విద్య నేర్చుకున్నాను అది ముఖ్యంగా యెవరూ నేర్వలేని విద్య అనుకున్నా, యిద్దరం సమానమే కానీ, పరిమాణంలోనే తేడా అని కొండతో జింక అన్నట్టు అనుకున్నా భిక్షుగాడు మరో భిక్షుగాడితో, నీలా అందర్నీ ముష్టి అడగను- దర్జాగా కూచుంటాను- వేసేవాడు వేస్తాడు అన్నట్టు అనుకున్నా యివన్నీ పతనంలో లోపాలే. యిటువంటి లోపాలవల్ల అతడు చాలా నష్టపోతాడు. యిటువంటి పతనాలు పడకుండా చూసుకుంటూ- 'తన' అన్నదానినే పోగొట్టుకుని అతడు విశ్వమానవుడుగా తనను తాను మలచుకోవాలి. అలా నడుచుకోవాలి. అందుకు సహకరించే విద్య, జ్ఞానం, ధ్యానం బౌద్ధంలో వున్నాయి. బౌద్ధసంఘం యివన్నీ అందిస్తుంది. సుభద్రా.. నదికి చేరువయ్యాము. మరి పవిత్రస్నానం చేస్తావా?"

సుభద్రుడు నదిలోకి వెళ్ళి నిండుగాస్నానం చేసి వచ్చాడు. మూడుసార్లు మునిగిన తరువాత, ఆనందుడతనిచేత త్రిశరణం, పంచశీల పలికించి బౌద్ధధర్మదీక్ష ప్రసాదించాడు. సుభద్రుడు అవి పఠించాక పునీతుడైనట్లుగా భావించి, ఆనందునికి వందనాలు చెప్పాడు.

తిరిగివస్తూ కూడా ఆనందుడు సుభద్రుడికి యెన్నో విషయాలు తెలియచేశాడు. "సుభద్రా! యీ నాలుగు నెలల్నీ నువ్వు బాగా సద్వినియోగం చేసుకోవాలి. యిప్పుడు నువ్వు స్రోతాపత్తి భిక్షువు వున్న స్థాయిలో వున్నావు. బౌద్ధ మార్గంలో ప్రవేశించి ప్రథమావస్థలో వున్న వారిని స్రోతాపత్తి భిక్షువులు అంటారు. రెండవ స్థాయి సక్నదాగామిస్థాయి. యీ స్థాయిలో భిక్షువు పాత జీవితంలోని

వ్యూహాలకు వెళుతూ వస్తూ వుంటాడు. ఆ తరువాత అనాగామి స్థాయి. యీ స్థాయిలో అతడికింక పాత జీవితపు ఆలోచనే వుండదు. బౌద్ధ ధర్మాన్నే అన్ని విధాలుగా పాటిస్తూ, ఆ ధర్మంలో లీనమవుతాడు. యీ ధర్మంలో లీనమైన తరువాత, మరింత త్యాగఫలితం ద్వారా అర్హతత్వం వస్తుంది. యీ అర్హతత్వం కోసమే బౌద్ధ భిక్షువులు ప్రాణం పెడతారు. యిందుకోసం శరీరంలోని ప్రతి కదలిక మీద, ప్రతి పలుకుమీద, ప్రతి ఆలోచన మీద వొక కన్ను వేసి వుండాలి. క్రమేపీ అతడు యితరులకు యీ ధర్మ విధానాన్ని బోధించగల విద్వాంసుడుగా తయారవాలి".

యిలాదారిలో యెన్నో విషయాలు బోధిస్తూ సుభద్రుడ్ని తథాగతుని వద్దకు తీసుకువచ్చాడు ఆనందుడు.

తథాగతుని పరిస్థితి యేమీ బాగోలేదు. అయినా అతడు వారిద్దరినీ ఆశీర్వదించాడు. ఆయన పరిస్థితి చూసి ఆనందుడు వలవలా యేడ్చాడు. అతన్ని పట్టుకోవడం కష్టమైంది.

"నాయనా! ఆనందా! బాధపడకు. నిన్ను అందరూ యిష్టపడతారు. నిన్ను చూసిన వారందరూ సంతోషిస్తారు. ఆనందా నువ్వు మౌనంగా వున్నా, దుఃఖంగా వున్నా నీ పాటివారు యేదో కోల్పోయినట్లు భావిస్తారు. ఆనందా! యీ ప్రపంచంలో ప్రతిదీ అశాశ్వతమని నీకు యిన్నిసార్లో చెప్పాను కదయ్యా! యిప్పుడు మళ్ళీ చెప్తున్నా! సోదరులారా! మీరందరూ కూడా యిటురండి".

"సోదరులారా! నేను మరల హెచ్చరిక చేస్తున్నాను. శ్రద్ధగా వినండి. యీ విశ్వంలోని వస్తు సమూహాలన్నీ నశించిపోయేవే. సత్యమే శాశ్వతమైనది. మీరందరూ సత్యాన్నే గురువుగా స్వీకరించండి. సత్యమంటే ముక్తిని పొందండి. యితరులపై ఆధారపడకుండా, మీరు మీ అంతర్గతమునందే సహాయాన్ని పొందండి. ముక్తి కోరకై సదా శ్రద్ధా మెలకువలతో కష్టించి కృషి సల్పండి".

యివే తథాగతుని చివరిమాటలు. ఆరాత్రి రెండవ ఝామున, వైశాఖ పున్నమి వెన్నెల లోనవ- తథాగతుడు మహాపరినిర్వాణం చెందాడు.

తథాగతుడు భౌతికంగా మరణించాడు. అతడి ధర్మం- తెలుసుకున్న ప్రతివాక్యరీలోనూ, తెలుసుకున్న క్షణంనుంచే మొగ్గతొడుగుతుంది. జ్ఞానజ్యోతిలా ప్రకాశించి ఆ మనిషిని, విశ్వ మానవ కళ్యాణం అనే పరమార్థ సాధన కోసం కృషి చేసేటట్లు అందులో ముక్తి పొందేటట్లు లీనమై పోయేటట్లు చేస్తుంది.

తథాగతుని చివరిమాటలు కూడా మహోత్కృష్ట బౌద్ధ జీవన ప్రారంభానికి కారు చీకటిలో కాంతిరేఖలా మహాకరుణతో ఆహ్వానం పలుకుతూనే వుంటాయి.

- సమాప్తం -

*అంకితం*

మూగజీవాల హక్కుల పరిరక్షణలో యీ శతాబ్దపు గౌతమబుద్ధుడు
మాననీయ శ్రీ పీలా రామకృష్ణగారికి
నమస్సుమాంజలులతో

నటరాజ్.

పుస్తకాంత్యం శుభం

# ఆధార గ్రంథాలు


1. 'బుద్ధ భగవానుడు'- ధర్మానంద కోశాంబి, విద్యోదయా పబ్లికేషన్స్, కడప (1957)
2. 'బుద్ధ చరిత-ధమ్మపదముతో'-డా॥ పందూరి రామకృష్ణమాచార్య M.A., Ph.D., ప్రమరణ-వేదవ్యాస చక్రవర్తి, ప్రగతి గీతామందిరం, హైదరాబాద్-4 (1976).
3. Studies in Buddism, by F. Max Muller S. G. Ltd., Calcutta (1953)
4. 'Buddhist Legends'- Eugene Watson Burungame, H.U. Press (1921)
5. 'Glimpses of buddhism'-N. Ramesam, Pub. by Govt. of A.P. (1961)
6. The Life of Buddha-Arthur Lillie Seema Pubs. Delhi (1974)
7. Philosophy of Buddha-A.J. Bahm, Capricoron Books, New York
8. The central Philosophy of Buddhism-T.R.V. Murthy, Unwin Paper Backs, London, 1955.
9. The Psychological Attitude of Early Buddhist Philosophy, - Lama Anagarika Govinda, Rider & Company, London, 1961
10. The Buddha's Philosophy, by G.F. Allen, G.A.U. Ltd, London, 1959
11. Buddha Buddhism, R. G. Basak, S. P. Pvt. Ltd., Calcutta-1. 1961
12. The Teachings of the compassionate Buddha, E.A. Burtt, Amenlon Religious classic, published by the New Americal Library, New york.
13. Bhagavan Buddha-R.R. Diwakar, B.V. Bhavan Bombay-400 007 (1980)
14. 2500 years of Buddhism, Pub. Division, New Delhi-110 001 (1956)
15. The Life of the Buddha Part I &II, & 16. Buddhist Thought & Meditation in the Nuclear Age, Edu. Foun. 11 Floor, 55 Hargchow, Taipei, Taiwan, ROC
17. Bhagawan Buddha and our heritaage, Swami Ranganadhananda, Adwaitha Ashrama, S. Delhi, Entally Road, Calcutta-14.
18. డా॥ బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు-ప్రసంగాలు, సంపుటం-3, తెలుగు యూనివర్సిటీ హైదరాబాద్
19. బుద్ధుడు-శ్రీ రమాపతిరావు, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 94
20. బుద్ధుడు-జీవితం-ఆనాపాన, ఎడిటర్ శ్రీ తిరుమల రామచంద్ర జయంతి పబ్లికేషన్స్, 1994
21. బుద్ధుడు-బౌద్ధ ధర్మం-డా॥ బి.ఆర్. అంబేద్కర్ , బుద్ధిస్ట్ సొసైటీ ఆఫ్ ఇండియా, ఆంధ్రప్రదేశ్ బ్రాంచ్, హైదరాబాద్. 1988
22. ధర్మపదం కథలు ; 23. జాతకమాల - శ్రీ బోధ చైతన్య, శ్రీ రామకృష్ణ సేవాశ్రమం, సి.టి.ఎమ్. రోడ్ మదనపల్లి-517 325.
24. ధర్మపదము-ప్రకాశకులు-శ్రీ కిలారు క్రిష్ణంసీడు, పెనమలూరు, విజయవాడ-39 (1981)
25. హిందూస్త్రీ-అభ్యున్నత్యము-పతనము-ఆంగ్లమూలం. డా॥ బి.ఆర్. అంబేద్కర్.
26. నిర్వాణనీతి 27. బౌద్ధమత సంగ్రహం 28. పంచసూత్రములు 29. బౌద్ధవందన శ్లోకాలు
30. ఇండియన్-బుద్ధిస్ట్-మాసపత్రికలు 31. A Few Teachings of Buddha

(దొరుకు చోటు శ్రీ దువ్వ శేషగిరిరావు, ఎడిటర్, ఇండియన్ బుద్ధిస్ట్, పురుషోత్తపురం. పెందుర్తి-531 173. ఫోన్ : 824413

32. ఆరణ్య వైభవం-పేపర్ బుక్స్-ఢిల్లీ

33. ఉపనిషత్తుల సందేశం-స్వామి రంగనాథానంద, రామకృష్ణమఠం, హైదరాబాద్-29.
34. సిద్ధార్థ చరితము, శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహం, కె.వి.వి.సన్స్, రాజమండ్రి, (1944)
35. 'ఆచార్య నాగార్జున, శూన్యతాసప్తతి'- శ్రీ ముక్కాల రాజగోపాలరావు, బౌద్ధ సాహితి, 5-54-118, 6/18, బ్రాడీపేట, గుంటూరు-522 002.
36. జీవబంధు ప్రత్యేక సంచిక-ప్రకాశకులు- శ్రీ సీతారామకృష్ణ గుంటూరు-3
37. భారతీయ తత్వ శాస్త్రం-సులభ పరిచయం- దేవీప్రసాద్ చట్టోపాధ్యాయ. అనువాదం: డా॥ గూడ సుందరరామయ్య, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు
38. అంబేద్కర్ మతవిధానం, 39. ధర్మచక్ర ప్రవర్తనము - శ్రీ ఎమ్.వి. రమణ, 39-23-12/2, వంశీనగర్, మాధవధార, విశాఖపట్నం - 530 007. ఫోన్ : 559286

"మంచిపనులు చేయడంలో త్వరపడండి.
లేకున్న చెడ్డయందు మనసు ప్రీతి చెందుతుంది"



"మనిషిలోకానికి కలిసిమెలిసి జీవించుటకు వచ్చియున్నామని చాలామందికి తెలియదు. తెలిసినవారు పరస్పరం తగవులాడుకొనరు".

"ప్రపంచం అంతా అగ్నితో ప్రజ్వరిల్లుతుంటే యీ ఆనందోత్సవాలేల? హాస్య పరిహాసాలేల? ఓ మనిషీ! నువ్వు గాఢాంధకారంలో వుంటే దీపంకావాలని కోరుకోవా?"

"జాగ్రత్తగా వుండటం అమృతత్వానికి బాట. అజాగ్రత్తగా వుండటం మృత్యువుకి బాట. అప్రమత్తులెన్నటికీ మరణించరు. ప్రమత్తులు జీవించివున్నా మరణించినవారే అవుతారు".

- గౌతమబుద్ధుడు.

...నటరాజ్., LOVABLE TO ALL. అతడి రచనలు కూడా అంతే. అచ్చయినవి కొద్దేలయినా పాఠకుల అపూర్వమైన అభిమానాలు, ఆత్మీయతలు అందుకున్న అదృష్టవంతుడు, నాస్తికుడు, ప్రకృతి, బాలప్రపంచ ప్రేమికుడు, లక్ష్మీలతాబాద్య విరోధి, దళితుడు, స్త్రీవాది యిలా ముసుగు ఏదైనా, ఆసక్తి కలిగిన బౌద్ధమహాసాగరంలో బిందువిపుడు. యిదే అతడి చివరిమలుపు. భువిపై మందర దివిపై యిదే అతడి మొదటిమలుపు.

